

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

**Journal of the Telugu Academy**

**KAKINADA.**



దేశభాషలందు తెలుగు లెస్స.

సంపుటము ౪౮ — Vol 48

సంచిక ౫-౬ — Parts 5-6

# ఆంధ్రసాహిత్య పరిషత్తు

స్థాపకులు

శ్రీ జయంతి రామయ్యగారు

ప్రతిష్ఠాపకులు

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

ఉద్ధారకులు

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు,
(జమీందారు, ఉయ్యూరు యెస్టేటు,)



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక


**Journal of the Telugu Academy**

**KAKINADA.**

సంవత్సరము చందా రు 3—0—0

సంపుటము ౪౮ మార్గశీర్ష-ఫాల్గుణములు సంచిక ౫-౬

Vol 48 Parts 5-6


## విషయసూచిక



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక


**Journal of the Telugu Academy**

**KAKINADA.**

సంవత్సరము చందా రు 3—0—0

సంపుటము ౪౮ మార్గశీర్ష-ఫాల్గుణములు సంచిక ౫-౬

Vol 48 Parts 5-6


## విషయసూచిక

# స్వవిషయము

ఆంధ్ర సాహిత్యపరిషత్పత్త్రికనుండి శాస్త్రవిషయముల నాంధ్ర భాషలో నందిచ్చుట సంభావ్యమని యూహించి, ఈ వఱకే యారంభమై కొంతవఱకు వెలువడియున్న శ్రీ భాగవతుల కుటుంబరాయశాస్త్రిగారి వ్యక్తివివేకమును మరల ముద్రింప నారంభించి యుంటిమి. శ్రీ కుటుంబరాయశాస్త్రిగారి యనువాదసరణి యీవఱకు పరిషత్పత్త్రికా పాఠకులకు విదితమే. పతఞ్జలిమహర్షి విరచితమైన మహాభాష్యమునందలి ప్రథమాహ్నికమగు పస్పశాహ్నికమునకు శ్రీ శ్రీ భాష్యం అప్పలాచార్యులవారు ఆంధ్రానువాదము కావించియున్నారు. దానిని సేకరించి వ్యాకరణశాస్త్రవిషయమును బ్రకటించుట మొదలుపెట్టితిమి. బౌద్ధాచార్యుఁడయిన నాగార్జునుఁడు రచించిన మాధ్యమికకారికలను శ్రీ కొల్లూరు సోమశేఖరశాస్త్రి గారి వ్యాఖ్యానముతో నీ వఱకు ముద్రించియుంటిమి. ఇఁక మీఁద శ్రీ సోమశేఖరశాస్త్రిగారే యాంధ్రీకరించిన వైశేషికదర్శనమును కూడ రాఁబోవు సంచిక నుండి ముద్రింపఁదలఁచితిమి.

భారతదేశమునందలి విజ్ఞానమునకుఁ బెన్నిధులయిన వ్యాకరణాది శాస్త్ర గ్రంథములు పఠనపాఠన క్రమమునుండి సడలిపోవుచున్నవి వానిని జదువుటకు నవగాహనము చేసికొనుటకుఁ దగిన మాస్థాపాస్థ్యములు కొఱవడుచున్నవి. ఈవిధముగ తఱిగిపోవుచున్న యీ శాస్త్ర గ్రంథముల సంప్రదాయరక్షకీ విధమయిన యాంధ్రీకరణములు, తత్ప్రకటనము గొంతసహాయకారులు కాఁగలవని యీ యుద్యమమున కుపక్రమించితిమి పాఠకమహాశయు లీవిషయమునకుఁ దమ సహకారము నొసఁగవలయునని మా ప్రార్థన.

ఇట్లు,
సంపాదకుఁడు.

# మనుచరిత్రము—రసము

డాక్టరు. దివాకర్ల వేంకటావధాని.

ఆంధ్రప్రబంధముల కాద్యము నాదర్శప్రాయము నైనది, మనుచరిత్రము. కాలప్రభావమునుబట్టియు నభిరుచివిశేషమునుబట్టియుఁ ప్రబంధకవు లెల్లరును శృంగారరసపరిపోషణమున కనువగు వస్తువులనే స్వీకరించిరి. పెద్దనయు మనుచరిత్రమున నారసమునే ప్రధానముగా గ్రహించెను. వరూధినీ మాయాప్రవరుల సమాగమము, స్వరోచి మనోరమాదులను వివాహమాడి వారియం దభిమతభోగముల ననుభవించుట, వనదేవత స్వరోచియాలింగనము నపేక్షించుట మున్నగు సన్నివేశము లాకావ్యమున శృంగారరసమున కాలంబనములు. కాని యాఘట్టములన్నింట నొకేవిధమైన శృంగారము పోషింపఁబడియుండలేదు. పాత్రలస్థితి మనోవృత్తిభేదములనుబట్టి యది కొంత వైవిధ్యము నొందినది. అది యొక్కచో నాభాసరూపమును, వేఱొకచో విమోగరూపమును, మఱియొక్కచో సంభోగరూపమును బొందుటయే కాక రెండుచోట్ల శాంతముతో సంఘర్షమునుగూడఁ గాంచినది.

ప్రవరాఖ్యుఁడు మకరాంకశశాంకమనోజ్ఞమూర్తియు, అలేఖ్యతనూవిలాసుండును మాత్రమే కాక నిర్మల ధర్మకర్మ దీక్షాపరతంత్రుఁడు కూడను. సౌందర్యవైరాగ్యము లనువిరుద్ధగుణము లాతనియెడ వపురూపముగా మేళనము చెందినవి. అందుచే నాతని చక్కఁదనము కాంక్షసేయు జారకామినులకుఁ బూచినసంపెంగపొలుపు మధుకరాంగనలకువలె భోగబాహ్యమైపోయినది. వరూధిని కీవిషయము తెలియదు. ఆమె సౌందర్యపిపాసయు, భోగలాలసయుఁ గల గంధర్వయువతి. ననవిల్తుశాస్త్రంపుమినుకు లావర్తించుపనియామెకు వెన్నతోఁ బెట్టినవిద్య. పసపు కరఁగిపోవుటచే నింటి కరుగు నుపాయముఁ గానక

త్రోవ యడుగుటకై తనకడకు వచ్చిన నలకూబరసన్నిభుఁడైన ప్రవరునిఁ గాంచి యాతఁ డెవ్వరో యెందు కరుదెంచెనో యెఱుంగకయే యామె యాతని వలచినది. అతనిఁ జూచియుఁ జూడకముందే యామె మేన మీనాంకానల సూచకధూమాంకురములనఁ బులక లంకురితములయ్యెను. అతఁడు తన్నుఁ బరిగ్రహించినచో మరు నేలని బంటుగా డక్కఁగొనవచ్చు నని యామె యెంతయో మురిసిపోయినది. దీనికంతకును సుర గరు డోరగ నరఖేచర విద్యాధర కుమారులందును గానరానిదియు, యక్షతన యెందు జయంత వసంత కంతుల గెలుప సాధనమగునదియు నగు నాతనిచక్కఁదనమే కారణము. అచ్ఛమైన సౌందర్య మున్నచో నామె కితరగుణాగుణములతోఁ బనియే లేదు. అందుచే నామె సిగ్గు విడిచి పోయి యాతనిదారి కడ్డమునిల్చినది. అతఁ డడిగినప్రశ్నకు బదులుగా నామె తనయుదంతము నంత నెఱిఁగించి తనగృహమున కరుదెంచి బడలికలు వాసి చను మని ప్రార్థించినది. ఆమెలో మదనత్వర యెంత యధికముగా నుండెనో కాలాతిక్రమణ మగుచుండుటచే సత్క్రియాకాండము తీర్చుటకై యింటికేఁగవలె నను త్వర ప్రవరునియం దంత యధికముగా నుండెను. నాఁడిల్లు చేరనిచో సమస్తధర్మములు తూలు ననియు నాతనిభయము. మఱియు వ్రతినై దినములు పుచ్చు నుత్తమవిప్రునిఁ ద న్నామె కామించుట యవిచారమూలక మని యాతఁడు భావించెను. వరూధిని కనువేదుఱుచేఁ గలిగిన వలపుతమిచే భోగానుభవమును సమర్థించుచుఁ బెక్కుయుక్తు లుగ్గడించెను. ప్రవరుఁ డవియెల్లఁ గాముకునకే కాని తనవంటివానికిఁ గా దని నిరసించెను. బ్రాహ్మణుఁ డింద్రియవశగతియై మదనబాణములకుఁ బాలైనచో బ్రహ్మానందాధిరాజ్యపదవీచ్యుతుఁడై చెడు నని యాతని యభిప్రాయము. ఇంద్రియసౌఖ్యావహమైన యింపే పరబ్రహ్మ మని యామె విశ్వాసము. సిగ్గులేని

యాజవ్వనిమాటలు తనకు సిగ్గును వెగటును గలిగింప నాతఁడు నాక రణుల్ దర్భలు నగ్నులుం బ్రియములైన ట్లసౌఖ్యముల్ గా వొడల్ తిరమే చెప్పకు మిట్టి తుచ్ఛసుఖముల్ మీసాలపైఁ దేనియ''లని యామెవాదమును దీవ్రముగా ఖండించెను. అంత నామె వలపు నిలుపలేక రతిసంరంభముతో నాతనిఁ గౌఁగిలించి యధరం బాసించెను. ఆతఁడు "హా శ్రీహరీ !" యనుచు నోరమోమిడి తదీయాంసద్వయం బంటి పొమ్మని త్రోసివైచెను. పిమ్మట నామె యేమి చెప్పుచున్నను వినక యతఁ డవ్వనజగంధి మేనిజవ్వాదిపస కదంబించునొడలు కడిగికొని వార్చి తన కుపాస్యుఁడైన గార్హపత్యాగ్నిని వేఁడుకొని తదనుగ్రహమునఁ దనగృహము చేరెను. ఇచ్చట శృంగార మేకత్రమాత్రనిష్ఠ మగుటచే నాభాసత్వమును బొందినది.

వరూధిని శృంగారరసకల్లోలిని. ప్రవరుఁడు శాంతమహాసముద్రము. ఆకల్లోలిని సముద్రము నాక్రమించుటకై సంరంభించినది. కాని సముద్రము విజాతీయమైన యాభావప్రవాహమునకు సందీయక యతిరస్కృతమూర్తియై నిల్చినది. ఇచ్చట శాంతశృంగారములకును, ధర్మకామములకును, బ్రహ్మానందప్రియానందములకుఁ, గర్మభోగనిష్ఠలకును గలిగిన సంఘర్షణము నాన్యతోదర్శనీయమై మనుచరిత్రను మనుచరిత్రగా నొనరింపఁ జాలినది.

ప్రవరుఁ డరిగినపిమ్మట వరూధిని యాతని నట వెదకి యెందును గానక వియోగసాగరమున నోలలాడినది. చొక్కపుఁ బ్రాయమును సోయగమును గల వల్లభుఁ డక్కున గారవింపఁ బ్రియమందని తనచక్కఁదనమును జవ్వనమును వ్యర్థము లని వాపోయినది. విరహదహనదాహమున దేహము తల్లడిల్లి నిట్టూర్పులు పుచ్చుచు వివిధదశాంతరము లొంది వేగఁజొచ్చినది. పిమ్మట నామె కేళీవనిఁ జొచ్చి వియోగవేదన నోర్వఁజాలక తనువుఁ దొఱంగఁ దలంచెను. చెలికత్తె

లామె నోదార్చి మరలఁ బానుపుకడకుఁ గొనిరాగాఁ నామె చంద్ర మన్మథమలయమారుతముల నుపాలంభించి దాపము పెల్లున మూర్ఛ మునింగెను. సఖులు వివిధశీతలోపచారము లొనరించి యామెను సంజాతసంజ్ఞ నొనరించిరి. ఇంతలో రాత్రి తెల్లవాఱెను. వరూధిని సర్వకార్యపరాఙ్ముఖియై యుండఁ జెలికత్తె లనునయించి, యెట్టెటులో మేను కైసేసికొన నూలొ్కలిపి, చింతచే సగమైన యామె నంతికోద్యానమునకుఁ గొనిపోయిరి. ఈఘట్టమున విరహశృంగారము సమగ్రసుందరముగా వర్ణింపఁబడినది.

అంతకుముందే గంధర్వకుమారుఁ డొకఁడు వరూధినివిలాసము లీక్షించి రాగాంధుఁడయి, కోరి, హత్తక మదనతాపము నందుచుండెను. అతఁడు జరిగినదంతయు నెఱిఁగి శాంబరీమహిమచేఁ బ్రవరుని రూపమునే కాక తద్దేహశిఖిదీప్తినిగూడ గ్రహించి యుద్యానవనమునఁ బూలు చిదుముచుండెను. వరూధిని చెలికత్తెలతోఁ గొంతసేపు పుష్పాపచయ మాచరించి తరువాత వారు జలక్రీడ సనరించుచుండఁ గొల నిగట్టునఁ గూర్చుండి చూచుచుఁ బూవులుకోయుచున్న యాకపట భూసురునిఁ గాంచెను. వెంటనే యామె యాతనిఁ జేర నరిగి తనవల రాచవేదులు నెఱింగించి త న్నేలుకొనఁ బ్రార్థించెను. గంధర్వుఁ డేవో కొన్ని కపటోక్తులు పల్కి, యామెదీనతఁ గాంచి వ్రతము విడువఁ బూనినట్లు నటించి కవయునెడఁ గన్నుఁగవ మూయవలెనని తనదేశాచారము నుగ్గడించి యామెచే నంగీకరింపఁ జేసెను. చెలికత్తెలు వారి నిరువుర వరూధినిమణిమండితాలయమునఁగూర్చి యాత్త గృహముల కరిగిరి. పిమ్మట వరూధినియు గంధర్వకుమారుఁడు నొక లతాగృహమునఁ బొంగెడుకాంక్షతో భోగింప నారంభించిరి. వా రట్లు బహుకాలము భావజతంత్రైకపరత్వమున నుండ, వరూధిని గర్భము దాల్చెను. ఇంకను దా నచ్చటనే యున్న వంచన మెఱింగి

సప్రత్యగ్రైః కుటజకుసుమైః కల్పితార్ఘాయ
తస్మై
ప్రీతఃప్రీతి ప్రముఖవచనం స్వాగతం
వ్యాజహార॥

ప్రత్యాసన్నే నభసి—అంటే శ్రావణమాసం సమీపించింది అని సాధారణార్థం, కాని ఇక్కడ సాధకాని నభస్సు అంటే ఆకాశతత్త్వం, దానిలో లీనం అయ్యే అవకాశం చేరువ అయిందని అర్థం. మేఘైర్నభాతీతి—నభఃమేఘాలతో అంటే ఉపాధులతో ప్రకాశించని ఆత్మతత్త్వం అని అర్థం. ఈవిషయంలో ధూమేనావ్రియతే వహ్నిః యథా దర్శో మలేనచ॥ అనేది గీతాచార్యుని సమర్థన. దయితా జీవితాలంబ నార్థీ-ముక్తిలోనే శాశ్వతానందాన్ని అర్థించిన సాధకుడు అని అర్థం. జీమూతేన—మేఘంచేత- జీవనం—ఉదకం, మూయతే బధ్యతే అత్రజీమూతః-దీనియందు ఉదకము బంధింపబడును. ఉదకం అంటే నారం—పరమాత్మ స్వరూపం అని అర్థం. పరమాత్మ స్వరూపాన్ని తనలో బంధించిన ఉపాధి మేఘం.దానితో స్వకుశలమయీం ప్రవృత్తిం హారయిష్యన్—ఇక్కడ ప్రవృత్తి అంటే వార్త అని సాధారణార్థం. కాని ప్రవృత్తి అంటే జననమరణ చక్రం. దాన్ని హారయిష్యన్ పోగొట్టుకొన దలచి అని అర్థం. ఇది స్వకుశలమయి. మనకు కుశలాన్ని కలిగించేది. మంచిని కలిగించే దాన్ని వదిలించుకోవడం ఎందుకు? అంటే ఇక్కడో కిటుకుంది. ఇష్టమైనది లభించినందువల్ల సుఖం, అనిష్టమైనది తొలంగినందువల్ల సుఖం. ఇక్కడ ప్రవృత్తి అనే భవరోగం తొలగినందువల్ల అది కుశలమయి అయింది. అటువంటి మేఘాన్ని అర్చించి ప్రార్థించాడు యక్షుడు, ప్రవృత్తికి మూలమైన మనస్సు మహా టక్కరిది. దీన్ని మంచి మాటలతో మళ్ళించాల్సిందే కాని శాసిస్తే మాత్రం త్రిప్పికొడుతుంది.

అసంశయం మహాబాహో మనో దుర్ని
గ్రహం చలం।
అభ్యాసేనతు కౌంతేయ! వైరాగ్యేణచగృ
హ్యతే॥

అంటూ గీతాచార్యుడు మనోనిగ్రహంలోని క్లేశాన్ని స్పష్టంగా చెప్పాడు. ఇక్కడ ఒకే విషయాన్ని దేహమనీ, ప్రాణమనీ, మనస్సనీ అవసరాన్ని బట్టి చెప్పడంలో వ్యక్తిభేదమే కాని వస్తుభేదం కాదని గుర్తుపెట్టుకోవాలి.

ధూమజ్యోతి స్సలిలమరుతాం సన్నిపాతః
క్వమేఘః
సందేశార్థాః క్వపటు కరణైః ప్రాణిభిః ప్రాప
ణీయాః॥
ఇత్యాత్సు క్యాదపరిగణయన్ గుహ్యక
స్తంయయాచే
కామార్తాహి ప్రకృతి కృపణాః చేతనా
చేతనేషు॥

మేఘసందేశ కావ్యానికీ, కాళిదాసుని తాత్త్విక దృష్టికీ మౌలికాధికరణంగా నిలిచింది. ఈ శ్లోకం. అందుకనే కాళిదాసు దీన్ని జాగ్రత్తగా చాలా బలమైన విషయం, అర్థాంతన్యాసం అనే అలంకారాల సంసృష్టితో నిర్వహించవలసి వచ్చింది.

ప్రపంచం పంచభూతాల సమ్మేళనం. అయితే చార్వాకాది దర్శనకారులు ఆకాశతత్త్వాన్ని అంగీకరించలేదు. కారణం ఏమంటే అది నిరాకార నిర్గుణతత్త్వం కావడమే. అంటే అది ఇంద్రియానికి ప్రత్యక్షంగా గోచరించదు. ఆకాశమాత్ర—శబ్దం. మనం శబ్దాలను వినగలుగుతున్నామంటే కార్యం జరిగింది. కానీ కారణం పరోక్షం (కనపడనిది). కారణం లేంది కార్యం జరుగదన్నది వ్యాప్తి. వ్యాప్తి ఉన్నచోట కార్యాన్నిబట్టి కారణాన్ని

స్వామి ప్రతాపరుద్రీయవ్యాఖ్యానమున నట్టిచో దక్షిణ నాయికానూ రాగమును ఆభాసమే కావలసివచ్చును గావున నదియుక్తము గాదని నిరసించెను. అందుచే స్వరోచి బహునాయికారతి దక్షిణ నాయకతా సూచకమే కాని యాభాసతాకరము కాదు.

స్వరోచి పంది నేయఁ బోవుచుండ నాపై శరమేసి నిగ్రహింపు మని కోరిన హరిణి నది యట్లు జీవితముపై రోయుటకుఁ గారణ మేమని యతఁ డడుగ నది యన్యసతులయందు నాసక్తుఁడైన వానిఁ దమకమునఁ గూడఁ దలంచుటకంటె మరణమైన మే లని బదులు చెప్పెను. అంత నాతఁడు "నీ హృదయ మెవ్వనిపై నిలిచె"నని యడుగ నది "చెదరక నామనంబు నృపశేఖర ! నీయెడ నిల్చి మన్మథ ప్రదరపరంపరానిహతి పాల్పడి వ్రేఁగెడి" నని చెప్పి "హరిణాంగన వీవు నరుండ నే ముదం బొదవఁగ నీకు నాకు మిథునోచితకృత్యము లెట్లు చేకుఱు" నని యాక్షేపింప "నన్నాలింగనము చేయు మదియే చాలు" నని ప్రార్థించెను. అంతఁ గృపార్ద్రుఁడైన స్వరోచి యాహరి ణిని గౌఁగిటఁ జేర్చెను. వెంటనే యది సౌందర్య సేవధియైన మెలం తయై నిల్చెను. పిదప స్వరోచి యడుగ నామె తాను వనదేవత ననియు, నతనియందు మనువర్యుం బడయవలె నని దివిజులు ప్రార్థింప నట్లు వచ్చితి ననియు, ననురాగవతియైన తన్ను వరించి తనయం దపత్యంబుఁ బడసినఁ బుణ్యలోకావాప్తి యగు ననియుఁ దెల్పెను. స్వరోచి యంత నావనదేవత నేకచిత్తముతో నంగీకరించి యామెయందు మనువును బడసెను.

స్వరోచి కౌఁగిలించుకొనువఱకును వనదేవత హరిణాంగనా కారముననే యుండెను. అది కౌగలించుకొను మని కోరఁ గరుణార్ద్ర చిత్తుఁడై యాతఁ డట్లు చేసెను. ఇది యనౌచిత్యసూచకమై రసాభాస మున కాకరముగా నున్నది. అనురాగ ముభయనిష్ఠమయ్యెఁ దిర్య

క్సంపర్కము గాంచుట యందుకుఁ గారణము. ఈరసాభాసము హరిణీ వనదేవతగా మాఱినపిమ్మట శృంగారమైనది. ఈశృంగారము మను సంభవమునకు హేతు వగుటచేఁ బరమధార్మికమై ప్రకాశించినది.

మనుచరిత్రమునఁ గళావతి స్వరోచికిఁ దన జన్మ వృత్తాంతము చెప్పుచోట పారర్షి యుదంతమునకుఁ బ్రసక్తి కల్గినది. అతఁడు ఫల మూలచ్ఛదనాంబుభుక్తిఁ బవనాభ్యాన క్రియాయుక్తి నిర్దళితాంగ్గత శాత్రవ ప్రకర జాగ్రద్గర్వ సర్వస్వుఁడై" శీతవాతాతపములకు మన మనుత్సాహము గానక యరుదైన తప మాచరించెను. ఇట్టి శాంత మూర్తి పుంజికస్థలయంగములఁ గాంచి వివేకము కలఁగఁ బంచశర కాండవిడంబిత ధైర్యసారుం డయ్యెను. పిదప నతఁడు తపమంతయుఁ బొలిపోవ నన్నియు విడిచి యాయంగనతో మనోజక్రీడా విపులైశ్వ ర్యము లనుభవించెను. ద్వితీయాశ్వాసమున వలెనే యిటఁ గూడ శాంత శృంగారములకు సంఘర్షణము సమకూడినది. కాని యిట ముని నిగ్రహహీనుఁ డగుటచే శాంతమే వీఁగిపోవలసి వచ్చినది.

మనోరమ చెలులతో వెండికొండపై విహరించుచు బాల్యచాప లమునఁ బూచివలె నున్న యొక వాచంయముని మోము పట్టుకొన నామౌని భగ్నానుసంధానుఁడై కన్ను తెఱచి యామెను శపించుటే కాక కనలుచుఁ దనచేతి నాగబెత్తముఁ గొని యదయుఁడై యామెను బసరముఁ గొట్టినట్లు కొట్టెను. అంత నామె చెలికత్తెలు నిందింప నాతఁ డాగ్రహమున వారిని గూడ శపించెను. మనోరమ సఖు లన్న ట్లాతని తపము శాపనిమిత్తమే మయ్యెను. ఇందీవరాక్షుఁడు వంచ నమై తన దగ్గఱనుండి యాయుర్వేదము గ్రహించు టెఱిఁగి బ్రహ్మ మిత్రుఁ డిట్లే యాతనికి ఘోరమైన శాప మొసంగెను. ఈ రెండు తావుల శాంతమునకు రౌద్రముతో సంఘర్షణము సంభవించినది.

రెండు చోట్లను గూడ రౌద్ర మతిమాత్రమై శాంతమును గ్రిందు చేసినది.

రాక్షసరూపమున నున్న యిందీవ రాక్షుఁడు గంధర్వుఁడుగా మాఱునెడ నద్భుతరస మున్నది. అట్లే దేవాపి ప్రత్యాఖ్యానకు పితుఁడై రాత్రి సమయమున పారర్షిని జంపిన ఘట్టమున బీభత్స మున్నది. మనువు పుట్టి విష్ణువును గూర్చి యన్యదుష్కరమైన తప మాచరించి యా దేవునిచే వరములు గాంచెను. దీనితోఁ గావ్యము ముగిసినది. ఇట్లుపసంహృతియం దిట శాంతరసము పోషితమైనది. పెద్దన మనుచరిత్రమున నాకాలప్రభావమును బట్టి శృంగారమునే ప్రధానరసముగాఁ గ్రహించినను ఆరంభావసానములందు శాంతమున కఖండ విజయము కలిగించి తనకాలమర్యాద నతిక్రమింపఁ జాలెను.

మను సంభవమునకు హేతువైనది వనదేవతా స్వరోచుల సమాగమము. ఇటఁ గొంతదనుక శృంగారాభాసమును దదుపరి శృంగారమును గనవచ్చుచున్నవి. రసాభాసము రసమగునా? అనౌచిత్యము వలన నాభాసత్వ మావహిల్లును. కాని సదోషత్వము వలన కావ్యమునకును, కీటవిద్ధత్వమువలన రత్నమునకును భంగము రాని విధమున ననౌచిత్యదోష మించుక యున్నంతమాత్రమున రసమునకు భంగము కలుగదు. రసాభాసము వర్ణింపరాదను నిషేధమును ఎచ్చటను గానరాదు.

---

# ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము — నాడులు

కుందూరి

(గతసంచికల తరువాయి)

క్రిందటి సంచికలో బారహదొంతి రాజ్యముల స్థలనిర్దేశమును జేయునపుడు 'బారహా'యనునది నేఁటి 'బారువా'యని నిర్ణయించితిని. కాని యానిర్ణయము సమంజసముకాదేమో యని సంశయము గలుగుచున్నది. కారణ మేమనఁగా పూసపాటిరాజుల పూర్వబిరుదావళిలో "భారుహా (బారహా)మన్నె గండపెండేరవిరాజితుఁడు" లేక "భారుహామన్యరాజన్య కోటీరకోటిహీర చారుశుష్యమాణ సమాశ్రిత పాద పంకజుఁ"డనునొకబిరుదు పూసపాటి తిమ్మభూపాలవిరచిత కృష్ణవిజయ కావ్యమందుఁ గలదని కవిజీవితకారుఁడు వేములవాడ భీమకవి జీవిత చరిత్రమునం దుదాహరించెను. కృష్ణవిజయగ్రంథము పరిశీలించుటకు నాకు వీలుకలుగలేదు. ఈబిరుదు ననుసరించి 'దొంతి'వలెనే, బారహా సహితము నొకరాజ్య మనియు నీబాగహారాజ్యము ప్రత్యేకముగ నాంధ్రకావ్యములందుఁ బేర్కొనఁబడెననియు మనము తెలిసికొనుచున్నాము. కాని 'బారహా' 'బారువా'కాదగునా? యని విచారింపవలసియున్నది. దొంతి వలెనే యిదియు మధ్యప్రదేశప్రాంతమే యగు ననుట కవకాశము గలదు. శ్రీకట్టి సాంబమూర్తి శాస్త్రిగారు భారతి పత్రికలో 'బారహా' యనునది నేఁటి మధ్యప్రదేశమునందుఁ గలదని వ్రాయుచు,నది కాకపోవచ్చుననియు, నేఁటి 'బారువా' యనునదియే 'బారహా'యైయుండునని నిశ్చయించిరి. చరిత్ర పరిశోధక శేఖరులు శ్రీ సోమశేఖరశర్మగారు వారురచించిన రెడ్డిరాజ్యచరిత్రలో బారహా దొంతి రాజ్యములఁ గూర్చివ్రాయుచు, 'బారహా'యనఁగా పండ్రెండనియు, బారహాదొంతిరాజ్యములనఁగా పం(డ్రెండు వరుసరాజ్యములనియు, నయ్యవి నేఁటివిశాఖపట్టణ గంజాముమండలములకు పశ్చిమమున మధ్య(ప్రదేశమునకుఁ గల సామంతరాజ్యములనియునిర్ణయించిరి,

తమ్మభూపాలకృత కృష్ణవిజయములోని పూసపాటిరాజుల బిరుదమును బట్టియు, మడికి సింగన్న పద్మపురాణోత్తరఖండములోని ముప్ప భూపాలుని, బిరుదు ననుసరించుయు "బారహా" యొకటియు, 'దొంతి' యొకటియు వేఱువేఱు మన్నె రాజ్యములనియు, శ్రీనాథుఁడు వానిరెంటిని జోడించెననియుఁ దెలియనగును. అదియునుగాక శ్రీవేంకటపతి భూపాలకృత "ఉషాభ్యుదయము"లో పూసపాటి తమ్మభూపాలుఁడు "బారుహామన్నె భూపాలర్చితార్హ పాదాబ్జాతుఁ"డని యితని వర్ణించునొకసీసపద్యములోగలదు.

సీ॥ దుర్ధరారాతి సందోహ తమఃపట
లార్కుఁడై తనరె నే యధికయశుఁడు,
జయవాటికా పురస్థాన దుర్గాలబ్ధ
వైభవుం డయ్యె నేపార్థివుండు
బారుహా మన్నెభూపాలార్చితార్హ
పాదార్హుఁ డయ్యె నేపార్థివుండు
ధార్మికమతితోడ తమ్మమాంబాప్రాణ
వల్లభుం డయ్యెనే బల్లిదుండు,
గీ॥ నతఁడు వినుతికిఁ దగు సమస్తావనీశ
చంద్రహృద్భల్ల విభుఁడు సాంద్రచతుర
సైన్యవారణ దారుణ సాహసాంక
బాహుబలహేళి తమ్మభూపాలమౌళి.

ఈ "బారహా"యను మన్నెసంస్థానము మధ్యప్రదేశములోని నరసింహాపురము జిల్లా గర్ద్వారతాలూకా యందలి 'బారహా'యై యుండవచ్చునని యూహించుచున్నాను. 'దొంతి'యు మధ్యప్రదేశములోనిదే యైయుండెను. ఈ విషయము పరిశోధనము గావింపఁదగినది. ఇంతదనుక ఆంధ్రసారస్వతసమ్మతమైన 'బారహాదొంతిమన్నె

భూపాలురం గూర్చి గలప్రమాణములం జూపితిని. స్థలనిర్ణయమును గావించితిని. ఇంక చరిత్రపరిశోధక విచక్షణులకు వదలివేయు చున్నాను.

## కి ల్ల డ సీ మ

క్రిందటి వ్యాసములో నుదహరించిన 'కిల్లడసీమలోపలి గొబ్బూరుగ్రామము చీపురుపల్లి తాలూకాలోనిది. అనకాపల్లి తాలూకాలో సహితము గొబ్బూరు అను గ్రామము కలదు. కాని శాసనకర్త జంతరునాంటి సింగరాజు కొడుకు ప్రతాపవర్మరాజగుటచే నీ కిల్లడసీమలోని గొబ్బూరు జంతరునాంటి పరిపాలకుల యధీనములోనుండు గ్రామమగునని యూహించి, చీపురుపల్లి తాలూకాలోని గొబ్బూరె అగునని నిర్ణయించితిని.

## దిమిలినాడు

దిమిలివిషయము కుబ్జవిష్ణువర్ధనుని చీపురుపల్లి శాసనములో పేర్కొనంబడినది. శ్రీవిష్ణువర్ధన మహారాజు దిమిల విషయములోని కల్వకొండ గ్రామమును విష్ణుశర్మ మాధవశర్మ లనునిద్దరి బ్రాహ్మణులకు దానమొసంగెను. దాక్షారామములోని కులోత్తుంగచోడదేవని యొకశాసనములో "వేంగినాణ్టైన ఉత్తమచోడమణ్డలమున డిమిల నాంటి తొణ్డవాడ జియ్యహరినాంటి జియ్యహరితిరుమలయి శ్రీపరాంతకేశ్వర మహాదేవరకు నీయూరి వలయుచుట్టు...సర్వకర పరిహారము ...నాచంద్రార్కము ననుభవింపంగలవారుగా దయసేసిరి" అని డిమిల (దిమిల) నాడు వేంగినాంటిలోని యంతర్భాగముగాం జెప్పంబడినది. ఈ దిమిల గ్రామము ఎలమంచిలికి మూండుమైళ్ళ దూరమున నున్నది.[1]

1. దక్షిణ హిందూదేశ శాసన సంపుటము 4, సంఖ్య 1224.

## ప్లక్కి విషయము లేక పాళకి విషయము

ఈప్లక్కి లేక పాళకివిషయము కుబ్జవిష్ణువర్ధనుని తిమ్మాపురము, చీపురుపల్లి శాసనములలోను, ఇంద్రవర్మ రామతీర్థము శాసనము లోను పేర్కొనఁబడినది. తిమ్మాపురము శాసనములో కూములూరు గ్రామమును, చీపురుపల్లి శాసనములో చెఱుపూరు గ్రామమును, రామతీర్థము శాసనములో పెరువాటకగ్రామమును నీవిషయములోని గ్రామములుగ వ్రాయఁబడెను. ఈప్లక్కివిషయము చీపురుపల్లి తాలూకా ప్రాంతమై యుండనోపునని యూహించుచున్నాను. పై నుదహరింపఁబడిన గ్రామముల స్థలనిర్దేశపరిశోధన మింకను గావింపవలసియున్నది. 2

## సారకినాడు

విశాఖపట్టణమండలములోని విజయనగరము తాలూకాలోని రెండుశాసనములు సారకినాటిని బేర్కొనుచున్నది. ఆరెండు శాసనములును అనంతవర్మదేవుని శా. శ. 1061 నాఁటి శాసనములు. ఆ రెండును సారకినాటిమఱుచెఱ్వు గ్రామములోని సోమేశ్వరదేవర కిచ్చిన దానశాసనములు. విజయనగరము తాలూకాలో సారిక యను గ్రామము కలదు. ఈసారికనాటికి ఆ గ్రామమునుబట్టి పేరు వచ్చియుండు. మఱుచెఱువు మరువాడనై యుండనోపును. 3

## కళింగము

కళింగము పూర్వసముద్రతీరమున చరిత్రప్రసిద్ధిని గాంచిన దేశములలో నొకటి. పురాణేతిహాసరూప సంస్కృత సారస్వతమునం

2- 1. తిమ్మాపురము శాసనము-ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము. 9 పుటలు 317-318.

2. చీపురుపల్లి శాసనము-ఇండియన్ ఏంటిక్వరీ సంపుటము 20-పుట 16.

3. రామతీర్థము శాసనము-ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము. 12 పుట 133.

3. దక్షిణ హిందూదేశ శాసనసంపుటము 10. సంఖ్యలు 690-691.

ముదాహరింపఁబడినట్లును, ఆంధ్రశాసన వాఙ్మయములందు వక్కా-ణింపఁబడినట్లును విదితమే. ప్రస్తుతము కళింగదేశ విస్తీర్ణము ముఖ్యాంశము.

రాజశేఖరుఁడు కావ్యమీమాంసలో కళింగమును భరతఖండములో పూర్వదేశము లోనిదిగా వివరించెను

"తత్ర వారాణస్యా పురతః పూర్వదేశాః. యత్రాంగ కళింగ కోసల తోసల ఉత్కళ మగధ ముద్గర విదేహ పుండ్ర ప్రాగ్జ్యోతిష తామ్రలిప్తక మలద మల్లవర్తక సుహ్మ బ్రహ్మోత్తర ప్రభృతయో జనపదాః"

వాత్స్యాయన కామసూత్రములకు వ్యాఖ్యాతయైన జయమంగళుఁడు కళింగదేశసీమానిర్ణయ మిట్లు గావించియున్నాఁడు.

"వంగాలౌహిత్యాత్ పూర్వేణ,అంగామహానద్యాః పూర్వేణ కళింగా గౌడవిషయాద్దక్షిణేన..."

అనఁగా కళింగదేశము గౌడదేశమునకు దక్షిణమున నుండెను.

అశోకుని కళింగశాసనములు, ఖారవేలుని హాథిగుంఫాశాసనమును, సముద్రగుప్తుని గయాశాసనమును,కళింగమును బేర్కొనె నని చరిత్రజ్ఞులకు విదితమే. గయాశాసనములోని పిష్ఠపురమహేంద్రుని తర్వాత పిష్ఠపురమేలిన రాజులఁగూర్చి శాసనములు దెలుపుచున్నవి. మాఠరవంశజుఁడును, వాసిష్ఠీపుత్రుఁడును నగుశక్తివర్మరాగోలు శాసనములో నతఁ డిట్లభివర్ణింపఁబడెను

"సిద్ధి రస్తు స్వస్తి విజయ పిష్ఠపురాత్ కళింగాధిపతి ర్మాగధ కులాలంకరిష్ణు ర్వాసిష్ఠీపుత్రో మహారాజశ్రీ శక్తివర్మా కళింగ విషయే రాకలువగ్రామే సర్వసమన్వాగతా న్గ్రహపతితో"

ఈ శాసనమునుబట్టి శక్తివర్మ కళింగాధిపతియనియు, పిష్ఠపురము కళింగరాజ్యములోనిదియనియు స్పష్టము. ఈ రాకలువ

గ్రామము శ్రీకాకుళము తాలూకాలోని రాగోలు గ్రామము [4]

తర్వాత నితని వంశములోని వాఁడైన అనంతశక్తివర్మ శృంగ వరపుకోట శాసనములో నితనితాత గుణవర్మ దేవరాష్ట్రాధిపతి యనియు అనంతవర్మ కళింగాధిపతియనియుఁ దెలుపఁబడినట్లు దేవ రాష్ట్రమును గూర్చి వ్రాసినపుడు విశదీకరించితిని. ఈ దేవరాష్ట్ర మును, ఎలమంచిలి కళింగవిషయమును విశాఖపట్టణమండలములోని సర్వసిద్ధితాలూకా ప్రాంతమైయుండుననియుఁజరిత్రకారుల నిర్ణయము. కావున కళింగ మనునది నేఁటి పిఠాపురము మొదలు ఆకాలమున నుత్తరమున శ్రీకాకుళము తాలూకా వఱకును వ్యాపించియుండెను. పిఠాపురమె దక్షిణసరిహద్దుగా నుండెను.[5]

పై శాసననిబంధన మట్లుండగా మంచనకవి తాను రచించిన కేయూరబాహుచరిత్రలో కొమ్మనమంత్రిని గూర్చి "కళింగ రాష్ట్రం బులోని యెలమంచి లాదిగా నెలమి ముప్పదిరెండు విష్ణుప్రతిష్ఠలు వెలయఁజేసె"నని వర్ణించియున్నాఁడు. రామకృష్ణకవిపాండురంగమాహా త్మ్యములోని నిగమశర్మోపాఖ్యానంబునందు సభాపతియను బ్రాహ్మ ణుని వర్ణించుచు "నతఁడు కళింగదేశాభరణంబగు పీఠికాపురం బధి ష్ఠించి సకలమహీసురసర్వశ్రేష్ఠుండై వెలసె నని" చెప్పియున్నాఁడు. పూర్వము శాసనములం దుదాహృతమైన విషయమె పురాణము లందును పిఠాపురమొకప్పుడు కళింగదేశాంతర్గతమై యుండెననియుఁ దెలియుచున్నది.

పై నుదహరింపఁబడిన ప్రమాణముల ననుసరించి కళింగము

4. రాగోలు శాసనము. ఎపిగ్రాఫియా ఇండికా-సంపుటము. 12, పుటలు 1-3 శాసనములో తేదీలేదు.

5. అనంతవర్మ శృంగవరపుకోట శాసనము ఎపిగ్రాఫియా ఇండికా సంపు టము 23. సంఖ్య 9. (క్రీ. శ. 450-500.)

దక్షిణమున గోదావరీతీరమువఱకు వ్యాపించియుండె ననుటకు సందేహము లేదు. పై విషయమె పాశ్చాత్యచరిత్రకారులు సహితము స్థిరపఱచిరి.[6] వరాహవర్తనీవిషయము. జంతుర్నాడుల గూర్చివ్రాసిన పుడాసీమలు గాంగవంశరాజులకాలమున కళింగములోనిదె యని వ్రాసియుంటిని.

## కళింగదండపాట

సింహాచలములోని శ్రీకృష్ణదేవరాయల క్రీ. శ. 1519 నాఁటి శాసనములో నామహారాజు "ప్రతాపరుద్ర గజపతి మహారాయల చేతను పుచ్చుకొన్న గ్రామాలు కళింగదండపాటలోని గ్రామాలు పెదగాణిగ్రామము అగనపూడిగ్రామము అదుకుచెల్లెపల్లెలు గంగవరంపాల్లెను పిన్న అగ్నపూడిపలెను ఉభయం గ్రామాలు—౨"సింహగిరి అప్పనికి భోగము నిమిత్తము దానము చేసినది చెప్పఁబడినది. పైన చెప్పఁబడిన పెదగాణియు, గంగవరంపల్లెయు, నేఁటి విశాఖపట్టణము తాలూకాలోని పెదగాణియు, గంగవరముగ్రామములే.

సింహాచలములోని మఱియొక శాసనములో ప్రతాపవీర నరసింహదేవ మహారాజులభార్య పార్వతి కళింగదేశములోని 'అనకపల్లి నావులపల్లి, పిళినికవాడ, ఎడువాకనాడు ముమ్మడివాడ క్రయముగా విలిచి సింహాద్రినాథునికి సమర్పించెనని గలదు. అనకపల్లి (అనకాపల్లి) పిళినికవాడ (పిషిణికాడ) అనకాపల్లి తాలూకాలోఁగలవు.[7]

కాఁబట్టి కళింగ మనునది ఇప్పటి విశాఖపట్టణ శ్రీకాకుళజిల్లాలకు (ఏజెన్సిభాగము తప్ప) సరివచ్చుభూభాగము. ఈప్రాంతములో

---

6. కన్నింగ్ హామ్ ప్రాచీనభూగోళ చరిత్ర పుట. 516

రేప్సన్ ప్రాచీన హిందూదేశము. పుట 164.

(Ancient Gegrophy of India P. 516 Ancient India P. 164)

7. దక్షిణహిందూదేశ శాసన సంపుటము, 6 సంఖ్యలు 731, 695

దొరకిన శాసనములన్నియుఁ దెలుఁగు భాషలోనే లిఖింపఁబడినవి. ఈ దేశమునకు కళింగాంధ్ర దేశమను నామమే సార్థకమైనది. అదృష్ట వశమున కళింగ మిప్పు డాంధ్రప్రదేశములోఁ గలసి పోయినది.

### కళింగము-త్రికళింగము

పూర్వచాళుక్యరాజన్యుల శాసనములలో వారు కళింగమును, త్రికళింగమును స్వాధీనపఱచుకొనినట్లు శాసనాధారము లనేకము లున్నవి. చాళుక్యభీముని బందరు శాసనమువల్లను మల్లపదేవుని పిఠాపురముశాసనమువల్లను మూఁడవ విజయాదిత్యుఁడు కళింగగాంగ రాజుల నోడించి, వారినుండి సువర్ణమును బలాత్కారముగఁగొని, కొన్ని యేనుఁగులను గప్పముగ గ్రహించెనని తెలియుచున్నది. విజయాదిత్యుని యొకశాసనములో "సత్రికళింగ వేంగిమండల మపాలయత్" అని వ్రాయఁబడినది. రెండవ అమ్మరాజు వేంగీదేశమును త్రికళింగ దేశసహితముగ రక్షించె నని మఱియొక శాసనమునఁగలదు.

"తస్యమహేశ్వరమూర్తేః భీమభూపతేః ఉమాసమానాకృతేః లోకమహాదేవ్యాః కుమారాభఃఖలు యస్మభవదమ్మరాజాఖ్యః ఆసౌ సమ్యగ్ధర్మన్యాయేన వేంగీదేశం త్రికళింగసహితం రక్షతి స్మ" మొదటి అమ్మరాజు శాసనములో చాళుక్యభీముని కుమారుఁడైన విజయాదిత్యుఁడుత్రికళింగాటవీ యుక్తముగ వేంగిదేశమును పదియాఱు మాసములు పరిపాలించి దివంగతుఁ డయ్యెనని వ్రాయఁబడినది.

"తత్సూను ర్విజయాదిత్యః షణ్మాసాన్ వేంగిమండలం త్రికళింగాటవీయుక్తం పరిపాల్య దివం యయౌ" ॥

పై శాసన దృష్టాంతముల ననుసరించి కళింగము వేఱు,త్రికళింగము వేఱను విషయము స్పష్టము. అంతకుఁబూర్వమే పూర్వగాంగోర్వీపతు లీత్రికళింగము నేలుచుండి రని మొదటి ఇంద్రవర్మ మహాసామంతవర్మల (క్రీ. శ. 537; 562) శాసనములను బట్టి తెలియుచున్నది

డపటి వర్మాభిధానులకు కళింగాధిపతులు అనుబిరుదు గలదు. త్రికళింగాధిపతి యను పేరు వహించి డెబ్బదియేండ్లు అవిచ్ఛిన్నముగా కళింగమేలిన పూర్వగాంగులలో అనంతవర్మ చోడగంగు సుప్రసిద్ధుఁడు ఈతఁడు క్రీ.శ. 1078 మొదలు క్రీ. శ. 1152 వఱకు కళింగమేలిన సుప్రసిద్ధభూపాలుఁడు.

త్రికళింగాధిపతులని పేరుపొందిన రాజన్యులలో కటకము నేలిన సోమవంశీయు లను నరపతులును కాలచురివంశజులగు చేది దేశపు రాజులును గలరు.

శ్రీ రామదాసుగారు ఆంధ్రచారిత్రక పరిశోధకమండలివారి త్రైమాసిక పత్రికలో త్రికళింగమును గూర్చి వ్రాయుచు, త్రికళింగ మనునది కళింగదేశమునకు తూర్పునను దక్షిణకోసలప్రాంతమునైన దేశభాగ మని నిర్ణయించిరి. వారే మఱియొక చోట త్రికళింగ మనునది మహేంద్రపర్వతమునకు పశ్చిమమును, మహానది కుత్తరమున లాంగుల్యానదీ జన్మస్థలప్రాంతము నగుదేశమని నిర్ణయించినట్లు మూఁడవ వజ్రహస్తుని గంజాముశాసనసంపాదకులు వ్రాసియున్నారు. వారు రామదాసుగారితో పూర్తిగ నేకీభవింపకున్నను త్రికళింగ మనునది, కళింగమునకు పశ్చిమప్రాంతారణ్య భూభాగమని నిర్ణయించిరి. అదియే త్రిలింగాటవి కాఁబోలు.

---

అనంతవర్మ చోడగంగుని

1. చికరిశాసనము భారతి సంపుటము సంచిక 2.
2. బొడ్డపాడు శాసనము భారతి సంపుటము 3 సంచిక 5.
3. కొర్ని శాసనము భారతి సంపుటము 2 సంచిక 2

Andhra Historical Research Sosiety Journal Vol: I. Page16, 23.

మూఁడవ వ్రజహస్తుని గంజాము శాసనము. ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము. 23-సంఖ్య. 11

పై వ్రాతలనన్నిటిని సమన్వయింపఁగా, త్రికళింగ దేశము మహానది కుత్తరప్రాంతమును, మహేంద్రపర్వతమునకు పశ్చిమమును, దక్షిణ కోసల దేశములోని దక్షిణ ప్రాంతములై యుండవచ్చునని యూహింపనగును.

## త్రిలింగదేశము

త్రిలింగ దేశ సీమానిర్ణయమును గావించు శాసన సారస్వత ప్రమాణము లీదిగువ నుదాహరించుచున్నాను. బ్రహ్మాండపురాణములోనిదగు నీదిగువశ్లోకము ఆంధ్రచరిత్రకారుఁడుదాహరించియుండెను.

"శ్రీశైల భీమ కాళేశ మహేంద్రగిరి సంయుతం
ప్రాకారంతు మహ త్కృత్వా త్రీణి ద్వారా నుపాకరోత్.

కాకతీయ ప్రతాపరుద్రుని యాస్థానపండితుఁడగు విద్యానాథకవి ప్రతాపరుద్రీయములో నాటక ప్రకరణమున త్రిలింగ దేశ వ్యాప్తిని వివరించియున్నారు.

స్వామిం స్త్రిలింగ దేశ పరమేశ్వర !
యై ర్దేశస్త్రి భి రేషయాతి మహతీం ఖ్యాతిం త్రిలింగాఖ్యయా
యేషాం కాకతిరాజకీర్తి విభవైః కైలాస శైలాఃకృతాః,
తే దేవాః ప్రసరత్ప్రసాదమధురా శ్రీశైలకాళేశ్వర
దాక్షారామ నివాసినః ప్రతిదినం త్వచ్ఛ్రేయసే జాగ్రతు.

నాటక ప్రకరణము పంచమాంకము శ్లోకము 44.

విద్యానాథకవికి నూఱుసంవత్సరములు తర్వాత నుండిన విన్నకోట పెద్దన్న విశ్వేశ్వర భూపతి కంకిత మిచ్చిన కావ్యాలంకార చూడామణిలో త్రిలింగ దేశ సీమానిర్ణయమును జెప్పియుండెను.

కం. ధర శ్రీపర్వత కాళే
శ్వర ద్రాక్షారామ సంజ్ఞ వఱలు త్రిలింగా
కరమగుట నంధ్ర దేశం
బరుదారఁ ద్రిలింగ దేశమనఁ జను కృతులన్.

పెద్దన కావ్యాలంకార చూడామణిని క్రీ. శ. 1403 తర్వాత రచించి యుండెనని తక్కిన యాధారములతో శ్రీ సోమశేఖరశర్మ భారతి పత్రికలో నిర్ణయించియున్నారు. విన్నకోట పెద్దనకు సమకాలికుఁడును రెడ్డిభూమీశ్వరుఁడునైన పెద్దకోమటి వేమభూపాలుని యాస్థానకవియునైన వామనభట్టబాణుఁడు తాను రచించిన వేమభూపాలీయములో అద్దంకినగరము త్రిలింగ జనపదములోనిదిగా వర్ణించెను.

శ్రీనాథమహాకవి భీమేశ్వరమండలమును (దాక్షారామ) త్రిలింగ విషయ మంగళా లంకారమని నివర్ణించెను. రెడ్లనాటి శాసనములలో ఆంధ్రదేశమునకు త్రిలింగ సంజ్ఞయే వ్యవహారసిద్ధమైయున్నట్లు వక్కాణింపఁబడినది. ముమ్మడినాయకుని శ్రీరంగశాసనమునందును, సింగయనాయకుని అక్కలపూడి శాసనమునందును త్రిలింగ దేశము పేర్కొనఁబడినది. శ్రీనాథుని పొన్నుపల్లి ఆలపాడు శాసనములలో వెలనాడు త్రిలింగవిషయములోనిదిగా వర్ణింపఁబడెను.

శ్లో॥ ప్రాచ్యాత్త్రిలింగవిషయే వెల్నాడో ర్దివిసీమని
కృష్ణవేణ్యా స్తరంగిణ్యాః ప్రతీరే పర్యవస్థితః॥
పొన్నుపల్లి శాసనము (క్రీ. శ. 1408)

శ్లో॥ ప్రాదాత్త్రిలింగవిషయే వెలనాండో మనోరమే।
తుంగభద్రా తరంగిణ్యాః ప్రాక్తీరే పర్యవస్థితః.
ఆలపాడు శాసనము (క్రీ. శ. 1413)

నరసారావుపేటలోని అప్పాపురము శాసనములో నొకదానియందు ఆంధ్రదేశ చారిత్రిక భూగోళము నీ క్రింది విధమున వివరించెను "స్వస్తి సమస్త ప్రశస్తి సహితంబై అనల్పంబైన కల్పారంభకాలంబున మహా వరాహ దంష్ట్రాశిఖరంబున నుద్ధృతంబై పంచాశత్కోటి యోజన విస్తీర్ణంబైన భూమండలంబునందు జంబూద్వీపం

బులో భారతవర్షంబున భారతఖండంబున మేరుపర్వతంబునకు దక్షిణదిగ్భాగంబున శ్రీశైల వాయసముద్రపార్శ్వంబున నోంకార నదీ తీరంబున త్రిలింగ దేశాలంకారంబైన కోటభూమి కమ్మనాంటి సీమాస్థలంబునందు నాదిండ్లపురంబున" .. *

త్రిలింగ దేశములో కోట (ధరణికోట) భూమియు, కమ్మనాడును, నంతర్భాగములని పై శాసనము వివరించుచున్నది. త్రిలింగమును గూర్చి యిదివఱకు ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక, ఇరువదియెనిమిదవ సంపుటము, నాల్గవసంచికలో విపులముగాఁ జర్చించియున్నాను ఈవ్యాసములో నొక్కసీమానిర్ణయము ముఖ్యాంశముగనుక, త్రిలింగ దేశసీమఁగూర్చి శాసన సారస్వత ప్రమాణముల నిచ్చియున్నాను. శ్రీశైలము, దాక్షారామము సుప్రసిద్ధ శైవక్షేత్రములు. మొదటిది కర్నూలుమండలములోనిది. రెండవది తూర్పుగోదావరి మండలములోనిది. కాళేశ్వరము తెలంగాణములో కరీంనగరజిల్లాలో గోదావరీ తీరమందున్న మంథెన కాళేశ్వరము. అద్దంకి గుంటూరు మండలము లోనిది. కాఁబట్టి త్రిలింగ దేశమనునది, ఇప్పటి తూర్పుగోదావరి, కృష్ణ, పడమటి గోదావరి, గుంటూరు, కర్నూలు మండలప్రాంత భూమియు, తెలంగాణములోని కరీమ్నగరము, వరంగల్లు, నల్లగొండ హైదరాబాదు, మహబూబునగరు, ఖమ్మంజిల్లాలో ప్రాంతములనియు నిర్ణయింపవచ్చును. పైని వివరింపఁబడిన కళింగ, త్రికళింగ, త్రిలింగములు వేర్వేఱు జనపదములనియు, నొకదానితో నొకదానికి సంబంధము లేదనియు గ్రహింపవచ్చును. తెలుఁగుపదము త్రికళింగము నుండిగాని, త్రిలింగమునుండిగాని పుట్టియుండలేదు. ఈ విషయమై తెలుఁగు దేశమునుగూర్చి వ్రాయునపుడు మరలఁ జర్చించెదను.

[సశేషము]

---

* దక్షిణహిందూదేశ శాసన సంపుటము 10 సంఖ్య 573.

# వ్యక్తివివేకము

భాగవతుల కుటుంబశాస్త్రి.

(సంపుటము 45. 4వ సంచికనుండి)

ఈవాక్యము వేణీసంహార నాటకములోనిది. సూతుఁడు దుర్యోధనునితోఁ జెప్పుచున్నాఁడు.

తా. ఒకేరథమునెక్కి, అటునిటు నిన్నుఁగుఱించి యడుగుచు వారిద్దఱు వచ్చుచున్నారు.

కశ్చ కశ్చ—ఎవరు ? ఎవరు ?

"అర్జునశ్చ సకర్ణారిః, సచ క్రూరో వృకోదరః"

(వే. సం. 5. అంకము)

తా. కర్ణునకు శత్రువైన యాయర్జునుఁడు, క్రూరుఁడైన యా వృకోదరుఁడును అని సమాధానము.

ఇచట, నిద్దఱు వచ్చుచున్నారని చెప్పినపుడు, దగ్గఱనున్న వారందఱును, సహజముగ నెవ రెవరు ? అని రెండుపర్యాయములు ప్రశ్నించినారు. కశ్చ, కశ్చ-అనుటకు బదులుగ "కౌతౌ" అని యేకశేషఁజేసి వారిరువు రెవరు ? అని ప్రశ్నించినను ప్రశ్నింపవచ్చును. కాని వ్యస్తముగనున్నప్పటి రమణీయతరాదు. వ్యస్తముగనున్నప్పుడు ఇరువురిలో నొక్కొకనికిని పృచ్ఛన్తౌ(అడుగుచు) ప్రాప్తౌ (వచ్చినారు) అను క్రియలతో ప్రత్యేకసంబంధ ముండును. అట్లు ప్రత్యేకముగ నున్నపుడు, ప్రష్టకుఁగల జిజ్ఞాసాతిశయము వ్యంగ్యమగును. ఏకశేషఁ జేయుచో నా ప్రత్యేకజిజ్ఞాస వ్యక్తముకాదు.

ఎచట నీవిధముగ నిది ప్రధాన మిది యప్రధానమని మనము చెప్పఁదలచుకొనమో, యెచట విశేషణ విశేష్యభావమున కాయా వస్తువులస్వరూపమును మాత్రము తెలియఁజేయుటయే తాత్పర్యమో

యచట సమాసముం జేసినను, చేయకున్నను దోషములేదు. మనయిష్టముపచ్చినట్లు చేయవచ్చును. ఉదా:—

స్తనయుగ మశ్రుస్నాతం సమీపతరవర్తి హృదయశోకాగ్నేః
చరతి విముక్తాహారం వ్రతమివ భవతో రిపుస్త్రీణామ్.

అర్థము:—అశ్రుస్నాతం=భర్తృవియోగమువలన హృదయమునందుఁగల్గిన శోకమనెడు నగ్నికి,సమీపతరవర్తి=బాగుగా దగ్గఱగానున్నట్టియు, విముక్తాహారమ్=వి+ముక్తాహారమ్=తీసివేసినముత్యాలహారములు గలట్టియు (విముక్త+ఆహారమ్=వదలిన ఆహారముగలట్టియు) భవతః=నీయొక్క, రిపుస్త్రీణామ్, స్తనయుగమ్=శత్రు స్త్రీలయొక్క స్తనయుగము (కర్త) వ్రతమ్, చరతీవ=వ్రతము నాచరించుచున్నదా యన్నట్లున్నది.

తా. వ్రతము చేయువారు స్నానముచేసి, అగ్నినారాధించి, విముక్తాహారులగుదురు. (ఆహారమును విసర్జింతురు)ప్రస్తుతమొకరాజు శత్రువులనందఱను చంపినాఁడు. ఆశత్రువుల భార్యలు విలపించుచు, శోకమున మునిఁగి, మెడలోనిహారములను తీసివేసినారు. ఈవిషయమునే కవి యిట్లు వర్ణించినాఁడు.“నీశత్రు స్త్రీల స్తనయుగము కన్నీటితోస్నానమాడి,హృదయ శోకాగ్నికి సమీపమున నున్నదై,విముక్తాహారమై వ్రతము నాచరించుచున్నదా యన్నట్లున్నది. ఇచట విముక్తాహారత యనునదియే శబ్దసాధర్మ్యము. అర్థములో భేదమున్నది. సాదృశ్యము లేదు.

ఇచట రిపుస్త్రీణామను పదమునకు భవతః యనునది విశేషణము. స్తనయుగమనుదానికి రిపుస్త్రీణామనునది విశేషణము. ఈవిశేషణములవలన నాపదముల యర్థమునకువచ్చు నుత్కర్షాతిశయ మేమియులేదు. కేవలము సంబంధము మాత్రము వివక్షితము. అందుచే నిచట భవద్రిపుస్త్రీణామ్ అనిగాని, రిపు-స్త్రీస్తనయుగమనిగాని భవ

జరివధూ_స్తనద్వితయ మనిగాని సమాసముం జేయకుండుట వలన వచ్చు విశేషముగాని, చేయుటవలనవచ్చు దోషముకాని లేదు. ఈ శ్లోకమునందే రిపుస్త్రీణామ్ అను సమాసమునందు రిపుపదము స్త్రీ సంబంధిత్వమును దెల్పినట్లే పైసమాసములయందును, విశేషణములు సంబంధిత్వమును మాత్రము తెల్పును. ఇంతవఱకుఁదెల్పిన విషయమీ సంగ్రహశ్లోకములయందు ప్రతిపాదితమైనది.

"వినోత్కర్షాపకర్షాభ్యాం స్వద న్తేర్థా నజాతుచిత్
తదర్థమేవ కవయోఽలంకారాః పర్యుపాసతే. 14
తౌ, విధేయానువాద్యత్వ వివక్షైకనిబన్ధనౌ
సా సమాసే_స్త మాయాతీత్యసకృత్ ప్రతిపాదితమ్. 15
అత ఏవచ వైదర్భిరీతి శ్శైవ శస్యతే
యత స్సమాససంస్పర్శ_స్తత్ర నైవోపపద్యతే. 16
సంబంధమాత్ర మర్థానాం సమాసో హ్యవబోధయేత్
నోత్కర్షమపకర్షంవా—వాక్యాత్తూభయమప్యదః. 17

తా. ఉత్కర్షమో యపకర్షమో లేనిదే ఏయర్థమును రమణీయముగ నుండదు. ఆయుత్కర్షాపకర్షలను ప్రతిపాదింపనెంచియే కవు లుపమారూపకోత్ప్రేక్షాద్యలంకారములను కూర్తురు. ఒకవాక్యమునం దాయావిషయములను విధేయములుగనో, అనువాద్యములుగనో వివక్షించినపుడే (చెప్పఁదలచినపుడే) యావిషయములయొక్కయుత్కర్షాపకర్షలు భాసించును. సమాసముఁ జేయుచో నాయుత్కర్షాపకర్షభావము భాసింపదు.అందువలననే వైదర్భీరీతి సర్వోత్తమమని ప్రశంసింపఁబడుచున్నది. ఆరీతియందు సమాస సంస్పర్శయే యుండకపోవుటచే సందుత్కర్షాపకర్షములు స్ఫుటముగ భాసించును. సమాసమందున్ననో సంబంధము మాత్రమే భాసించును గాని యుత్కర్షాపకర్ష

ములు భాసింపవు. సమాసరహితమైన వాక్యమున సంబంధముమాత్ర మేగాక యుత్కర్షాపకర్షములుకూడ భాసించును.

సమాసమునం దుత్కర్షాపకర్షములు భాసింపవనుట కుదాహరణము.

ఊర్ధ్వాక్షి తాప గలితేన్దు సుధాలవాక్త
జీవత్కపాలచయ ముక్త మహాట్టహాసమ్
సన్త్రస్త ముగ్ధగిరిజావలితాంగ సంగ
హృష్టం వపు ర్జయతి, హారి, పినాకపాణేః"

అర్థము : ఊర్ధ్వాక్షి...హాసమ్= నుదుటియందున్న యగ్నిరూపమైన నేత్రముయొక్క వేడిచే కరిగిన చంద్రునియొక్క యమృతలేశముయొక్క సంపర్కముచే బ్రతుకుచున్న పుఱ్ఱెలసమూహముచేతఁ జేయఁబడిన మహాట్టహాసము (పెద్దనవ్వు) గలట్టియు, సంత్రస్త... హృష్టం=భయపడిన అమాయకురాలగు పార్వతియొక్క, త్రిప్పఁబడిన శరీరముయొక్క సంపర్కముచే సంతోషము నందినట్టియు, హారి=హారములు గలట్టియు, పినాకపాణేః=ఈశ్వరునియొక్క, వపుః=శరీరము, జయతి=జయించుచున్నది.

తా॥ ఈశ్వరుని నుదుటియందున్న మూఁడనకన్ను, అగ్నిస్వరూపము. ఆ యగ్ని వేడిమికి శివుని శిరస్సుననున్న అమృతమయుఁడగు చంద్రుఁడు కరిగిపోయినాడు. ఆయమృతపుఁబొట్లు శివుఁడు ధరించు పుఱ్ఱెలమీదఁ బడినవి. అపుడవి ప్రాణవంతములైనవి. ఒక్కసారి పక్కన నవ్వినవి. ఈనవ్వునకుఁ గారణము పార్వతికిఁ దెలియలేదు. ఆమె భయపడినది. ప్రక్కకు తిరిగినది. అపు డామెశరీరము శివుని శరీరమునకుఁ దాకినది. ఆనందాతిశయముచే శివునియొడలెల్ల గగుర్పాటునొందినది. అట్టి యీశ్వరశరీరముజయించుచున్న దనిభావము.

ఇచ్చట మొదటి మూఁడుపాదములయందలి రెండు సమాసముల యందును సంబంధము మాత్రమే భాసించును. ఉత్కర్షాపకర్షలు భాసింపవు.

వాక్యమునం దుత్కర్షాపకర్షలుకూడ భాసించు ననుట కుదాహరణము.

న్యక్కారోహ్యాయమేవ, మే యదరయ, స్తత్రాప్యసౌ తాపసః
సోప్యత్రైవ నిహన్తి, రాక్షసకులం,జీవత్యహో రావణః,
ధిక్ ధిక్ శక్రజితం, ప్రబోధితవతా కిం కుంభకర్ణేన వా
స్వర్గగ్రామటికా విలుంఠనవృథోచ్ఛూనైః కిమేభి ర్భుజైః.

సందర్భము :— శ్రీరాముఁడు రాక్షస సంహారముసేయుచుండ రావణుఁ డనుకొనుచున్నమాటలు :— మే=నాకు (మూఁడులోకములనువశముచేసికొనిన నాకు—అని భావము) అరయః—శత్రువులు (ఒకఁడు కాదు—అనేకులు.నాకనేకులు శత్రువులుండుట యనుచితము—"మే"— అను పదములోని షష్ఠీవిభక్తికి సంబంధ మర్థము— అనేక శత్రుసంబంధానౌచిత్యము క్రోధమునకు విభావము. అరయః— అను పదమునందలి బహువచన మీభావమును ధ్వనింపఁజేయును) ఇతి యత్=అనుటయే, న్యక్కారః=అవమానము (నింద) తత్రాపి=అందును, అసౌ, తాపసః=తపసుచేసుకొను నితఁడు నాయకుఁడా! తత్ర= అపి=అను రెండునిపాతల సముచ్చయము. అత్యంత మసంభావ్యత్వమును కలలోనైన నూహింపరాని దనువిషయమునువ్యక్తముసేయును. తపో విద్యతేయస్యస్యః తాపస :—తపసున్నవాఁడు తాపసుఁడు— ఇచట తద్ధిత ప్రత్యయ మున్నది— దీనిని మత్వర్థమందురు. ఈమత్వర్థీయ తద్ధితప్రత్యయము— పౌరుష కథాహీనత్వమును సూచించును) సోపి=మనుష్య మాత్రుఁడైన ఆతాపసుఁడును (రాముఁడును) అత్ర+ ఏవ=నేనున్నయీ తావుననే, రాక్షసబలమ్, నిహన్తి—ఒకరి నిద్దఱను

గాదు. రాక్షసవంశమును నిశ్శేషముగా చంపివేయుచున్నాఁడు. (ఇచట నిహన్తి అనుక్రియాపదములోని "తి" ప్రత్యయము సః, కులమ్, అత్ర అనుపదములోని కర్తృ, కర్మాది కరణకారకములును కలిసి రావణ పౌరుషము వ్యర్థమను విషయమును ధ్వనింపఁజేయును). అహో= ఎంతయాశ్చర్యము! రావణః జీవతి=రావణుఁడు జీవించియున్నాఁడు రావయతీతిరావణః మూఁడులోకముల నేడ్పించినవాఁడు రావణుఁడు. అని వ్యుత్పత్త్యర్థము. అట్టినేను ప్రస్తుతము కూడ జీవించియే యున్నాను!) శక్రజితమ్=ఇంద్రుని జయించిన ఇంద్రజిత్తును, ధిక్ ధిక్ ఛీఛీ (అతఁడును మనుష్యమాత్రుని చేతిలో నోడిపోయినాఁడు.)

ప్రబోధితవతా=బాగుగా మెలకువ వచ్చిన కుంభకర్ణేనవా= కుంభకర్ణునితోనైనను ఏమిలాభము! (ఏమియు లేదని భావము) స్వర్గగ్రామటికా విలుంఠన వృథోచ్ఛూనైః=స్వర్గమనెడు చిన్నగ్రామముయొక్క నాశనముచేత వ్యర్థముగ బలిసిన, ఏభిః భుజైః=ఈ చేతులచేతను, కిమ్=ఏమిప్రయోజనము!(శక్రజిత్ అను పదమునందలి కృత్ప్రత్యయము, ధిక్ ధిక్ అను నిపాతలు కలిసి ఇంద్రుని జయించుటయనెడిది ప్రస్తుతము కల్పిత కథయేమోయని యనుపించుచున్నదను భావమును వ్యంగ్యముసేయును. గ్రామటికా అనుపదములోని, తద్ధిత ప్రత్యయము, స్త్రీలింగమును కలిసి, స్వర్గమును జయించుటలోఁ గొప్పతనమేమియుఁ గన్పడుటలేదను భావమును వ్యక్తముసేయును. విలుంఠనము నందలి 'వి' యను నుపసర్గ-విశేషముగ నను నర్థము నిచ్చి, నిర్దయతను సూచించును. వృథాపదము తనపౌరుషమునందలి నింద్యత్వమును వ్యంగ్యముసేయును. భుజైః అనుపదములో బహువచనమున్నది. ఇన్నిభుజములుండియు నేనేమియుఁ జేయలేకపోతి నన నీభుజములన్నియు బరువుచేటే యను భావము నభివ్యంగ్యము సేయును. ఇట్లే శ్లోకమును విభజించినకొలదియు లేశలేశముగ నమ్మ

అమత్యున్ మ్రోకరిలెదు నా
తని వెల్లరు ననుగమించుతరి వారి నచే
తనులం జేయుచు నొకపె
ట్టున క్రమ్మెన్ చిమ్మచీకటులు లోకమ్మున్. 26

అభ్రచమూ సమూహము నింగి పై దాడి
వెదలి నల్దిక్కుల కదల కొనగ
తళ పంక్తుల తటిల్లతలు వ్యోమ సీమ్ర
ద్దలగొట్టుచున్ భయదములుగాగ

మిన్ను విరిగి పడుచున్నట్టు లురుములు
ఫెళఫెళల నొడళ్లు జలదరింప
ముత్యాలవలె తొల్త, ముత్యాల సరముల
వలె నావెనుక జడివాన కురియ

పర్ణశాల జనుల పరివేష్టితుండయి
నిలిచియున్న మౌని కలయ జూచి
మీదె విజయమనెడు స్మితముతో కూర్చుండె
మొగము లెల్ల నిట్టె పుల్లమాయె.

నున్నవి) ఇవియన్నియును వాచికాభినయమున నంతర్భావము నందు టచేఁ రసాభివ్యక్తిహేతువులే యగును. అందుచే రసానుగుణముగ సమాసము నుపయోగింపవచ్చునని తేలినది.

శ్లో. సచార్థాన్తావధిః కార్యో నాధికో గద్యతాప్తితః
గద్యే హి వృత్తవైకల్యే న్యూనా తద్వ్యక్తిహేతుతా 20.

తా. ఆసమాసము, శ్లోకార్థములో (శ్లోకపాదములో) సగము కాని, పాదాన్తమువఱకుఁ గాని యుండవచ్చును. (కొందఱి మతమున శ్లోకపాదము పూర్తియగువఱకుఁగాని యుండవచ్చునని యర్థము) అంతకంటె నధికముగ నుండరాదు. ఉన్నచో నదియు గద్యమే యగును. పద్యములోనున్నంత రసాభివ్యక్తి పద్యశూన్యమగు గద్యయం దుండదు. "ఊర్ధ్వాక్షితాప గలితేన్దు సుధాలవార్త"మను సమాసభూయిష్ఠమగు పద్యమే యిందుకుదాహరణము-పై పద్యమున శ్లోకపాదమును మించిన సమాసమున్నది. అందుచే నచట రసాభివ్యక్తి యధికముగ నుండదు.

శ్లో. తస్యాచ్ఛిన్నః పదార్థానాం సంబన్ధశ్చేత్ పరస్పరమ్
న విచ్ఛేదోన్తరా కార్యో రసభఙ్గకరో హి సః. 21

తా. ఈ సమాసరచనమున నింకొక నియమమునుఁ గూడ గుర్తింపవలయును. సమాసములోనున్న పదములకుఁ గల పరస్పర సంబంధము తెగిపోవనిచో, సమాసమునకు మధ్యయందు విచ్ఛేదమును చేయఁగూడదు, అట్లుచేయుట రసభంగమునకు హేతువగును. ఉదాహరణము-"మాద్యద్దిగ్గజ గండభిత్తికషణైః భగ్నస్రవచ్చందనః

తా. మదించిన దిగ్గజముల కుంభస్థలములయొక్క యొరపిడుులచే భగ్నమై, స్రవించుచున్న చందనముగలది" ఇచట కషణములచే (ఒరపిడిచే) విఱిగిపోయి అనునర్థము వచ్చుటచే, కషణపదమునకును సంబంధము తెగిపోలేదు. సాక్షాదన్వయమే యున్నది. అందుచే

నిచట "కషణైః" అని సమాసమును విఱిచివేయుట రసాభివ్యక్తికి భంగకరము. కావున "మాద్యద్దిగ్గజగండ భిత్తికషణక్షుణ్ణ ద్రవచ్చందనః" అనియున్నచో బాగుండెడిది. కొన్ని గ్రంథములలో నీపాఠమే యున్నది.

ప్రధానావిమర్శదోషము:—ఇంతవఱకును విధేయానువాద్యభావమును గుఱించి చర్చించియుంటిమి. ఒకవిషయమునకు ప్రధానత్వము లేనిచో విధేయత్వమును నుండదు. అందుచే నారెండును సహచరులే యనవచ్చును. కావున పూర్వచర్చయందలి విధేయత్వము ప్రాధాన్యోపలక్షకమే. ఇపుడు ప్రధానావిమర్శముకూడ దోషమే యని తెలియవలయును.

ఉదాహరణము:—

"స్నేహం సమాపిబతి కజ్జల మాదధాతి
సర్వాన్ గుణాన్ దహతి పాత్ర మధఃకరోతి,
యోఽయం కృశానుకణసంచయసంభృతాత్మా
దీపః ప్రకాశయతి తత్ తమసో మహత్త్వమ్"

అర్థము:—యః, అయం=ఏ, ఈ, కృశానుకణసంచయసంభృతాత్మా=అగ్నికణముల కూడికచే నిర్మితమైన స్వరూపముగల (శరీరముగల) దీపః=దీపము, స్నేహం=నూనెను, సమాపిబతి—బాగుగా త్రాగివేయును (పీల్చివేయును) కజ్జలమ్=కాటుకను (మసిని)ఆదధాతి=కలుగచేయును, సర్వాన్=అన్ని, (అన్నివిధములైన) గుణాన్=వత్తులను, దహతి=తగులఁబెట్టును, పాత్రమధఃకరోతి=నూనె యుండు పాత్రను (బుడ్డిని) అధఃకరోతి=క్రిందనుంచును (పైన దీపజ్వాల, క్రింద దీపపుబుడ్డి యుండును) ప్రకాశయతి=వస్తువులను ప్రకాశింపఁజేయునో తత్=అది తమసః=చీకటియొక్క, మహత్త్వమ్=గొప్పదనము. ఇది దీపపరమగు నర్థము. ఈ వర్ణనమువలన తమోగుణావిష్టుఁడగు పురుషు

నియొక్క వృత్తాంతముగూడ స్ఫురించును. తదనుకూలమగు నర్థ మీ-క్రిందివిధముగ నుండును. కృశాను...భృతాత్మా=కోపమనెడుఅగ్ని కణనిర్మిత స్వభావముగలవాఁడు, స్నేహమ్ సమాపిబతి=ప్రేమను మ్రింగివేయును; కజ్జలమాదధాతి=దోషములను ప్రకటించును. (కజ్జల పదమునకు దోషము లక్ష్యార్థము) సర్వాన్ గుణాన్=సద్గుణముల నన్నిటిని, దహతి=తగులఁబెట్టును. పాత్రమ్=యోగ్యుని,(విద్వాంసుని అధః కరోతి=తిరస్కరించును. తత్=అది, తమసః=తమోగుణము యొక్క, మహత్త్వము.

ఇచట ప్రకాశింపఁజేయునను క్రియయొకటియే ప్రధాన మైనది. స్నేహ పానము, గుణదహనము మొదలగుక్రియ లప్రధాన ములు. కాని అన్నిటిని, కవి, సమానశ్రేణిలోనే వర్ణించినాఁడు. అన్నియు సమాపకక్రియలే యగుటచే నన్నిటికిని సమప్రాధాన్యమే వచ్చును. అట్లుచెప్పుట దోషము. మిగిలిన క్రియలనన్నిటిని శతృ-ప్రత్యయాంతము లుగఁ జెప్పి, ప్రకాశయతి యను నొకక్రియనే యుపయోగించుచో నీదోషము పోవును.

అపుడు శ్లోకము.

"స్నేహం పిబ న్నధచ కజ్జల మాదధానః"

జ్వాలన్ గుణాన్ విమలపాత్రమధశ్చ కుర్వన్"

అనుకీతి నుండవలయును.

ఇచట మఱియొకదోషము గూడఁగలదు-"యః అయం" అను నప్పుడు యః అనుపదము దీప-అనుపదముతో నన్వయించును. తత్- అనుపది-"దీపః ప్రకాశయతి" అను వాక్యార్థమును పరామర్శించును. యచ్ఛబ్ద మేయర్థమును పరామర్శించునో, తచ్ఛబ్దముగూడ నాయర్థ మునే పరామర్శింపవలయును గాని, మఱియొక యర్థమును పరామ ర్శింపరాదు. ప్రస్తుత మిచటి యఃతత్, అనుశబ్దములు విభిన్నార్థపరా

మర్శకము లగుటచే దోషమే. ఆ దోషమును పరిహరించుటకు "యత్" అను నపుంసకలింగశబ్దమునే యుపయోగింపవలయును. అపుడు యత్తత్ శబ్దములు రెండును వ్యాక్యార్థమునే పరామర్శించును.

"యచ్చా యమగ్నికణ్ఠాసంచయ సంభృతాత్మా" అని శ్లోకములోని మూడవపాదమును మార్పవలయును.

అప్రధానక్రియలను శతృ_న్తములుగ నుంచి, ప్రధాన క్రియను సమాపకక్రియగఁ జెప్పిన పద్యమున కుదాహరణ మీక్రింది శ్లోకము.

శ్లో॥ "బిభ్రాణః శక్తిమాశు, ప్రశమితబలవత్తారకౌర్జిత్యగుర్వీం
కుర్వాణో లీలయాధః శిఖినమపి, లసచ్చన్ద్రకాన్తావభాసమ్
ఆధేయా ధన్యకాశే రతిమతిశయినీ మావహన్ వీక్షణానామ్
బాలో లక్ష్మీమపారా మ పర ఇవగుహోఽహర్పతేరాతపోవః.

అర్థము : ఈ శ్లోకములోని విశేషణములు (1) సూర్యాతపమునకును (2) కుమారస్వామికిని వర్తించును.

ప్రశమిత...గుర్వీమ్ (1) ప్రశమిత=తగ్గింపఁబడిన, (నాశనము చేయఁబడిన, బలవత్=బలముగల, తారక+ఔర్జిత్య=నక్షత్రముల యొక్క తేజస్సు గలిగియుండుటచే గుర్వీమ్=సకల ప్రపంచమును ప్రకాశింపఁజేయునంతగొప్పదగు, శక్తిమ్=సామర్థ్యమును, బిభ్రాణః= భరించుచున్నట్టియు (శతృ_న్తము)- (2) నాశనముచేయఁబడిన బలవంతుఁడగు, తారక+ఔర్జిత్య, గుర్వీమ్=తారకుఁడను రాక్షసుని యొక్క ప్రభావముగలదియు, బరువైనదియునగు, శక్తి="శక్తి"అను పేరుగల యాయుధమును, మోయుచున్నటియు

లసత్...భాసమ్ (1) లసత్=ప్రకాశించుచున్న చంద్ర=చంద్రునియొక్క, కాన్త=మనోహరమైన, అవభాసమ్ కాన్తిగలట్టియు (అవభాసః యస్మాత్ సః-అగ్నినుండియే చంద్రుఁడు తన కాన్తిని బొందుచున్నాఁడని భావము) చంద్రపదమునకు సువర్ణమనియు నర్థ

ము. ఆ పక్షమునఁ బ్రకాశించుచున్న సువర్ణముయొక్క మనోహర మైనకాన్తి యెవనియందున్నదోయను నర్థమువచ్చును- శిఖినమ్, అపి=అగ్నిహోత్రుని కూడ, లీలయా=విలాసముతో, అధః కుర్వాణః=తిరస్కరించుచున్నట్టియు

(2) లసత్,=ప్రకాశించుచున్న, చంద్రక=నెమలి కన్నులచే అన్త=రమణీయమైన, అవభాసః=కాన్తిగల, శిఖినమ్=నెమలిని, లీలయా=విలాసముతో, అధఃకుర్వాణః=తనకు వాహనముగఁజేసి కొనుచున్నట్టియు (1) అన్ధకారే=చీకటియందు, వీక్షణానామ్=నేత్రములకు, అతిశయినీమ్,రతిమ్=ఎక్కువ ప్రీతిని, ఆవహన్=కలుగఁజేయుచున్నట్టియు (2) అన్ధక+అరేః=శివునియొక్క, నేత్రములకానన్దమును గూర్చుచున్నట్టియు

(1) అహర్పతేః=సూర్యునియొక్క, బాలః, ఆతపః=లేతయెండ (2) బాలః, గుహఃఇవ=బాలుఁడైన కుమారస్వామివలె, వః=మీకు, అపారామ్ లక్ష్మీమ్=అనన్తమైన సంపదను, ఆధేయాత్ కలుగఁజేయుఁగాక.

ఇచట బిభ్రాణః, కుర్వాణః, ఆవహన్-అనునవి శతృప్రత్యయాన్తములు- అప్రధానవ్యాపారములను దెల్పును. ఆధేయాత్-అనునదొకటియే ప్రధానక్రియ. అది యటులే సమాపక క్రియగానేయున్నది- ప్రధానాప్రధానక్రియ లిట్లే యుండవలయునని ప్రస్తుత విషయము.

అన్ని వ్యాపారములును ప్రధానములే యగుచో వానినిఁ దెల్పునవన్నియు క్రియలేయైనను దోషములేదు. ఉదాహరణము.

శ్లో॥ సౌధా దుద్విజతే, త్యజ త్యుపవనమ్, ద్వేష్టిప్రభామైన్దవీమ్
ద్వారా న్నశ్యతి చిత్రకేలిసదసో, వేషం విషం మన్యతే
ఆస్తే కేవల మబ్జినీకిసలయప్రస్తారశయ్యాతలే
సంకల్పోపనత త్వదాకృతి రసాయత్తేన చిత్తేన సా॥

అర్థము:—సా=నీయెడబాటు ననుభవించుచున్న ఆనాయిక సౌధాత్=మేడనుండి, ఉద్విజతే=భయపడుచున్నది. ఉపవనమ్=ఉద్యానవనమును,త్యజతి=వదలివెళ్ళుచున్నది ఐన్దవీమ్=చంద్రికాన్తిని (వెన్నెలను ద్వేష్టి=ద్వేషించుచున్నది, చిత్రకేలిసదసః=విలాసముగ నాడుకొనుటకై యుద్దేశింపఁబడిన యింటియొక్క, ద్వారాత్=వాకిటినుండి నశ్యతి=పారిపోవును. అటపోవుటకే యిచ్చగింపదు. వేషమ్=అందముగ నలంకారాదులను ధరించుటను, విషమ్=విషముగ, మన్యతే=తలఁచుచున్నది-సంకల్పోప........యత్తేన = మనసునందలి యూహలచే తన హృదయమున స్థాపితమైన నీయాకారమునందలి యానందమునకు వశమైన చిత్తముతో, అబ్జినీ...శయ్యాతలే=కోమలములైన పద్మదళములతో నేర్పాటైనశయ్యయందు, కేవలమ్,ఆస్తే=వ్యాపారరహితయై, ఉన్నది.

ఇందు, విరహావస్థయందున్న నాయికకు సంబంధించిన ఉద్వేజనము, ద్వేషము-మొదలగుక్రియ లనేకములు వర్ణితములైనవి.ఆమె విరహావస్థను సూచించుట కీక్రియలన్నియు నావశ్యకములే యగుటచే నవియన్నియు సమప్రాధాన్యములే. అందుచే నామె చేష్టలన్నియు ప్రధానక్రియలతోనే వర్ణితములైనవి.

శ్లో. యత్రైకకర్తృకానేకా ప్రాధాన్యేతరభాక్ క్రియా
తత్రాఖ్యాతేన, వాచ్యాద్యా, శత్రాద్యై రపరా పునః

అన్తరశ్లోకము-21

తా. ఏకకర్తృకములై, ప్రధానములును, అప్రధానములును నగు క్రియలున్నపుడు, ప్రధానక్రియ నాఖ్యాతముచేఁ జెప్పవలయును. అప్రధానక్రియలను శతృ క్తములు మొదలగు వానిచేఁజెప్పవలయును.

ఆశంక: అన్ని తావులయందును సమాసముఁ జేయుచో ననిష్టము గల్గుననియు నందుచే . రచనముఁజేయునపుడు క్రియాదులు

ప్రధానాప్రధానతలను గుర్తించియే సమాసమును చేయవలయునుగాని, యెల్లతావులందును కూడదని మీరింతవఱకును విస్తృతముగ నుపపాదనమును చేసినారు. కాని యిందులో నపూర్వత యేమున్నది ?- "విశేషణం విశేష్యేణ బహులమ్" విశేషణము, విశేష్యముతో బహుళముగ సమసించును. అని సూత్రమును వ్రాయుటచే పాణిన్యాచార్యులీ విషయమును సూచించియేయున్నారు. బహుళమను పదమును ప్రయోగించుటవలన నొకచో సమాసవిధి ప్రవర్తించును, ఒకచో ప్రవర్తింపదు, ఒకచో విభాష, మఱియొకచో నన్యవిధముగ నగునను విషయము సూచితమగుచునేయున్నది. దీనిననుసరించి యుత్కర్షాపకర్షలు, వివక్షితములు కానపుడు సమాసమువచ్చును. వివక్షయున్నపుడు సమాసము కూడదు. అని తెలియుచునేయున్నది. ఇంత మీ రీవిషయమునే చెప్పనేల ?

సమాధానము: మీరు చెప్పినది సత్యమే. కాని యిట నొక విశేష మున్నది—సమాసవిధి సామాన్య శాస్త్రము. ప్రధానేతర భావము వివక్షితమైనపుడు సమాసము కూడదనుట- యపవాదము- పై సామాన్యశాస్త్రమునకు బాధకము- (అపవాద శాస్త్రమునకు విషయములైన తావులను విడిచి మిగిలిన తావులందే సామాన్యశాస్త్రము ప్రవర్తించును,) కావున ప్రధానేతర వివక్షామూలకమైన సమాస నిషేధము, సమాసవిధికపవాదమనుటయే మంచిది. సమాస నిషేధమును బహులగ్రహణమునకు విషయమునుగాఁ జేయుట, కూడదు.

ఒక్కొక ప్రయోగమును గుఱించి- ఇది సామాన్య శాస్త్రమునకు విషయమనిగాని, అపవాదశాస్త్రమునకు విషయమనిగాని నిర్ణయింపలేము. అట్లు నిర్ణయింప శక్యముకానిదానిని బహులగ్రహణమునకు విషయముగాఁ జేయవలయును. అట్లు చెప్పుచో, "విశేషణం

విశేష్యేణ బహులమ్" అను సూత్రమునందలి బహుళగ్రహణమునకు సార్థకతయు సిద్ధించును. ఇట్లు వ్యవస్థను చేయుటయే మంచిది. లేనిచో "గోదః" "కంబలదః" అను ప్రయోగముల విషయమున నిబ్బంది కల్గును.- "గాందదాతి" (గోవునిచ్చును) "కంబలం దదాతి" (కంబలము నిచ్చును) అని విగ్రహవాక్యములుండును- ఇచట గామ్, కంబలమ్ అనునవి కర్మవాచకపదము లుపదములుగ నున్నచో ధాతువునకు అణ్ ప్రత్యయమువచ్చును- అనునర్థముగల "కర్మణ్యణ్ అను సూత్రమునను సరించి, యిచట అణ్ ప్రత్యయము రావలసియుండగా ఉపసర్గ పూర్వమందులేని, ఆకారాన్త ధాతువునకు, కర్మవాచకపద ముపపదముగ నున్నపుడు, అణ్ రాదు; క ప్రత్యయము వచ్చునని "ఆతోఽనుపసర్గే కః" అను సూత్రము విధించుచున్నది. ఇచట 'దదాతి' అను క్రియకు మూలమైన "దా" అను ధాతు వాకారాన్తమైనది. అందుచే నిచట కప్రత్యయమేవచ్చును,

ఆతోఽనుపసర్గేకః అను సూత్రము, కర్మణ్యణ్ అను సూత్ర మున కపవాదము. పైనిఁజెప్పిన విధానము ననుసరింపనిచో, గోదః, కంబలదః అనునప్పటి యణ్ప్రత్యయము భావముగూడ, "కృత్యల్యుటో బహులమ్" అను సూత్రమునందలి బహుళగ్రహణమునకు విషయము కావలసివచ్చును. అది ఎప్పటికి నిష్టముకాదు. అందుచే నిచటఁగూడ, సమాస నిషేధ మపవాదవిషయమనియే యనవలెను. ఇది యపవాద విషయమేయని నిర్ణయించుటలో నిబ్బందిలేదు. అందువలన నిది బహుళమునకు విషయము గాదు.

ఈ విషయము మే మూహించి చెప్పినదిగాదు. పాణిన్యాచా ర్యులకును నిది యభిమతమైనదియే- వారు "సమర్థః పదవిధిః" అని సూత్రమును చెప్పినారు- అందు సమర్థపదము మేము చెప్పినయ ర్థము గూడ సూచించును. సామాన్యముగ నా సూత్రముపైన

వ్యాఖ్యానము వ్రాసినవారు, పరస్పరము సాపేక్షతలేని దములకు సమాసమును వారించుటకయియే సమర్థపద ముపయుక్తమైనదని చెప్పినారు. వారు సూత్రకారుని యభిప్రాయమును పూర్తిగ గ్రహింపలేదనియే మా యభిప్రాయము- ప్రధానేతరభావవివక్షయున్నపుడు గూడ సమాసమునుపయోగింపరాదను విషయమును చెప్పుటకుఁ గూడ "సమర్థః" అనుపద మీసూత్రమున నుపాత్తమైనదని మనము తెలిసికొనవలయును. ఈ విషయమును ప్రకటించుటకే మే మీచర్చను ప్రారంభించితిమి. అపూర్వముగ మేము చెప్పున దేమియు లేదు.

ప్రస్తుతము నిష్కృష్టమైన యర్థమిది:- ఎచట విశేషణము వలన విశేష్యమునకొక యుత్కర్షముగాని, అపకర్షము గాని కలుగునో, ఎచట నుద్దేశ్యభావము స్పష్టముగ భాసింపవలయునో, యచట నెల్ల వాక్యమే యుండవలయును. సమాసముకూడదు. మిగిలిన తావులందు సమాసముఁ జేయవచ్చును.

ఈ విషయమునే శ్లోకమున సంగ్రహించుచున్నాడు.
"విధేయోద్దేశభావోయం వక్తుం వృత్త్యా నపార్యతే
యత్ర తేనాభిధానం వా, సమర్థగ్రహణం చవా (23)
కారణ ద్వయమేవేష్టం, బహులగ్రహణంనతు
ఆశక్యనియమోహ్యర్థో విషయస్తస్య నేతరః (24)
(సంగ్రహశ్లోకములు)

తా. సమాసము, విధేయోద్దేశభావమును చెప్పలేదు- సామర్థ్యమున్నపుడే (సాపేక్షత్వమున్నపుడే) సమాసమును జేయవలయును. అను నీరెండువిషయములే సమాసవిధి ప్రతిషేధములలో హేతువులు.- బహుళ గ్రహణము మాత్రముకాదు. ఎచట నిది యుత్సర్గము (సామాన్యము) ఇది యపవాదము నను నియమమును చేయ శక్యముకాదో యది మాత్రమే బహుళగ్రహణమునకు విషయము—మిగిలినవి కావు. [సశేషము

# శివరాత్రిమాహాత్మ్యము-కావ్యత్వము

(గతసంచిక తరువాయి)

చిలుకూరి పాపయ్యశాస్త్రి.

## మూర్తి సాక్షాత్కృతి

శ్రీనాథుని కవితాశిల్పమునందొక ప్రత్యేకత గలదు. అతఁడే వస్తువును బాఠకుల యెదుటఁ బెట్టఁ దలపెట్టినను, దన్మూర్తిని భావుకులకు భావనచే సాక్షాత్కరించునట్లు చేయును. ఏవస్తువును వర్ణించినను తత్సమగ్రస్వరూపమును వెలయించుటయు నాతని కొకపరిపాటి. ఈ శివరాత్రిమహాత్మ్యమునందు నట్టి మూర్తిసాక్షాత్కృతి సమన్వితమైన తావులు పెక్కులు జతఁగూడినవి. ఇట్టి రచన కావ్యత్వమునకత్యంతోపస్కారకమై వెలయును. కావ్యకర్త తానేదృశ్యమును దనప్రతిభాసమున్మేషమునఁ బాఠకుల యెదుటఁ బెట్టఁజూచునో, దానికనువైన పదవాక్య విన్యాసము చేయుటయు నత్యావశ్యకము. ఆవిషయమున నీ కావ్యమునందలి కవితావిన్యాసము కడు విలక్షణమై చూపట్టుచున్నది. అట్టిసుట్టములను గొన్నిటి నెఱిఁగించెదను. శ్రీమహావిష్ణువు ప్రళయావసానమున క్రోడావతార మెత్తి భూమి నుద్ధరించిన దృశ్యము పరికింపుఁడు.

సీ॥ కాఁడిపాఱిన మేని గరులు బ్రహ్మాండంబు
కణఁపపూబంతి కక్కజము తోఁప
ఖురపుటంబునఁ గీలుకొని మేరుకుధరంబు
మువ్వలోపలి జాతి మురువువడయ
దీర్ఘకంఠకఠోర ఘుర్ఘుర స్వనమునఁ
బాతాళగోళంబుఁ బాతలింప
నీలాంబుదశ్యామ నిబిడదేహచ్ఛాయఁ
బ్రళయాంతకాలంబు దొలకరింప

సప్త పాతాళములక్రిందఁ జాగిపడిన
యవని నెత్తె విశాలదంష్ట్రాంకురమున
నభినవస్తబ్ధరోమ దివ్యాకారుఁ
డంబురుహలోచనుఁడు కల్పాదియందు  శిరో. 1-61.

ఈపద్యములోఁ బ్రళయావసానమునఁ గల్పాదియందు జలమగ్నమైన భూమి నుద్ధరించుటకై నూతన వరాహావతారము నెత్తిన కమలామనోహరుని భీమమనోహరమూర్తి సాక్షాత్కరింపఁజేయబడినది. గడిపొడిచినరోమములు బ్రహ్మాండ మనుపూబంతి దళములవలె వ్యాపించియాశ్చర్యమును గొల్పినవి. మేరుపర్వతమావరాహమూర్తి డెక్కలనడుమఁజిక్కుకొనిమువ్వలోపలి ఱాయివలె గలగలలాడఁదొడఁగినది. మోరక్రిందికానించి కావించినఘుర్ఘురధ్వనిచేఁ బాతాళగోళము బీటలువాఱినది. నీలమేఘమునుబోలిన చిక్కనిశరీరకాంతిచేఁ బ్రళయవిలయకాలము తొలకరించినది. అట్టిభీకరాకారముతో ప్రళయజలనిధిలో సప్తపాతాళములక్రింద సాగిలఁబడియున్న భూమిని దనతీక్ష్ణదంష్ట్రాగ్రమున మీఁదికి లేవనెత్తినాఁ డాయాదివరాహమూర్తి. ఈపద్యమునఁ జతఁగూడిన తెలుఁగు నుడికారపుసొరు కడువిలక్షణమైనది. కాఁడిపాఱుట, మువ్వలోపలిఱాతి మురువునడయుట, పాతలించుట, తొలకరించుట, చాగిపడుట యను నీపదముల సొంపు అక్కజము గొల్పుచున్నది. వీనికూర్పుతోడనే క్రోడావతారము మనకనుల యెదుట సాక్షాత్కరించుచున్నది.

శ్రీమహావిష్ణు విట్టిమహత్తరకృత్యము నిర్వర్తించినపుడు దేవత లాతనిపై పుష్పవృష్టి గురిపించినారు. ఉద్ధతక్రోడావతారుఁడైన హరిపైఁ బువ్వులవాన కురిసినదృశ్యము నొకవిచిత్రమైన కల్పనముతో మనోహరముగఁ జూపించినాఁడు. అప్పటి యాక్రోడావతారమూర్తి గుహాలలో మిణుఁగురుపురుగులు మిలమిలలాడుచుండఁ జూచ నొప్పె

డీకాటుకకొండవలెఁ జూపట్టెనఁట.

సురలు తనమీఁదఁ బుష్పౌఘసోన కురియఁ
జూడ నొప్పారె హరి శశక్రోడమూర్తి
కందరంబుల ఖద్యోతగణము మెఱయఁ
జాల నొప్పారు నంజనాచలము వోలె. 1-65

ఈదృశ్య సాక్షాత్కారవిషయమునఁ బాటించిన కల్పనాచమత్కారము హృద్యమైనది. ఇట్లాలే సుశీల గర్భవతియైనప్పటి దృశ్యచిత్రణము కూడ మధురముగనే సాగినది.

పలుచఁబాఱెను గండదర్పణయుగంబు
నవమధూకప్రసూనంబు నవముకుర
మానగతిఁ జూచుకంబులునసితమయ్యె
సవతిపూఁబోండ్లయాననాబ్జములతోడ. 2-63.

యువతులు గర్భవతులైనపుడు చెక్కిళ్లు దర్పణములవలెఁ దెల్లవాఱుచుఁబలుచఁబడుట సహజము. ఈసహజదృశ్యమునే మధురము గావించినాఁడు. స్త్రీలు గర్భవతులైనపుడే చూచుకములు కుచాగ్రములు నల్లనగుటయు సహజమే. ఈనలుపెక్కుట నుపమితి సామగ్రీ సమన్వయముచే సుకుమారతరము గావించినాఁడు. క్రొత్తగఁబూచిన యిప్పపూవునందలి మధువుగ్రోలుటకై వ్రాలిన క్రొంగ్రొత్తపూవులందలి తేనెనానఁజూచు తేఁటిని దలపింపఁజేసిన దాకుచాగ్రనీలిమము. సుశీల చూచుకములు నలుపెక్కుటతోపాటు సవతుల ముఖపద్మములుకూడ నల్లవాఱినవనుటలో కల్పన మధురోదాత్తమైనది. యజ్ఞదత్తుఁడువిప్రుఁడైనను నాతని నమాత్యస్థానమునందుఁ బ్రభువునుగాఁ జిత్రించియుండుటచే సవతిపూఁబోండ్లనుగూడఁ గల్పించి, సుశీలాసౌభాగ్యమునకు వారి నీర్ష్యాళువులను జేసి, వారిముఖపద్మములను నలుపెక్కించుట కూడఁ బొసఁగియే యున్నది. కొంచెము దూరముగ భావించినచో

నిచటి యుపమితి సమన్వయమున మధురపయః ప్రదానసమర్థములగు నప్పుడే చూచుకములు నల్లవడు నను విషయమ్ము, ఆపయఃపానము మధూకకుసుమరసమువలె మాదక మనువిషయముకూడ స్ఫురింపఁ జేయునదిగా నున్నది.

ఈప్రకరణమున గర్భవతీలక్షణముల నెఱిఁగించు కూర్పులో జతపడిన భావసామగ్రి యలంకార సంయోజనము మధురతరము. మఱియు వివిధావస్థాసాక్షాత్కార సంయోజకము.

మనమున కుత్సవం బొసఁగె మంత్రికిఁ బట్టపుదేవి, గర్భశో
భనమునఁ బఱ్ఱనై చెలువుపైకొను ముద్దుల నెమ్మొగంబుతో
ఘనసమయంబునందుఁ బొడకట్టిన చల్లని తూర్పుగాలిచే
ననిచిన కన్నెగేదఁగికి నచ్చిన కూరిమి చుట్టమో యనన్.

యజ్ఞదత్తామాత్యుని దేవి సుశీల గర్భశోభనముచే అంగములు విఱఁజి మ్ము ముద్దులుగులికెడి నెమ్మొగముతో భర్తమనమున కుత్సవ మొదవించెనఁట. ఈదృశ్యము నత్ప్రికాసామగ్రిచే సాక్షాత్కరింపఁ జేసి యున్నాఁడు. ఆముఖము వర్షాకాలమునఁ బొడ తేఱిన చల్లని తూర్పు గాలిచే పుష్పించిన లేఁత మొగలికిఁ బ్రియమైన చుట్టమో, యనునట్టు లుండెనఁట. గర్భవతి యైనప్పుడు యువతినెమ్మొగము తూర్పుగాలి తగిలి పుష్పించిన మొగలిఱేకును బోలియుండుట సహజము. దానిని సరసముగఁ గాన్పింపఁజేసియున్నాఁడు.

ఉపచీయమాన గర్భయైనప్పటి సుశీల తనూవిలాసమును గర్భవతీ సహజమైన మృదాస్వాదనక్రియమును దృశ్యసాక్షాత్కార మేర్పడునట్టులు నడిపించినాఁడు. కనుఁగొంద మాక్రియను.

అట్లు ధవునొద్ద మెలఁగుఁ బద్మాయతాక్షి
సముదితంబైన గర్భభారము కతమున
సమ్యగాపీతజలరాశి సామ్యమైన
ప్రావృడారంభనవమేఘపంక్తిలోలె 2-51

గర్భభారాలసయైన సుశీల జలరాశిపానలంబమానయైన వర్షారంభ నవమేఘపంక్తివలె నున్నదనుటలో గర్భవతీదృశ్యము కన్నులకుఁ గట్టినట్టు లున్నది. ఇటులనే-

> అపారంగ విలోలలోచనను గాఢాలింగన క్రీడల
> వ్యాపారాగారము కేళితల్పముపయి న్మన్నించి మంత్రీశుఁ డ
> త్యాసంగం బొనరించె ముద్దుగొనె ముత్సాహస్వాదనప్రక్రియా
> వ్యాసంగంబునఁ గమ్మనైన యదసీయంబైన బింబోష్ఠమున్. 1-47.

ఇదియొక భావనామధురమైన సహజ దృశ్యము. ప్రణయాతిరేకసముద్యోతకము. సుకుమారమైన పదసన్నివేశమున సుకుమారమైన భావము నిందా యోజించియున్నాఁడు. మట్టితినుటచేఁ గమ్మనైన యామె బింబోష్ఠమును ముద్దుగొనుటను వర్ణించుటలో సౌకుమార్య మతివేలముగఁ దులకించినది.

ఈ కావ్యమున సుశీల గర్భవతియైనపుడు యజ్ఞదత్తామాత్యునిచేఁ గావింపఁజేసిన సీమంతపుంసవనమహోత్సవము దశరథుని వాజపేయమునకు ధర్మజుని రాజసూయమునకు సాటిగా మహోర్భటితో నిర్వహించియున్నాఁడు. కావుననే యాయుత్సవము నెఱపుటకువలయు లౌకికవైదిక సామగ్రుల నన్నిటి నేపాటియు లోపము లేకుండ సర్వాంగపరిపుష్టము సర్వసమృద్ధము గావించినాఁడు. కావుననే మంత్రిపూర్వకసమాచరణీయ క్రియాకలాపమునందుఁ గాని, ఉత్సవసంభారసంభరణమునందుఁ గాని ప్రక్రియాభంగము లేకుండ సాధించియున్నాఁడు. ఇంతకు శ్రీనాథుఁ డేవిషయమును గవితాముఖమున వెలార్పఁ దలఁచినను దానిని సర్వాంగ పరిపుష్టము చేయునేగాని లోప మేపాటియు చేయఁబూనఁడు. సుశీలాదేవి పుత్త్రునిగాంచె ననువార్త విని నంతనే యజ్ఞదత్తామాత్యుఁ డావార్త గొనివచ్చిన యంతఃపుర పరిచారికకు పారితోషిక మొసఁగిన తీరిట్లు చిత్రించియున్నాఁడు.

తాను గట్టినట్టి చీనాంబరంబులుఁ
దాను బెట్టినట్టి మేని తొడవుఁ
బ్రమద మొప్ప నిచ్చెఁ బారితోషికముగ
మంత్రి యంతిపురము మానవతికి. 2-69

సుశీలకుఁ బుత్త్రుఁడు జన్మించె ననువార్త విని నంతనే, యజ్ఞదత్తామాత్త్యుఁ డమృతరసధారామయంబైన యమ్మాటకు, సద్యః ప్రరూఢరోమాంకురనికరకంటకితగాత్రుండును, దరస్మితవికసితకపోలమండలుండును నై తాను గట్టినవస్త్రంబులును తాను బెట్టుకొనిన యాభరణములును ఆవార్త వినిపించిన యామెకుఁ బారితోషికముగ నిచ్చెను. ఈ పద్యమున మానవమాత్ర సహజమైన సంతోషావిష్కరణపద్ధతి నిరూపితమైనది. యజ్ఞదత్తుఁడు మంత్రిపుంగవుఁడు గావున తన మేన నప్పుడున్న విలువగల వస్తువుల నన్నిటిని బారితోషికముగ నీయఁ గలిగెను. ఇట్టిపుత్త్రోదయవేళలం దెవ్వరయిన తచ్ఛుభవార్తాహరులకుఁ బారితోషిక మిచ్చుట సహజము. దాని నిచటఁ గవి గూర్చియున్నాఁడు.

ఈ కావ్యమున బాలెంతరాలి సొగసు వర్ణించిన తీరు కడువిలక్షణమైనది. ఆతని యితరకృతులన్నిటికంటె నీకావ్యమున బాలెంత విభవ మతిసహజముగఁ జిత్రింపఁబడినది. ఇది శ్రీనాథుని నాఁటి బాలెంతరాండ్ర కొక రేఖామయచిత్రము.

పసుపుఁ బుట్టంబు ధరియించి పద్మనయన
సుతుని నుత్సంగమునఁ దాల్చి చూడనొప్పెఁ
దరణిబింబ హారిద్ర వార్ధరముతోడ
లలితరుచి నొప్పు నాకాశలక్ష్మివోలె 2-76.

పద్మనయనయైన సుశీల పసుపుపట్టిన పుట్టము దాల్చి, అచిరప్రసూతుఁడైన కుమారు నొడిలోఁ బెట్టుకొనియుండ సూర్యబింబము పచ్చని మేఘము నడుమనుండినప్పు డాకాశలక్ష్మి యెట్లొప్పునో యట్టి

శోభతోఁ జెలువొందినదఁట. భావనచేసిన సహజమధురమైన దృశ్యమిచట సాక్షాత్కరించును. అది యెంతయు మనోహరమై యవభాసించును. ఉపమానోపమేయ సామగ్రులు రెండింటిని సాక్షాత్కరింపఁ జేసికొనిన వారికిఁ గాని చూపట్టని మధురదృశ్య మిది.

శ్రీనాథుఁడు తెలుఁగు జాతీయతను తెలుఁగు జాతీయములలో వెలార్పఁ గల ప్రతిభావంతుఁడు. ఈ క్రింది పద్యమునఁ దన నాఁటి బాలెంత వేషమును తెలుఁగు నుడికారపుఁ దీరులో నడిపినాఁడు.

పల్లవాధర మాణిక్యైన యొల్లెఁ గట్టి
కొంగు మణిహేమ కాంచికాకోటిఁ జెరివి,
సొగసుఁ గాటుక బొట్టుతోఁ జూడ నొప్ప
వింత చెలువునఁ బచ్చిబాలెంత యపుడు. 2-71

సహజముగ లేక తాంబూల రాగముచే నెఱ్ఱనయిన యధరము గల సుశీల స్వచ్ఛమైన చీరగట్టి, పైఁట చెరఁగు మణిఖచితమై హేమమయమైయున యొడ్డాణమునఁ జెరివి, అందముగ కాటుకదీర్చి బొట్టు వెట్టి పచ్చిబాలెంతరాలయి వింత చెలువునఁ జెలువారెనఁట. పచ్చి బాలెంతలు ప్రాచీనకాలమున పైఁటచెరఁగు నడ్డికట్టు కట్టుట, కాటుక బొట్టు వీడక దాల్చుట పలుమాఱు తాంబూలచర్వణము సేయుట, వీనితో వింత చెలువము గలిగి యొప్పుటయుఁ బరిపాటి. ఆ చెలువము నీ పద్యమున సాక్షాత్కరింపఁ జేసినాఁడు. నేఁడుకూడ నీ బాలెంత చెలువము సహృదయులయిన భావుకులకు వింత గూర్పక మానదు.

ఆనాఁడు సిరిగలిగి మహాసనమదోద్రిక్తులై వీథుల వెంటఁ దిరుగాడు యువకుల యాకృతి నీ క్రింది పద్యమున వెలార్చినాఁడు.

పసగొన్న తెలిపట్టు పన్నిదంబులతోడ
రత్నాలతారహారము ధరించి
తలిపసిఁడిరాకవి దోకటిపైఁ బదార్వన్నె
కరగైన పసిఁడిమేఖల ఘటించి

గంగమట్టియమీఁదఁ గస్తూరి రసమునఁ
బుండ్రకంబు లలాటమున నమర్చి
కమలకర్ణిక కుండలములు పార్శ్వములందు
లలితంబులగు నొంటు లలవరించి
యాత్మవంశ పరంపరాయాతమైన
వైదికాచారమార్గంబు వర్జించి
యారజము రాచరికమును నలవరించి
నగరివీథులఁ జరియించుఁ బ్రేగడసుతుఁడు. 2-90

యౌవనమదోద్రిక్తులయిన విలాసవంతులగు విప్రులానాఁడు, ఎగుడుదిగుడు లేని పట్టుజందెములు వైచుకొని, వానితోపాటు, రత్న సమ్మిశ్రితముక్తాహారములు దాల్చుట, సన్నని నీర్కావిరంగుగల దోవతి గట్టి దానిమీఁద బంగారు గోవ్రతాడు మొల నూలుగాఁ బెట్టుట, నుదుట గంగమట్టిపూసి మీఁద కస్తూరినామము పెట్టుకొనుట, చెవులను దుద్దులు పెట్టుకొని వాని ప్రక్కన అందమైన యొంట్లు దాల్చుట, యను వీనిని వేషభూషాదికముగాఁ దాల్చుచుండెడివారు. మఱియు వారు వంశక్రమాయాతమైన ఆచారము వదలి పోగరుఁబోతుతనము పెరిగి రాచకవితో వీథులలో యువతుల వలపించుటకై తిరుగాడు చుండెడి వారనియు, దీనివలన విదితమగుచున్నది. యౌవనమదోద్రిక్తుఁడయిన సుకుమారుని మూర్తి యీ పద్యమునఁ జూపట్టును.

సుకుమారుఁడు ధూర్తవిటుఁడై పారదార్యమునకుఁ బాల్పడి నప్పుడు, తల్లి యాతనిదుర్వృత్తికి దురపిల్లినతీరు చిత్రించుటలో కరుణరస ప్లావితమూర్తి సాక్షాత్కృతిచూపట్టును.

రవలయుంగరములు రత్నాంకురములొత్త
గేల్దమ్మిఁ జెక్కులఁగీలు కొలిపి
మొకరితుమ్మెద మూతిముట్టనోడెడి కేఁడి
నిశ్వాసపవనంబు నివ్వటిలఁగ

నా కర్ణదీర్ఘంబు లగు క్రాలుఁగన్నులఁ
బరిపాటలచ్ఛాయ పల్లవింపఁ
గంఠగోళంబు గద్గదికానుబద్ధమై
భాష్పధారాంబునిర్భరము గాఁగ
పక్ష్మముల జాఱి గండదర్పణము దొరసి
వ్రాలి పాలిండ్లపై నశ్రువాఃకణములు
హారలతలకు నాతిథ్య మాచరింప
గుబ్బతిలనేడ్చె నత్తఱిఁ గువలయాక్షి.

రవ్వలు దాపిన యుంగరములందలి రత్నాంకురములు చెక్కిళ్ళ నొత్తునట్లు హస్తపద్మమునఁ జెక్కిళ్ళు నిలిపి, గండుతుమ్మెద మూతితో ముట్టుటకు జంకునట్లు వేఁడి నిట్టూర్పులు విడుచుచు, ఆకర్ణ విశ్రాంతము లైన కన్ను లంతట నెఱ్ఱవాఱ, కంఠము గద్గదికతోఁ గూడునట్టులు భాష్పధారలు పొడమ, కన్నీటి బిందువులు ఱెప్పలనుండి జాఱి, చెక్కిళ్ళ నొరసి, కుచములపై వ్రాలి, అఱుతఁదాల్చిన హారముల కాతిథ్య మొసఁగుచుండ నాకువలయాక్షి దుఃఖముప్పొంగ విలపించినదఁట. కరుణరసభావసంచారమున వివిధక్రమములు సుకుమారముగ నాయోజించుచు కరుణరసమయమూర్తి నిందు సాక్షాత్కరింపఁ జేసినాఁడు.

తలము దప్ప మద్యము త్రావినవాని మూర్తి యీ క్రింది పద్యమునఁ జూపట్టును.

త్రిసరకాస్వాదభవ మదోద్రేకలహరి
ధరణిదేవుఁ డాయోజ మత్తావహించి
యారణాలు పఠింపంగ నాలకించి
శంబరారాతి రచిచేయిచఱచి నవ్వు. 3-14.

భూసురుఁడైన సుకుమారుఁడు మూఁడుపాయల కల్లు ద్రావి, తత్పానమునఁ గలిగిన మత్తుచే నొడలు తెలియని స్థితిలో పూర్వము వేదము చదివినవాఁడు గాన, అరణ్యకము చదువ మొదలుపెట్టెను.

అది చూచి మన్మథుఁడు రతిదేవిచేతఁ జప్పటులు చఱుచుచు నవ్వి నాఁడఁట. సురాపానమదోద్రిక్తులు, తత్పానమునకుఁ బూర్వమునందు బుద్ధిలోఁ బాదుకొనియున్న సంస్కారవశమునఁ బ్రేలుచుందురు. సుకుమారుఁడు విప్రుఁడుగావున పూర్వవాసనావశమున నారణాలు పఠింపఁ దొరకొనినాఁడు. ఈ విషయమునే తరువాతిపద్యమున మఱికొంత వివరించియున్నాఁడు.

ఉత్సవమొ వైభవమొ లేమియో కలిమియొ
పగలొ రాత్రియొ యెఱుఁగఁ డా బ్రాహ్మణుండు
నవమధూకప్రసూనసంభవము మధువు
దళము దప్పంగఁ ద్రావి మత్తాళహించి. 3-15.

హద్దుమీఱఁ బుష్పాసవము సేవించి మత్తెక్కిన వ్యక్తికి దేశకాలాది విభాగవివేకము శూన్యమైపోవు ననుట యిటఁ దెల్లము చేసినాఁడు.

చండాలకన్య సరోవరమున ఋతుస్నానము నెఱపి, తీరమునకు వెడలి వచ్చినప్పటి యామె సౌందర్యమును వర్ణించు ప్రకరణమున నామె శిరోజముల నెంతయుఁ బ్రేక్షణీయముగఁ జిత్రించియున్నాఁడు.

అకలకంఠి యొయ్యఁ దడియార్చు నెడన్ జఘనాంతికంబులై
కేకికలాపలీల వణకించి, మధువ్రతమాలికాకృతిం
గైకొని, యింద్రనీలమణి ఖండవిలాస మలిఘ్నుదంబులై
చీఁకటి గొల్పె బ్రాహ్మణుని చిత్తము పెన్నెఱిసోగవెండ్రుకల్. 3.44.

ఆమె స్నానముచేసి, పెద్దవి అందమైనవి సోగయైనవి యగు శిరోజములను తడియాఱఁ జేయునపుడు, వివిధభంగిమలలో నెమలి పింఛమును, తుమ్మెద బారును, మీఱినవియై ఇంద్రనీలమాణిక్యశకల విలాసమును ముచ్చిలునవియై కానవచ్చి బ్రాహ్మణునిచిత్తమునకుఁ జీఁకటి గొల్పిన వఁట. స్త్రీలక్షణములలో కచకుచములు ప్రధాన

ములు. వాని భావాభావములే స్త్రీ సౌందర్య భావాభావములకు నిదర్శనములు. చండాలిని విలక్షణసౌందర్యవతినిగను సుకుమారుని కామాంధునిగను జేయఁ దలపెట్టినాఁడు గావున శ్రీనాథుఁ డామెశి రోజముల నింత విలక్షణముగఁ జిత్రించి పెట్టినాఁడు. అదియును గాక సౌందర్యనిరూపణాభినివిష్టమతియై శ్రీనాథుఁడేవిషయమును జేఁబట్టి నను తత్సమగ్రత సంపాదించును గాని, సంకోచము నేపాటియుఁ బాటింపఁడు. ఇంతటి కేశసౌందర్యము నాఁతడు పరికించియే దీని నిట్టులు రూపొందించియుండును. ఈ దృశ్యభావనకు తత్సమాన దృశ్య దర్శన మావశ్యకము. లేకున్న నిది యతిశయోక్తిగ భాసించును.

చలిని వర్ణించు ప్రకరణమున సామాన్యముగ సాక్షాత్కరించు మూర్తి నొక్కటి సాక్షాత్కరింపఁ జేసినాఁడు.

> ఇనుఁడు కోదండ రాశిమీఁ దెక్కినపుడు
> నిక్షుకోదండ వల్లి నెక్కిడు మరుండు
> సమద వేదండసమ మహాసత్త్వుఁ డయ్యు
> జనుఁడు కోదండమును బోలెఁ దనువు వంచు.

సూర్యుఁడు మార్గశిరపుష్యమాసములకు మధ్యవేళ ధనూరాశిలోఁ బ్రవేశించును. ఆసమయమున చలి మితిమీఱి యుండును. చెఱుకు తోఁటలు కూడ ముదురఁబాఱును. ఆసమయమున మన్మథుఁడు ఇక్షు ధనువు నెక్కువెట్టి యుండును. ఆతరుణమున మదపుటేనుఁగుతో సమానమయిన బలముగల జనుఁడయినను తన శరీరమును వింటిబద్ద వలె వంచును. ఎంతటి బలవంతుఁడయినను ధనుర్మాసమునందలి చలికిఁ దట్టుకొనలేక శరీరమును వింటి బద్దను వలె వంచవలసినదియే. ఇది సర్వజనానుభవ గోచరమైన దృశ్యము.

## అష్టాదశ వర్ణనములు

శ్రీనాథుని యీ శివరాత్రిమాహాత్మ్య మను ప్రబంధము గద్య పద్యాత్మక రూపమునఁ జిన్నదియైనను, ప్రబంధమునకు వలయు

లక్షణముల నన్నిటిని సమకూర్చినక్రమమును బట్టి చూచినను, కావ్యసామగ్రీ సమన్వితిని బట్టి చూచినను నిదియొక యుత్తమ ప్రబంధ మనఁదగియున్నది. శ్రీనాథుని రచనలన్నియు స్వేచ్ఛానువాదములే గాని, యథాతథానువాదము లేవియుఁ గానేకావు. ఈ కావ్యమునకు మూల మీశానసంహితలోని యితివృత్తమైనను నిదియొక స్వతంత్ర కావ్యమనియే యనఁదగియున్నది. ఈ కావ్యమునకు మూలమునందలి యితివృత్తాపేక్ష చాలతక్కువ. శ్రీనాథుని భావనామయమైన కావ్య సామగ్రీసృష్టి దీనిలో చాల హెచ్చు. ఈ కావ్యమున సూచనా మాత్రసారముగ సంక్రాంతమైన విషయమే తరువాతి ప్రబంధయుగ కావ్యనిర్మితి పద్ధతికి మార్గదర్శక మయ్యెనా? యని యనిపించు తీరులో నడచినది. ఈ ప్రబంధమునం దష్టాదశవర్ణనములు ప్రకరణ వశమున నన్నియు జతగూడినను, అతిమాత్ర మనిపించునట్టు లెక్కడను గానరాదు. ఔచిత్యమునకు భంగపాటును జూపట్టదు. అష్టాదశ వర్ణనా సమన్వితంబు గావింతుసను ప్రతిజ్ఞా నిర్వహణ మెట్లు సాగెనో యాతీరును కొలదిపాటి వివరణముతోఁ దెలిపెదను.

సముద్రవర్ణనము—ఆటఁగాంచెం బద్మగర్భం డహీమకరధులీ ...

... జగద్వ్యాప్తి లబ్ధిన్ సుధాబ్ధిన్. 1-72

శైలవగర వర్ణనములు— కాంచవాచలముతో గర్వించియే కొంచ. ...

రత్నపుర మనఁ గల దొకరాజధాని

ఆశ్వా. 2-3వ పద్యము మొదలు 11-వ పద్యమువఱకు.

ఋతువర్ణనము—ఈ కావ్యమున హేమంత శిశిరవసంత ఋతువులు వర్ణనోపాత్తములయినవి. ప్రాచీనకవులు ఋతువర్ణనప్రసక్తు లయి నచోఁ దన్మూలముగఁ బ్రకృతి చిత్రణమును గావించుచు వచ్చిరి. నాఁటి వారి కవితాప్రవృత్తి కాదర్శమన్నిటను సంస్కృతకవులు తద్విరచిత కావ్యములు గావున వారి యడుగు జాడలలో మెలఁగుచు

వచ్చిరి. కావుననే కల్పనాపాటవము అలంకారపరిపుష్టితోపాటు కవులయూహ కందిన ప్రకృతిదృశ్యములు ప్రబంధముఖమునసాక్షాత్కరించుచు వచ్చినవి. శ్రీనాథుని రచనలో మాత్రము కవితాస్రవంతి సంస్కృతచ్ఛాయలో జాలు వాఱినను, తెలుఁగుఁదనము తరిగిపోక, స్వాభావికత సడలిపోక, తెలుఁగు నేలఁ గాన వచ్చెడి వివిధ దృశ్యములు ఋతువర్ణనల మూలమున వెలువడుచు వచ్చినవి. ఇతర కావ్యములం దేకవియు నంతగఁ జేపట్టని హేమంత శిశిరములఁ గైకొని వింతహొయలతోఁ జిత్రించి పెట్టినాఁడు.

హే మం త శి శి ర ము లు

వీని వర్ణనోపక్రమమే విలక్షణము.

క. హేమంతము శరదాగమ
సామంతము తుహినకర వి సంజ్ఞితశబరీ
సీమంతము మదనబల
శ్రీమంతము డాసె భువన సీమాంతంబై.

చక్కని పలుకుబడితో హేమంత సమయమును శరత్సమయము నకు సామంతమును మదనబలశ్రీమంతమును జేసి లోకము నందంతట నవతరింపఁ జేసియున్నాఁడు. ఇఁక నిప్పటి ప్రకృతి వైభవ చిత్రణ మత్యంత విలక్షణము,సహజదృశ్య సమన్వితమునై యొసలారినది. అది యెట్లు కొనసాగెనో కనుఁగొందము.

జలుసు ల్పండెను దొండమున్కపడియెం బ్రాసంగుచే లోఁకపా
కల పూఁబాళల తావిగ్రోలి పొదలెం గాబేగదచ్ఛాయువుల్
ఫలినీవల్లిమతల్లికల్లరులపైఁ బైపై నలిగ్రాతముల్
పొలసె న్కంచలు రాలె రాత్రికరిణీపూత్కారవార్బిందువుల్. 4-19.

జలుసుతుప్పలు పండియుండుట యొక్క ప్రేక్షణీయమైన దృశ్యము. అవి పండుట హేమంతసమయమునందే జరుగును. ఆ పండ్లు పండినపుడు చెట్టునందొక్క యాకేని యుండక రాలిపోవును.

తుప్పలన్నియుఁ బచ్చని పండ్లతో నిండి చూడముచ్చట గొల్పుచుండును. ఆసమయమునందే పెద్దవరి చేలు పండఁబాఱి యెఱ్ఱని కొనలతోఁ గూడిన గింజలతో నిండియుండును. కన్నారిసంత మేర పండఁబాఱిన వరిచేల సొబగు కూడఁ గడుఁ బ్రేక్షణీయముగనే యుండును. ఇఁక నాసమయమునం దుత్తరదిశనుండి కొండగాలులు వీచును. శ్రీనాథుఁడు సామాన్యముగ నెట్టి వాయువునకైన గంధవహ నామము సార్థకముసేయుటకై వానినిపోకచెట్ల పూలగుత్తులలోని పరిమళమును గ్రోలునట్టులుసేయును. పోక పూవులలో సౌరభభరము మిక్కుటము. మఱియు ప్రేంకణపుఁ దీవల పూలగుత్తులపైఁ దుమ్మెదలు మూగినవి. మధుసౌరభభరితమైన పూవులమీఁదికి తుమ్మెద బారులు చేరుటయు సహజమే. ఇఁక రాత్రివేళ మీఁదినుండి క్రిందికి రాలెడి మంచుబిందువులు, రాత్రియనెడి యాడేనుఁగు ఫూత్కారము సేయఁగా రాలిపడెడి నీటిబిందువుల ట్లుండెనఁట. ఇందు సహజ విషయముతో పాటు ఉత్ప్రేక్షాసమన్వయమును గూడినది. శ్రీనాథునకు వరియన్నమన్నను, వరిచేలనినను ప్రీతి మెండు. పలుతావులందు పలుమాఱులు తత్ప్రస్తావము దెచ్చుచునేయుండును. ఇప్పుడు పండిన వరిచేలసొగసు నొకవింత యొయ్యారముతోఁ దీర్చి దిద్దినాఁడు. వరిచేలు పండి వెన్నులన్నిట నూగు రేగినది. చెఱువులక్రింద కాలువ నీటి ప్రవాహము పాఱుదలచే పండిన వరిచేలున్నచోటు లన్నిటను, భూమి చలి మిక్కుటమగుటచే గగుర్పాటునంది రోమాంచిత దేహమైనట్టులుండెననినాఁడు. ఇట్టి రూపకల్పనము నీక్రింది పద్యమునం దాయోజించినాఁడు.

కలమవనాళి కాకణిశకంటకకోటులచేతఁ జాడ్యకిం
పలఁబఱిచెన్ధరిత్రి తుహినాగమవేళఁ దటాకసారణీ
సలిలము పాఱి పండినయజాంగలసీమము లెన్ని, యన్నిటన్
దలముగ నీతు పేర్మి గరుదాల్చిన భావము ప్రస్ఫుటంబుగన్

ఈనాఁటి చలి నుద్దేశించియే రెండు పద్యములలో ద్వివిధమైన కల్పనము కావింపఁబడినది. కల్పనాచమత్కారము కావ్యాంగములలో నొక్కటి.

క. కలవింక కలకలాకుల
వలభీగర్భములు సౌధవాటములు పురం
బులయందుఁ దుహినవేళల
జలి గులగులఁ గూయునట్టి చందంబొందెన్.

పట్టణములలోని మేడల మీఁది భాగములు ఇండ్లకప్పులు, పిచ్చుకల కలకలారావములలో నిండియుండుటచే చలిచేఁ గులకుల కూయుచున్నట్లు లుండెను. ఇటులనే మొక్క ప్రేంకణపు చెట్టుల మీఁది పూగుత్తులకు మూఁగు తుమ్మెద గుంపులు ధ్వనిచేయుట, వనదేవత మిక్కుటమైన చలిచే వణఁకుచు దంతవీణ వాయించెనో యనునట్లుండె ననినాఁడు. చలి మిక్కుటమైనపుడు తట్టుకొనలేని యదనునఁ బ్రాణులు వణకుచు పండ్లు చప్పుడు సేయుదురు. దానిని దంతవీణ వాయించుటగాఁ జిత్రించినాఁడు. ఇట్టి చలివేళయందుధన్యాత్ములు కొందఱే రాత్రివేళ నిద్రింపఁగలిగెద రనినాఁడు. ఇదియు నొక మధురోదాత్తమైన కల్పనయే.

శా. బింబోష్ఠీకుచకుంభ భారము లురః పీఠంబున న్హత్తి మో
దం బారన్ మృదుకేలి శయ్యల శుభాంతర్గర్భ గేహంబులం
దాంబూలీదళపూగపూరితముఖుల్ ధన్యాత్మకు ల్శీతకా
లం బెంతేనియు నిద్రవోదురు నిశల్ సంభోగ లీలావిదుల్. 4-23

శీతకాలములో ధన్యాత్ములు కొందఱు దొండపండువంటి మోవిగల యువతుల కుంభములవంటి కుచలములబరువును తమ వక్షః పీఠముల మోచునట్లు చేసికొని, సంతోషములో మెత్తని సెజ్జలపై, అందమైన యిండ్ల లోపలిగదులలో, తములపాకులు పోకలు గూర్చి నమలుచు సంభోగ లీల నెఱిఁగినవారై యెంతేని నిద్రపోదు

రఁట! శీతకాలమున మిక్కుటమగు చలిచే నిద్రపట్టనినాఁడు, నిద్రా సాధనముల నిట్లు రమ్యముగ రూపొందించినాఁడు.

ఈహేమంత సమయమున కొండగాలి అలకాపురము మొదలు పెట్టి రాధాపురము వఱకు నడుమనుండెడి ప్రదేశములందు వింతలు గాన్పింపఁజేయుచు, అడవులమీఁదుగా కళింగాంధ్ర దేశముల సరణిఁ బట్టుచు సపాదలక్ష శైలములను బలుకరించుచు వచ్చుటను చిత్రముగఁ జిత్రించియున్నాఁడు.

సీ. ధనదశుద్ధాంత కాంతాపయోధర భార
సంవ్యానపల్లవ స్రంసనములు
కైలాసగిరి కూటకల్పద్రుమాటవీ
కుసుమగుచ్ఛర జోవగుంఠనములు
చంద్రభాగాసరిత్సలిలవీచీఘటా
ప్రేంఖోలి కాకేళిరింఖణములు
రాధాపురీహర్మ్య రత్నహేమ గవాక్ష
సంవేశనక్రియా సౌష్ఠవములు
వలనుగాఁ జంపకారణ్యవాటిఁ దరిసి
కాశి యొరసి కళింగాంధ్రదేశసరణి
దక్షిణము సాగెను సపాదలక్షశైల
కటకబంధుఁ డుదగ్దిశాగంధవహుఁడు.

ఈవాయుప్రసారమునందుఁ గొన్నివింత విటచేష్టితములను గాన్పింపఁజేసినాఁడు. అది వాచ్యముగాక వ్యంగ్యభంగిలో నడిచినది ఉత్తరదిక్కు నుండి దక్షిణముగాఁ బ్రసరించు గాలిని తెలుఁగు నాఁట 'కొండగాలి' యనియందురు. ఆమాట సార్థకమగుటకు సపాదలక్ష శైలముల ప్రదేశములతో బంధుత్వము నెఱపింపఁజేసినాఁ డాగంధవహమునకు. మఱియు నీవాయువునకు గంధవహనామమును సార్థకము చేయుటకు చిగురుటాకులతో కుసుమరజముతో జలతరంగక్రీడలతో అంతఃపురాంతఃప్రవేశముతో సంపెంగవనములతో సంబంధమును

గల్పించి, స్త్రీలింగశబ్ద సంయోజనమున వింతవిటచేష్టితముల నంతర్హితము చేసియున్నాఁడు.

ఇది హేమంతఋతువర్ణన ప్రస్తావము గావున, దీనిలో చలికి ప్రవేశ నిర్గమములను రెండింటిని తెలుఁగు పరిపాటిని దెలిపియున్నాఁడు.

గీ. చలి ప్రవేశించు నాగులచవితినాఁడు
మెఱయు వేసవి రథసప్తమీ దినమున
వచ్చుసీతు ప్రవేశించుఁ బెచ్చుపెరిగి
మార్గశిరపౌషమాసాల మధ్యవేళ.

నాగులచవితినాఁటికి చలి ప్రవేశించును. రథసప్తమికి చలి తగ్గి వేసవి యనిపించును. కార్తికశుద్ధచవితి సంస్కృత పరిపాటిని నాగచతుర్థి. తెలుఁగువారి కది నాగులచవితి. ఈనాగులచవితి తెలుఁగు నాఁటివారి కండఱకు నాగులకు పూజచేయు పండుగ. ఆనాఁడు చాల మంది వనిత లుపవసించుట పాముపుట్ట లున్నచోట పాలుపోయుట, తమ సంతానమున కభయము నర్థించుట నెఱపుదురు. మాఘశుద్ధసప్తమి రథసప్తమి. ఇది కూడ నాంధ్రుల కొకపర్వదివసము. ఈనాఁటికి సూర్యరథము ఉత్తరమునకుఁ బయనించును. కావునఁ దెలుఁగువారు పాలు పొంగించి సూర్యభగవానునకు నివేదింతురు. 'రథసప్తమికి రథములు మరలును' అనుసామెత. శరదృతువులో జైత్రయాత్రకుఁ దరలిన రథములు మరలు నని జనశ్రుతి. ఈనాఁటి కుత్తరాయణ ప్రవేశమయి చలి తరిగి వేసవి చూపట్టును. ఈతీరయిన తెలుఁగు పరిపాటుల నిందు సూచించుచు, మార్గశిర పౌషమాసముల నడిమివేళ అచ్చుసీతు పెచ్చు పెరిగి యుండు ననినాఁడు. ఈపద్యమునందలి విషయ మంతయు పూర్వకాలికము.

మకరసంక్రాంతి తెలుఁగువారి కొక పెద్ద పండుగ. అప్పటికి సూర్యుఁడు కోదండరాశి నుండి మకరరాశిలోఁ బ్రవేశించును. ఆసమ

య మాబాలవృద్ధము చలిచే బాధపడుచునే వినోదించువేళ. ఆవినోదము నీ క్రింది పద్యమునఁ జిత్రించినాఁడు.

ఇండ్ల మొదలను నీరెండ నీడికలను
ననుఁగుఁ దమ్ముఁడు నన్నయు నాటలాడు
నత్తయును గోడలును గుమ్ములాడుఁ గుమ్ము
గాచుచోటికి మకరసంక్రాంతివేళ.

ఇండ్లముగింట నీ రెండలు పాఱునపుడు చిన్నపిల్ల లన్నదమ్ము లీడికలాడు కొందురు. చలిగాచుకొనుటకై కుమ్ములున్నచోటికి అత్త కోడండ్రు చేరి కుమ్ములాడుకొందురఁట. ఈ రెండును సహజములే. హేమంతానంతరకాల భావియైన శిశిరమునకుఁ బ్రస్తావము గావించుచు, మకరసంక్రాంతి పుణ్యకాల ప్రసంగము గొని తెచ్చి, మాఘ వేళను బ్రవేశపెట్టినాఁడు. మాఘకృష్ణచతుర్దశి మహాశివరాత్రి పర్వ సమన్వితముగావున నేతదృతువైభవమును పుణ్యక్రియారంభముతోఁ బవిత్రతరము గావింపఁ దలపెట్టియున్నాఁడు.

సీ. కాశిలోఁ జక్రపుష్కరిణి దుష్కరశుష్క
గహనావళీ దావదహన జిహ్వ
కుక్కుటేశ్వరవరకుండి పీఠపురి శం
కాతమస్కాండ చండాంశుదీప్తి
దక్షవాటంబున సప్తగోదావరి
కలిదోష పాషాణకులిశధార
గౌతమీతటిని మార్కండేయపురి మోహ
దురితాహిసంఘాత గరుడమూర్తి
నిన్నిటను దీర్థమాడంగ నేఁగుచెంతు
రఖిలమునులుఁ బ్రభాతసంధ్యాగమముల
గ్రహగణేశుండు కోదండరాశిఁ బాసి
మకరమున కేఁగుదేరంగ మాఘవేళ.

సూర్యుఁడు ధనూరాశిని వదలి మకరరాశికి వచ్చునప్పటికి మాఘమాసము ప్రవేశించును. ఆపుణ్యసమయమున సకలమునులు-

ప్రాతః కాలసంధ్యాసమయములందు సకల కలుషములు తొలఁగుటకై, కాశిలో చక్రపుష్కరిణియందు, పీఠికాపురమున కుక్కుటేశ్వరకుండమునందు (పాదగయాతీర్థమునందు) దక్షారామమునందలి సప్తగోదావరమున, రాజమహేంద్రవరమున మార్కండేయ శంకరు నెదుట గౌతమీనదియందును, తీర్థమాడుటకై యేతెంతురఁట. కాశీతీర్థముదక్క మిగిలినతీర్థములన్నియు నాంధ్రదేశమునందలివియే యగుట శ్రీనాథుని యాంధ్రతీర్థక్షేత్రాభిమానమును వ్యక్తముసేయుచున్నది. మఱియు శ్రీనాథుఁడు మాఘవేళఁ బలుమాఱు లీతీర్థములందు గ్రుంకులు వెట్టియుండుననుటగూడ వ్యక్తమగుచున్నది. ఆతనినాఁటి సుకృతార్థుల ప్రవృత్తికూడ నిచట సూచితమగుచున్నది. ఇఁకనప్పటి ప్రకృతివికాస విభవము నిట్లు చిత్రించి పెట్టినాఁడు.

పఱివోయెన్ దుహినంబు పండె వరి యిప్ప ల్పూసె శైలంబులన్
గఱిగట్టె న్వలరాజు తేఁటియెఱుకం గాండప్రకాండంబులం
జఱపించెన్ గ్రహరాజు మాఠరకునిం జక్రాద్రికూటంబునం
దఱిఁ గౌబేరదిగంతరిక్షపథయాత్రా జైత్ర తుత్తుంభమున్.

సూర్యుఁ డుత్తరాయణమునఁ బ్రవేశించి ఉత్తరదిగ్జైత్రయాత్రాభేరిని తనయనుచరుఁడైన మాఠరకునిచే చక్రవాళ పర్వతశిఖరములయందు మ్రోగింపఁజేయునప్పటికి మంచు కొల్లఁబోయినది. వరి పండినది. కొండలపై ఇప్పచెట్లు పూసినవి. మన్మథుఁడు తనపుష్పబాణములందు తుమ్మెద ఱెక్కలచే గఱి గట్టించినాఁడు. మధుమదారంభమున కనువైన సమయ మది. కావున వలరాజుచేఁగూడ సమరసన్నాహము చేయించినాఁడు.

ఇఁక నప్పటి మనోహరదృశ్యములను భోగానుభూతుల నీక్రింది విధముగ రూపొందించియున్నాఁడు.

"వెండియుఁ జకోరలోచనల కుచమండలంబులకు కర్పూరక్షోదంబుల మేదించిన చందనానులేపనై పథ్యం బపథ్యం బయ్యె. (చలి తరుగుటచే శీతలానులేప

నములు హితవయిననుట) సవ్యాపసవ్యక్రమంబునం జక్రమిథునంబుల నెట్టుకొని బిట్టేసి యేసివిసిగి నిల్చి మనోభవుండు నిగుడించిన నిట్టూర్పునుంబోలె నిశాసమయంబుల నిండువెన్నెలలోనం జన్నిచ్చి సుడివేఁడి పొడమూపె. (నిశితముగఁ బరికించినఁ గాని పట్టుపడునది గాదు.) కేదారక్షేత్రంబులం గలమగోపిక లొడికంబుగా దంచిన నిర్దంపుదుద్దుగడు ప్రాసంగుఁబ్రాలు సద్యోమార్గపావకంబున నవతిస్నిగ్ధవర్ణంబులై కర్ణాటదేశతాటంకినీ దశనవజ్రాంకురంబుల కాంతిసంపద దలంచె. నీహారవ్యాపాయంబున నిర్మలంబులై బహుళపక్షప్రదోషంబులయందుం దారకంబులు వికచకుముదకోరకంబులు కొలంకులలోనం బ్రతిఫలించిన నక్షత్రములు, కలహంసలు ఖండింపఁగాఁ దేలుచున్న తామరతూండ్లవలె నుండె ననుటలో కల్పనాసమన్వితభావన సుకుమారతరమై యొసలారినది. (ఈ దృశ్యము కన్నులారఁ గాంచినఁగాని పొడకట్టునది గాదు) పలపలని మంచుఁదుప్పర ముసురుజడిం దడిసి, జడనువడి వేఁకలగుపోఁక పూఁబాళల పరిమళంబులఁ బుక్కిలించి, యసమసమవిషమ కుసుమఫలక్రీడామతల్లికల మల్లువెనంగి దస్సినఖిల్లపల్లవాధరల గల్లఫలకంబులఁ గ్రొత్తయుదయించు చెమటచిత్తడి యుడిపె. ఇంత దనుకఁ బ్రకృతి వికాసమున సంభూతమైన దృశ్యముల నుత్ప్రేక్షింపఁజేసి యిఁకమీఁద భక్తిభావ సుసేవ్యమైన శివరాత్రిపుణ్యకాల మాహాత్మ్యమును జిత్రింపఁదలపెట్టినాఁడు. కాశీ శ్రీశైల కుంభఘోణ కాంచీ కాంచనసభా కాళహస్తి కురుక్షేత్రాది పుణ్యస్థానంబులం గూప వాపీ తటాక కుండికా ప్రస్రవణ స్రోతస్వినులం బ్రత్యూషకాలంబులం బరమర్షి సార్థంబు తీర్థంబులాడె. ఇవ్విధంబున మాఘమాస వాసరంబులు వసంత సమయ సామంతంబులు జరుగుచుండ నాచండాలాది మనుష్యులకు భుక్తిముక్తులు ప్రసాదింపం జాలి, మాహేశ్వరులకు మహోత్సవంబు, వేదాంతులకు సంతోషంబు, శంభునకు విస్రంభస్థానంబు, శాంభవికి హృదయానందంబు, హేరంబునకుఁ బ్రియంబు, మునితతి [illegible] గండ్రగొడ్డలి సంతాపశాంతికి భాగీరథీ ప్రవాహంబు శివరాత్రి పుణ్యకాలంబు చేతెంచెం."

ఈ విధముగ శిశిరఋతువిభవము నంతయు శివరాత్రి పుణ్యకాల మహాత్మ్య ప్రతిపాదకముగ నిర్వహించి శ్రీనాథుఁడు తనకుఁ గల యీశ్వరార్చన కళాశీలత్వమును బ్రతిపాదించియున్నాఁడు. ఈ ఋతుద్వయ విభవము నింత యుదాత్తముగను సుకుమారముగను జిత్రించిన తా ప్రాతనికృతులలోఁ గాని [illegible] ల కృతులలోఁ గాని [illegible]ంతగఁ గానరాదని మన మూహింపవచ్చును. సృష్టి సౌందర్య విస్ఫురణ విషయమున శ్రీనాథునిదృష్టి యెంత నిశితముగఁ బ్రసరించునో, యనుట కేతదృతువర్ణనము కూడ నొక తార్కాణము.

## వసంతవర్ణనము

సీ. కామినీగండూష కాదంబినీధారఁ
బులకించె నారామభూమిఁ బొగడ
చివురాకుఁ జవిచూచి చవిచూచి యెలిగించెఁ
బంచమస్వరమునఁ బరభృతంబు
సంపుల్ల కోరకస్తబకాచితంబైన
కోరవిపై భ్రమయించెఁ గొదమతేఁటి
పరిపక్వసహకారఫలరసాస్వాదన
ముదమునం గీరంబు చదువఁ దొణఁగె

విట విటీసముదయములు వివిధ విధుల
నుపవనక్రీడ సల్పిరి యుబ్బు మిగిలి
యఖిలజనులకు సంతోష మావహించె
వాసరములైన మధుమాస వాసరముల.

శ్రీనాథుని నాఁడు గూడ వృక్షములను బుష్పింపఁ జేయుటకై దోహదక్రియలు నెఱపుచుండెడివారో, లేక సంస్కృతకావ్య పరిశీలన సలిపినాఁడో కాని, ఆరామభూమిలో కామినీ గండూష సంప్లావముచే వకుళవృక్షమును వికసింపఁ జేసినాఁడు. వసంతోదయమైనంతనే శ్రీనాథుని కవితలో పరభృత పంచమస్వరము వినిపింపక పోయెను. కా[illegible]చటఁ గోయిల చిగురుటాకు చవిచూచి చవిచూచి [illegible] పంచమస్వర[illegible] చుచున్నవి. గండు [illegible] గోరంటలపై సంభ్రమింపఁ జేసినాఁడు. గోరంట పూల పరిమళ[illegible]విస్తృతము. పండిన మామిడిపండ్ల రసమును మెసవినంతనే చిలుకలు చదువ మొదలుపెట్టెనట. మధుర చూతఫల రసాస్వాదముచేసిన చిలుకలచేఁ జదివించుట యనునది యొక సుకుమారతరమైన ప్రయోగము. వసంతోదయమున నుబ్బుమిగిలి విటవిటీజన సముదాయము పెక్కుతెరఁగుల నుద్యానవనములలో విహారము లాచరించుట యనునది మధుమాసవాసర సమాజలక్షణము. మధుమాస వాసరములలో సకలజనులకు సంతోషమావహించె ననునది సార్వకాలికమైన సత్యము.

ఈ విధమయిన వసంత వర్ణనమును సుకుమారుని ప్రవృత్తిని పాపభూయిష్ఠము గావించుటకు సాధనము చేసినాఁడు.

"సకలజనమనోహారంబులగు మధుమాసవాసరంబుల, నస్పాపిష్ఠుం డు చండాలకన్యకం దగిలి, రెుుండెఱుంగక, లజ్జ యుజ్జగించి, మానం బూనంబుచేసి, కులంబు పదటం గలిపి, శీలంబు పరిత్యజించి, దిట్ట కూళయై, కన్ను గానక, కావరంబెత్తి, తిరుగుచుండ ...

నతని దుర్వర్తనంబులు ప్రసంగించి ప్రకాశంబుగా నాడుచుండిరి.

మధుమాసవాసరములకు సుకుమారుని దుర్వర్తనమునకుఁ గార్య కారణభావమును గల్పించి నిర్వహించుటలోఁ గూడ నొకమధురభావ పరిష్కారము పొడగట్టును. ఈ ఋతువర్ణనములం దచట నచట శృంగారభావాను ప్రవేశము గాన వచ్చినను నౌచిత్యమునకు భంగకర ముగఁ గాని, చదువరులకు విసువు జనించునట్టులు గాని కవితావిన్యాస మెచ్చటను గానరాదు. సమయోచితముగ లలిత మధుర సుకుమార భావ సంయోజనమే యెల్లెడల జాలువాఱినది.

సూర్యచంద్ర వర్ణనము— సూర్యోదయ సూర్యాస్తమయము లందును చంద్రోదయ చంద్రాస్తమయములందును ప్రకృతిలో వింత వికాసములు గానవచ్చును. సౌందర్య నిరూపణ తత్పరుఁడైన కవికా సన్నివేశములు భావనామయసృష్టి కనుకూలములు. కావుననే మహా కావ్య కర్తలు తద్వర్ణనమును కావ్యాంగములలో నొక్కటి గావించి యున్నారు. ఈ కావ్యమున సూర్యాస్తమయ చంద్రోదయ ప్రసా రము లెట్లు సాగెనో కనుఁగొందము. సుకుమారుఁడు చండాలకులాం గనను వలచి వలపించి, యామెతో సురత సౌఖ్య మనుభవించునంతలో సూర్యాస్తమయమగుట ప్రారంభమైనది.

సూర్యాస్తమయము

ఉ. కాయజవిక్రియం బడయఁ గాని కులంబున సంగమించి య
న్యాయము సేయునే యిటు దురాత్ముఁడు వీఁడు త్రపాభిమానముల్
మాయఁగఁ దట్టి యంచు నతిమాత్రము లజ్జితుఁడైన కైవడిం
దోయజషండబాంధవుఁ డధో ముఖుఁడయ్యె నభోంగణమ్మునన్.

దుష్టబుద్ధియైన యీ విప్రుఁడు మన్మథ వికారముచేఁ బొంద రాని కులమునఁ బొందును ఘటించుకొని, సిగ్గుబిడియములు వదలి యింతటి యన్యాయము సేయునే ? యని, పద్మబంధువు తాను సిగ్గుపడినట్టు లాకాశమున తలవాంచుకొనెను. ఆకాశమున సూర్యుఁ డధోముఖుఁ డగుటను, కర్మసాక్షి గావున విప్రుఁడన్యాయము సేయుట చూచి సిగ్గుచేఁ దలవాంచికొనినట్టు లుత్ప్రేక్షించియున్నాఁడు. ఈ యుత్ప్రేక్ష యిచట నౌచిత్యభరితమై సూర్యాస్తమయమును జిత్రముగ నుత్ప్రేక్షింపఁ జేసినది. ఈకల్పనము మను చరిత్రకారునకు మార్గదర్శకమైనది. కాని యచటఁ బెద్దన్నగారు చేసిన కల్పనము మాత్రము ఔచిత్య విషయమునఁ గొంచెము విచికిత్సనొదవింపఁజేయుచున్నది. అచట సూర్యాస్తమయ వర్ణన క్రమమిట్లు నడచినది.

తరుణిననన్యకాంత నతి దారుణపుష్ప శిలీముఖవ్యథా
భరవివశాంగి సంగతివు బారికి నగ్గముచేసి క్రూరుఁడై
యరిగె మహీసురాధముఁ డహంకృతితో నని రోషభీషణ
స్ఫురణ వహించె నోయన నభోమణి దాల్చెఁ గషాయ దీధితిన్.

రెండిటను భూసురుఁడే యపరాధి. రెండిట నుత్ప్రేక్షాలంకారముననే విషయ వివరణ మావృతమైనది. శ్రీనాథుఁడు భూసురుఁడు చేసిన యన్యాయమునకు సూర్యుని దలవంచుకొనఁ జేసినాఁడు. పెద్దన్నగారు ప్రవరుఁడు వరూథినిని వ్యథల పాలుచేసి వెడలి పోయెనని కినుక వహించి యొడలెఱ్ఱఁజేసికొనె ననినాఁడు. శ్రీనాథుని రచనలో నసంగమకుల సంగమమున సుకుమారుఁడు దురాత్ముఁడు. తరుణికి వ్యథ గలిగించిన ప్రవరుఁడు మహీసురాధముఁడు. ప్రవరున కీవిశేషణమును గూర్చుట యేతత్ప్రకరణోచితమైనట్టులు గానరాదు. నిత్యము కర్మసాక్షి కెరఁగు ప్రవరుని, స్వధర్మలోపభీరువును, సత్కర్మ నిరతుని దేవవేశ్యా ప్రణయతిరస్కారమునకు కర్మసాక్షియైన సూర్యుఁడు మెచ్చుకొనవలెను గాని, యాతని నధమునిగా భావించి కినుక వహించుట సమంజసమైనట్టులు గానరాదు.

మఱియు నీ పద్యమునం దన్వయము సరిపడుట విషయమునం గూడఁ గొంత విచికిత్స పొడముచున్నది. 'అనన్యకాంతన్' అను పదమునకు సంస్కృతవ్యాకరణ పరిపాటినిబట్టి నవిద్యతే అన్యః, కాంతః=కాముయితా యస్యాస్సా అనువ్యుత్పత్తిచే, మఱియొకఁడు ప్రేమించువాఁడు లేని, యని యర్థము చెప్పవలెను. అంతకుమున్నే యామెను గంధర్వుఁడు ప్రేమించి, యామెచేఁ దిరస్కృతుఁ డయ్యెనని తరువాతి కథాభాగమే తెలుపుచున్నది. అప్పు డీమె అనన్యకాంత కానేరదు. ఇంతియ గాక అంగభవువారికి నగ్గము చేసిన వాఁడు ప్రవరుఁడు గాఁడు. వరూథిని ప్రణయమే. వరూథినీ ప్రణయమును వలదనుటలో ఏకపత్నీవ్రతుఁడైన ప్రవరునిదోష మేమియులేదు. సత్కర్మాచరణ తృప్తుఁడైన అగ్నిహోత్రుని యనుగ్రహమునకుఁ బాత్రుఁడైన ప్రవరుఁడు కర్మసాక్షియైన భువనచక్షువు నాగ్రహమునకు గుఱికాఁజాలఁడు. ఆదివ్యతేజములు రెండు నభిన్నములే. కావున మనుచరిత్రము నందలి కల్పన యంతగ సరిపడునట్లులు చూపట్టదు.

ఇటులనే స్వభావోక్తిని నడిపించిన పద్యములలోఁ గూడ వీరిరువురి రచనలకు సామ్యము చూపట్టుచున్నది.

క. క్రుంకె విభాకరబింబము
పంకజషండములు మొగిడెఁ బత్యగ్వీథిన్
గంకేళీతరుపల్లవ
సంకాశచ్ఛాయఁ గొమరుసంజ జనించెన్. శివరా 3-94.

శా. శ్రేణుల్గట్టి నభోంతరాళమునఁ బాఱెం బక్షులుష్ణాంశుపా
షాణవ్రాతము కోష్ణమయ్యె మృగతృష్ణావార్థు లింకెం గడున్
శోణం బయ్యెఁ బతంగబింబము దిశాస్తోమంబు శోభాదరి
ద్రాణంబయ్యె సరోజషండములు నిద్రాణంబు లయ్యెం గడున్.

హిమము ఘనీభూతమైన హిమవత్పర్వత ప్రదేశమున నుష్ణాంశుపాషాణవ్రాతమున కత్యుష్ణత కలుగుట తగ్గుట యెట్లు సరిపడునో? మృగతృష్ణాసముద్రము లెడారి ప్రదేశములలోఁ బొడముట సహజముగ నుండును. హిమవత్పర్వత ప్రదేశమున నవి పొడముట యింకుటయు నెట్టులో యెఱుఁగరాకున్నది. పెద్దన్నగారి రచనమాత్రము సహజ మధురముగ నడచినది. (సశేషము.)

# కథానిక

బొడ్డపాటి కుటుంబరాయశర్మ

పాశ్చాత్య భాషా సంపర్కమున నాధునికాంధ్ర గద్య వాఙ్మయములో వెలసిన విభిన్న రూపావళి యందు నవల వలెనే కథానికయు నొకటి. భాష యెంత పురాతనమో కథయు నంత పురాతనము. అందును మన పురా భారతదేశము కథల కాటపట్టు అగుచో నేటి మన కథానికను విదేశీయ ప్రభావ జనిత మననేల ? భారతీయ ప్రాచీన సాహిత్యములోని బృహత్కథయు, కథాసరిత్సాగరమును, పంచతంత్ర హితోపదేశాదులును, జెప్పు కథలొకమాదిరివి. మపాసా, మామ్, ఓహెన్రీ, చెఖోవ్, డి. హెచ్. లారెన్స్, ప్రభృతులు చెప్పు కథలు వేఱొకమాదిరివి. ఇది ప్రాక్పశ్చిమములను గూర్చి చేయు బహు స్థూల విభజనము. కాఁగా, పశ్చిమదేశీయులు శిల్ప నైపుణ్యముతోఁ జెప్పు కథానికల వంటివి మునుపు మనలో కొన్ని యేని లేవా ? లేకేమి ? ఉన్నవి. సాంస్కృతికముగా వారిదొక పద్ధతి; మనదొక పద్ధతియు. ఇదే భేదము నేఁటి మన కథానిక మాత్రము పాశ్చాత్య వాఙ్మయ సంస్కారానుసారియేయనక తీరదు. కాని యిప్పుడిప్పుడే క్రమశః సమగ్రమైన పరిణతి నొంది యాంధ్ర భాషలోని కథానికయుఁ దన భారతీయ విశిష్టతను నెలకొల్పుకొను చున్నది.

నేఁడు కథానికల వ్యాప్తికిఁ బెక్కు కారణములు గలవు. ముందు ముద్రణశాలలను నెలకొల్పి, యచ్చు యంత్రములను దిగుమతి చేసికొంటిమి. దానితో పత్త్రికల కనుదినము రచన లావశ్యకము లైనవి. కథానికల వ్యాప్తి కిది మొదటి హేతువు. రెండవది నిర్విరామమై బహువిధ సుఖ, దుఃఖ సంస్పృష్టమైన మన జీవిత విధానము. జీవితమునకు వ్యక్తిత్వమునకును సంబంధించిన యెట్టి యంశములను గాని సమస్యలను గాని వ్యక్తీకరించుటకు కథానిక చక్కని

సాధనము కాఁగల్గుట మూఁడవ కారణము. ఇట్టి యనేక హేతువు లచే కథానిక నేఁడు ప్రజానురంజక మైనది.

స్వరూప శిల్ప స్వభావాదుల రీత్యా తెలుఁగున కథానిక యొక ప్రత్యేకత నొందినది. దానికొక యెత్తుగడ, యొక నడక, యొక ముగింపు, నొక విశిష్ట వస్తువు, సన్నివేశ రచనా విధానము, తక్కువ పాత్రలు, తత్పాత్ర పోషణము మున్నగు లక్షణము లేర్పడు చున్న దినములివి. సంగ్రహత, యేకాంశ ప్రవణత, నిర్భరత మొదలైన కొన్ని గుణముల చేత వస్త్వైక్యమును సాధించుట వలన మన కథానిక తదితర వచన సాహిత్య రూపముల కంటె భిన్నమై స్వయం సంపూర్ణమై నిల్వఁగల్గుచున్నది.

ఇఁక మన భాషలోని కథానికా పరిణామమును గూర్చి యుటంకింతును. శ్రీ॥ శే॥ గురుజాడ అప్పారావుగారే ఆధునికాంధ్ర కథానికకు శ్రీకారము చుట్టిరన వలయును. వీరి ఆణి ముత్యాలు' అను కథానికల సంపుటి యిటీవలనే ప్రకటితము క్రీ॥ శ॥ 1910 నాఁటికే శ్రీ॥ శే॥ గురుజాడ వారాంగ్లములో నొక కథానికను వ్రాసిరి. పిమ్మటివి "మీ పేరేమిటి"? "దిద్దుబాటు", అనునవి మనకు ప్రస్తుతము లైన కథానికలు. ఇవి రెండును 'ఆణిముత్యాల'లో ప్రకటింపఁబడినవి. శ్రీ॥ శే॥ పంతులుగారు సాంఘికముగ సంస్కార ప్రియులు; భాషా పరముగ వ్యావహారిక వాదులు. ఈ రెండంశములను పొంది పొసఁగి యుండుటచే వీరు కథానికలకు చక్కని యొరవడిఁ బెట్టఁగల్గిరి. అది మొదలుకొని పండితులు, పామరులు, కవులు, గేయకారులు, శతావధానులు, ఆశుకవులు, లాక్షణికులు, చిత్రకారులు, రాజకీయ వాదులు న్యాయ వాదులు, విద్యుచ్ఛాఖోద్యోగులు, భోజనశాలోద్యోగులు, ఆకాశవాణీ నిర్వహణశాఖవారు, వైద్యులు, విజ్ఞాన శాస్త్రవిదులు, నుపాధ్యాయులు, పత్రికాలయోద్యోగులు, నటీనటులు, వారు వీరని

ద్యేమి ? తమ తమ సందేశములను కథానికల మూలమున లోకమున కెల్లరు వినిపించుచునే యున్నారు.

వీరిలో దీని పరిణామమునకుఁ దోడ్పడిన రచయితల ప్రతినిధు లను కొందఱనే పేర్కొనఁగలను. శతావధానులు శ్రీ వేలూరి శివ రామశాస్త్రి గారు పాత క్రొత్తల సమన్వయించుచు, వస్తు వైవి ధ్యముఁ జూపుచు సంస్కర్తృ హృదయముతో రచియింపఁ గల రచ యితలు. 'కథాపట్కము' మొదలైనవి. వీరి ప్రచురణలు. వీరి 'యానందభవనము' నిజముగా నానందభవనమే. ఒక ధర్మమునో, యొక యాదేశమునో నిరూపించు వీరి కథలు చక్కని సంస్కారము గల వారికి బాగుగ రుచింపఁగలవు.

కథానికకు రూపు రేఖలు దిద్ది పిన్నలకు, పెద్దలకు సమాన ముగ సంతోషముఁ గొల్పునట్లు రకరకములైన రచనలు సాగింపఁగల "కథక చక్రవర్తి", శ్రీ చింతా దీక్షితులు గారు. వీరొక విధముగ సంప్రదాయ పాక్షికులు. నవనాగరకతను మృదురీతిగ నవహేళన చేయు కోవ వీరిది. కథానికా రచనలో వీరు నూతన పథముల నిర్మించిరి. శ్రీ 'చలం' వంటి వారికి కొన్ని యెడల గురుస్థానీయులు గూడ.

శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారొక రీతిగ ప్రథమశ్రేణి కథానికులు. ఆంధ్ర కథానిక యొక్క అచ్చమైన తత్త్వము వీరి రచనలలో ప్రతిబింబించును. పాశ్చాత్యభాషా సంపర్క దూషితము గానిది వీరి భావన; శ్రోత్రియ కుటుంబములోనిది వాతావరణము; సహజ సుందరములైనవి సంభాషణలు; వాస్తవికములైనవి నన్ని వేశ చిత్రణలు. అమృత బిందువులు వీరి యీకథలు, చారిత్రక ప్రాధా న్యము గల వీరి 'గులాబీ అత్తరు' సాంఘిక ప్రాధాన్యము గల వీరి కచ్చితమైన జవాబు' మున్నగునవి బహు ప్రసిద్ధములు. 'కేవలము'

సంభాషణలతో కథనడుపు నోడుపు వీరికి వెన్నతోఁ బెట్టిన విద్య. 'మార్క్సిస్టు' సాహితీ పరిచితితో నక్కఱలేకయే కొన్ని కథలలో జీవిత సత్యమును ద్రాఘీయః ప్రతిభతో నిరూపించిన లబ్ధప్రతిష్ఠులు వీరు.

వస్తువులోను, విధానములోను, భావములోను, భాషలోను గూడ నొక నవ్యతఁ గొని తెచ్చిన వారు శ్రీ చలంగారు. కథానికా చరిత్రలో విపథమునఁ బోయిన ప్రథమ విప్లవకారులని విపక్షుల చేతను, విపశ్చితుల చేతను విదలింపులు, విప్రకారములుఁ దిని కూడ, విప్రతిపత్తి వలన విరవిర పోవని వారు వీరు. ఒప్పినవారు వీరిని ఉప దేష్ట యనిరి; ఒప్పని వారు ఉప్పెన,ఉపద్రవము ననిరి.ఎవరేమనినను, వీరిని ఉపజ్ఞాశాలి యనక తీరదు. ఆధునికాంధ్ర కథానిక కొక విధ ముగ జవము జీవమును గల్పించిన మహనీయ కీర్తి వీరిది. వీరి 'హంపీ కన్యట' 'సినిమా జ్వరం' మున్నగునవి ప్రసిద్ధములు. వీరికి అనుయా యులు పెక్కుమంది.

కీ॥ శే॥ అడవి బాపిరాజు గారు మువ్మూర్తుల కవి, గేయ కారులు చిత్రకరులు నవలారచయితలు, కథానికా కర్తలును. ఒక్క మాటలో, వారు సమస్త కళలకు సువర్ణ సమన్వయము. ఆయన వాక్కున కతీతమైన రూపమును చిత్రమునందును, చిత్రమున కతీత మైన భావమును వాక్కునందును విన్యసింపఁగల సహజ శిల్పి కావుననే వారికి కథానికా శిల్పములో నుత్కృష్ట స్థానమందినది. భావాంబర వీథులలో విహరించుచు మధుర గీతములలో తేలియాడుచు, వారు కథానికలు నిర్మించిరి. శబ్దార్థముల హరిదాంపత్యముచే నొదుగులు పోవువారి భావభంగిమలు శివపార్వతుల నాట్యవిలాస రేఖలు. వారి 'తిరుపతి కొండమెట్టు' 'భోగీరబోయ'; 'శైలబాల'; 'హంపీ శిథిలాలు' మున్నగునవి శిల్ప సౌందర్యమునకు పరాకాష్ఠలు. వీరికి కొద్ది యను

చరవర్గమున్నది. అనుకరణ సాధ్యముగానిది వీరి మార్గము అగుటచే పెక్కుమంది వందిమాగధులు లేరు వీరికి.

శ్రీ విశ్వనాధ వారు కథానికా రచనమునఁ గూడ పరిణత ప్రజ్ఞులు. సంగ్రహాత, నిర్భరతాది లక్షణములచే వస్త్వైక్యమును సాధించు నిశిత శిల్ప ధ్యాయిత వీరికి శ్రీరామరక్ష. 'చిన్న కథలు' అను సంపుటి యిటీవలనే వీరు ప్రకటించిరి. 'ఏమి సంబంధము' 'పతి పూర్తి', 'తిరోధానము', 'మాక్లీదుర్గంలో కుక్క', 'చామర గ్రాహిణి' 'జమీందారుని కొడుకు', 'రిసెర్చిస్కాలర్లు' భారతి మున్నగునవి వీరివి మిక్కిలి యాకర్షణీయమైన కథలు.

శ్రీ తల్లావజ్ఝల శివ శంకరశాస్త్రిగారి 'నీలకంఠం కథలు' రసవంతములై బహుళ ప్రచారముఁ గన్నవి. వీరు చక్కని కథానికా విమర్శకులుఁ గూడ.

శ్రీ ముని మాణిక్యము వారి 'కాంతం' తెలుఁగు నాటి కోడళ్ళకు ప్రతినిధి. శ్రమాలసమైన నిత్య జీవితములో మాధుర్య మొలికించు హాస్య రచనము మునిమాణిక్యము వారిది. నవలా నాయకులలో బారిష్టరు పార్వతీశమే పార్వతీశము, కథానాయికలలో కాంతమే కాంతము. కాంతం కథలలో ప్రాయికముగా వాతావరణము గార్హస్థ్య జీవితము. 'నలసారము సంసార మఖిల దుఃఖావహము, భయ నికేతన' మనిన దానిని ససారమని 'మసారసారనయన' "కాంతం" ఋజువు చేసినది. కథలకు తెలుఁగు నాట సర్వవ్యాపకత్వము కల్గినది. "కాంతం" వలననే కథన సాహిత్య మున్నంత కాలము, కోమల హాస్యమునకు రసస్థితి యున్నంత కాలమును, కాంతమును మఱువలేము.

ఎంత కథకులో అంత విమర్శకులు గూడ శ్రీ కొడవటి గంటి కుటుంబరావుగారు. వీరి దభ్యుదయ దర్శన పథము; వాస్తవిక చిత్ర

ణము; కథావస్తువు మధ్యతరగతి ప్రజల జీవితము కథల సముదా యమునకు, వైవిధ్యమునకు వీరు పెట్టినది పేరు. కథానికల శకమిది. దీనికి వీరు ప్రతినిధి పాత్రల స్వరూప స్వభావములకు సంబంధము సాధించిన కథలు వీరివి పెక్కు కాని అందలిది నగ్నవాస్తవికత. ఇది చదువరులపై క్షణిక ప్రభావమునే గాని శాశ్వత ప్రభావమును ముద్రింపలేదు. కాంతా సమ్మితముగా నుపదేశించుట (delightful instruction) కు అనువు పడదు. 'గల్పిక' యను తెలుఁగు కథా నికా భేదమునకు తొలుదొల్త రూప కల్పనముఁ జేసిన పితృపాదులు వీరు.

శ్రీ పాలగుమ్మి పద్మరాజుగారి 'గాలివాన' ప్రపంచ స్పర్ధన మున ద్వితీయ బహుమతి నొంది తెలుఁగు కథానికకు ఖండ ఖం డాంతరాలలో నఖండ యశః ప్రతిష్ఠల స్థాపించినది. పల్లీ పట్టణ వాసులలోని సంస్కార రాహిత్యము, వీరి కలమను చికిలిదంతపుటులి సోకిన లింగరూపమునఁ ప్రత్యక్షమగును. ఎదురు చూస్తున్న ముహూర్తము, 'వాసన లేని పూలు, పడవ ప్రయాణము; మొదలైన వీరి ప్రసిద్ధ కథలు పరిమితము లయ్యును అపరిమిత కీర్తి నొందుటకు వీరు ప్రదర్శించు ననల్ప శిల్ప చాతుర్యమే హేతువు. వీరి కథా సంపుటి పేరు కూలి జనము' ఆకర్షణీయమైన కథావస్తువు, సహజ సుందర సన్నివేశ రచనము, ప్రకృతి మధుర సంభాషణములు మొద లగునవి వీరి శిల్పసామగ్రి వీరు కథానికా విమర్శకులు గూడ.

చక్కని పండితులయ్యునుఁ గథానికారచనకు కళల గుండెతో గలిసి వచ్చిన వారిలో శ్రీ హనుమ దింద్రకంటి వారొకరు. అచ్చపు కవులుగా విమర్శకులుగా కథానికా కర్తలుగా ప్రఖ్యాతి గన్నవారు వీరు. వీరివి కొన్ని 'స్కెచ్'లనియు, నూహా చిత్రములనియుఁ జెప్ప వచ్చును. కీ॥ శే॥ అడవి బాపిరాజు గారి నప్పుడప్పుడు వీరి శిల్పములో

తొంగి చూడ గల్గుట మనకు గర్వకారణము. కథానికలలో ప్రాత కాలము వారిది నిర్గాంభిక వర్గ మని యొకటి. దానికి వీరి నధ్యక్షు లను కొనుఁడు. 'హనుమచ్ఛాస్త్రి కథలు' అని యొక సంపుటి వీరిది ప్రకటితము.

కరుణ కుమార కథలు గూడ సంపుటములుగా వెలువడి నవి. వీరు సార్థక నామములు. పల్లెజనుల పీడిత జీవనములోని కరుణ రసమున ముంచి, కలమును కుంచెగా కథాపటముపై కదలించు చిత్ర కారులు. తాము వెలిగించిన చిత్ర దీపమునకు చిదిమి చమురు పోయఁగలది వీరి జానపద మనః ప్రవృత్తి నిదానము.

శ్రీరంగం శ్రీనివాసరావు గారాధుని కాంధ్ర సాహిత్య శాఖలన్నిటిలోను నొక మహాప్రళయము వంటివారు. ప్రాచ్య పాశ్చాత్య సంస్కృతుల విచిత్ర సమ్మేళనము వీరిది. ఆ సమ్మేళన వలని నవ్య సృష్టికైన వేదనయే వీరి కథలలోని స్పందన శక్తి. సాం ఘిక పునరుద్ధరణచే జాతిని పునరుజ్జీవింపఁ జేసి, విశ్వ సంక్షోభమునుఁ జల్లార్ప నెంచు నవ్యప్రభ "శ్రీ శ్రీ" గారు. వీరి "చరమరాత్రి" సుప్రసిద్ధము.

శ్రీ గోపీచందు గారుద్దండ కథానికులు. ఒక్కొక్కప్పుడు ప్రబలమైన సంక్షోభమునే నిమ్మకు నీరెత్తి నట్లు హాయిలుగా ప్రవ హింపఁ జేయఁ గలరు. కీ॥ శే॥ అడవి బాపిరాజు గారి యుత్తమ కథలు స్థూలముగా హృదయ సంబంధులగుచో, వీరివి మేధా సంబం ధులు. అనఁగా వారు మేధకు, వీరు హృదయమునకు సంబంధించినవి వ్రాయలేరని కాదు మొత్తము మీఁద వారు హృదయము నెంత కదలింపఁగలరో, వీరు బుద్ధి నంత ప్రకాశింపఁ జేయఁ గలరనుట. ఆయన మన జాతికి రమ్యముగ జీవించుట నేర్పినారు; ఈయన నిశిత

ముగ నాలోచించుట నేర్పినారు. వైదేశికమైన భావనా విధానమందు వీరికి శ్రీ బుచ్చిబాబుగారితో పోలిక, ఆలోచనలలో మన జాతిని క్రొత్త పుంతఁ ద్రొక్కించిరి. చరిత్ర గుణపాఠములను సంఘగతులను, వ్యక్తుల మనోరీతులను వాని వానికి హేతు భూతములైన భిన్నభిన్న వాతావరణములను నవగతము చేసికొని రచనలు సాగించు కథానికా కర్తలు. వీరు ప్రసిద్ధ నవలాకారులు విమర్శకులు, చలన చిత్రనిర్మాతలును. సాంఘిక రాజకీయములలో మూసకట్టినది వీరి మనస్సు. అందుచే వీరి భావములను నాదర్శములను తత్సంబంధము గలవి యనవచ్చును. పథ్య వాక్కు, హితోపదేశమును, వీరి రచనలకు జీవంతములు. 'ధర్మవడ్డీ', "భార్యల్లోనే ఉంది", 'తండ్రులూ-కొడుకులు' మున్నగునవి పెక్కు వీరి ప్రసిద్ధ కథలు. ఇవి రెండు సంపుటములుగా వెలువడినవి. సర్వసాధారణమైనది వీరి కథ 'ఒడుదుడుకులు దీనిలో కూడ పఠితల హృదయములపై హత్తుకొని పోవు స్వీయతా ముద్ర వేయఁగలది వీరి శిల్పము.

అధునాతన కథకులలో విశిష్టత సంపాదించుకొన్న సమర్థులు శ్రీ బుచ్చిబాబుగారు. శ్రీ గోపీచందుగారికి వలెనే వీరికిని నాంగ్లభాషా సంస్కారము చాల బాసటయై నిల్చును. వారు పాశ్చాత్యుల రీతులను జీర్ణించుకొనిరి; వీరిలోనవి జతించినవి. వీరు కథలో నుపయోగించు నుపమానములు వ్యుత్పత్తిని సూచించినచో, చేయు వ్యాఖ్యానములు ప్రతిభను చాటును. కీ॥ శే॥ బాపిరాజుగ్గారివలె వీరు హృదయమును స్పందింపఁ జేయనుఁగలరు; శ్రీ గోపీచందుగారివలె బుద్ధికి ప్రకాస్తిఁ గల్గింపనుఁగలరు. 'నన్నుఁగురించి కథ వ్రాయవూ' ?; 'అడవిగాచిన వెన్నెల'; 'మేడమెట్లు'; 'నిరంతర త్రయం'; 'కుముదం'; మణిదీపాలు; మొదలైనవి వీరివి ప్రతిభా సముద్గారులై చదువరుల నుత్తేజపఱచి చైతన్య ధామములుగఁ జేయఁగలవు. శిల్పముపై సం

పూర్ణాధికారము సంపాదించుటవలన కథలలో వైవిధ్యమును ప్రసాదింపఁగల మేధావులు వీరు. ఏకాంకిక నవలాది రచనలలోగూడ వీరు సంకు తేరిన చేయి.

నేఁటి యువకులలో మఱియు యువకులైనను, చేయితిరిగిన శిల్పు లున్నారు కొందఱు. వీరిలో శ్రీ శండిల[వరపు, బుద్ధవరపు, వేంకట రత్నము గారు చక్కని విమర్శకులు, కథానికులును. సన్నివేశ శిల్పచ్ఛాయలలో భావసంఘర్షణ చిత్రణములలో వీరు సిద్ధహస్తులు. మెలపుఁగొన్న తలఁపులు పలుకులై ప్రవహింపఁగా వీరి కృషిలో చవిటి నేలగూడ శిల్పసస్యశోభితమగును. వీరి తరువాత శ్రీ మధురాంతకంరాజారాంగారు ప్రసిద్ధులు. వీరి 'వక్రగతులు', 'కుంపటిలో కుసుమం' మొదలగునవి ప్రశస్తములు. శ్రీ కుటుంబరావుగారు, శ్రీ పూ. భా. గారునువలె వీరు 'గల్పిక' లలోను నిపుణులు. శ్రీ బలివాడ కాంతారావుగారు కథానికాకర్తలుగా గూడ బహులబ్ధ ప్రతిష్ఠులు. శ్రీ ముళ్లపూడి వేంకట రమణగారి హాస్యరసముచే పకపక నవ్వి యారోగ్యవంతులు గాని వారుండరు. వీరు చాలముందుకు రావలసిన వారు.

శతాధికులగు కథానికా రచయితలలో కొందఱ ప్రతినిధులను మాత్రమే పేర్కొనఁ గల్గుదునని ముందే మనవిచేసితిని. వారి వారి యనుయాయివర్గమును చెప్పగిప్ప రాదు. చెప్పూచో శ్రీయుతులు భరద్వాజ, ధనికొండ పినిసెట్టి మొదలగు ప్రసిద్ధులు సమర్థులు నగు వారికి శ్రీ చలంగారు గురుపీఠ మనవలెను.

శ్రీ వేలూరి, శ్రీ చలం, కీ. శే. బాపిరాజు, శ్రీ విశ్వనాథ, శ్రీ ఇంద్రగంటి, శ్రీయుతులు పాలగుమ్మి, గోపీచందు, బుచ్చిబాబు మున్నగువారి రచనలు వేర్వేరాశయములు గలిగి, వేసికపియే ప్రత్యేకములైనను, నవి యొక విధమగు సమానధర్మముఁగూడఁగలవి. కేవల ముబుసుపోకకై చదువునట్టి సాధారణుల కొఱకుగా వివి. ఇంచుక కళాత్మకమైన హృదయమున్న వారి కివి యమృతపు గుళికలు; లేనివారి

కడవి మల్లెలు. ఇదియే వీరినందఱ నొకసూత్రమున బంధించు సమాన ధర్మము.

చాల విశిష్టులు నుత్తమ రచయితలు గదా యని వ్యక్తిగత ముగ కొందఱఁ జేర్కొనుచు నైన పోవలయునన్నచో నది యొక దండక మగును. అయినను వారి సాహిత్యోపాసన వలని సత్ఫల మందుచున్న మనజాతికి కృతఘ్నతా దోష మంటరాదు. సాముదాయిక ముగఁ జెప్పవలసి చెప్పుచున్నాను గాని వీరిలో నొక్కొక్కరొక్కొక్క మెఱపునకు నొక్కొక్క ఒదుగునకును పట్టభద్రులు.

సర్వశ్రీ బొమ్మిరెడ్డిపల్లి సూర్యారావు, మల్లాది, జలరుక్, అమరేంద్ర, హితశ్రీ, శ్రీ వాత్సవ,మురయూ, పోతుకూచి, చాగంటి, భాస్కరభట్ల, పొట్లపల్లి,ఇసుకపల్లి సోదరులు, వట్టికోట ప్రభృతులు, కథానికా క్షేత్రమునఁ బసిడిపంటలు పండింపఁ గృషిఁ జేయఁగలవారు, పెక్కుమంది.

ఇఁక కథానికారచనలో శ్రీమతుల సంఖ్యయును, గుణనీయము; గుణము గణనీయము. శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవిగారి "బలీయసీ కేవల మీశ్వరాజ్ఞ" చదివి యంతర్ముఖులు గాని వారుండరు. ఇఁక శ్రీమతి మాలతీచందూరుగారు మాలతీచందూరు గారే! 'మేటనీ షో' ప్రతిష్ఠగల శ్రీ నాగేశ్వరరావుగారిని క్రిందుబరచిన పడతి. చి॥ వసుంధరకును "అచల"కును గల పరస్పర సంబంధ మోర్లుమఱువగలము? శ్రీమతి ఎల్లాప్రగడ సీతాకుమారిగారు పేరు మాత్రము నకే కుమారి; శిల్పములో శ్రీమతియే. శ్రీమతి వాసిరెడ్డి సీతాదేవిగారి యిటీవలి మారిపోయిన మనిషినిఁ జూచిన నబ్బురము కాదా? శ్రీమతి అద్దేపల్లి వివేకానందా దేవిగారి 'వెలుగు నీడల'లో నుండి చూడఁగా 'అగ్నిగుండాలు' అగపడుచున్నవి; సాగిన ప్రస్తారములో 'భిన్నస్వరాలు'ను వినఁబడు చున్నవి. శ్రీమతులు నందగిరి ఇందిరాదేవి, నేమాని భారతీ రత్నకరాంబ; శ్రీదేవి; జానకీరాణి; వీరందఱును కథానికా లక్ష్మికి పెళ్లిపందిళ్లలో మంగళములు పలికి విందు చేయఁగల శయ్యా పాకములలో పారంగతలు.

# ఆ ముఖము

సంస్కృతవ్యాకరణమువలె సమగ్రము నిర్దుష్టము సులభము నగు వ్యాకరణము వేఱొకభాషకు లేదు. దానిలోని సంగ్రహవైశద్యములు అనితరసాధారణములు. అట్టి మహోత్కృష్టమయిన వ్యాకరణమునకు బీజావాపమును జేసిన మహాముని పాణిని. పాణిని తన కాలమునకున్న వైదికలౌకికభాషలలోని పదముల ననుశాసించుచు, సంగ్రహముగ సూత్రప్రాయమయిన వ్యాకరణమును రచించెను. ఆ సూత్రములు ఎనిమిది అధ్యాయములుగ నుండుటచే దానిని "అష్టాధ్యాయి" అని వ్యవహరించుచున్నారు. అందు మొదట పరమేశ్వరు నుండి లభించినవిగా నిబంధించిన 14 సూత్రములలో నిబద్ధమైనది అక్షరసమామ్నాయము. దానిచే సాధించిన ప్రత్యాహారముల సంగ్రహశక్తిని గాంచినవారు ముగ్ధులై యాతనియలౌకికశక్తికి జోహారులర్పించుచుందురు. మన యాంధ్రభాషకు "అచ్చు""హల్లు" అనుపదము లా మహామహిముని ప్రత్యాహారనిర్మాణదక్షతచే సిద్ధించిన ప్రసాదములే. ఇట్లు 'సూత్రములు'గ పాణిని వ్యాకరణమును నిర్మించిన తరువాత కొంతకాలమునకు "కాత్యాయనుఁడు"అను మఱియొక యాచార్యుఁడు పాణిని సూత్రములపై 'వార్తికములు' రచించెను.

మఱికొంతకాలమయినపిదప 'పతంజలి' యను శేషాంశసంభూతుఁడగు నాచార్యుఁడు పాణిని విరచితమగు 'అష్టాధ్యాయి'కి వివరణమును 'మహాభాష్య'మనుపేర రచించెను. ఈ ముగ్గురు ఆచార్యులు 'మునిత్రయము' అనుపేర వ్యవహరింపఁబడుదురు. వీరు సంస్కృత వ్యాకరణ ప్రపంచమున త్రిమూర్తులు.

పాతంజలమగు మహాభాష్యమున ముందు ఉపోద్ఘాతమున, వ్యాకరణ మన నేమి? దాని ప్రయోజన మేమి? దాని నెట్లు రచింపవలెను? మొదలగు ప్రశ్నములకు సమాధానములను వివరించెను. దానిని'పస్పశాహ్నికము'అందురు. దానినాంధ్రమున వ్రాయుట

కుపక్రమించుట సాహసమే యని తెలిసియు సాధారణముగా నన్ని వ్యాకరణములకు నుపయోగించు విషయము గావున, అనూదితమైన నందఱకును సేవచేసిన ట్లగునని తెనిఁగించితిని. అనువాదముచేసి ప్రదీపోద్ద్యోతములలోని విషయములను నా యోపినంతవఱకు వివరణమునొసంగితిని. నాయీ సాహసమును మన్నించి పండితులు దోషములను సరిచేసికొని యానందింతురుగాక యని యభ్యర్థించుచున్నాను.

ఇట్లు,

అనువాదకుఁడు.

# పాతఞ్జలమహాభాష్యము - పస్పశాహ్నికము

అనువాదకర్త:శ్రీభాష్యం అప్పలాచార్య.

## అనుశాసనీయ శబ్దనిర్ణయము

మూలము. అథ శబ్దానుశాసనమ్.

"అథ" అనుశబ్దము ఆరంభము అనునర్థము గలది. ఇటనుండి శబ్దానుశాసన మనుశాస్త్రము ఆరంభ మగునని తెలియఁదగును.

వివరణము-అనుశిష్యంతే అసాధుశబ్దేభ్యః వివిచ్య జ్ఞాప్యంతే అనేన ఇతి అనుశాసనమ్. శబ్దానాం అనుశాసనం. శబ్దానుశాసనం. శబ్దములను వివేచించి తెలియఁబఱచునది శబ్దానుశాసనము. [సాధు శబ్దములను అసాధు శబ్దములనుండి వేఱుచేసి చూపునది]

మూ. కేషాం శబ్దానామ్ ?

శబ్దములను అనుశాసించును అని సామాన్యముగా చెప్పిరిగదా ! ఆయనుశాసనము ఏ శబ్దములకు ?

వి. లోకవ్యవహారములో నుండు శబ్దములకా ? వేదములలోని శబ్దములకా ? శబ్ద మనుమాటచే సాధారణమగు ధ్వని, అపశబ్దములు కూడ వ్యవహరింపఁబడుచుండుటచే నీ వ్యాకరణము వేని నను శాసించునో, తెలియుట కీప్రశ్నము.

మూ. లౌకికానాం వైదికానాంచ । తత్ర లౌకికా స్తావత్ ।

గౌ రశ్వః పురుషో హస్తీ శకుని ర్మృగో బ్రాహ్మణ ఇతి.

వైదికాః ఖల్వపి । శంనో దేవీరభిష్టయే । ఇషేత్వో

ర్జేత్వా।అగ్నిమీళే పురోహితమ్।అగ్న ఆయాహివీతయే ఇతి

లౌకికములు వైదికములు నగు శబ్దముల కనుశాసనము. లౌకిక శబ్దము:-గోవు, పురుషుఁడు, హస్తి, మృగము, బ్రాహ్మణుఁడు మొద లగునవి. వైదికశబ్దములు:-'శంనో దేవీ రభిష్టయే' 'ఇషేత్వోర్జేత్వా' 'అగ్నిమీళే పురోహితం' 'అగ్న ఆయాహి వీతయే' మొదలగునవి.

మూ. అథ గౌ రిత్యత్ర కః శబ్దః ?

'గోవు' అనునపుడు శబ్ద మననేది ?

వి. ఎదురుగా నున్న ఒకగోవును జూచి దాని నేమని వ్యవహరింతురో తెలియఁగోరి "అయం కః" ? ఇదియేమి ? అని ప్రశ్నించిన "అయంగౌః" ఇదిగోవు అని సమాధానము నిత్తురు. ఇచట అడిగిన వాని అభిప్రాయము, ఆవ్యక్తిని తెలియఁజేయు శబ్ద మేది? యని కాని సమాధానములో 'ఇదిగోవు' అని శబ్దమును అర్థమును అభిన్నముగా చెప్పిరి. 'ఇది' అనఁగా ఎదురుగా నున్న గోవ్యక్తి. "గోవు" అనఁగా ఆవ్యక్తిని తెలియఁజేయు శబ్దము. ఈ రెంటికిని అభేదము ఎట్లు పొసఁగును. శబ్దార్థముల నభిన్నముగా వాడుట కొన్ని తావులందు లోకమందు ప్రసిద్ధముగా నున్నది. కావున నందులో శబ్ద మననేది ? అంతియే కాదు. 'గోవు' అను శబ్దమును వినినంతనే అక్షరసమూహరూపమగు శబ్దమును, 'గోవు' అను ఒకవ్యక్తియు, అట్టి గోవులన్నింటి యందుండుజాతియు (గోత్వము) మనకు భాసించును. వానిలో "శబ్దము" అని వ్యవహరింపఁబడున దేది ?

మూ. కిం యత్తత్సాస్నాలాంగూలకకుదఖురవిషాణ్యర్థరూపం స శబ్దః ?

గంగడోలు, తోఁక, మూపురము (రెంటము) డెక్కలు కొమ్ములు మున్నగు నవయవములతోఁ గూడిన పదార్థమా శబ్దము ?

మూ. నేత్యాహ. ద్రవ్యం నామ తత్.

కాదు అది ద్రవ్యము.

వి. శబ్దము శ్రోత్రేంద్రియముచే గ్రహింపఁబడు ననునది ప్రసిద్ధము. వెనుకఁజెప్పిన పదార్థము చక్షురింద్రియముచే గ్రహింపఁబడుచున్నది. కావున నది శబ్దము కాదు.

మూ. యత్తర్హి తదింగితం చేష్టితం నిమిషిత మితి స శబ్దః ?

అట్టైన గోవు తనయభిప్రాయమును సూచించుటకుఁ జేయు తలయూఁపుట(ఇంగితము)తోఁక ఆడించుట (చేష్టితము) తెప్పలార్చుట మొదలగు వ్యాపారమా శబ్దము?

వి. ద్రవ్యము, ఎట్లు శ్రోత్రేంద్రియగ్రాహ్యము కాదో అటు లనే పైక్రియలును శ్రోత్రేంద్రియగ్రాహ్యములు కావు. కనుక నివి యును శబ్దములు కావని తెలియుచున్నను వివరించి చెప్పుట భాష్య కృత్కి యగుటచే ఆశంకించి నివారించుచున్నాఁడు.

మూ. నేత్యాహ । క్రియానామ సా.

కాదు. అది క్రియ యనఁబడును.

మూ. యత్తర్హి తచ్ఛుక్లో నీలః కపిలః కపోత ఇతి సశబ్దః ?

తెలుపు, నలుపు, దోర, పుల్ల మొదలగునవియా శబ్దము ?

మూ. నేత్యాహ । గుణోనామ సః.

కాదు. అది గుణము.

మూ. యత్తర్హి తద్భిన్నే ష్వభిన్నం ఛిన్నే ష్వచ్ఛిన్నం సామా న్యభూతం స శబ్దః ?

తానాశ్రయించియున్న వస్తువులు వేఱువేఱుగా నున్నను తాను వేఱుగాక ఏకముగా నుండునదియు, తానుండు వస్తువులు నశించినను తాను నశింపనిదియు నగు సామాన్యమా (జాతి) శబ్దము ?

మూ. నేత్యాహ । ఆకృతి ర్నామ సా.

కాదు అది ఆకృతి (జాతి) యనఁబడును.

వి. ఆకృతి యనఁగా ఒక తెగకు చెందిన వస్తువులన్నింటియందు నుండు సమానధర్మము. గోవులన్నింటియందు నుండు సమానధర్మము గోవులన్నింటియందు నుండు జాతి గోత్వము. అట్టి సమానధర్మమొకటి కలదని మనకు స్ఫురింపఁజేయు ఆకారవిశేషము (తోఁక లుకొమ్ము మొ. వానితోఁగూడిన సంస్థానము) కూడ ఆకృతి యనఁబడును.

ఆక్రియతే వ్యవచ్ఛిద్యతే స్వాశ్రయః అనయా ఇతి ఆకృతిః।- ఒక వస్తువును తదితరముల నుండి వేఱు చేసి చూపునది ఆకృతి. ఇట్లు వేఱు చేయునది జాతియుఁ గావచ్చును. వస్తువు యొక్క ఆకారమును (సంస్థానము) గావచ్చును. కావున ఆ రెండును శబ్దములు కావని భాష్యకారుఁడు "ఆకృతి-శబ్దము కాదని" తెల్పెను.

మూ. కస్తర్హి శబ్దః ?

అటులైన శబ్దమననేమి ?

మూ. యేనోచ్చారితేన సాస్నా లాంగూల కకుద ఖుర విషాణినాం సంప్రత్యయో భవతి సశబ్దః.

దేని నుచ్చరింపఁగనే గంగడోలు, తోఁక మూపు డెక్కలు కొమ్ములు గల గోవులు మన బుద్ధికి గోచరించునో అది శబ్దము.

వి. వైయాకరణులు వర్ణములకుఁ గాని వర్ణసముదాయము నకుఁ గాని వాచకత్వము (అర్థబోధకత్వము) నంగీకరింపరు.

వర్ణములకంటె భిన్నమగు పదము గాని వాక్యము గాని వాచకము (అర్థమును తెలియఁజేయునది) అని యంగీకరింతురు.

వర్ణములకంటె వేఱుగ పదము, లేదా వాక్యము కలదని యంగీకరింపక వర్ణములే అర్థము నీయఁజాలునవనియు, వర్ణముల సముదాయమే పదము వాక్యము అని పిలువఁబడుచున్నది యనియు కొందఱి యభిప్రాయము.

కాని ఈ పద్ధతి అంతగా సరిపడదు. "వర్ణము అర్థబోధకము" అనిననాఁడు "గోవు" అను చోట విడి విడిగా రెండక్షరములును అర్థబోధకము లా? లేక రెండును కలిసి అర్థమును తెలియఁజేయునా ? విడి విడిగా వర్ణము అర్థమును తెలియఁజేయును, అన్నచో "గో" అను నక్షరమే అర్థమును తెలియఁజేయును గావున "వు" అను రెండవ

అక్షరము నుచ్చరించుటయనావశ్యకమగును. "రెండును కలిసిన సముదాయము అర్థమును ఎఱింగించును" అనిననాఁడుకూడ మొదటి వర్ణము నుచ్చరించి రెండవయక్షరము నుచ్చరించువేళకు మొదటి యక్షరము నశించును, కావున సముదాయ ముండనేయుండదుకదా! ఇఁక నది యెట్లు అర్థమును బోధించును? లేదా మొదటి అక్షర ముచ్చరింపఁగనే మన మనమున ఒకఅక్షరము అభివ్యక్తమగును అనఁగా స్ఫురించును. అట్లు అభివ్యక్తములైన అక్షరముల సముదాయము అర్థమును బోధించును అని యనవచ్చును. కాని అచటఁ గూడ మొదట స్ఫురించిన వర్ణము రెండవవర్ణము స్ఫురించుసరికి నాశము నొందును. కావున నిచటను సముదాయ ముండదు. 'గౌః' అనుమాట లోని రెండక్షరములను నుచ్చరించినపిదప ఆయనుభవమువలన కలిగిన సంస్కారముచే స్మృతికిఁ దెచ్చుకొనఁగా నాస్మృతిలో గోచరించిన వర్ణసముదాయము అర్థమును తెలియఁజేయును, అనిననాఁడు గూడ ఆస్మృతిలో వర్ణము లాయుచ్చరించిన వరుసలోనేయుండు ననునియమము లేకపోవుటచే "సరః" 'రసః' అనుపదముల యర్థములు తారుమాఱుగుటకుఁగూడ నవకాశము కలదు.

అందుచే వర్ణములు లేదా వర్ణముల సముదాయము అర్థబోధకము అనువాదము సరికాదు. వర్ణవ్యతిరిక్తమగు పదము లేదా వాక్యమే వాచక మని యంగీకరింపవలెను. అంతేకాదు. మఱియొక సంగతినిగూడ గుర్తింపవలెను. మనము ఉచ్చరించిన వర్ణసముదాయము మనకు అర్థజ్ఞానమును గలిగింపదు. ఆయుచ్చరించినవర్ణములచే 'స్ఫోట' మనఁబడు ఒక బుద్ధిగోచరమగు శబ్దము అభివ్యక్తమగును. అది మనమనస్సుచే గ్రహింపఁబడును. కాని వ్యావహారికశబ్దమువలె శ్రోత్రేంద్రియముచే గ్రహింపఁబడదు. అట్టిశబ్దమును అభివ్యక్తము చేయునది నాదము. నాదముచే అభివ్యక్తముచేయఁబడి మనస్సుచే

గ్రహింపఁబడు పదరూపము లేదా వాక్యరూపము నగుశబ్దమే స్ఫోటమనఁబడును. అదియే నిత్యము సత్యమునగు శబ్దము. మన ముచ్చరించుచున్న వినుచున్నశబ్దములు దానిని వ్యక్తముచేయునవియే కాని సత్యములుకావు. స్ఫోటమనఁగా అర్థమును స్ఫుటముచేయునది. ఈ 'స్ఫోట' శబ్దము వాక్యరూపముననే యుండు ననునది పరమసిద్ధాంతము కాని పదరూపమున వర్ణరూపమునఁగూడ నుండవచ్చునని కొందఱి మతము. ఇది సిద్ధాంతమైనను అట్లు సత్యమగు శబ్దమును మనముఉచ్చరించుటయు వినుటయు పొసఁగవు. కనుక దానికి అనుశాసన మెట్లు చేయ వీలగును. కావున సత్యమగుశబ్దము స్ఫోటమేయైనను ఆస్ఫోటమును వ్యక్తముచేయునదియు మనచే నుచ్చరింపఁబడి వినఁబడుచుండునదియు నగుశబ్దమునే ఇచట, అనఁగా నీలోకవ్యవహారమునను, శాస్త్రమునను గ్రహింపవలెను. అందులకే భాష్యకారుఁడింతవఱకు సిద్ధాంతమును జెప్పి లోకమునను, శాస్త్రమునను దేనిని శబ్దముగా గ్రహింపవలెనో యీఁకమీఁదఁ జెప్పుచున్నాఁడు.

> **మూ.** అథవా-ప్రతీతపదార్థకో లోకే ధ్వనిః శబ్ద
> ఇత్యుచ్యతే । తద్యథా । శబ్దం కురు, మా శబ్దం
> కార్షీః, శబ్దకార్యయం మాణవకః, ఇతి ధ్వనిం
> కుర్వ న్నేవ ముచ్యతే । తస్మాద్ ధ్వనిః శబ్దః.

లోకమున నర్థప్రతీతిని గలిగించుధ్వని శబ్దముగా వ్యవహరింపఁబడుచున్నది. లోకములో మాటలాడుచు ధ్వనిచేయుచున్నపుడు— "శబ్దము చేయుము, "శబ్దము చేయకుము" ఈ మాణవకుఁడు శబ్దముఁ జేయువాఁడు" అను వ్యవహారము కలదు. "ధ్వని" అనునర్థమున 'శబ్దము' అనుమాటను వాడుచున్నాము. కావున శబ్దము అనఁగా ధ్వని యని యెఱుంగవలెను.

వి. ధ్వని: శ్రోత్రేంద్రియముచే గ్రహింపఁబడుచున్న అర్థజ్ఞానమును కలిగించుటకై యుచ్చరింపఁబడిన గోవు మొదలగువర్ణరూపము లగు శబ్దములను ధ్వని యందురు. స్ఫోటము : మనము వినుచున్న శబ్దము అర్థజ్ఞానమును గల్గింపదు ఈశబ్దముచే అభివ్యక్తమై బుద్ధిలో భాసించు వేఱొకశబ్దమే అర్థజ్ఞానమునిచ్చును.అట్లు బుద్ధిలో భాసించు శబ్దమును "స్ఫోటము"అందురు "శబ్దము" అనుమాట మనకు వినఁబడు చున్న ధ్వనిరూపమగు పదవాక్యములకును, బుద్ధిలో భాసించు నిత్యములగు 'స్ఫోట' మనఁబడు శబ్దములకును వాడుట కలదు. 'గోవు'అను నపుడు మనచెవులకు వినఁబడు ధ్వనిని శబ్దమనుకొనవలెనా ? దానిచే మనసులో స్ఫురించు శబ్దమును "శబ్దము" అనుకొనవలెనా? అనుసందేహమును భాష్యకారుఁడు తొలగించుచుసత్యముగా 'స్ఫోట'మే యైనను వ్యవహారానుగుణముగ ఈశబ్దానుశాసనమున "ధ్వని"నిగూడ శబ్దముగా గ్రహింపవలెనని నిరూపించెను.

శబ్దానుశాసన ప్రయోజనాధికరణము.

మూ. కాని పునః శబ్దానుశాసనస్య ప్రయోజనాని ?
శబ్దానుశాసనమునకు ప్రయోజనము లెవ్వి?

వి. వ్యాకరణాధ్యయనము సంధ్యావందనాదులవలె ప్రత్యవాయమును దొలఁగించుటకా? లేక వేఱొకప్రయోజన మేదయినను గలదా ? వ్యాకరణాధ్యయనము నిత్యమా ? కామ్యమా ? అని సందేహము.

మూ. రక్షోహాగమలఘ్వసందేహాః ప్రయోజనమ్ ।
రక్ష,ఊహ, ఆగమము, లాఘవము, అసందేహము అనునివి వ్యాకరణాధ్యయనమునకు ప్రయోజనములు.

మూ. రక్షార్థం వేదానా మధ్యేయం వ్యాకరణమ్.లోపాగమ
వర్ణవికారజ్ఞో హి సమ్యగ్వేదా న్పరిపాలయిష్యతీతి.
వేదముల స్వరూపము చెడకుండ రక్షించుటకు వ్యాకరణమును నేర్వ

వలెను. వర్ణలోప,వర్ణాగమ, వర్ణవికారముల నెఱింగినవాఁడే వేద మును గాపాడఁగలఁడు.

వి. లోకములో మనము వ్యవహరించుశబ్దములకంటె వైదికశబ్ద ములు భిన్నములుగానుండును. అట్లుండుటకు కారణము తెలియని వారు పొరబడి వానిని తప్పులుగా తలంచి మార్పవచ్చును. లోకము లోని 'అదుహాత' అనురూపమునకు బదులు వేదములో 'అదుహ్ర' అనురూప ముండును. అదుహాత అనుదానిలోని త కారము లోపించి, రేఫము చేరినది. అట్లే లోకములోని 'ఉద్గ్రాహం-నిగ్రాహం' అను రూపములు వేదమున 'ఉద్గ్రాభం-నిగ్రాభం' అని యుండును. ఇచట హ కారము భ కారముగా మాఱినది. దీని నెఱుఁగనివారు ఇది పొర పాటని భ్రమించి వేదస్వరూపమునే మార్తురు. కావున వ్యాకరణము నెఱిఁగియుండవలెను.

మూ. ఊహః ఖల్వపిః-న సర్వై ర్లింగై ర్నచ సర్వాభి ర్విభ క్తిభి ర్వేదే మంత్రా నిగదితాః। తే చావశ్యంయజ్ఞగతేనపురుషేణ యథాయథం విపరిణమయితవ్యాః। తా న్నావైయాకరణః శక్నోతి యథాయథం విపరిణమయితుమ్।తస్మా దధ్యేయం వ్యాకరణమ్.

ఊహచేయుటకు వ్యాకరణము నెఱిఁగియుండవలెను. వేదములో మం త్రములు క్రియలలో నుపయోగించుట కర్హములుగ అన్నిలింగముల లోను అన్నివిభక్తులతోను చెప్పఁబడియుండవు. యాజ్ఞికుఁడు యజ్ఞ గతములగు క్రియల ననుసరించి యామంత్రములను ఆయాలింగముల తోను ఆయావిభక్తులతోను ఉచ్చరింపవలెను. అట్లు విభక్తులను లిం గములను మార్చుట వ్యాకరణము నేర్వనివాఁడు చేయలేఁడు. కావున అట్టియూహ శక్తి కలుగుటకు వ్యాకరణమును నేర్వవలెను.

వి. వేదములోఁ జెప్పినయాగములలో కొన్ని ప్రకృతియాగ ములనియు, కొన్ని వికృతియాగములనియు వ్యవహరింపఁబడును.

ప్రకృతియాగవిధానమునే వికృతియాగమునందు ననుసరింపవలెనని మీమాంసకులు చెప్పుదురు. ప్రకృతియాగములో చెప్పినమంత్రములనే వికృతియాగమునందును ఉపయోగింపవలసి వచ్చుచుండును. అట్టిచో కొన్నిమంత్రముల లింగములను విభక్తులను మార్చుచుండవలెను. ఉదా : అగ్ని నుద్దేశించి చరుహోమము చేయునప్పుడు "అగ్నయే త్వా జుష్టం నిర్వపామి" అని చరువవలెను. అని ష్ని బ్రహ్మవర్చసకాముఁడు సూర్యదేవతోద్దేశ్యకముగ చరుహోమము చేయవలెనని చెప్పెను. ఏమంత్రముచే హోమము చేయవలెనో వేఱుగా చెప్పలేదు. అందుచే యాజ్ఞికుఁడు "అగ్నయే త్వాజుష్టం నిర్వపామి" అనుదానిని చూచి "సూర్యాయ త్వా జుష్టం నిర్వపామి" అనుమంత్రము నూహించి చరుహోమమును చేయవలెను. ఇట్లూహించుటకు వ్యాకరణము తెలిసియుండవలెను.

ఇట్లు శబ్దములను మార్చుటయేగాక కొన్ని మంత్రములందు లింగమును, విభక్తినిగూడ మార్చవలసియుండును. నీటిని అభిమంత్రించునపుడు "దేవీ రాపః శుద్ధాస్థ" అనుమంత్రము నుపయోగింతురు. ఘృతము నభిమంత్రించునపుడుకూడ ఆమంత్రమునే మార్చి యుపయోగింపవలెను. "దేవ ఆజ్య శుద్ధోఽసి" స్త్రీలింగశబ్దములను పుంలింగములుగ మార్చి, ఏకవచనమున నుంచి, క్రియలోని బహువచనమున కేకవచనమును ప్రయోగింపవలెను. ఇట్లూహించి లింగవచన విపరిణామము చేయుటకు వ్యాకరణము నధ్యయనముచేయవలెను.

మూ. ఆగమః ఖల్వపి:-"బ్రాహ్మణేన నిష్కారణో
ధర్మః షడంగో వేదోఽధ్యేయో జ్ఞేయశ్చ" ఇతి ।
ప్రధానంచ షట్స్వంగేషు వ్యాకరణమ్।ప్రధానేచ
కృతో యత్నః ఫలవాన్ భవతి.

ఆగమ ప్రామాణ్యము ననుసరించియు వ్యాకరణము తప్పక అధ్యయనము చేయవలెను. "బ్రాహ్మణుఁడు దృష్టప్రయోజనము నపేక్షింపకయే తనధర్మముగా షడంగసహితమగు వేదమును నేర్వవలెను" అని ఆగమము (శాస్త్రము) చెప్పుచున్నది. వేదాంగము లాఱిటిలో ప్రధానమైనది వ్యాకరణము. ప్రధానమైన అంగమును అభ్యసించిన మిగిలిన అంగములనెల్ల సాధించినట్లే. కనుక ముఖ్యముగా వ్యాకరణమును జదువవలెను.

వి. శిక్ష, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిషము అనునవి వేదార్థజ్ఞానమున సహకరించునవి. కనుక వేదమునకు అంగములు. వేదార్థజ్ఞానమున మిగిలినవానికంటె వ్యాకరణము ఎక్కువగా సాహాయ్యము చేయును. కావున నిది ప్రధానము. ముఖ్యస్థానీయము.

మూ. లఘ్వర్థం చాధ్యేయం వ్యాకరణమ్—"బ్రాహ్మణే
నావశ్యం శబ్దా జ్ఞేయాః" ఇతి। నచాంతరేణ వ్యాకరణం
లఘునోపాయేన శబ్దాః శక్యా జ్ఞాతుమ్।

సులువుగా శబ్దముల నెఱుంగుటకు వ్యాకరణాధ్యయన మావశ్యకము. బ్రాహ్మణుఁడు శబ్దములను తప్పక యెఱింగియుండవలెను. తక్కువ ప్రయత్నముతో శబ్దజ్ఞానమును సాధించుటకు వ్యాకరణముకంటె సులభమైన యుపాయము వేఱొకటి లేదు.

వి. అధ్యాపనము బ్రాహ్మణుని వృత్తి. ఆవృత్తిని చక్కఁగా సాగించుకొనుటకు శబ్దజ్ఞానము ఆవశ్యకము. "ఈపదము సాధువు. ఈ పదము సాధువు" అని ప్రతిపదము నేర్చుకొనుటకంటె ప్రకృతిప్రత్యయముల నెఱింగించు వ్యాకరణముచే "శబ్దము లివి" యని తెలిసికొనుట సులభము.

మూ. అసందేహార్థం చాధ్యేయం వ్యాకరణమ్। యాజ్ఞికాః పఠంతి, స్థూలపృషతీ మాగ్నివారుణీ మనడ్వాహీమాలభేత ఇతి తస్యాం సందేహః-స్థూలా చాసౌ పృషతీచ స్థూలపృషతీ, స్థూలాని పృషంతి యస్యాః సేయం స్థూలపృషతీతి। తాం నావైయాకరణః స్వరతోఽధ్యవస్యతి
యది పూర్వపద ప్రకృతి స్వరత్వం తతో బహువ్రీహిః
అథ సమాసాంతోదాత్తత్వం తత స్తత్పురుష ఇతి।

సందేహము కలుగకుండుటకు వ్యాకరణమును చదువ వలెను. "స్థూలపృషతీ మాగ్నివారుణీ మనడ్వాహీ మాలభేత" అగ్ని వరుణ దేవతోద్దేశ్యకముగ స్థూలపృషతియగు గోవును విశసనముచేయ వలెను" అనుచోట "స్థూలపృషతీం" అను సమాసమునకు "స్థూలా చాసౌ పృషతీచ" అనియా ? లేక "స్థూలాని పృషంతి యస్యాస్సా" అనియా విగ్రహవాక్యము? అని సంశయము కల్గు నవకాశమున్నది. వైయాకరణుడు కానివాడు స్వరముచే నది యేసమాసమో ? నిశ్చయించుకొనలేడు. ఆద్యుదాత్తమైన బహువ్రీహిసమాసము. అంతోదాత్తమైన తత్పురుషము అని వైయాకరణుడు తెలిసికొనగలడు.

వి. స్థూలపృషతి యగు గోవు నుపయోగింపవలె ననుచోట రెండువిధములుగా అర్థము రావచ్చును. పెద్దమచ్చలు గలగోవు (స్థూలాని పృషంతి యస్యాఃసా) మచ్చలు గల పెద్దగోవు (స్థూలా చాసౌ పృషతీచ) అను రెండర్థములును వచ్చును. మొదటిది బహువ్రీహి సమాసము. రెండవది కర్మధారయ సమాసము. మంత్రద్రష్ట యభీష్టము నెఱింగి ఎట్లు అతఁ డుద్దేశించెనో అట్టిగోవు నుపయోగించిన నాఁడే సరియగుఫలము లభించును. సంప్రదాయసిద్ధముగ వేదము సస్వరముగ పలుకఁబడును. కావున వైయాకరణుఁడు స్వరమునుబట్టి అర్థనిర్ణయమును చేసికొనఁగలఁడు. సూలపృషతియను పదమున

మొదటి యచ్చు నుదాత్తముగాఁ బల్కిన బహువ్రీహి యనియు, చివరియచ్చు నుదాత్తముగాఁ బల్కిన కర్మధారయ మనియు నతఁడు నిర్ణయించును. యాజ్ఞికునకు అట్టిశక్తి యావశ్యకము. అందుచే సందేహము కల్గకుండుటకు వ్యాకరణ మావశ్యకము.

మూ. ఇమాని చ భూయః శబ్దానుశాసనస్య ప్రయోజనాని
తేఽసురాః। దుష్టః శబ్దః। యదధీతమ్। యస్తు ప్రయుఙ్క్తే ।
అవిద్వాంసః। విభక్తిం కుర్వన్తి। యో వా ఇమామ్। చత్వారి।
ఉతత్వః। సక్తుమివ। సారస్వతీమ్। దశమ్యాం పుత్రస్య। సుదేవో
అసి వరుణ । ఇతి.

శబ్దానుశాసనమునకు క్రింద చెప్పఁబోవు మఱికొన్ని ప్రయోజనములు కూడఁ గలవు. తేసురాః మొదలగు వానిచే వివరింపఁబడునా ప్రయోజనములు పదుమూఁడు.

మూ. తేఽసురాః— తేఽసురా హేలయో హేలయ ఇతి
కుర్వన్తః పరాబభూవుః। తస్మాద్బ్రాహ్మణేన న మ్లేచ్ఛితవై
నాపభాషితవై. మ్లేచ్ఛో హ వా ఏష యదపశబ్దః ।
మ్లేచ్ఛా మాభూమే త్యధ్యేయం వ్యాకరణమ్.

పూర్వము అసురులు "హేఽరయః" అనుటకుమాఱుగా హేలయః హేలయః" అని ప్రయోగించుటచే పరాభూతులైరి. అపశబ్దము పరాభవహేతువై నింద్యమగును. కావున నింద్యులమై పరాభూతులము కాకుండుటకు వ్యాకరణమును నేర్వవలెను.

వి. హే అరయః-అనుచోట హే' అనుదానిని ప్లుతముగా నుచ్చరింపవలెను సంధి చేయక వేఱుగా నుచ్చరింపవలెను. రేఫకు లకారమును వాడరాదు. 'అరయః' అనుపదము నే రెండుసార్లు ఉచ్చరింపవలెను. కాని వాక్యమునంతను రెండుసార్లుచ్చరింపరాదు. ఈ నియమములను పాటింపక "హేలయః హేలయః అని సంధిచేసి, ప్లుతము చేయక, వాక్యమునంతను రెండుసార్లుచ్చరించి రేఫకు

లకారమును చేయుటచే నివి యపశబ్దములు. అట్టివానిని యాజ్ఞికప్రక్రియయం దుపయోగించుటచే అసురులు పరాభూతులైరి.

మూ. దుష్టః శబ్దః–

దుష్టః శబ్దః స్వరతో వర్ణతో వా
మిథ్యాప్రయుక్తో నత మర్థమాహ
సవాగ్వజ్రో యజమానం హినస్తి
యథేంద్ర శత్రుః స్వరతోపరాధాత్ ఇతి.

దుష్టాన్‌శబ్దాన్ మాప్రయుక్ష్మహీత్యధ్యేయం వ్యాకరణమ్.

వర్ణములచేగాని స్వరముచేగాని దుష్టమైన శబ్దమును వాడినచో నాశబ్దము సరియైన అర్థమునీయక ప్రయోగించినవానికి జెడిసికొట్టును. ఇంద్రశత్రుపదము నుచ్చరించునపుడు స్వరములో పొరబడినందున వృత్రాసురుఁడు నాశమాయెను. కావున దుష్టశబ్దములను ప్రయోగింపకుండుటకై వ్యాకరణము నేర్వంగవలెను.

వి. ఇంద్రుని చంపవలెనని వృత్రాసురుఁడు అభిచారహోమమునుచేయుచు "ఇంద్రశత్రుర్వర్ధస్వ" అనుమంత్రముచే హోమము చేసెను. (ఇంద్రస్య శత్రుః=శాతయితా ఇంద్రశత్రుః) "ఇంద్రుని నాశనముచేయువాఁడవగుము" అను నర్థమునిచ్చు షష్ఠీతత్పురుష సమాసముగానుండవలెనని వృత్రుని యాశయము. అట్లు తత్పురుషమైనచో 'ఇంద్రశత్రు' శబ్దమున చివరియచ్చును ఉదాత్తముగా పలుకవలెను. అది తెలియక వృత్రుఁడు మొదటియచ్చు నుదాత్తముగాఁ బలుకుచు హోమముచేసెను. అంతట దానియర్థము మారెను. అది బహువ్రీహి సమాసమగును. (ఇంద్రః శత్రుః=శాతయితా యస్యసః) "ఇంద్రుఁడు నాశకుఁడుగా కలఁవాడవగుము" అనునర్థమునిచ్చెను. ఆ యభిచారహోమముచే వృత్రునిశక్తి వృద్ధినొందుటకుమారు ఇంద్రుని

శక్తి వృద్ధినొందెను. ఇందుచే వృత్రాసురునిఁ జంపెను. స్వరమునందలి దోషముచే వృత్రుఁడు నాశనమైనట్లు నాశము కాకుండుటకు వ్యాకరణమును జదువవలెను.

మూ. యదధీతమ్ :-యదధీతమవిజ్ఞాతం నిగదేనైవ శబ్ద్యతే
అనగ్నా వివశుష్కైధో న తజ్జ్వలతి కర్హిచిత్ ॥

తస్మాదనర్థకం మాధిగీష్మహీత్యధ్యేయంవ్యాకరణమ్.

అర్థజ్ఞానములేక కేవలము పారాయణముమాత్రముగా చేసిన అధ్యయనము నిప్పులేనిచోటనుంచిన ఎండుకట్టెలవలెనే ప్రజ్వలన సమర్థము కాక నిష్ఫలమగును. ఫలవంతముకాని అధ్యయనము చేయకుండుటకు వ్యాకరణజ్ఞాన మావశ్యకము.

మూ. యస్తుప్రయుఙ్క్తే—

యస్తుప్రయుఙ్క్తే కుశలో విశేషే
శబ్దాన్ యథావద్ వ్యవహారకాలే।
సోఽనంత మాప్నోతి జయం పరత్ర
వాగ్యోగవిద్ దుష్యతి చాపశబ్దైః॥

పదస్వరూప, తదర్థవిశేష జ్ఞానముకలిగి శబ్దములను ప్రయోగింప వలసినతీరున నెవఁడు వ్యవహారమున ప్రయోగించునో అట్టి వాగ్యోగవిదుఁడు పరలోకమున అనంతమగు జయము నందును అపశబ్దములచే దూషితుఁడును అగును,

మూ. కః?

ఎవడు దూషితుఁడగును ?

మూ. వాగ్యోగవిదేవ

పదస్వరూప తదర్థవిశేషజ్ఞానముగల వాగ్యోగవిదుఁడే దూషితుఁడగును.

[సశేషము]

# గ్రంథ స్వీకారము సమీక్ష

(1) శబల :- ఖండకావ్యము క్రౌన్ పుటలు 80 వెల రు 1-4-0

కృతికర్త :- అభినవ తిక్కన తెలుగు లెంక శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు, కృతి పతి శ్రీ జాస్తి వేంకట నరసయ్యగారు.

పూర్వాంధ్ర కవులలో మేనమామ మేనల్లుఁడు జంటకవులుగా వరాహపురాణ, ప్రబోధ చంద్రోదయ కృతులు రచించిన నంది మల్లయ, ఘంట సింగయలు కలరు. కాని పూర్వులలోఁ గాని యాధునికులలోఁ గాని కృతికర్త కృతిపతులుగా నున్న మాతుల భాగినేయులు కనరారు. "శబల"యను కృతిలో నేఁడట్టిసన్ని వేశము ఘటిల్లినది. సీతారామమూర్తి, వేంకట నరసయ్య ఉభయులుకూడ జాతీయకవులుగాఁ బేరెన్నికగన్నవారు. అన్యోన్యము భక్తి వాత్స ల్యములచే బద్ధులయినవారు. నరసయ్యగారికృతులఁ గొన్నిటినిబూర్వ సంచికలలో సమీక్షించి యున్నాము. "మామయ్యా! జంకుచునే యడుగుచున్నాఁడను. నీకృతి నొకదానిం జేపట్టుభాగ్యము నాకుఁ గల్గునా?" అని నరసయ్యగారు మేనమామను ప్రార్థించుటయు "ఏది వ్రాసే నెన్నఁడుం గోరని మేనల్లుని కోర్కెని మన్నించుటెట్లాయని మానసించి చిల్లరకొట్టుందెఱచి చూడఁగాఁ బ్రచురణార్హమగు రచనలుకొన్ని నాకంటఁబడినవి. వాని యభిలాషముదీర్ప వీనినే యేల ప్రకటింపరాదు? ఇది ఖండకావ్య యుగమేకదా!" అని తలంచి సీతారామమూర్తి గారు మేనల్లుని కోర్కెని మన్నించుటయు నీకృతిరూపముగఁ బరిణ మించుట ముదావహము. విషయవైవిధ్యమునుబట్టి దీనికి శబలయను పేరుంచితినని కృతికర్త పేర్కొన్నారు. కృతిపతి నరసయ్యగారు జవ్వ నముననే గాంధి సత్యాగ్రహోద్యమమునఁ బాల్గొని బ్రిభుత్వము వారి కారాగృహాతిథ్యములనంది యనంతర మిప్పటికిఁగూడ నైష్ఠిక బ్రహ్మచర్యముతో ఆంధ్రోపాధ్యాయ వృత్తియందు జీవితము గడ

# గ్రంథ స్వీకారము సమీక్ష

(1) శబల :- ఖండకావ్యము క్రౌన్ పుటలు 80 వెల రు 1-4-0

కృతికర్త :- అభినవ తిక్కన తెలుగు లెంక శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు, కృతి పతి శ్రీ జాస్తి వేంకట నరసయ్యగారు.

పూర్వాంధ్ర కవులలో మేనమామ మేనల్లుఁడు జంటకవులుగా వరాహపురాణ, ప్రబోధ చంద్రోదయ కృతులు రచించిన నంది మల్లయ, ఘంట సింగయలు కలరు. కాని పూర్వులలోఁ గాని యాధునికులలోఁ గాని కృతికర్త కృతిపతులుగా నున్న మాతుల భాగినేయులు కనరారు. "శబల"యను కృతిలో నేఁడట్టిసన్ని వేశము ఘటిల్లినది. సీతారామమూర్తి, వేంకట నరసయ్య ఉభయులుకూడ జాతీయకవులుగాఁ బేరెన్నికగన్నవారు. అన్యోన్యము భక్తి వాత్సల్యములచే బద్ధులయినవారు. నరసయ్యగారికృతులఁ గొన్నిటిని బూర్వ సంచికలలో సమీక్షించి యున్నాము. "మామయ్యా! జంకుచునే యడుగుచున్నాఁడను. నీకృతి నొకదానిం జేపట్టుభాగ్యము నాకుఁ గల్గునా?" అని నరసయ్యగారు మేనమామను ప్రార్థించుటయు "ఏది యేమె నెన్నఁడుం గోరని మేనల్లుని కోర్కెని మన్నించు టెట్లాయని మానసించి చిల్లరకొట్టుం దెఱచి చూడఁగాఁ బ్రచురణార్హములగు రచనలుకొన్ని నాకంటఁబడినవి. వాని యభిలాషముదీర్ప వీనినే యేల ప్రకటింపరాదు? ఇది ఖండకావ్య యుగమేకదా!" అని తలంచి సీతారామమూర్తిగారు మేనల్లుని కోర్కెని మన్నించుటయు నీకృతిరూపముగఁ బరిణమించుట ముదావహము. విషయవైవిధ్యమునుబట్టి దీనికి శబలయను పేరుంచితినని కృతికర్త పేర్కొన్నారు. కృతిపతి నరసయ్యగారు జవ్వనముననే గాంధి సత్యాగ్రహోద్యమమునఁ బాల్గొని బ్రిటిషు వారి కారాగృహాతిథ్యములనంది యనంతర మిప్పటికిఁగూడ నైష్ఠిక బ్రహ్మచర్యముతో ఆంధ్రోపాధ్యాయ వృత్తియందు జీవితము గడ

పుచున్న యుత్తమశీలురు. సీతారామమూర్తిగారుకూడ ఆంధ్రోపాధ్యాయులుగానే జీవితముగడపి గాంధి భక్తులయి "బాపూజీఆత్మకథ" మున్నగు మహోన్నత పద్యకృతులెన్నియో తెనుగు నుడికారంపు సొంపులుమెఱయ రచించిన జాతీయకవితా ధురంధరులు.

"నామేనల్లుని కిల్లువాకిలియుఁ గాంతావిత్తముల్ కామ్యముల్
గామిఁ బెద్దకలంగి డీల్పడుదు రక్తస్పర్శ మూలమ్మునన్
సీమల్ దాఁటిన తద్విరాగము కృతిస్వీకార భోగాహిత
ప్రేమంబై వడి తగ్గినామదికిఁ దృప్తింజూపె నీనాఁటికిన్."

అని యానందించి, తమధీచాతురి కాదితీర్థము గురుస్థానమునగు బావమఱఁది సుబ్బయ్యగారిపుత్త్రుఁడు నరసయ్య "పుత్త్రరూప గురుఁడేకద వీఁడు శ్రోత్రికర్మమ్మునన్" అని నిశ్చయించి "అటుగురుని ఋణము దీర్చుట! కిటు సోదరిబిడ్డవలపు నీడేర్చుట కొక్కటిచాలుంబనియని వేంకట నరసయకితనికి డెదఁగవితన్ శబలన్" అని యీకృతి నొసంగినారు. ఈవిషయమై గ్రంథారంభమున "ఈవి" యను శీర్షికతో వీరు రచించిన పద్దియములెల్ల చక్కనిసుద్దులయి ముద్దుగులుకుచున్నవి. సంక్రాంతితలఁపులు, వీరపూజ, కర్ణుఁడు, నాకథ. సీత (ఆశువు) ఆతఁడు (వినోబాభావే) మున్నగు శీర్షికలుగల యిరువది యెనిమిది కృతులిందుగలవు. శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు రచించిన 12 పుటల పీఠిక కృతికి ముఖాలంకరణముగ నున్నది. సీతారామమూర్తిగారు తొలుదొలుత బాల్యయౌవనములలో స్వగ్రామమునఁ బల్లెటూరిలో సుఖతరమగు కృషీవళజీవనమును నెఱపి యానందారోగ్యముల ననుభ ంచినవారు. అప్పుడు పంటకాలములో సంక్రాంతి దినములలోఁ దమకుఁగలిగిన యనుభవములను సుఖానందములను దలఁపునకుఁ దెచ్చికొని తరువాతఁ బ్రభుత్వపుఁ గొలువులో, ఉపాధ్యాయవృత్తిలోఁ దామనుభవించు శారీరకమానసిక కష్టములను, అనారోగ్యమును,

అశాంతి జీవనమును నిరూపించునది యిందలి మొదటి ఖండకృతి, "సంక్రాంతి తలఁపులు." ఇది పరమోత్తమమైన కవితాఖండమని, దీనిముందునిలిచెడి కవితాఖండము మఱొకటి గ్రంథమునలేదని, అది కవి స్వానుభవముల కాదర్శకమని, నేఁటి యాంధ్రభాషాకవిత్వములో శిరోభూషణమని శ్రీ విశ్వనాథవారి ప్రశంస. అది యట్టిదేయనిమా యభిప్రాయముగూడ. తదితర ఖండములుగూడ వేనికవి యథోచితముగ సన్నుతిపాత్రములుగనే యున్నవి. మచ్చునకుఁ గొన్ని పద్యములు (సంక్రాంతి తలఁపులనుండి)

వెచ్చని గడ్డిపై నడుగువేయుచు మంచుమొయిళ్ల బంటుగా
వచ్చిన సీతురక్కసికి వంగక గిత్తలబండి దోలుచున్
బుచ్చిన కొయ్యలోఁ జివురుపుట్టునటుల్ వలిపాట పాడుచున్
రెచ్చినజవ్వనంబును స్మరించెద నీమకరోత్సవమ్ములన్.
ఈదార్బల్యమకాల వార్ధకము నాయీకొన్న పీరమ్ముతోఁ
బ్రాదుర్భూతములయ్యె నొజ్జనమెదో భాగ్యంబుగా నెంచి నా
వాదెల్లన్ గదలించికొంటిని రుజా భారమ్ము నాక్రించితిన్
జేఁదున్ మెక్కితిఁ బంచదారయని నీసీధర్మమున్ దక్కితిన్.
వలచి పఠించువారు పదివందలు వచ్చిన ముద్దుముద్దుగాఁ
దెలిసినవట్టు నేర్పిపరి తృప్తి వహింతు సహింతుఁగాని; కా
కులువరకుల్కపుం జదువుగోరెడి బొట్టెలుచట్టులెనచోఁ
గలఁగినలంగి నెవ్వగలఁ గందకకుందక యుంటశక్యమా!
కోటికొకఁడేని వానికి దీటువచ్చు పురుషుఁడుండిన మహికిరాచటిక మేల శాసనములేల యస్త్రశస్త్రమ్ములేల ధర్మదేవత నాల్గుపాదముల నడువ. (అతఁడు వినోబాభావే నుండి).

(2) అంజలి :- పాకెట్ సైజు పుటలు 50 వెల 0-8-0

కర్త కవిశేఖర శ్రీ పంతుల ల క్ష్మీనారాయణశాస్త్రిగారు.

(3) **ఉమాసహస్రము :-** ద్వితీయభాగము డెమ్మీ పుటలు 200 వెల రు 3—0—0.

(4) **ఉమాసహస్రము :-** తృతీయ భాగము డెమ్మీ—పుటలు 304 వెల రు 5—0—0.

శ్రీ వాసిష్ఠ గణపతి మునిప్రణీతము. ఆంధ్రీకృతికర్త, సాహిత్య విద్యాప్రవీణ, ఉభయ వేదాంత విమర్శన విశారద భాషాప్రవీణ, కవిశేఖర, శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు, అధ్యాపకులు మహారాజ సంస్కృతకళాశాల, ప్రత్తిపాటివారి వీధి, విజయనగరము, విశాఖపట్టణము జిల్లా. ప్రతులు గ్రంథకర్తయొద్దనే లభింపఁగలవు.

**అంజలి :**—ఇదియొక స్తోత్రకదంబము. అంజలికి (దోసిలి) పది యంగుళులుండుఁగావున ఒక్కొక్క స్తోత్రమునకు పదిపద్యములుగాని, శ్లోకములుగాని రచించి కవి దానికి సాభిప్రాయముగ అంజలినామకరణ మొనర్చినారు. నిజగురుండగు శ్రీ రమణమహర్షి పరముగ ఆత్మాభీష్టనివేదనరూపకముగ సంస్కృతాంధ్రముల వేర్వేఱుగఁ గూర్చిన శ్రీరమణాంజలి ద్వయము, శ్రీ దేవీవరివస్యాంజలి, శ్రీ లక్ష్మీనారాయణ సందర్శనాంజలి, ఈశ్వర ప్రార్థనాంజలి, శ్రీ బ్రాహ్మీవరివస్యాంజలి, శ్రీ క్షీరారామ రామలింగేశ్వర, సోమేశ్వర ప్రణామాంజలి, శ్రీవరాహ నరసింహ కల్యాణాంజలి, శ్రీ శివతత్త్వాంజలి, శ్రీ శంకర భగవత్పాదాంజలి, అనెడి యంజలి దశకముతో నిది శోభిల్లుచున్నది. ఇవి గాక కృత్యారంభమున శ్రీ సూక్తి గీతాంజలి యను పేరితో భగవద్గీతాచార్యుఁడు శ్రీకృష్ణుని గూర్చిన గేయము కూడ నిందున్నది. శ్లోకములేమి, పద్యములేమి యన్నియు భక్తి జ్ఞాన విలసితములు, అద్వైతామృతోల్లసితములు నయి యొప్పుచున్నవి. భక్తలోకము పారాయణముగఁ బఠింపఁదగిన స్తోత్రకృతి యిది. వీనిలోఁ గొన్ని యింతకు మున్ను "ఆరాధన" పత్రికాముఖమునఁ బ్రకటితములయినవి. మచ్చున కీ క్రింది పద్య శ్లోకములఁ జూచునది.

(1) మానవ జన్మమెత్తి పశుమార్గమునన్ జరియింపనొల్ల, వి
జ్ఞానధనంబుఁ గోరక-అనర్ఘ్యము, తుచ్ఛము, నింద్యమౌ, ధన
శ్రేణిని గోరఁ జెల్లునె విశీర్ణ శరీర విభూతి-సుస్థిరమ్మౌనె ?
తలంప దీన సుఖమా? శుభమా?యశమా? గురూత్తమా

(2) అద్వైతాత్మ వివేక సంవిదమలానన్ద ప్రపూర్ణాకృతే
ప్రత్యగ్ బ్రహ్మపదార్థయోగమననధ్యాన ప్రయోగోన్నతే
భేదారణ్య విభేదక శ్రుతికథా యుక్తి ప్రచారాద్భుతే
శ్రీమచ్ఛంకర దేశికేంద్ర భగవన్ విద్యానిధే! పాహిమామ్.

**ఉమాసహస్రము :-** ద్వితీయ, తృతీయ భాగములు.

కీర్తిశేషులు కావ్యకంఠ గణపతిశాస్త్రి కవివతంసులు శ్రీ రమణ మహర్షి యాశ్రమమున నధివసించి తత్కారుణ్యమునకుఁ బాత్రమయిన కాలమున పరాశక్తి మహిమవర్ణనాత్మకముగ వివిధ వృత్తములలో బహు విషయ బోధకముగ ఇరువదియైదు శ్లోకములో శస్తబకముగ నేర్పఱచి ఉమాసహస్ర మనుపేరితో 1000 శ్లోకముల యుద్గ్రంథమును రచించియున్నారు. వానికి శ్రీ అరవిందయోగి యాశ్రమమందుండిన శ్రీ టి. వి. కపాలిశాస్త్రిగారు, గణపతిశాస్త్రి వర్యుల శిష్యులు, ప్రభానామక వ్యాఖ్యానమునుగీర్వాణ భాషయందు రచించియున్నారు. ఇందలి ప్రథమశతకమును శ్రీ పంతుల లక్ష్మీ నారాయణశాస్త్రి సుధీవతంసులు శ్రీ కపాలి శాస్త్రిగారి వ్యాఖ్యానమున కాంధ్ర వివరణముతోను, స్వవిరచిత ఆంధ్ర పద్యానువాదము తోడను ఇంతకమున్న ప్రకటించియున్నారు. దాని పైని సమీక్ష ఈ పత్రిక సం. 42. సంచిక 4లో (విజయ,ఆశ్వయుజ కార్తికములలో గావించియున్నాము. తరువాతి శతకములలో ద్వితీయ, తృతీయ, చతుర్థ శతకములు, ద్వితీయభాగముగను, తక్కిన యాఱుశతకములు

తృతీయ భాగముగను నిప్పుడు శ్రీ లక్ష్మీనారాయణశాస్త్రిగారు ప్రకటించి విద్వల్లోకమునకు మహోపకార మొనర్చినారు. ఈ భాగములలో మూలశ్లోకములు, వాని క్రింద శ్రీ కపాలి శాస్త్రిగారి వ్యాఖ్యానమునకు విశేషాంశములతోఁ దాము వచనమునఁ గూర్చిన యాంధ్రాను వాదమును శ్రీ లక్ష్మీనారాయణశాస్త్రిగారు ముద్రించియున్నారు. మొదటి భాగమునందు వలె నీ ద్వితీయ తృతీయ భాగములలోని శ్లోకములకు ఆంధ్రపద్యాను వాదములను శాస్త్రిగారు రచింపలేదు. ప్రథమభాగము పయి నీ పత్రికలో మున్ను గావించిన సమీక్షను శాస్త్రిగారు తృతీయ భాగావతారికలో నుల్లేఖించి యున్నారు. అందు గణపతి కవీంద్రులయగణితవైదిక విజ్ఞానమునకు, సర్వదర్శన కళానైపుణ్యమునకు నీ యుమాసహస్ర స్తోత్ర కృతి యాదర్శకముగ నున్న విషయమును, ఆంధ్రీకర్తలగు శ్రీ లక్ష్మీనారాయణ శాస్త్రిగారి శక్తి సామర్థ్య విశేషములను బ్రశంసించియున్నాము. ఈ కృతియందలి ఉమ పరమేశ్వరుని మానశక్తి రూపకమయిన కేవల పరాశక్తియే గాని కావ్యములందు పురాణములందు వర్ణితమయిన పరిమిత వ్యక్తి కాదని, హైమవతి, పార్వతి శబ్దములకు సువర్ణద్యుతి, వైద్యుతద్యుతి యని గణపతి కవీంద్రుల నిర్వచనములని అట్లే దక్ష, దాక్షాయణి, సతి, అదితి, మున్నగు శబ్దములకుఁ గూడ పౌరాణికకథలకు విలక్షణములగు నర్థములు, శ్రుత్యాధారములతో నిరూపింపఁబడినవని నివేదించియుంటిమి. ఇప్పుడు ప్రకటితములయి ద్వితీయ, తృతీయ భాగములందలి శ్లోకములు గూడ నట్టి పరతత్త్వద్యోతకములుగనే భాసిల్లుచున్నవి. పరాశక్తి స్వరూపిణి యగు ఉమాదేవి వర్ణనములో శ్రీ గణపతి కవీంద్రులు తాండవింపని విధానము

[illegible]

తత్కృష్ట స్తోత్రకృతిని సాకల్యముగఁ బఠించి తరించుఁ గాక! (ప్రభా వ్యాఖ్యాతలు శ్రీ కపాలి శాస్త్రిగారు శ్లోకాత్మకముగ రచించిన స్తబక వృత్త విషయసూచిక తృతీయభాగాంతమున ముద్రిత మయినది. గ్రంథ స్వరూపమును దిఙ్మాత్రముగఁ దిలకింపఁ గోరు వారుకివి యెంతయు నుపకరించును. మచ్చునకుఁ గొన్ని శ్లోకములు, తద్వివరణములు శ్లో. దేవీవ్యాపక తేజశ్శక్తిస్తత్త్వ విచారే। అత్యన్తం సుకుమారీ నారీమూర్తి విచారే'' (ద్వితీయ భాగము 2 స్తబకము శ్లోకము 9) పరమార్థమును విచారించునప్పుడుమా దేవి వ్యాపక తేజశ్శక్తి యగుచున్నది. ఆయమ్మ విచారించునపుడు అత్యంత కోమలగాత్రియగు పార్వతి యగుచున్నది.

ప్రభ: వ్యాపక తేజశ్శక్తియన "సర్వవ్యాపియగు జ్యోతిస్సగు పరమేశ్వరుని శక్తి అని గాని "వ్యాపక తేజోరూపిణియగు శక్తి'' అని గాని యర్థము చెప్పవచ్చును. వ్యాపక తేజోరూపిణి యగు శ యని చెప్పునపుడు శాక ప్రియః పార్థివః శాక పార్థివః అని చెప్పు నట్లు తేజోరూపిణీ శక్తిః తేజశ్శక్తిః అని సమాసమును జెప్పవలయును.

తత్త్వమును విచారించు నెడల దేవీస్వరూపము సర్వవ్యాపి తే క్తియని, విగ్రహవత్త నపేక్షించు నెడల, సుకుమారియగు నారి యగుననియు భావము.

శ్లో॥ఆపీనం భవతిసహస్రపత్రకంజం వత్సోఽస్యాఃపటుతర మూలకుండ వహ్నిః। దోగ్ధాత్మా దహర సరో మహోప విష్టో మానం స్యాత్ సురసురభేస్తనూషుదోహః(తివభాగము 2 స్తబకము శ్లో 16)

సహస్రారకమలమే పాలపొదుగు, కుండలిని యగు కామ ధేనువునకు మూలాధారమేయగు కులకుండమునందలి నిపుణతరమగు నగ్నియే దూడ. హృదయకమలాసీనుఁడగు ఆత్మయే దోగ్ధ. (పాలు పిదుకువాడు) సర్వవిషయములను నిరసించునవియు శాంతితో నింపి యుండు నదియునగు మానమే పొదుగునుండి పాలు తీయుట.

ప్రభ :- కుండలి నుండి జనించిన మూలాగ్నియే వత్సము (దూడ)

బండారు తమ్మయ్య.

ఆంధ్రధ్వన్యాలోకము :-మూలకారికాది సమన్వితము. ద్వితీయోద్యోతము. శ్రీబాల సరస్వతీ ప్రచురణము-5. ప్రథమభాగము. శ్రీబాల సరస్వతీ ప్రచురణము-9 ద్వితీయభాగము. సలోచన ప్రభావతీ సమున్మీలితము. ప్రథమభాగము. పుటలు మొత్తము 320. గ్లేజు ముద్రణము రు. 5-00 లు. న్యూసు ముద్రణము రు 4-00. ద్వితీయ భాగము పుటలు మొత్తము 230. గ్లేజు ముద్రణము రు 5-00 లు. న్యూసు ముద్రణము రు 4-00 లు.

ఈధ్వన్యాలోకమును లోచన వ్యాఖ్యానముతో సహితము నాంధ్రీకరించి లోకమున కందిచ్చుచున్న శ్రీ కవిశేఖర వేదాంత విమర్శనవిశారద శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారి వాఙ్మయ తపస్సు ఆంధ్రులందఱకు మిక్కిలి ప్రశంసనీయము. ధ్వని మార్గమును పరిష్కరించుటలో నానందవర్ధనాచార్యు డవలంబించిన పద్ధతి, అభినవగుప్తాచార్యు డాబాటను తీర్చిదిద్దిన విధము ఉద్దండ పండితులకు సైతము దురవగాహము. అట్టి దానిని క్షుణ్ణముగా నవగతము చేసికొని, శాస్త్రీయ సిద్ధాంతములకు విరోధము లేకుండ ననువదించుట యనునది కేవలము తపస్సాధ్యమే కాని బుద్ధిసాధ్యమైన విషయము గాదు. శ్రీలక్ష్మీనారాయణశాస్త్రిగారు శ్రీతాతా సుబ్బరాయ శాస్త్రులవారినుండి లోచనసహితమైన ధ్వన్యాలోక విషయమును సంప్రదాయానుసారముగ గ్రహించుటయే గాక, దానిని మూలమున కనన్యానాతిరిక్తముగను, శక్యమైనంతలో సుబోధకముగను నాంధ్రభాషలోని కనువదించుట మిక్కిలి హర్షింపఁ దగిన విషయము.

అభినవగుప్తుని లోచన వ్యాఖ్యానము నవగతము చేసికొనుటకు సామాన్యలోచనములు సరిపడవనియు, జ్ఞానలోచనములు గావలెననియు నభిజ్ఞులు వాకొందురు. శ్రీ శాస్త్రిగా రట్టిలోచనములను వేదాంత విద్యాభ్యాసాదికముచే నార్జించి లోచనోన్మీలిత విషయమును

క్రమశక్తి కొలఁది ప్రభామతీటీకలో వివరించియున్నారు. శాస్త్రీయ విషయపరిజ్ఞానము గలవారికిఁ గాని యావిషయములు మనసునకు వచ్చునవి గావు. అట్టి దుర్బోధ విషయములను శ్రీ లక్ష్మీనారాయణ శాస్త్రిగారు, ఆంధ్రభాషలోఁ గొంత విశేష పరిచయముగలవారికి అవధానముతోఁ జూచిన సుబోధమగునట్లు రచియించియున్నారు. వీరి యనువాదమును శ్రద్ధతోఁ జదివిన వారికి ధ్వన్యాలోక లోచనము లందలి విషయములన్నిటియందును మంచి పరిజ్ఞానము గలుగుట నిశ్చయము.

మూలమునందలి కారికలను శ్రీ శాస్త్రిగారు తమ తెనుఁగు పద్యములలోని కనువాదము చేసియున్నారు. ధ్వన్యాలోక విషయమునకు లోచనవ్యాఖ్యానమునకు యథామూలముగ ననువాదము సాగించుచు, దుర్బోధములైన విషయములకుఁ బెక్కు తావులందు వివరణము చేసి, తత్తద్విషయపరిజ్ఞానము పాఠకులకుఁ గలుగునట్లు చేయుటకై గావించిన కృషి ప్రశంసార్హము. శాస్త్రిగారి ఆంధ్ర ధ్వన్యాలోక భాగములను జదివిన వారికి ధ్వని మార్గము, ఆనందవర్ధనాభినవగుప్తుల సిద్ధాంతములు సుస్పష్టములగు ననుట నిర్వివాదమైన విషయము. శాస్త్రీయ విషయముల చర్చ గావున రచన చాల వఱకు శాస్త్ర పరిభాషా క్రమమునన సాగక తప్పినది గాదు. ద్వితీయోద్యోతము చివర ప్రథమానుబంధముగ 'రసాలోకము' అను పేర రచించిన విషయము గమనింపఁదగినది. శ్రీ లక్ష్మీనారాయణశాస్త్రిగారి యనువాద సరణి దెలియుటకై అచటి లోచనానువాదమును ప్రభామతి వివరణమును కొంచె ముదాహరించెను.

'రసప్రతీతి శబ్ద వ్యాపార జన్యము కాదు' అను మీమాంసకుని యాశంక.

లోచనము- "అయ్యా! (ధూమశబ్దము వలన దాని యర్థమగు,) పొగ తెలియఁబడిన పిమ్మట అగ్ని యొక్క స్మరణము

కలుగునట్లు, విభావాదులు తెలియఁబడిన పిమ్మట రత్యాది చిత్త వృత్తులు తెలియఁబడును. కనుక రసప్రతీతివిషయమున శబ్దవ్యాపారము లేనేలేదు." (అని మీమాంసకుఁ డనవచ్చును.)

ప్రభా :—'విభావాదులు తెలియఁబడిన పిమ్మట కలుగునది యగు రత్యాదిప్రతీతి ధూమాదిప్రతీతిచే జనించునదియగు అగ్న్యాది స్మృతివంటిదే యగును. కనుక అగ్న్యాదుల స్మృతివలె, ఈ రసాది ప్రతీతి కూడ ఏశబ్దవ్యాపారమునను జనించునది కానిదై యుండఁగా అది వ్యంజనావ్యాపారజన్య మెట్లగును? అనఁగా రసాది ప్రతీతి యందు లక్షణకువలె వ్యంజనకుఁ గూడ ప్రసక్తియుండదు" అనునది మీమాంసకుని యాశంక". రాజాలంబనము లేక శాస్త్ర విద్యాభ్యాసమునకు క్రమముగ లోపము వాటిల్లుచున్న యీ కాలమున శాస్త్ర గ్రంథముల కిట్టి యాంధ్రీకరణములు వెలువడుట శాస్త్రసంప్రదాయ రక్షకు దోహదకారులు కాఁగలవనుట నిశ్చయము.

చి. పాపయ్యశాస్త్రి.

**ద్రావిడభాషా సామ్యములు** :- కళాప్రపూర్ణ శ్రీ వఝ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రి గారిచే రచియింపఁబడినది. విద్వాన్ వె. వెంకట రాజులు రెడ్డిగారిగ్రంథమునకుఁ కృతిభర్తలు. డెమ్మీసైజు 182 పుటల గ్రంథము. వెల రు 2-8-0 లు. ప్రకాశకులు కాకరపర్తి వేంకట సీతమ్మగారు. విజయనగరము.

గ్రంథకర్తల విజ్ఞప్తి వాక్యములను బట్టియే యీగ్రంథరచనకుఁ గల ప్రయోజనము పాఠకలోకమునకు విదితమగును. శ్రీ శాస్త్రిగారి రచనలు ఆంధ్రలోకమునకు సుపరిచితములు. వారికిఁ గల సంస్కృతాంధ్ర భాషా విమర్శనపాటవము, శ్రీ శాస్త్రిగారు రచింపఁగా ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు ప్రకటించిన ఆంధ్ర వ్యాకరణ సంహితాసార సర్వస్వమును బట్టియు, ద్రావిడభాషా పరిశీలనమును

బట్టియు నాంధ్రలోకమునకు సువిదితము. ఆ రెండింటికి సంగ్రహ రూపముగ వెలువడిన రెండు గ్రంథములలో 'ద్రావిడభాషా పరిశీలనము' అనునది యొకటి. దీనిని గూర్చి శ్రీ శాస్త్రిగారి వాక్యములివి.

"నారచించిన ద్రావిడభాషా పరిశీలనము డా. కాల్డు వెల్లు గారి ద్రావిడ వ్యాకరణమును విమర్శించుట ప్రధానవిషయముగఁ గల దగుటచేతను, నతివిస్తృతమైన దగుటచేతను నాంధ్ర విద్యార్థులు సులభముగా వలసిన ద్రావిడవిషయములను సంగ్రహించుకొనఁ జాలరు. నారచించిన బాలవ్యాకరణోద్యోత మాంధ్రభాషా విషయ సారమును సులభముగఁ దెలుపునట్లు యిది ద్రావిడ భాషల లక్షణములను సులభముగాఁ దెల్పును. ఈ రెండుగ్రంథములు సకలాంధ్ర విద్యార్థి జనోపయోగమునకై సారభూతములుగ నాచే రచింపఁబడినవి" ఈ వాక్యములచే ఈ గ్రంథమున ఆంధ్ర విద్యార్థులకు ద్రావిడభాషా లక్షణములు సులభముగ నవగతములగుట శాస్త్రిగారి రచనకుఁ బ్రధానలక్ష్య మని విదితమగుచున్నది. శ్రీ శాస్త్రిగారేవిషయమును జేతఁబట్టినను దానికి వలయు సామగ్రినంతను గూలంకషముగ సంకలితముఁ జేసియే రచన సాగింతురు. విశ్వవిద్యాలయము వారీ కృషిని బరికించి యీ గ్రంథము నున్నతకక్ష్యలలోని విద్యార్థులకుఁ బాఠ్యముగా నిర్ణయించిన శ్రీ శాస్త్రిగారి పరిశ్రమ సఫలము కాఁగలదని యాశించుచున్నాను.

చి. పా. శాస్త్రి.

**నీలకంఠవిజయము** ఆంధ్రీకృత చంపూప్రబంధము-రచయిత శ్రీదువ్వూరి సూర్యనారాయణశాస్త్రి.-ప్రచురణ కర్తలు-శ్రీ మల్లాడి సత్యలింగంనాయకరు ఛారిటీస్ వారు, కాకినాడ. వెల రు 2-0-0 పుటలు 150

ఆంధ్రమున నీలకంఠవిజయమునకు మొదటగా ననువాదమును వెల. యించిన ఖ్యాతి శ్రీసూర్యనారాయణశాస్త్రి గారికి లభించినది. సంస్కృతమున నీలకంఠ విజయ చంపువును అప్పయ్య దీక్షితుల మునిమనుమఁడగు నీలకంఠదీక్షితులు రచించెను. సంస్కృతమున

చంపూప్రబంధములలో నీలకంఠవిజయము వక్రోక్తి భరితమై నారికేళపాకమున సాగినది. వ్యాఖ్యాన సహాయములేనిదే మూలము నర్థము చేసికొనుట పండితులకుఁ గూడఁ బలుతావులఁ గష్టముగా నుండును. అట్టి చంపువును శ్రీ శాస్త్రిగారు చాల వఱకుఁ దెనుఁగునఁ దెచ్చుటకుఁ బ్రయత్నించిరి. వా రుపోద్ఘాతములో వివరించినట్టులు కొన్ని పట్టులు వదలియుఁ గొన్ని పట్టులఁ బద్యములను గూడ గద్యములుగనే యనువదించియు, అనువాదము మూలసహాయ మక్కఱ లేకయే యర్థమగునటులు శ్రమించిరి. సంస్కృత శబ్దములపై నతఁడు సాగించిన వక్రోక్తిచమత్కారములను జాలవఱకుఁ దెనుఁగునఁ గూడఁ దెచ్చుటకు యత్నించిరి. ఉదాహరణమునకు మంగళాచరణ పద్యమునే పరికింతము.

గీ॥ వాంఛితార్థ సిద్ధికి నమోవాక మిడుదు
నెవరికో! యన, వారినే నెంచి యనను
మఱి యనేకత పొసఁగు దంపతుల కనిన
దంపతి కటన్న దుష్టశబ్దత ఘటిల్లు

అభీష్టసిద్ధికి నమస్కరించుచు, దంపతుల కనవలెనా? దంపతి కనవలెనా? అని సందేహించి దంపతుల కనినచో అద్వైతమునకు భంగము వచ్చును. దంపతి కనిన వ్యాకరణదుష్టమగును. అందుచే నే నెవరికి నమస్కరించుచున్నానో చెప్పను అని చమత్కారముగ అద్వయమగు పరబ్రహ్మ స్వరూపమునకు నమస్కరించును. దీనిని పై పద్యమున భావపుష్టి చమత్కారము తెలుగకుండునట్లు శాస్త్రిగా రనువదించిరి. వీరి రచన యంతయు నీ విధముగనే మూలావిరుద్ధముగ జాతీయముగ రసోచితముగ సాగినది. ఇట్టి మహోత్కృష్టమయిన చంపూప్రబంధము నాంధ్ర సారస్వతమున కందిచ్చిన శ్రీ శాస్త్రిగారు ఎంతయుఁ బ్రశంసనీయులు. ఇట్టి గ్రంథమును ముద్రింపించి తమకుఁ గల సంస్కృతాంధ్ర భాషాసమాదరమును వెల్లడించిన శ్రీ సత్య లింగనాయకరు ఛారిటీసు వా రెంతయు ప్రశంశార్హులు.

శ్రీభాష్యం అప్పలాచార్యులు.

వ. అనిన విని శంభుండు శాంభవి కిట్లనియె.

క. మనలను బిలువక దక్షుఁడు
ఘనకల్మషచిత్తుఁ డగుచు గణఁగిన మేమై
చని చూత మనియెదవు పిలు
వని పేరంటమ్ము నరుగువారుం గలరే!

ఆ. అత్తవారియింటి కల్లున కెప్పుడు
తగదు శుభమువేళఁ దాన యరుగ
నాడుబిడ్డ కొప్పు లలరఁ బిల్వకయున్న
నమరుఁ బుట్టినిండ్ల కవసరముల.

వ. అట్లు గావున నేను రాను; నీకుఁ జనవచ్చు; నెగ్గుగాదు; పొమ్మనుచుం బల్కిన నెట్టకేల కొడంబఱచి, యంతశ్చరచరులఁ గొందఱఁ బిలిచి, శాంభవి తనపుట్టినింటి కరిగెడు రత్నవిమానంబు మొదలుగాఁ గల ప్రయాణోపకరణంబులు సమకొల్పుకొని తోడన కొల్చియరుగుడుం డని పనిచినం బ్రసాదంబని వారునుం గృతకరణులగుచున్న యనంతరసమయంబున దాక్షాయణి మహేశ్వరుని పాదపంకజంబులకుఁ బ్రణామంబుచేసి, తదీయభావంబు హృదయపీఠంబున నునిచి, ప్రదక్షిణంబుగా వీడుకొని, కోరికం బరిచారికలు ముక్తాతపత్త్రహేమచామరాదులుఁ, గేలిశుకశారికాదులు మఱియు వలయునవియుఁ గొనుచు, నాల్గుదిక్కులు ముంచుకొంచు నడువ, దేవదుందుభిరవంబులు రోదసీకుహరంబు చెవుడుపఱుప వచ్చి, యద్దివ్యవిమానం బధిరోహించిన.

క. దినరాజమండలముక్రియ
ఘనతేజము దొంగలింప నాగగనపథం
బున నరిగి దక్షవాటము
గను తెప్పిడినంత నదియుఁ గదిసెం దిర్గమె.

ఆ. అచట నున్న వార లందఱు నానన
విసరముల భయంబు విస్మయంబు
లజ్జయును జనింపఁ దజ్జగన్మాతభా
సురవిమాన మర్థిఁ జూచి రపుడు.

సీ. కంచుకి ప్రిమథులు కనకవేత్రిములతో
బదమని సందడిపాయ జడియ
దివ్యదుందుభులు ప్రదీప్తనాదములతో
బోరన దిక్కులం బొదల మొరయ
సురవృక్షకుసుమము ల్సుంభివాసనలతో
జోరున జడివట్టి సొరిది మెఱయ
వరుస తేజస్స్ఫూర్తివఱలు సంభ్రమముల
జయ యని భృత్యులు సరవి నుడువ
నరిగె నాభవాని యయ్యానముననుండి
యిలకు నవతరించి లలితభంగి
నంబుజాక్షపూర్వ లంజలిసేయంగ
దక్షయజ్ఞవాటతలమునకును.

వ. ఇట్లువచ్చిన యాత్మజాతం ద్రిలోకమాతం గనియును, శివ సహితంబుగా మున్ను తన్నవమానించిన దని తలంచి, రోషాంధుం డగుచు దక్షుండు కాననియట్లు నిరాకరించి యుండుసమయంబున, నతనిచేత నర్చనలు వడసియున్న తనచెలియండ్రను మఱిందులం జూచి యేచిన యలుకం గటకటంబడి శాంకరి యిట్లనియె.

క. నను నీదు పెద్దకూఁతుం
జనునె పరిభూతఁ జేయ జనకత్వముసే
జన విసమిసుమంతయు నీ
మనమున లేకునికి యపుడ మాకుం దెలిసెన్.

గీ. పిన్నకూఁతుల నల్గురఁ బిలిచినాఁడ
వకట మము నేల పిలువ నీయాత్మఁ జొరదు
సకలయజ్ఞకర్మ ఫలదాయకుఁడు శివుఁడు
దగఁడె నీజన్నమునకు రా దక్ష చెపుమ.

ఉ. ఈకమలాక్షు వాక్పతుల కెవ్వఁడు నిక్కము పూర్వకర్త యీ
లోకములెల్ల నెవ్వఁ డనులోమగతి న్రచియించినట్టివాఁ
డీకమనీయసంపదల నిందఱ కిచ్చినవాఁడ యెవ్వఁ డీ
వాకరుణాకరుం హరుని నర్చనసేయవు బుద్ధిమాలితే.

వ. అనిన విని మిక్కిలి మండిపడి దక్షుం డరుణాయమానకటా
క్షుండగుచు నావిశ్వనాయికం గనుంగొని.

క. తనమామ యనుచుఁ దగుమ
న్ననఁ జూడక తోడివారి నన్నును సరిగాఁ
గనుఁగొనియెఁ గాన శంకరుఁ
డనుమానములేదు శత్రుఁ డబలా! నాకున్.

ఉ. కోరిక నాజతాత్మకునిగూడిన నీ వదియేల నీకు నో
వారిరుహాక్షి నెమ్మి బలవంతపులాగున సంఘటించుని
నేరుపు మామఘంబునకు నీహృదయేశ్వరుఁ డేల? శాత్రవున్
వారక పిల్తురే? చనుము వచ్చినత్రోవనె పట్టి సయ్యనన్.

వ. అనిన విని సర్వమంగళ సభవారిం జూచి, వింటిరే! ముక్కంటి
వాదికర్త నీకలుషవర్తనుండు వలపని విరోధంబున నిందసేయుచు
న్నాఁడు. మీ రెఱుఁగని వేదశాస్త్రపురాణములు లేవు. శివనిందా
కరంబులగు వచనంబులు వింటిరే యని యంతటంబోక, తండ్రి నవ
లోకించి యిట్లనియె.

సీ. ఓరితుచ్ఛవిచార యోరినిష్కరుణాత్మ
యోరి యధర్మజ్ఞ యోరధూర్త

యోరి హీనవివేక యోరిశోభనమార
    యోరినాశవిలోల యోరి మూర్ఖ
యోరి గురుద్రోహి యోరి పాపాన్వేషి
    యోరి యహంకారి యోరి కపటి
యోరి దుష్పథగామి యోరిహారాజ్ఞాని
    యోరి కేవలమోహి యోరి కలహి
యేలరా మనంబునఁగొంక కిందుధరుని
హరుని నిందచేసెదవు దురాగ్రహమున
నఖిలరక్షాకరుండు నీ కమ్మహాత్ముఁ
డకట యేకల్ల చేసెరా? యధమ! చెపుమ,

క. నినుఁ గూర్రుండగు టెఱుఁగక
పనివడి నీకూఁతు నన్నుఁ బరిణయమయ్యెన్
విని మఱువందగు దోషం
బని యెన్నఁగ నేది యొకఁడు నాశివునందున్.

సీ. రాజసయుక్తి యారంగఁ బద్మజుఁడనా
    వెలసి లోకముల భావించుచుండు
సాత్త్వికసక్తి మించఁగ శ్రీవరుండనఁ
    జెలఁగి యింతయును రక్షించుచుండుఁ
దామసవృత్తి యందముగ రుద్రుండనా
    నడరి సర్వము నుక్కడఁపుచుండు
సకలసంపత్తి నచ్చముగ నాత్మండనా
    నలరి విశ్వమునందు వెలుఁగుచుండు
నమరుఁ డద్వయుఁ డక్షరుఁ డజితుఁ డజరుఁ
డతితరస్థూలుఁ డవికారుఁ డలఘుతేజుఁ
డచలుఁ డవిచింత్యుఁ డవ్యయుఁ డధికసూక్ష్మ

డవిరలశ్రీకుఁ డగు సదాశివుఁడు దాన.

క. ఈశ్వరుఁ డెక్కడ నిలుచును
శాశ్వతముగ నచట నుండు సన్మంగళముల్
విశ్వపతి యెచటఁ ద్రొక్కఁడు
నశ్వరత వహించు శోభనము లచ్చోటన్.

ఆ. ఇది నితాంతధర్మ మిది వేదవిహిత మం
చరసి యిప్పు డీవు జరుపుచున్న
మఖము తుట్టతుది సమగ్రత ఫలియించు
పండు శంభుఁ డొక్కరుండు సూవె.

చ. శ్రుతులు యుగాది నిర్జరులఁజూచి మఖంబుల నబ్బు హవ్యముల్
చతురత నధ్వరేంద్రుఁడగు శంభున కిచ్చి యతండ యిచ్చినన్
మతు లలర న్భుజింప నగు మంగళ; మట్టిజగద్విధాత యా
నతుల నిరాకరింప, నగు నాశము పొందని చాటి చెప్పవే.

క. నెఱయఁగ నిదియును మనమున
నెఱుఁగవె యీదృశుఁడు శంభుఁ డీమఖమున నే
తెఱఁగున రాఁదగఁడొక్కొ
యఱపుల కిటు లెద్ది పాటి యధమాధముఁడా!

వ. అని పల్కి మఱియు నచట...నంతకంతకు నిగుడు నాగ్రహంబున నాననంబు జేవురింప నాజగన్మాత యరుణాంబురుహేక్షణంబులం బాపాత్ము దక్షుం గనుంగొని ... సకల్మషుండును దుస్స్వభావుండును నగు నీకు మున్ను నే జనియించినట్టి యీశరీరంబు దాల్పను మదీయవల్లభుం గదియింప నుచితంబుగా దనుచుఁ దదనంతరంబ.

చ. పరమసమాధి నొంది నిజభావమునందుఁ గరంబు నిష్ఠ నీ
శ్వరు విడియించి యర్థి నినచంద్రులవీథులఁ గప్పి మిక్కిలిన్
బరువడితోడఁ బ్రాణుని నపానుని గూర్చి సుషుమ్నలోనికిన్

జనియె భవాని యోగశిఖఁ జక్కఁగ మేల్కొనఁ జేసియుండఁగా.

ఉ. ఆపయి యోగ పావకమునందులనాలుక లోలిఁ గ్రోయుచుం
జూపఱ కెంతయు న్భయము చొప్పడ నుగ్రనిరూఢిఁ జేర్చియా
లోపల నింతిమీఁదికిని లోలత నుబ్బుచు నద్భుతక్రమా
టోపము దాల్చె శాంభవి గడు న్వెలసిల్లఁగ నిశ్చలస్థితిన్.

గీ. ఆత్మశిఖి యట్లు తనచుట్టు నగ్గలింప
నడుమఁ బాయక యాసతి నళువు మీఱ
సహజ తేజంబు నిశియందుఁ జాలఁ బడసి
లాలితంబగు నోషధిలతయుఁ బోలె.

క. తదనంతరంబ శాంభవి
కదలక తద్గాఢదహనఘనకీలములన్
పొదవుడిపె శరీరము స
మ్మదమున భస్మముగఁ జేసె మహిమ దలిర్పన్—

వ. ఇట్లు పరమమాహేశ్వరి యగు నీశ్వరి దక్షువలని రోషం
బున భస్మసాత్కారంబు నొందిన ... యప్పటి మంత్రంబులు
తదీయగేహంబు వెడలె నింక నిక్కడ నునికి గర్జంబు గాదని ముకుంద
శతానంద పురస్సరులైన యమరు లందఱు దమతమనివాసంబుఁ
కరిగి రంత. నిట సదాశివుం డిచ్చటి వృత్తాంతం బంతయు దివ్య
భావంబునను బునరాగతప్రమథయూథంబులవలనను నెఱింగి నిఃజ
ప్రియసుందరి యందలి ప్రేమంబు రోషరూపంబున నిగుడుటయు
నుగ్రుం డుదగ్రరభసంబున

ఆ. దక్షుఁ గష్టశీలు ధర్మవిదూరాత్ము
గతవివేకుఁ దలఁచి కటము లదర
బొమలు ముడివడంగఁ బొలియింపఁ దలఁచి యి
టనుచు శాపమిచ్చె నభవుఁ డంత.

గీ. ఓరి ! యాత్మాధికంమన్య ! యోరి ! దక్ష !
యోర ! మత్ప్రాణవల్లభయందు నట్లు
కడు నహంకృతి చూపిన చెడుగ వగుట
నడఁకు మంతకు దుర్దాంతయాతనలను.

క. పుట్టుము ప్రచేతసునకుం
బట్టి వగుచుఁ బిదప నిట్ల పటుమూఢతఁ జే
పట్టుము దురధ్వరము ను
ద్ఘట్టించెద నపుడ నిన్నుఁ గ్రతువున నలుకన్.

వ. అనిన నిట్లు నిష్ప్రతీపంబగు శాపంబున దక్షు నుపలబ్ధయమ సమత్వుం గావించిన నతండును దన్ను సకలజనంబులు నిందింపఁ బంచత్వంబు నొంద నీశ్వరుండును యథోచితవర్తనంబులం బ్రొద్దులు పుచ్చుచుండె.

చ. చదురుగ దక్షునాశ మనఁజాలిన యీశివలీల నిచ్చలుం
జదివిన విన్న వ్రాసినను జక్కఁగ వారల కెల్ల నిక్కడం
గుదురుపడ న్ఫలించు ననుకూలశుభంబులు నిత్యసంపద
ల్పుదిసమకూరుఁ జాల భవులోకము గౌరవలక్షులాభ ముల్.

ఆ. వినుఁడు సముచితముగ వివరింతు నిటమీఁద
నభవుఁ డవధరించినట్టి లీల
గరము వెలయు నదియుఁ గందర్పదహనాఖ్య
నమరసార్థగుంఫనములు గలిగి.

వ. దక్షుండు క్రియాదక్షుండు గాక దురవరోధంబునఁ జేసిన యపరాధంబున గాసిల్లి యాగసన్నాహంబున దేహంబు విడిచిన దేవశితారోమణి దాక్షాయణియగణ్యపుణ్యవంతుండగు హిమవంతున కుం దనపునర్జన్మం బానతిచ్చినఁ బ్రాపించినఁ దత్సతియగు మేనక మేన నుపసంక్రమించి, పరిపూర్ణవివర్ధనంబున విడంబించి, సముచిత క్రమంబున.

చ. అటతఱి వర్ణనీయసమయంబున దక్షతనూజ కేవల
స్ఫుటమహిమ న్గిరీంద్రునిజసుందరియందు జనించె నుజ్జ్వలో
త్కట విలసన్నవాబ్జసుముఖద్యుతి రత్నశలాక మోహనో
త్కటగరిమ న్విదూరమహిత స్థలిలియందుజనించుచాడ్పునన్

మ. పొలసెం గల్పకపుష్ప వర్షము జను ల్పొం దెన్సుఖామోదముల్
మలసె న్పావనగంధవాహము దిశ ల్పామెం బ్రసన్నప్రభల్
వలరెం దైవతతూర్యనాదములు నిర్వ్యాజపదీప్తార్చులన్
గలసెన్ శంకరపత్ని యుత్కలిత రేఖాపూర్వభావంబునన్.

క. ప్రతిపన్నజన్మవతి యా
సతి యాభిజనాఖ్య నెసఁగె సతికై యాపా
ర్వతి యనఁగ వెలసె లీలం
బ్రతివాసర వర్ధమాన భావాకృతియై

వ. ఇట్లనన్యసామాన్యాగణ్య లావణ్యవిశేషంబులు నెట్టన గను
పట్టం గ్రమక్రమంబునం బరిపోషణంబు గలిగి యుల్లసిల్లఁగ

క. ప్రజనిత సమ్మదుఁ డచల
ప్రజవల్లభుఁ డంత నాదరం బలరంగా
నిజనందన కొప్పఁగ జయ
విజయలు మునుగాఁగ సఖుల వెరవున నొసఁగెన్.

ఉ. ఆసఖు లెల్లఁ దన్ను ననయంబును నొక్కటఁ గొల్చుచుండఁ గ్రీ
డాసముపేతభంగుల కొడంబడియు న్మదితాత్మగల్గు ప్రా
గ్వాసన నెప్పుడుం శివునఖండదయావిభవుం దలంచున
భ్యాసము సేయఁ జొచ్చెఁదుహినాద్రితనూభవ భక్తిసంపదన్.

గీ. అబల యపుడును వలయుసయ్యాటలపుడు
బాటలప్పుడుఁ దగు జోలపాటలపుడు
మఱియుఁ దగువర్తనంబులు నెఱపునపుడు
మఱువ దయ్యె సదాశివస్మరణ మబల.

వ. ఆసమయంబున.

సీ. అనియతన్యాసంబు లగుమృదుపాదముల్
సతులయానంబుల జడత లెఱిఁగె
నకలితదోషంబు లగు ...
ల్వాలయుభావంబుల వలను లెఱిఁగె
నకృతసంస్కారంబు లగుభాషితంబులు
సరసవైభవముల గరిమ లెఱిఁగె
నచపలశ్రీకంబు లగులోచనంబులు
కుటిలవర్తనముల నటన లెఱిఁగె
నవిదితనియంత్రణము లగు నంగకములు
నవ్యలజ్జాసమాశ్లేషణంబు లెఱిఁగె
నద్భుతావహంబుగఁ దుహినాచలేశ్వ
రాత్మజకు బాల్య యౌవనవ్యతికరమున.

క. [illegible]ల విలుకాఁ డిచ్చో
కొంవ్విరులకుఁ దానమొదలి కోర్తల యనఁగా
జవ్వనముఁ బడసె నిండుగ
నవ్వనజాతాస్యమేన నట్లవిరళమై.

సీ. సత్ప్రవాళఖ్యాతిఁ జదురొందు నీరామ
పదతల పదనఖ పాణిగరిమ
వజ్రపుష్పఖ్యాతి వలనొందె నీ భామ
రదనమందస్మితప్రఘూణమహిమ
రాజబింబఖ్యాతిఁ బ్రకటొందె నీ లేమ
యవయవ కంఠాధరాస్యకలన
నీలకంజఖ్యాతి నెఱి నొందె నీ బోటి
యలకావళీకంధరాక్షినటన

ననుచు బహువిధముల నంద ఱాత్మలోన
మాపుగాఁ గను దనరు నాహూపు వొగడ
వఱలె నట్లును మధురయౌవనవతియగు
హైమవతిమైవిలాసంబు లగ్గలింప.

వ. ఆకమలముఖి నొక్కనాఁడు పితృసమీపంబునం జూచి కామచరుండగు నారదుం డచలాధిపతితోడం దావకనందన యిటమీఁద నీశ్వరునకు నేక వల్లభయును దదర్ధగాత్రసంగతయునుగాఁగలయది; యని పలికి యిష్టగమనంబునం జనిన, నతండు నివృత్తాన్యవరాభిలాషుం డగుచునుండుసమయంబున నక్కడ శివుండు దక్షురోషంబున వినిముక్త దేహవతి యగుట యదిగా నితరసతీపరిగ్రహణవిముఖుం డగుచు నొక్కనాఁడు మనంబునం దపశ్చరణ కుతూహలంబు చిగురొత్త.

శా. కైలాసంబున నుండఁ దాఁ బ్రమథలోకగ్రామణు ల్గొల్వఁ దచ్ఛైలాభుక్ వృషభేంద్రు నెక్కి నియతేచ్ఛన్వచ్చి పొందెన్సదా
ఫేలత్కిన్నరకామినీ నికర సంగీత ప్రబంధాంచిత
శ్రీలీలాపరిశోభమానమగు నా శీతాచలస్థానముక్.

చ. సకలతపఃఫలప్రభుఁడు సర్వసురేశ్వరుఁ డష్టమూర్తి త
ప్పక నిజమూర్తి భేదమగు పావకముం దగఁదెచ్చి ముందటం
బ్రకటముగాఁగ నిల్పి మదిఁబాయక యచ్చట నుండి యెద్దియో
యొకఫల మాత్మఁ గోరి తపమూని చరించెఁ దదేకనిష్ఠుఁడై.

వ. అంతఁ దత్క్రమం బంతయు నద్రిపతి యెఱింగి యేకత్వంబ మేనకతోడ మన పార్వతి యఖండితగుణప్రాయంబగు పెండ్లి ప్రాయంబున నున్నయది. తనయంత నీశ్వరుం డడుగక మనయంతన యిత్తమనుట తత్తరం; బిప్పు డవ్విభుండు నమీపంబున నున్నవాఁ డిప్పుడిక్కన్నియం దత్సన్నిధిం బరిచర్య నెట్టన ననుపుట యీప్సితసిద్ధి దొర

కొను నని విచారించి నిర్ణయించి యక్కడికి నిజనందనం దోడ్కొనుచు నేఁగు సమయంబున.

సీ. పదముల కెంపుపైఁ బరగి యుర్వర యెల్ల
సురగోపకశ్రీలఁ బరిఢవింప
కన్నులతళుకు పైఁ గదిరి పార్శ్వము లెల్ల
శంపావళి శ్రీల సంఘటింప
వేనలికప్పు పై విరిసి యంబర మెల్ల
నంబుధరశ్రీల నలవరింప
రవణంబుమించుపై నివిడి దిక్తటు లెల్ల
నమరధనుశ్శ్రీల నావహింప
వఱలు తన మనోహరమూర్తి వర్షలక్ష్మి
యనుచు వనమయూరములు నృత్యములు సలుప
సఖులు నలుదిక్కులను గొల్వ జనకుపిఱుఁద
నరిగె శంకరాశ్రమభూమి కద్రితనయ.

గీ. అంత నాకన్యకయుఁ దాను నచలవిభుఁడు
సముచితంబుగ శంభునిచరణములకు
నెరఁగి యర్ఘ్యపాద్యాదుల నెఱయఁ బూజ
లిచ్చి భక్తిఁ జేతులు మోడ్చి యిట్టు లనియె.

మ. హర సర్వజ్ఞ జగత్ప్రమోదకర చంద్రార్ధస్ఫురన్మూర్ధ నీ
చరణాబ్జంబులు గంటి మంటి నిదె యస్మద్భాగ్యమాకన్యయుఁ
బరిచర్యార్థ మనుగ్రహించి తగ నొప్ప న్మన్చి మావంశము
న్బరితానందముగా నొనర్పుము కృపాభంగీసమంగీకృతిన్.

క. అనుటయుఁ దన మానసమున
ననుకంప దలిర్ప భవుఁడు నాతని విజ్ఞా

పనమువ ధరించి పీడ్కొలి
పిన నరిగె న్గిరియు మిగులఁ బ్రీతాత్మంబై.

క. అది మొదలుగాఁగఁ బార్వతి
పదిలంబగు నిష్ఠతోడఁ బ్రతివాసరమున్
మదిఁ దత్పరముగ నిల్పుచుఁ
గుదియక యీశ్వరునిఁ గణఁకఁ గొలువఁ దొణంగెన్.

మ. అలరు ల్దెచ్చు లతానివాసము కరం బందంబుగా నల్కు ని
మ్ముల బ్రుగ్గు ల్రచియించుఁ భావన జలంబుల్వేడ్కఁ జేస్పుంగుశం
బులు చాల న్సమకట్టు నిట్లు సతతంబుం దత్త దర్హక్రియా
కలనానందితుఁ జేయుచుండె శివుఁ దత్కంజాస్య యవ్యగ్రయై.

వ. తదనంతరంబునఁ దారకుండను మహాసురుం డతిఘోర తపంబుకలిమి బ్రహ్మవలన వరంబు వడసి యుద్రేకంబున లోకంబున కుపద్రవంబు గావించుచుండఁ దద్బాధావిహ్వలాయమానమానసులగు శతమఖప్రముఖామరులు పద్మసంభవుం గాన నరిగి, తత్స న్నిధి వడసి, భక్తి సాష్టాంగంబుగాఁ బ్రణామంబులు సలిపి,కరంబులు మొగిచి, పెక్కు భంగులఁ బ్రస్తుతించి, యిట్లని విన్నవించిరి.

క. తారకుఁడు జగదుపప్లవ
కారకుఁడు భవద్వరాత్త గర్వక్రమసం
భారకుఁడు ధర్మగుణవి
స్తారకుఁ డలసితిమి దేవ! తద్ఘాతములన్.

ఉ. ఇంతట నైన వానిఁ బొలియింపఁ దలంపక యూరకున్నఁ గ
ల్పాంత విజృంభమాణ భయదానల భాతిఁ బరిజ్వలించి దు
ర్దాంతత నమ్మహాబలుఁడు తక్కక లోకసమూహ మెల్ల భ
స్మాంతము సేయుఁ గావున దయం బరికింపఁ దగుం బితామహా!

వ. అని విన్నవించినఁ గొంత విచారించి, వారలకు విరించి యిట్లనియె.

ఉ. ఏవర మీకయున్నఁ గడునేచిన వాని తపోగ్ని హెచ్చి లో
కావలిఁ గాల్చు నంచు వినుఁ డప్పటికిం దగుశాంతి గోరి మ
న్నావిధ మాచరించితిని నాక్రియఁ దక్కని యట్టి కూర్మిరులన్
వావిరిఁ జెందియు న్మజ్జ్రుధవంబుగ నుండవు భాగ్యసంపదల్.

వ. అట్లు గావునం దారకప్రతాపంబునకు శంకింప న్వలవదు. వానిం జంపించుటకు వీర్యంబు గల శూరుండు పార్వతియందు నిషిక్తం బగు పరమేశ్వరునివీర్యంబునం గలుగు కుమారుండు. తజ్జన్మంబు నకుం దగు యత్నంబు గావింపుఁ డని నిలింపుల వీడుకొలిపిన నాప్రజా పతికి పునఃప్రణామంబులు సలిపి, పురుహూతుం డమరగణసమేతుండ గుచు మరలి చనుచు ... తనూజ సంధాయకుం డసమసాయకుం డని తలంచి సత్వరంబుగ.

మ. తలఁచెం దైవతవల్లభుం డటుజగత్సంపోష సంపోషణా
కలనా కీర్తి తకీర్తిహారుని సురంగద్గంధపుష్పంధయా
వలిమౌర్వీరవగర్విత ప్రసవ భాస్వచ్చాపదుర్వారు ని
ర్మలిత శ్రీనయనాంతకాంత విశిఖాలంకారునిన్ మారునిన్.

చ. మసలక వచ్చె నక్షణమ మన్మథుఁడు న్సురనాథుఁ డంతఁ దెం
పెసఁగఁగ నున్న నాతని సమీపసువర్ణ విభాసిపీఠమం
దసదృశ మత్తషట్పద నిరంతర నిశ్చల పంకజావళీ
హాసనమనోజ్ఞలోచనచయంబులఁ దన్ముఖమొప్పఁజూచుచున్

వ. తదనంతరంబ సముచితార్చనాప్రముదితుం గావించినం బాకశాసనునకుఁ గుసుమశరాసనుం డిట్లనియె.

ఉ. నీపద మొక్కఁ డెవ్వఁడును నిష్ఠురఘోరతంబుచేత సు
పాపముగాఁగ నాత్మఁ దలపండుగదా! కుటిలాగ్రముం డసూ
యాపరతంత్రుఁడై యురక యాతని నిప్పడ చేయువాఁడ వ
చ్చాప ఝుణంఝుణక్వణన సంచకితాత్ముని గాఁ బురందరా!

మ. అదిగా కెవ్వఁడు నీకసమ్మతముగా నాత్మంబున న్జన్మదుః
ఖద సంసారవిమోక్ష మార్గమునకుం గామించినాఁ డాతనిం
గుదియింతుం జిరకాల ముజ్జ్వల మదాకుంచత్సమాంచద్భ్రమ
త్సుదతీ దీర్ఘకటాక్షపాశముల బద్ధున్జేసి వజ్రాయుధా!

మ. పలుకు ల్మాటికి నేఁటి కింకఁ బచరింపం దళ్కుపూముల్కులం
బొలుపొందంగఁ బినాకధన్వుఁడగు నాఫాలాక్షునై నన్ను మా
కులుఁగావించి కలంతుఁ దాల్మి, ననిలోఁ గోపించియే నిల్చినన్
విలుకాండ్రెవ్వరు నాకె దుర్పఁ గల రీవిశ్వంబున న్వాసవా!

వ. అని యాత్మసంభవుం డవష్టంభ విజృంభణంబునం బల్కు పల్కులు నిజప్రార్థనార్థ సంగతంబులగుటకు నమందానందభరసుందరుండగుచుఁ బురందరుం డతని కిట్లనియె.

మ. తగు నేమన్నను నీకు నిప్పటి భవద్వ్యాహారము ల్బీరముల్
ప్రగుణార్థత్వగభీరము ల్సురహిత ప్రారంభ సంభారముల్
జగదానందనసారముల్ చటుల భాస్వద్గర్వ దుర్వారముల్
విగతాసత్యవిచారముల్ శుభకళా విష్కారము ల్మన్మథా!

శా. శ్రీనాథుండు భవద్గురుండు జగమార్తిం బ్రోచుచు న్మాపుగా
దా నానాగతుల న్భరించు నెపుడుం దద్భంగి యూహించినన్
మీనాంకా శరణాగతావనవిధుల్ మీ కెందుఁ గర్తవ్యముల్
జానారంగొనియాడ మాతరమె యుష్మచ్చిత్రచారిత్రముల్.

ఆ. కాన వినుము నీదుఘన కీర్తి వర్ణన
మొంద గురుతర ప్రయోజనంబు

సంఘటింపు మీవు సకలనిర్జరగణ
ప్రమదకరము గాఁగఁ బంచబాణ !

వ. అది యెట్టి దనినం, గ్రూరతారకవధాహార్యవీర్యంబు గలుగు శూరుండు పార్వతీనిషిక్త పరమేశ్వర వీర్యంబునం గలుగు కుమారుం డని విరించి యవధరించినాఁడు. గిరిశుండు నిప్పుడు హిమగిరి ప్రస్తరంబునఁ దపంబున నున్నవాఁడు. గిరిజయుఁ దత్సమీపంబున జనకనియోగంబునం బరిచర్యాకార్యప్రసన్నత నున్నయది. వారల నిద్దఱం గూర్పుము. నీదు నేర్పున నిప్పని దీర్పుము; మిది యనన్య సాధారణం బగుటకు నీ విఖ్యాతి కారణం బగు నని మఱియును.

చ. సుర లిది వేఁడువారు పని చూడఁ ద్రిలోకహితంబు చేతయుం
బరులకుఁ గాదు; పుష్పనవబాణ సుచేతన సాధ్య మింక నీ
శ్వరునకు మీఁద విక్రమము సమ్మతి మెప్పుడు గాంచి రిట్టి పెం
పరయఁగ నీవకాక సుఖదాతవె భవ ! యోమనోభవా !

ఆ. అనిన నంగజాతుఁ డౌఁగా కయని యియ్య
కొనిన నెలమిఁబొదలి గోత్రవిభుఁడు
ప్రస్తుతించి యతనిఁ బరిరంభ మొనరించి
విజయమందు మనుచు వీడు కొలిపె.

వ. తదనంతరంబ మదనుం డక్కడఁ గదలి యరిగి, నిజసఖుం డగు వసంతునిం బిలిచి, నిర్జరగణంబునకు నీశ్వరుమీఁద దండయాత్ర సేయవలయు. రథప్రముఖ సాధనంబులు బిట్టు సమకట్టు మనినఁ బ్రసాదంబని.

సీ. కమలకర్ణికలు చక్రములుగా సమకట్టి
వెరవున బిసకాండ మిరుసుఁ బెట్టి
చిన్నిమొల్లలు కొన్ని చీలలుగాఁ గూర్చి
నునులేఁత చెఱుకులు నొగలుఁ జే
కమ్మగేదఁగిమొగ్గ కాడిగాఁ గదియించి

పొగడ దండలు మోకులుగ రచించి
రాజకీరములు వార్వములుగా డీకొల్పి
మెలదమ్మిమా ల్వాల్పులుగను నిలిపి
క్రమముగు తీఁగ మునుకోలగా నమర్చి
కడఁకఁ బుండరీకము తెల్లగొడుగు గానర్చి
మఱియుఁ దగువాని వలయు నిర్మాణవిధులు
సలిపి రథము గావించె వసంతుఁ డిట్లు

క. అకలంకత నతఁ డటఁ ద
త్ప్రకటరథముపైఁ దమాలప ల్లవరచనా
వికచచ్ఛాయాధ్వజమగు
మకరధ్వజ మెత్తె గగనమండలిఁ గ్రాలన్.

వ. ఇట్లు మోహనాయితంబగు తన తేరాయితం బగుటయుఁ
జూచి యేచినప్రమోదంబున.

సీ. కర్పూరహిమకరకలితమేళనమున
జాదుచందనకవచంబు దొడిగి
శతపత్రదళచిత్రవితతగుంభనమున
మెఱయు సంపెంగబొమ్మికము వెట్టి
పూరితవిషమాస్త్రభూరిసంపదల నిం
పలరుపవాళతూణములు బిగిచి
రంజితబిసతంతుసింజినీతతుల భా
సిల్లు మవ్వపుఁదియ్యవిల్లు దాల్చి
మఱియు బహువిధముల మధురపరికారశృం
గారగౌరవములు గరము చెలువు
గలిగి రతియుఁ దానుఁ గమనీయసరణి న
య్యసమబాణుఁ డెలమి నరద మెక్కె.

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

అధ్యక్షులు

ఆంధ్రాస్థానకవి, కవిసార్వభౌమ. మహామహోపాధ్యాయ

శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

ప్రధాన కార్యదర్శి, కోశాధికారి

శ్రీ దంటు భాస్కరరావు.

సహాయ కార్యదర్శి

శ్రీ మధ్వారి సూర్యనారాయణశాస్త్రి.

కార్యనిర్వాహక సభ్యులు

1. శ్రీ కోకా శివనాథశాస్త్రి.
2. శ్రీ రా. సా. మాదిరెడ్డి సీతారామయ్య. బి. ఏ., బి. యల్.,
3. శ్రీ వేదుల రామచంద్రకీర్తి, ఎం. ఏ., (ఆనర్సు) బి. ఇడి.,
4. శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి (వ్యాకరణవిద్యా,భాషా,ప్రవీణ)
5. శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి (కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర)
6. శ్రీ యండమూరి వేంకటరమణ (మధురకవితావిశారద)
7. శ్రీ బండారు తమ్మయ్య (ఐతిహాసికసమ్రాట్)
8. శ్రీ జయంతి బుచ్చిరామశర్మ.
9. డాక్టరు శ్రీ ఇవటూరి జోగారావు, (యం. బి. బి. యస్.,)
10. శ్రీ చిరువోలు కోటీశ్వరరావు.

పత్రికా సంపాదకుఁడు :

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

సంపాదక సహాయులు :

శ్రీ బండారు తమ్మయ్య

---

# శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు

| | | |
|---|---|---|
| 1వ సంపుటము | ... | రు 6—0—0 |
| 2వ సంపుటము | ... | 6—0—0 |
| 3వ సంపుటము | ... | 6—0—0 |
| 4వ సంపుటము | ... | 6—0—0 |
| 5వ సంపుటము | ... | 10—0—0 |
| 6వ సంపుటము | ... | 10—0—0 |
| 7వ సంపుటము | ... | ముద్రణములో నున్నది. |

## కవిజనాశ్రయము

వేములవాడ భీమకవి విరచితము.

పెక్కు పాఠభేదములతోఁ గూడిన వెనుకటివిషయ మంతయుఁ గలిగి తిరిగి తృతీయముద్రణపీఠికతో ముద్రితమైనది. వెల రు 1—50.

బౌద్ధాచార్య నాగార్జున ప్రణీతము. కొల్లూరు సోమశేఖర శాస్త్రి విరచిత సుబోధినీవ్యాఖ్యాసహితము. మూల్యము. రు 2—50.

ఆంధ్రసాహిత్యపరిషత్తు,
కాకినాడ.

Published by Andhra Sahitya Parishat, Kakinada.
Edited by C. PAPAIAH SASTRY
Printed by J. Bhaskara Rao at Republic Press Kakinada.

శ్రీ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక

**Journal of the Telugu Academy**

**KAKINADA.**



దేశభాషలందుఁ దెలుఁగులెస్స.

సంపుటము ౪౮
Vol 48

సంచిక ౪
Part 4

# ఆంధ్రసాహిత్య పరిషత్తు

స్థాపకులు

శ్రీ జయంతి రామయ్యగారు

ప్రతిష్ఠాపకులు

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

ఉద్ధారకులు

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు,
(జమీందారు, ఉయ్యూరు యెస్టేటు,)

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక

**Journal of the Telugu Academy**

**KAKINADA.**



దేశభాషలందుఁ దెలుఁగు లెస్స.


| సంపుటము ౪౮ | సంవత్సరము చందా | సంచిక ౪ |
| --- | --- | --- |
| Vol 48 | రు 3—0—0 | Part 4 |

# శ్రీ ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక

**Journal of the Telugu Academy Kakinada**

సంపుటము ౨౮ ఆశ్వయుజ—కార్తికములు


## విషయసూచిక

# ప్రాచీనాంధ్ర చారిత్రిక భూగోళము — నాడులు

కుందూరి ఈశ్వరదత్తు.

(గతసంచికల తరువాయి)

## చెంగర — చాగల్నాడు

ముమ్మడినాయకుని శాసనములలోఁ బేర్కొనఁబడిన ఉభయ గోదావరీ మధ్య ప్రదేశమున నున్న పానార, కోన, చెంగళి, కుళి వాటక ప్రాంత భాగములఁ గూర్చి వ్రాయునపుడు, పానార, కుర వాటక ప్రాంతభాగములను గూర్చి గతసంచికలలో వ్రాసియున్నాను. చెంగళినాఁడు, లేక చాగల్నాఁడు తూర్పుగోదావరీ మండలములోని రాజమహేంద్రవరము పెద్దాపురము తాలూకాలకు సరివచ్చు భూభాగము. గోదావరీనది కుత్తర తటమున నున్న ప్రదేశము. ఈ మండలములో నీ భాగమును చాగల్నాడని ప్రజలు వ్యవహరింతురు.

ఈ చెంగళి ముమ్మడినాయకుని శ్రీరంగము, కోరుకొండ శాసనములలో నుదాహృతమైనటులు నిదివఱకే సూచించియున్నాము. సింగయ నాయకుని అక్కలపూండిశాసనములో "ప్రథితోభయ గోదావర మధ్య ప్రాంతేషు మహిత సౌభాగ్యాన్। పాలయతి ముమ్మడీంద్ర శ్చెంగళి కుళివాట కోనవానా ? రాన్॥ అని మరల వ్రాయఁబడినది.[1]

దక్షిణహిందూ దేశశాసనములందలి చాళుక్య భీమవరశాసనములలో నొకదానియందు "చెంగనాంటి స్థలములో సమత్తిపూండి ఊాల గని చాళుక్య భీంవ్వరపు భీమేశ్వర దేవరలకు నగరుగట్టను దారవోసి యి స్తిమి" యని చెంగనాఁ డుదాహరింపఁబడినది. ఈ శాసనములో దాతపేరు గాని శక సంవత్సరముగాని లేదు. ఈ సమత్తిపూఁడి గ్రామము పెద్దాపురము తాలూకాలోని మత్తిపూడి యను గ్రామమే.[2]

---

1. ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము. 13 శాసనము సంఖ్య 24. సింగయ నాయకుని అక్కలపూండి శాసనము (శా. శ 1290)

2. దక్షిణ హిందూదేశ శాసన సంపుటము. 5. సంఖ్య. 43.

## కోన

పూర్వోదాహృతమైన 'కోన' శాసనములలో కోనరాష్ట్రమనియు, కోనస్థలమనియు, కోనమండలమనియు, కోనదేశమనియు వ్యవహరింపఁబడినది. అన వేమారెడ్డి నడుపూరు శాసనములో[3] "శాకాబ్దే రసరత్న భానుగణితే (శా.శ 1296) గ్రస్తే విధౌ రాహుణా, కార్తిక్యాం విజయేశ్వరస్య పురతః శ్రీగౌతమీరోధసి। విప్రేభ్యః పరమన్న వేమనృపతిః శ్రీ వేమసాన్యాః స్వసుః పుణ్యార్థం నడుపూరు సంజ్ఞక మదాద్గ్రామం సకోణస్థలే" అనియు, కాటయవేముని తొత్తరమూడి శాసనములో (శా.శ 1333) "కోనదేశే(గ్రహారో(యం భాతి మల్లవరాభిదః। తీరేచ వృద్ధగౌతమ్యాః పుణ్యో ముక్తీశ్వరాంతికే॥[4] అనియు, ద్రాక్షారామ శాసనములలో నొకదానియందీప్రాంతము కోనరాష్ట్రముగను (శా.శ 1153)

"శ్రీ కొణ్డ దేసటి రభూ ద్విపులేషు తేషు శ్రీ దుర్జయాన్వయల
సద్గృహ రత్న దీపః।
కణ్డ్రవాది విషయచ్ఛ స కొణ్డః కోనరాష్ట్ర మలభ ద్దలితారిః।
రాజలాంఛన సమున్నత ముద్య(ద్రాజభీమధరణీశ్వర రత్నాత్"
అని పేర్కొనఁబడినది.[5]

శాసనములం దుదాహృతములైన నడుపూరు, మల్లవరము గ్రామములు ఇప్పటి అమలాపురము తాలూకాలో నున్నవి. గోదావరి మండలములోని, అమలాపురము, కొత్తపేట తాలూకాలకు కోన సీమ యని పేరు. మల్లిదేవుని పిఠాపురము శాసనములో కోనమండలా

3 నడుపూరు శాసనము. Epigraphia Indica Vol III P.286.

4 తొత్తరమూడి శాసనము. Epigraphia Indica Vol IV. P. 324.

5 ద్రాక్షారామశాసనము. దక్షిణహిందూదేశ శాసన సంపుటము. 4-1153.

ధీశుఁడైన రాజపతేఁడు లక్ష్మీ, తొండాంబికలను భార్యలను పెండ్లాడి నట్లు వర్ణింపఁబడెను.

"శ్రీమాన్ రాజపతేండు క్ష్మానాథః కోనమండలాధీశః
ఉపయేమే యః కులజే లక్ష్మీ తొండాంబికే దేవ్యౌ"

సింధుయుగ్మాంతరదేశము—రెండేఱుల నడిమివిషయము

వెలనాటి పృథ్వీశ్వరరాజు పిఠాపురశాసనములో, వీరచోడునకు మంత్రియు సేనాపతియునైన రెండవ విదురవర్మ, పాండ్య భూపతిని గెల్చి, తన ప్రభువగు వీరచోడునిచే "సింధుయుగ్మాంతర దేశ" పాలనమును వహించినట్లు వర్ణింపఁబడినది. 'ఈ సింధుయుగ్మాంతర దేశము 'అశేష సస్య ప్రచురఫలయుత మని చెప్పఁబడినది. రాజరాజు నందంపూఁడి శాసనములో[7] "పరమమహేశ్వరః పరమ బ్రహ్మణ్యః శ్రీరాజ రాజ దేవో రెండేఱులనడిమి విషయనివాసినో రాష్ట్రకూట ప్రముఖాన్ కుటుంబినః సమాహూయ మంత్రిపురోహిత యువరాజ దౌవారిక ప్రధానసమక్షం మిత్థ మాజ్ఞాపయతి యథా॥" అని రాజరాజు రెండేఱుల నడిమివిషయనివాసులగు ప్రముఖకుటుంబుల నాహ్వానించి నట్లు వర్ణింపఁబడినది. దానమిచ్చిన గ్రామము నందంపూఁడి. దాని సరిహద్దు గ్రామములు పెద్దపూఁడి, ముంజరము, అనునవి, అమలాపురము తాలూకాలో నున్నవి. రెండేఱుల నడిమివిషయ మనఁగా తూర్పుగోదావరి జిల్లాలో గౌతమీ వసిష్ఠానదుల మధ్య నున్న ఇప్పటి అమలాపురము రాజోలు తాలూకాలకుఁ జెందిన ప్రదేశము. ఈ రెండేఱుల నడిమి విషయము సంస్కృతమున తెలుపఁబడిన 'సింధుయుగ్మాంతర దేశము'నకు

---

6 పృథ్వీశ్వరుని పిఠాపురము శాసనము. ఎపిగ్రాఫియా ఇండికా సం. 4. పుట 36.
7 రాజరాజు నందంపూఁడి శాసనము ఎపిగ్రాఫియా ఇండికా సం. 4 పుటలు 303. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక స. 1. సంచిక 1.

సరియైన తెలుగు సేత. నాఁటికిని నేఁటికిని "ఆశేష సస్య ప్రచుర ఫల యుత"మగు గోదావరీమండలాంతర్భాగము;ఇదియే కోనసీమ.

## కడలునాడు—కడలిసీమ

తూర్పుగోదావరీ మండలాంతర్భాగమున శాసనబద్ధమును, సారస్వత ప్రసిద్ధమును నగు నాఁడులలో కడలు నాఁడొకటి. ఈకడలు నాఁడు ద్రాక్షారామ శాసనములలో పేర్కొనఁబడినది. కులోత్తుంగ చోడదేవుని శాసనములలో నొకదానియందు "చోడమండలమున తిరువింజులూరు నాంటి గంజట్టు పంచనది ముడిగొండఁడైన వత్సరా యఁడు వ్యతియిపాతనిమిత్తమునం గడలునాంటి రట్టడికము పదియేడు రాజరాజ మాడలు వెట్టి వలయుచుట్టు అంతయుం జతు స్సీమములో సల్వి సందలతోం గూడ విల్చికొని శ్రీ భీమేశ్వర దేవరకు ... నిత్యపడి వోయంగల పాలకుంచ్చములు పదియేడింటికి విడ్చిన పసులు ..." అనియు, మఱియొకదానియందు "శ్రీ భీమేశ్వర దేవరకు గడలునాంటిలోని మంజేటి గంగిరెడ్డి తన వృత్తియైన అలము సలివి సంపదలతో శ్రీ భీమేశ్వర దేవరకు ధారాపూర్వకము సేసి" అనియు కడలు నాడు పేర్కొనఁబడినది. ఆశాసనములలో నుదాహరింపఁబడిన 'సిల', 'మంజేరు' గ్రామములు కాకినాడ తాలూకాలోని శీల, మంజేరు గ్రామములే. ఈకడలు నాడు కాకినాడ తాలూకా సముద్రతీర ప్రాంతము. [8]

శ్రీనాథకవి భీమేశ్వరపురాణము పంచమాశ్వాసములో భీమేశ్వరస్వామి పాలించిన భూ భాగములో కడలిసీమ కలిసియున్నట్లు వర్ణించియున్నాఁడు.

---

8 దక్షిణ హిందూదేశ శాసన సంపుటము 4. శాసనముల సంఖ్య 1291;1361. భీమేశ్వర పురాణము. పంచమాశ్వాసము పద్యము 89.

గీ॥ ఏకభోగంబుగాఁగ నేలేఱు గరుసు
గడలిసీమయు గౌతమీగంగ మేర
కప్పురపుఁ గ్రోవి కాశ్మీరఖండ మవధి
యేలె విశ్వకుటుంబి భీమేశ్వరుండు

కడలునాడే కడలిసీమ

## వీసరనాడు

ఈ వీసరనాడు గోదావరీమండలములోని మన్య ప్రాంతము. ఇది కడప మండలములోని తాళ్ళప్రొద్దుటూరి శాసనమునందును, రాజమహేంద్రవరము అన్న దేవుని మ్యూజియము శాసనమదుంను బేర్కొనఁబడినది. తాళ్ళప్రొద్దుటూరి శాసనములో ఏఱువ భీముఁడు వీసరనాడు, చక్రగొట్టము, మన్యము, వడ్లక్కేలి ? వేంగి, కళింగాది మండలములుజయించినట్లు చెప్పఁబడినది రాజమహేంద్రవరము శాసనములో అన్నదేవుఁడు గంగా (గోదావరి) తటమునందు పిన్నసాని సంగమమందు గల వీసరనాటిలోని ఉత్తమ గండ చోడాన్నవర మనెడి గ్రామమును బ్రాహ్మణులకిచ్చెనని గలదు.

ఉ॥ పన్నితురంగమంబునకుం బక్కెర వెట్టిన వార్త(హేరిచే
విన్న భయంబునం గలంగె వీసరనాండునుం జక్రగొట్టమును
మన్నియు (వడ్లక్కేలియు) ను (ల...ద్యన) వేంగి కళింగలాదిగా
నిన్నియు నొక్కనాండ ... నేఱువ భీమనృపాలు ధాడికిని.

శాసనపద్యమంజరి

"యోయం లసద్వీసఱునాంటి సమాఖ్య దేశే
చోడాన్న దేవవర ముత్తమగండపూర్వం।
గంగాతటే భువన విశ్రుత పిన్నసాని
సంగెన్న దేవనృపతిర్ద్విజసాదకార్షీత్॥
(రాజమహేంద్రవరము మ్యూజియము శాసనము)

మొదట నుదాహరించిన పద్యమే 'చాటుపద్యమణి మంజరి'లో నొక విధముగను, శ్రీ వెంకటరమణయ్య శ్రీ వెంకటరామయ్యగారలు, భారతిలో ప్రకటించిన తాళ్లపొద్దుటూరి శాసనములో మఱియొక విధముగను నున్నది. (భారతి—ఈశ్వర సం॥మాఘమాసము)

ఉ॥ పన్ని తురంగమంబునకు బక్కెర వెట్టిన వార్తచారుచే
విన్న భయంబునం గలిగి వేసటనాటనె చక్రగోట్టముల్
మన్నియ పట్టణంబులును మక్కెన వేంగి కళింగలాదిగా
నిన్నియు నొక్క పెట్టెగసె నేఱువభీమ నృపాలుధాటికిఁ

(చాటపద్యమణిమంజరి రెండవభాగము పుట 59)

ఉ॥ పన్ని తురంగమంబునకు బక్కెర వెట్టిన వార్తహేరిచే
విన్నభయంబునం గలగె వీసఱనాండును జక్రగొట్టముం
మన్నియ వడ్డె తెక్కలియ మంథ్యన వేంగి గళింగలాదిగా
నిన్నియు నొక్క నాండవిసె నేఱువ భీమునృపాలు ధాడికిన్.

(భారతిలోని పద్యము)

ఈవీసరనాడు నేఁటి తూర్పుగోదావరి మండలములోని చోడవరము ఎల్లవరము తాలూకా ప్రాంతముగా నుండనోపును.

జంతఱునాడు—జంతుర్నాడు

ఈనాడు విశాఖపట్టణ మండలములోని ప్రసిద్ధమైన నాడులలో నొకటి. సింహాచలములోని శాసనములలో నిది పెక్కంటియందు పేర్కొనఁబడినది. శా.శ. 1109 నాటి యొక శాసనములోఁ జంతుర్నాటి డెబ్బదింటిలో వీరనారాయణ (పురమును) ఆచంద్రార్కస్థాయిగా సుక్షేత్రమగుచున్న భూమిని శ్రీ దంతపురేశుఁడు సింహాచలస్వామికి సమర్పించినట్లు గలదు. జంతఱునాటిని పేర్కొన్న మొదటి ప్రాచీన శాసన మిది యని తోఁచుచున్నది. ఈసీమలోని గ్రామములనుదాహరించిన కొన్ని శాసనములఁ జూపుచున్నాము.

(1) జంతర్నాటి సీమలోను ఉత్తరాపల్లి గ్రామము.

(2) జంతర్నాటి జాంకేటి గుడివాడ.

(3) జంతర్నాటి ప్రతాపచింగ రాజులు తమకు అభీష్టార్థ సిద్ధిగాను సమర్పించిన కొలుపులులకు మరపుకోటు గంగనారాయణ చెఱువు వెనుకను క్షేత్రము.

(4) జంతఱునాటి మారందపల్లి జలక్షేత్రము. శాసనములలో పేర్కొనఁబడిన గ్రామములు విశాఖపట్టణమండలములో శృంగవరపుకోట తాలూకాలో గలవు.

| | |
|---|---|
| (1) వీరనారాయణ | వీరనారాయణం |
| (2) ఉత్తరాపల్లి | వుత్తరావిల్లి |
| (3) జాంకేటి గుడివాడ | గుడివాడ |
| (4) లకుమరపుకోట | లక్కవరపుకోట |
| (5) మారందపల్లి | మార్లాపల్లె |

'జంతుర్నాటి డెబ్బది' యని పేర్కొనఁబడుటచేత డెబ్బది గ్రామములు గలవాఁడని చెప్పవచ్చును. శృంగవరపుకోట తాలూకా ప్రాంతమె ప్రాయికముగా జంతుర్నాడు కావచ్చును.

శ్రీనాధుడు కాశీఖండములో అల్లాడ వేమారెడ్డి విజయముల నిట్లు వర్ణించియున్నాడు.

సీ॥ సప్తమాడియరాయ చంద్రబింబాననా
    చికురవల్లరులపైఁ జిన్నిపువ్వు
  ఝూడె జంతుర్నాటి జననాథ శుద్ధాంత
    కుచకుంభముల మీఁది కుంకుమంబు

---

9 దక్షిణ హిందూదేశ శాసన సంపుటము 6. శాసన సంఖ్యలు. 1189; 698, 711; 925; 745.

బారహదొంతి భూపాల లీలావతీ
గండస్థలంబులఁ గలికినవ్వు
కలువపల్లొడ్డాది కటకాధిపతి వధూ
సీమంత వీథులఁ జేరుచుక్క

గీ॥ ....................................
....................................
....................................
....................................

ఒడ్డవాది ఒడ్డాది రాజ్యము

శాసనములందును సారస్వతమునందును బ్రసిద్ధిగాంచిన ఒడ్డవాది లేక ఒడ్డాది రాజ్యమొకటి. ఇదియు విశాఖపట్టణము మండలములోని యంతర్భాగమే. సింహాచలము శాసనములలో ఒడ్డాది మత్స్యవంశరాజన్యుల శాసనములలో నిది ఒడ్డవాది, ఒడ్డాది రాజ్యమని పేర్కొనఁబడినది.

"శ్రీశకవర్షంబులు 1297 గు నేంటివైశాఖ విమల తృతీయా బుధవారమునాండు అనవేమయరెడ్డి ప్రిధాని నారాయణదాసుల కొడుకు చెన్నమనారాయండు తనకు ఒడ్డాది అర్జునదేవ మహారాజుచే బడసిన ఊరు గొట్టివాడ..."(శాసన సంఖ్య 785)

"శ్రీ శకవర్షంబులు 1295 గు నేంటి శ్రావణ శుక్ల పౌర్ణమియు నాదివారమునాండు ఒడ్డువాది అర్జున దేవరాజుల కొడుకు జయంతరాజు తనకు నాయురారోగ్యైశ్వర్యసంతానాభివృద్ధిగా శ్రీ నరసింహానాథునికి సమర్పించిన ... ... గడిచింగావరము గొట్లముగా రెండూడ్లు ... ... " (శాసనసంఖ్య. 981) పై నుదాహరింపఁబడిన గొట్టివాడ, గడిచింగావరము, గొట్లము గ్రామములు వీరవిల్లి (చోడ

వరము) తాలూకాలోని గోటివాడ, గొట్లాము, శింగవర మను గ్రామములె. ఒడ్డాదియు నాతాలూకాలోనిదే. ఈ ఒడ్డాదిరాజ్య మిప్పటి చోడవరము తాలూకా ప్రాంతమని చెప్పవచ్చును.

ఈ ఒడ్డాది, లేక వడ్డాది కళింగాంధ్ర దేశమునందలి సామంత మండలములలో నొకటి. రెడ్డి, కాకతీయ, విజయనగరరాజుల చరిత్రలో ప్రసిద్ధిగాంచినది. శ్రీనాథుని కృతులగు భీమేశ్వరపురాణములో, కాశీఖండమునందును పేర్కొనఁబడినది. పెద్దన మనుచరిత్రలో కృష్ణదేవరాయల దిగ్విజయయాత్రాసందర్భమున రాయలు వడ్డాదిని మసి యొనర్చె నని వర్ణించియున్నాఁడు. ఆ పద్యముల నన్నిటిని వ్రాయుట చర్వితచర్వణమగు నని పాఠకులకు నివేదించుచున్నాను.

### వరాహ వర్తనీ విషయము

ఈ వరాహవర్తనీ విషయ మిప్పటి యాంధ్రప్రదేశములోని శ్రీకాకుళము జిల్లాలోని శ్రీకాకుళ, టెక్కలి తాలూకాప్రాంతము. ప్రాచీన శాసనములలో దీనికి వరాహవంతని యనియు,వరాహవర్తని యనియు, కోలువర్తని యనియు, క్రోష్టుకవర్తని యనియుఁ బేర్లు. శ్రీ కూర్మము శాసనములలో నొకదానియందు "కలుంగ్గ మండలాంతర్గతమైన ... వరాహవంత్తనియ సింహపురమున ఆదిత్యనాయకుల్లో పైన నాయకులును" అని వరాహవంతనిలోని సింహపురము గ్రామము పేర్కొనఁబడినది. ఈ సింహపురము శ్రీకాకుళమునకు సమీపమున నున్న సింగుపురగ్రామము[10]. మూఁడవ వజ్రహస్తుని గంజాము శాసనములో "వరాహ వర్తన్యామ్ నవగ్రామ శ్చతుస్సీమా వచ్ఛిన్నస్సజలస్థలస్సర్వ పీడా వివర్జిత మాచంద్రార్క క్షితి......" అని నవగ్రామము వరాహవర్తనిలోని దని తెలుపఁబడినది. ఈ నవగ్రామము టెక్కలి తాలూకాలోని నౌగాము గ్రామము. ఆతనిదేయగు

10 దక్షిణ హిందూదేశ శాసన సంపుటము 5 సంఖ్య 1190. (శా.శ. 1152)

మద్రాసు మ్యూజియము శాసనములో "వరాహ వర్తన్యాం తామర చెరుగ్రామోనామ చిఖలీ వాటికేన సమ మేకీకృత్య" యని తామర చెఱువు గ్రామము పేర్కొనఁబడినది. ఈగ్రామము ఇప్పటి శ్రీకాకుళము తాలూకాలోని తామరపల్లె యనుగ్రామమె. మూఁడవ వజ్రహస్తుని బొడ్డపాడు శాసనములో "కోలువర్తని విషయే అవరెంగాఖ్య గ్రామః।" అని కోలువర్తని విషయములో అవరంగ గ్రామము గలదని వ్రాయఁబడినది. అతనిదే యగు చిక్కాలవలస శాసనములో "కోలువర్తని విషయే కోకుడ్డ మాఖ్య గ్రామః।" అని యావిషయాంతర్గతమైన కోకుడ్డ గ్రామములో చెప్పఁబడినది. దేవేంద్రవర్మ చీడివలస శాసనములో "కోలు వర్తన్యాం కన్దలివాడ గ్రామనివాసినః కుటుంబినః।" అని కందలివాడ గ్రామము కోలువర్తని విషయములోనిదే యని వివరింపఁబడినది. అనంతవర్మ చోడగంగ దేవుని కొర్ని శాసనములో "శ్రీ చోడగంగదేవః వరాహవర్తనివిషయే వాసినో రాష్ట్రకూట ప్రముఖాన్ ......భవిద్విషయే ఖోన్న గ్రామః ముణ్డపఱునామ గ్రామం గ్రాసీకృత్వా...తత్రగార గ్రామగృహీత ముణ్డపఱుగ్రామస్య ప్రతిక్షేత్రత్వేన తూలువు గ్రామా దాహృత్యాష్టోత్తరాశీతి పరిమితం క్షేత్రం తేభ్యః ఖోన్న గ్రామనివాసి బ్రాహ్మణేభ్యః...ధారాపూర్వక మస్మాభిః దత్తమితి పూర్వతః ఖోన్న ఓంబరవెల్లి తోనేంగి గ్రామాణాం త్రికూటే తోనేంగి గ్రామవక్రగర్తా.. తతః ఖోన్న తోనేంగి ఖోల్లిర గ్రామాణాం త్రికూటే వల్మీకసహిత మరిచవృక్షః" అని ఖోన్న, గార, తూలువు, ఓంబరవెల్లి ఖొల్లిర గ్రామములు వరాహ వర్తనిలోనివని విశదీకరింపఁబడినవి. పైనఁ జెప్పఁబడిన గ్రామములు నేఁటి యీనామములతో వ్యవహరింపఁబడుచున్నవి.

| | | |
|---|---|---|
| అవరంగ | అవలింగి | పర్లాకిమిడి తాలూకా |
| కోకుడ్డము | కుద్దాము | శ్రీకాకుళము తాలూకా |

| | | |
|---|---|---|
| ఖోన్న | కొర్ని | .. |
| ఓంబరవెల్లి | వమరవెల్లి | |
| గార | గార | |
| తోసంగి | తోసంగి | |
| | కొర్లాము | |
| తూలువు | తూలువు | ... |

ముఖలింగములోని శాసనములలో నొకదానియందు "ఈ అఖండ దీపమునకు వరాహవర్తని విషయములోని తులగామ బెట్టిన భూమిపుట్లు" అని యావిషయములోనిదే యగు తులగామ పేర్కొనఁబడినది. ఈతులగామ నేఁటి టెక్కలి తాలూకాలోని తులగామ గ్రామము. 11 ఆవిధముగనే ఇంద్రవర్మ అచ్యుతాపుర శాసనములో "శ్రీమహారాజేంద్ర వర్మావరాహవర్తన్యాం సిద్ధార్థక గ్రామేసర్వసమవేతాన్కుటుంబినః సమాజ్ఞాపయతి" అని యావిషయములోనిదే యగు సిద్ధార్థక గ్రామము సిద్ధాంత మను పేరుతో శ్రీకాకుళము తాలూకాలోఁ గలదు.

హస్తివర్మ ఉర్లాము శాసనములో క్రోష్టుకవర్తని తెలుపబడినది.

"శ్రీ మహారాజో హస్తివర్మా క్రోష్టుకవర్తన్యాం హన్ద్రోలక గ్రామే సర్వసమవేతాన్కుటుంబినః సమాజ్ఞపయతి...మాతాపిత్రో రాత్మనశ్చ పుణ్యాభివృద్ధయే ఉరామల్లనివాసినే వత్ససగోత్రాయ... జయశర్మణే ఉదకపూర్వకం సంప్రత్తాతద్విదిత్వా స్వభూమి మమపాలయతాం......" హస్తివర్మ మహారాజు తనతల్లితండ్రులయొక్క పుణ్యాభివృద్ధికై వత్సగోత్రుఁడైన జయశర్మయను బ్రాహ్మణునకు నగ్రహార ముదకధారా పూర్వకముగ దానమీయఁబడినది. ఈ ఉరామల్లగ్రామము శ్రీకాకుళము తాలూకాలోని నేటి ఉర్లాము గ్రామమే.

---

11 దక్షిణ హిందూదేశ శాసన సంపుటము 5. సంఖ్య 1064.

హస్తివర్మ నర్సింగిపల్లి తామ్రశాసనములో "శ్రీ మహారాజో హస్తివర్మా వరాహవర్తనీ విషయే రోహణకాయాం సర్వసమవేతా న్కుటుంబినస్సమాజ్ఞాపయతి..." యని వరాహవర్తనిలో రోహణికి గ్రామము గలదని తెలుపఁబడినది. ఈగ్రామము సింగుపురమునకు సమీపమునగు రోణంకి యను గ్రామము.

ఈ వరాహవర్తనీవిషయము కళింగము నేలిన గాంగవంశరాజులగు హస్తివర్మ, దేవేంద్రవర్మ, ఇంద్రవర్మల శాసనములందును,వజ్రహస్త, రాజరాజ అనంతవర్మల శాసనములందును బేర్కొనఁబడినది. పై నుదాహరించిన శాసనములు కళింగసంచికలో ననుబంధమునందు ముద్రితములు. పాఠకులపరిశీలన నిమిత్తము శాసనములు మొదట నెచ్చట ప్రకటింపఁబడెనో యా గ్రంథవివరణము పొందుపఱుచుచున్నాను.

1. హస్తివర్మ ఉర్లాము శాసనము (ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము. 17. సంఖ్య. 19)
2. హస్తివర్మ నర్సింగిపల్లి శాసనము (భారతి భావ సం॥ భాద్రపద మాసము. శ్రీ సోమశేఖరశర్మగారు ప్రకటించినది)
3. దేవేంద్రవర్మ చీడివలస శాసనము (ఆంధ్రచారిత్రక పరిశోధక మండలివారి త్రైమాసికపత్రిక. సంపుటము. 2. రెండవసంచిక)
4. మూఁడవ వజ్రహస్తుని గంజాము శాసనము (భారతి. భావ సం॥ మాఘము)
5. మూఁడవ వజ్రహస్తుని మద్రాసు మ్యూజియము శాసనము (ఎపిగ్రాఫియా ఇండికా సం॥ 9. పుట 98)
6. మూఁడవ వజ్రహస్తుని బొడ్డపాడు శాసనము (భారతి-అక్షయ సం॥ వైశాఖము. శ్రీ సోమశేఖరశర్మగారు ప్రకటించినది)

7. మూఁడవ వజ్రహస్తుని చిక్కాలవలస శాసనము (భారతి సంపుటము 2. సంచిక 2. శ్రీ శర్మగారు ప్రకటించినది.
8. అనంతవర్మ చోడగంగ దేవుని కోర్ని శాసనము (ఆంధ్రచారిత్రక పరిశోధకమండలి త్రైమాసిక పత్రిక. సంపుటము 1. పుట 40)
9. ఇంద్రవర్మ అచ్యుతాపుర శాసనము (ఇండియన్ ఆంటిక్వేరి. సంపుటము 8. పుట 120)

మూఁడవ వజ్రహస్తుని బొడ్డపాడు శాసనములోని అవరంగ గ్రామము పర్లాకిమిడి తాలూకోలోనిదని యిదివఱకు వ్రాసియున్నాము. గుగార్ణవుని కుమారుఁడగు దేవేంద్రవర్మ శ్రీకాకుళము శాసనములోను, ధర్మలింగేశ్వరస్వామి దేవాలయ తామ్రశాసనములోను క్రోష్టుకవర్తని విషయములోనివగు ఈక్రింది గ్రామములు పేర్కొనఁబడినవి.

| శాసనములోని పేర్లు. | ఇప్పటి పేర్లు | తాలూకా |
|---|---|---|
| పొప్పంగిక | పొప్పంగి | పర్లాకిమిడి |
| కురుడింబి | కురుడింబి | |
| హడువాక | అడబ | |

పై రెండుశాసనములలో మొదటిది ఎపిగ్రాఫియా ఇండికా మూఁడవసంపుటము. సంఖ్య. 21 గాను, రెండవది ఆంధ్రచారిత్రక పరిశోధకమండలివారి త్రైమాసికపత్త్రిక రెండవ సంపుటము మూఁడు నాల్గు సంచికలలోను బ్రకటింపఁబడినవి. ఆగ్రామస్థుల నిర్దేశములనుబట్టి వరాహవర్తని లేక క్రోష్టుకవర్తని పర్లాకిమిడి జమిందారిలోని కొంత భాగమునను సహితము వర్తించునని శాసనసంపాదకులయభిప్రాయము.

## దేవరాష్ట్రము—దేవరట్టము

ఈరాష్ట్రము విశాఖపట్టణ మండలములోని ప్రాచీన రాష్ట్రములలో నొకటి. దీనిని మొదటి సముద్రగుప్తుని అలహాబాదు శాసనమున పేర్కొనఁబడినట్లు చరిత్ర ప్రసిద్ధము. సముద్రగుప్తుని దక్షిణ

దండయాత్రలలో నిపుడు తూర్పు సముద్రతీరమున జయించిన దేశములలో దేవరాష్ట్రమొకటి.

"కౌసలక మహేంద్ర, మహాకాంతారక వ్యాఘ్రరాజ, కౌరాళకమణ్ణరాజ, పైష్టపురకమహేంద్ర గిరి కౌట్టూరక స్వామిదత్తై, రణ్డపల్లకదమన, కాంచేయక విష్ణుగోపా, వముక్తకనీలరాజ, వైఙ్గేయక హస్తివర్మ, పాలక్కకోగ్రసేన దైవరాష్ట్రకకుబేర, కౌస్థలపురక ధనంజయ, ప్రభృతి సర్వదక్షిణాపథ రాజగ్రహణ మోక్షానుగ్రహీత ప్రతాపోన్మిశ్ర మహాభాగ్యస్య..." అని దక్షిణాపథరాజ్యములలో దైవరాష్ట్రక కుబేరుని జయించినట్లు వ్రాయఁబడినది. సముద్రగుప్తుని దండయాత్రలలో దేవరాష్ట్రము, పిష్టపురము (నేటి పిఠాపురము) వివిధరాజ్యములుగ నున్నట్లు తెలియుచున్నది. ఈ దేవరాష్ట్రము పూర్వము కళింగములోని నేఁటి సర్వసిద్ధి తాలూకాలో కొంత భాగమునకు సరివచ్చునని యూహింపనగును. ఏలయనఁగా మొదటి చాళుక్యభీముని కళింకోట తామ్రశాసనములో ఎలమంచి కళింగ దేశమును, దేవరాష్ట్ర విషయమును (లేక దేవరట్ట విషయము) పేర్కొనఁబడినట్లు శాసనపరిశోధక నివేదికలో ప్రకటింపఁబడినది. ఈ ఎలమంచి కళింగ దేశము దేవరాష్ట్రములోనిది. ఈ ప్రాంతమునకు ఎలమంచి (ఎలమంచిలి) ప్రధాన నగరమైయుండెను. తర్వాత ఈ దేవరాష్ట్రము పిష్టపురమునుండి పరిపాలించిన వాసిష్ఠకుల జనపాలకుఁడగు అనంతవర్మ శాసనములలో నొకదాని యందితఁడు దేవరాష్ట్రాధిపతియని వాకొనఁబడెను. ఇతఁడు పిష్టపుర, దేవరాష్ట్ర రాజ్యములను పరిపాలించుచుండెను.

ఎలమంచిలి, పిఠాపుర గ్రామములు నేటికిని తెలుఁగుదేశములోనికి ప్రసిద్ధగ్రామములు. పూర్వము కళింగదేశము పిఠాపురమువఱకు వ్యాపించియున్నట్లు ఆంధ్రశాసన, సారస్వతములఁబట్టి దృష్టాంతము

లనేకములున్నవి. ఆంధ్ర, కళింగ దేశములగూర్చి వ్రాయునపుడు విపులముగా వ్రాయుదును.[12] గుణవర్మ మనుమఁడును, ప్రభంజనవర్మ కుమారుఁడునగు అనంతవర్మ శృంగవరపుకోట తామ్రశాసనములో గుణవర్మ దేవరాష్ట్రాధిపతిగ వర్ణింపఁబడెను. 'ఓమ్ స్వస్తి విజయ పిష్ట పురాధిష్ఠాత్ మహీమండలవ్యాపి శారదేందుకర నిర్మలగుణస్య దేవ రాష్ట్రాధిప తే రనేకసమరసంఘట్ట విజయాధిగత యశసో మహారాజశ్రీ గుణమర్మనః పరమపౌత్రః శక్తిత్రయోపేతరాజ్యసంపదో వాసిష్ట కుల చంద్రమసః శ్రీ మహారాజ ప్రభంజనవర్మ మణః ప్రియపుత్రః స్వబల విక్రమోపార్జిత భూర్న్నయ వినయస త్వసంపన్నాధిగత యశో దేవద్విజాతి గురుజనోను ధ్యానసంవర్ధిత మహిమా పరమమహేశ్వరో మాతాపితృపదానుధ్యాతః కళింగాధిపతిశ్శ్రీమహారాజఅనంతవర్మా... ఈ శాసనకాలము క్రీ. శ 450–550. ప్రాంతము. అనఁగా మొదటి చాళుక్య భీమునికాలమునాఁటికి పూర్వమునఁ బుట్టినది. పిఠాపురము నేలిన వాసిష్టకుల నరపాలురది[13].

## రూపవర్తనీ విషయము

ఈ రూపవర్తనీ విషయము వరాహవర్తనీ విషయమున కుత్తరభాగము. దీనికే రూప్యవతీ విషయమని నామాంతరము. దానార్ణవుని కుమారుఁడైన ఇంద్రవర్మ చెక్కలి శాసనములలో నీతఁడు తన తల్లి అచ్చిపోతి పుణ్యార్థముగా రూప్యవతీ విషయములోని తుంగన గ్రామమును స్కందశర్మకు దానముచేసినట్లు చెప్పఁబడినది[14].

---

12 సముద్రగుప్తుని అలహాబాదు శాసనము పలువురు చరిత్రకారులు విపులముగ పరిశోధించి చారిత్రక పత్రికలలో నిదివఱకే ప్రకటించినారు. తెలుఁగులో కళింగ గంచికానుబంధమున నీయఁబడినది. మొదట చాళుక్య భీము కళింగకోట శాసనము శాసన నివేదికలో వివరింపఁబడినది. (ఎపిగ్రాఫికల్ రిపోర్టు 1908-1909 పేరా59.)

13. శృంగవరపు కోట అనంతవర్మ శాసనము. ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము. 23. సంఖ్య 9

14. ఎపిగ్రాఫియా ఇండికా సంపుటము. 18 సంఖ్య 31.

శ్రీ రామదాసుగారు ప్రకటించిన మఱియొక శాసనములో టెక్కలి తాలూకాలోని సెల్లాడ గ్రామము రూపవర్తనీ విషయము లోనిదని తెలియవచ్చుచున్నది[15]

ఈ రూపవర్తనీ విషయము వరాహవర్తనీ విషయములో టెక్కలి తాలూకా కుత్తరభాగమున నుండెనని చెప్పవచ్చును.

## కురకరాష్ట్రము

ఈరాష్ట్రము దానార్ణవుని కుమారుఁడగు ఇంద్రవర్మ పుర్లిశాసనములో పేర్కొనబడినది[16]. శ్రీ మద్దానార్ణవసూనుః శ్రీ మన్మహారాజేంద్రవర్మా కూరకరాష్ట్రే భుక్కుకురచ్ఛేద కర్షకాన్కుటుంబినస్స మాజ్ఞాపయతి" అని ఇంద్రవర్మ కూరకరాష్ట్రములోని భుక్కుకురగ్రామ కర్షకుల నాజ్ఞాపించినట్లున్నది. ఈ భుక్కుకురగ్రామము పాలకొండ తాలూకాలోని బుక్కూరు గ్రామము. వరాహవర్తనీ విషయమునకు పశ్చిమమున కురకరాష్ట్ర ముండెనని యూహింపవచ్చును

## ఝాడె—ఝాడు

శ్రీనాథుడు భీమేశ్వర పురాణములో వీరభద్ర, వేమారెడ్ల కనుఁగు మంత్రియగు బెండపూఁడి అన్నామాత్యు నభివర్ణించుసందర్భమున, వీరభద్రేశ వేమారెడ్లు "సప్తమాడియరాయ ఝాడియత్స్థాపాల వందిత శ్రీపాదవనరుహాయులనియును లింగన మంత్రిని వర్ణించు సందర్భమున నతఁడు "ఝాడేశవన సప్తమాడెబారుహాదొంతి వంతునాది నరుల గెలిచె" ననియు వ్రాసియున్నాఁడు. ఈ ఝాడు లేక ఝాడె యనుస్థలము సోంపేట తాలూకాలోని ఝాడులేక ఝాడు పూడియను గ్రామము. క్రీ. శ. 1327 సంవత్సరపు నాఁటిదియగు, ఝాడుపాల పడిరాయని శాసనమొకటి సింహాచల శాసనములందు

Journal of the mythik society Vol. XIV. P. 271.

16 పుర్లిశాసనము. ఎపిగ్రాఫియా ఇండికా. సంపుటము. 14. సంఖ్య. 217.

గలదు. దానిలో "స్వస్తి - శ్రీ శాకాబ్దే బ్ధిసందద్యుమణి పరిమితే శుక్లపక్షే నభస్యే, రాకాయాం సోమవారే సకలగుణగణాలంకృతో ఘ్నూముపాలః। ప్రాదాదా చంద్ర తారం విమలతరయశాః పుణ్యసంతానవృద్ధ్యై శ్రీమత్సింహాద్రి చూడామణి నరహరయే చంద్రశుభ్రాతపత్రం॥ ధనంజయ గోత్రుండును గోపాలనాయంకర కుమారుండును నగు ఘ్నూము పాల పడిరాయండు సింహాద్రి దేవునకు ధవళఛత్రమును దానముచేసె నని శాసనమునందుఁగలదు[16].

దొంతి

ఈ దొంతిరాజ్యమును పేర్కొన్న ప్రథమాంధ్రకవి మడికి సింగన్న. ఇతఁడు రచించిన పద్మపురాణోత్తరఖండములో కృతిపతి యైనకందనామాత్యుఁడు రామగిరి పట్టణాధీశుఁడైన ముప్పడి భూపతికి మంత్రియు, దండాధీశుడై యుండెను. ఆముప్పడి భూపతి వంశవిశేషములు వర్ణించునెడ "విభవవిలాస విక్రమవిజయ విఖ్యాతులం బ్రసిద్ధుండైన ముత్త భూపాలుండు తనకు సహాయుండుగా గౌతమీ దక్షిణంబును బరమపావనమగు సబ్బినాటి రాష్ట్రంబున రామగిరి పట్టణంబు రాజధానిగా బురందర విభవుండై రాజ్యంబుచేయుచు, నిరువెత్తుగండ గండగోపాల కాంచీరక్షపాలక, చోడరాజ్య స్థాపనాచార్య, దొంతి మన్నియ. విభాళస, చలమర్తిగండ, గజగంధవారణ, రాయగజ కేసరి...నానాబిరుద విఖ్యాతుండును... అగు ముప్పభూపాలుండు" అని ముప్పభూపాలుఁడు దొంతిమన్నియవిభాళుఁడైనట్లు వర్ణించియున్నాఁడు. ఈకవియే రచించిన వాసిష్ఠరామాయణమునందును కందనామాత్యునిగూర్చి యిట్లు వ్రాసియున్నాడు.

"తొల్లి హరిభక్తి రసావేశంబునఁ గతిపయాక్షరాభ్యాస చాపలంబునఁ జేసి విష్ణువిభవాధి రామకథాప్రభూతంబులగు పద్మపురాణోత్తరఖండంబును, భాగవత దశమస్కంధంబును దెనుంగున రచించి

16. దక్షిణ హిందూదేశ శాసన సంపుటము. 6. సంఖ్య. 1110.

యప్పుణ్య పురాణంబులకుఁ గృతిపతిగా నేపుణ్యుం బ్రార్థింతునో యని విచారించి, గంధగజవారణ, గండగోపాల, చలమర్తిగండ, రాయగజకేసరి, దొంతిమన్నె విభాళాది నానాబిరుద విఖ్యాతులం బ్రసిద్ధుండగు రామగిరి పట్టణాధీశ్వరుండైన కుమార ముప్పభూపాలుని మాన్యమంత్రి పరధుర్యుండును నగు...కందనామాత్యుఁడు" అని మరల ముప్పభూపాలుని వర్ణించునెడ దొంతిమన్నె విభాళన బిరుదును జెప్పియున్నాఁడు.

ఈ దొంతిమన్నెభూపాలురను రెడ్డిరాజులు గెలిచినట్లు శ్రీనాథుని కృతులవల్ల మనకుఁ దెలియును.

అల్లాడరెడ్డి విజయధాటీ సంరంభము వర్ణించునెడ "ఘూడె జంతుర్నాటి జననాథ శుద్ధాంత కుచకుంభములమీఁది కుంకుమంబు బారహదొంతి భూపాల లీలావతీ గండస్థలంబులఁ గలికినవ్వు...అనియు

తే. దూరమంతంత బారహదొంతిమన్నె
సప్తమాడియరాజన్యసమితి మ్రొక్క
రాయవేశ్యాభుజంగ సంగ్రామపార్థ
గాయగోవాళ వేమక్ష్మాధవునకు.

అనియు,

ఉ. బలవద్బారహ దొంతిమన్నె ధరణీపాలావరోధాంగనా
విలసన్మంగళసూత్ర రక్షణ కళావిఖ్యాత కారుణ్య!

అనియు కాశీఖండములో దొంతిమన్నె ధరణీపతులఁ బేర్కొనెను. భీమఖండకృతిలో లింగనమంత్రి ప్రతాపము వర్ణించు సందర్భమున మరల

సీ. ఘూడేశవన సప్తమాడె బారహ
దొంతి పంతనాదక్షితీశ్వరుల గెలిచి"

యని దొంతినాఁటిని గూర్చినాఁడు.

ఈ దొంతి యెక్కడిదని విచారింపగా నిది బస్తరురాజ్యములోని జగదల పురమునకు ఆగ్నేయమున నలుబదిమైళ్ళ దూరమునను

బారసూరపురమునకు దక్షిణమున నలువది మైళ్ళదూరమునను డంకిని, శంఖిని, నదుల సంగమస్థానమందున్న దంతెవాడ యని తెలియుచున్నది. ఈ బస్తరు రాజ్యములోని దంతెవాడ తెలుగు శాసనములు పదియవ దక్షిణ హిందూదేశ శాసనసంపుటము నందీయఁబడినవి. ఇచ్చట దంతేశ్వరీ దేవాలయము గలదు. ఈ దొంతి క్షితీశ్వరులు కాకతీయ ప్రతాపరుద్రుని సోదరుఁడగు అన్నమరాజు సంతతివారమని వారి శాసనములలో వ్రాయించుకొన్నారు. ప్రతాపచరిత్రములో ప్రతాపరుద్రునికి అన్నమదేవుఁడను తమ్ముఁడు గలఁడని చెప్పఁబడినది. కాని శాసనాధారములు లేవు. దిక్పాలదేవుని దంతెవాడ శాసనమునుబట్టి ఈ అన్నమరాజు ప్రతాపరుద్రుఁడు నష్టరాజ్యుఁడై శివసాయుజ్యమును బొందినపిమ్మట యవనభయముచే దండకారణ్య నికట బస్తరురాజ్యమునందు రాజ్యమేర్పఱచుకొనెనని తెలియుచున్నది[17]. శ్రీనాథుఁడు పేర్కొన్న 'బారహా' నేటి 'బారువా'. రెడ్లనాఁటి ఆంధ్రసారస్వతములోను, శాసనములందును రెడ్లవిజయములఁగూర్చి పేర్కొనఁబడిన స్థలనిర్దేశము ఈదిగువ నిచ్చుచున్నాను. కొన్నిగ్రామములు సీమలు రెండుమూఁడు తాలూకాలలోఁగానవచ్చుచున్నవి. కాని వారి విజయధాటి తూర్పుతీరము నంటియుండెననుటకు సందేహములేదు. ఈతాలూకాలపేర్లు మద్రాసు ప్రభుత్వమువారు ప్రకటించిన ఆయా జిల్లాలలోని తాలూకాపేళ్ళనుబట్టి వ్రాయఁబడినది.

విశాఖపట్టణ మండలములోని గ్రామములు.

| | | |
|---|---|---|
| 1. కంచుకము | కంచిలి | సోంపేట తాలూకా |
| 2. చీడికోట | చీరికోట | గొలుగొండ ... |

17. 1 ఎపిగ్రాఫియా ఇండికా-సంపుటము. 12. సంఖ్య 30.

2. ఎపిగ్రాఫియా ఇండికా-సంపుటము 9. సంఖ్య 19.

3. దక్షిణ హిందూదేశ శాసనసంపుటము-సంఖ్యలు. 646, 648. ఈ దత్తెవాడ పూర్వమొకప్పుడు చిందకుల రాజన్యులకు రాజధానిగ నుండెను.

3. మాకవరము    మాకవరము    అనకాపల్లి ...

4. కలువపల్లి    కలవపల్లి    దిమిలసమీపమున నున్నది.

(విష్ణువర్ధనుని తిమ్మాపురము శాసనములోను దక్షిణహిందూదేశ శాసన సంపుటము 6 సంఖ్య. 1168 లోను పేర్కొనఁబడినది)

5. శృంగారంకోట    శృంగవరపుకోట    శృంగవరము కోట తాలూకా

6. లోతుగడ్డ    లోతుగెడ్డ    గొలుగొండ ...

7. చీకటి    చీకటి    గంజాము ...

8. చిల్కసముద్రము    చిల్కసముద్రము    గంజాము ...

9. కసిమికోట    కసిమికోట    అనకాపల్లి ...

10. వెంకటాయి    వెంకటాపురము    అనకాపల్లి ...

11. కప్పకొండ    కప్పకొండ    గొలుగొండ ...

12. కిల్లెడ    ...    కిల్లెడసీమ

(ఈసీమ కిల్లెడసీమలోని గొబ్బూరు అని దక్షిణ హిందూదేశ శాసనము సంపుటము 6 సం. 1054 లో నుదాహరింపఁబడినది. జంతుర్నాటిలోని యంతర్భాగము)

13. పొట్నూరు    పొట్నూరు    భీమునిపట్టణము తాలూకా

14. వీరకూటము    వీరఘట్టము    పాలకొండ ...

15. పురుషోత్తము    పురుషోత్తమపురము    సోంపేట ...

16. వంతు    వంతురు లేక వంతవాడ    పార్వతీపురము...

17. సప్తమాడెములు    మాడుగులు    వీరవిల్లి తాలూకా

(చోడవరమునకు పదునొకండు మైళ్ళదూరమున కలదు.)

18. బారహా    బారువా    సోంపేట తాలూకా

19 సింహాచలము    సింహాచలము    విశాఖపట్టణము ...

# తిక్కనభారతము—నాటకీయత

కాకర్ల వెంకటరామ నరసింహము.

కవిబ్రహ్మ తిక్కన భారతమును నాటకీయముగా రచించెనని పండితవిమర్శకలోకమున నొకయభిప్రాయము గలదు. దీనినిగూర్చి ప్రసంగించుటకు ముందు మనము తెలిసికొనవలసినవిషయము లనేకములు గలవు. భారత మొక యితిహాసము. అనఁగా శ్రవ్యకావ్య మన్నమాట. దీనిని నాటకీయముగా రచించుట యననేమి? ఈప్రశ్నకుఁ దగిన సమాధాన మీయనిదే మనకుఁ దక్కినవిషయములు సమగ్రముగా నర్థము గావు. శ్రవ్యకావ్యమును నాటకీయముగా రచించుట యనుదానిని స్థూలముగా నిట్లు నిర్వచింపవచ్చును. దృశ్యకావ్యముగూడఁ బఠనావస్థలో శ్రవ్యకావ్యమువంటిదే; ప్రయోగావస్థయందే దానికి దృశ్యకావ్యావస్థ సమగ్రముగా సిద్ధించును. కావున సమగ్ర దృశ్యకావ్యత్వసంసిద్ధి కే యే విషయము లుపకరించుచున్నవో వానిని శ్రవ్యకావ్యకర్త తనగ్రంథములోఁ దనరచనా చమత్కృతిచేత రూపొందింపవలయును. నాటకమును జూచుచున్నప్పుడు భావుకహృదయములో నెటువంటి రసానుభూతి యెంత సుకరముగఁ గలుగుచున్నదో, అటువంటి రసానుభూతి యంత సుకరముగఁ దనకావ్యమును బఠించుచున్నప్పుడు సహృదయునకుఁ గలుగునట్లుగ గ్రంథకర్త చేయవలయును. నాటకము కేవల మొకేకళ గాదు; అది యొకసమాహారకళ. ఈసిద్ధాంతముగూడ నాటకముపట్లఁ బ్రయోగావస్థయందే యన్వర్థ మగును. ఈయవస్థలో నాటకమున కుపకరించు నితరకళ లేవి? సాహిత్యమనునది ప్రప్రథమమునుండియు నున్నదే. ఇఁకఁ జిత్రలేఖనము, నాట్యము, సంగీతము ననునవి ప్రయోగావసరమున నాటకమున కుపకరించు నితరకళలు. వీనియన్నింటికంటె ముఖ్యమైనది మఱియొకటి గలదు. అది పాత్రలు మనయెదుటఁ బ్రత్యక్షముగా గోచరించుట

పాత్రోచితమైనవేషభాషల ననుకరించుచు మనముం దొకవ్యక్తి సాక్షాత్కరించుట భూతకాలముతో వర్తమానము నైక్యము చేయుట. అనఁగా నేనాఁడో జీవించిన దుష్యంతాదులు వారిభావములు వారి చేష్టలు మనకుఁ బ్రత్యక్షగోచరము లగుననుట. అట్టియెడ భావుకహృదయములలోఁ గలుగురసానుభూతిని శ్రవ్యకావ్యకర్త సంపాదించుట దుష్కర మనియే చెప్పవలెను. కాని యట్టిదుష్కరకార్యములనుగూడ సాధించిన మహాకవులు లేకపోలేదు. వారిలోఁ బ్రప్రథముఁడు కవిబ్రహ్మ తిక్కన. అనితరసాధ్యమైన యాయన ప్రజ్ఞావిశేషమునకు సమగ్రనిదర్శనము తత్కృత మహాభారతము.

భారత మాంధ్రీకరణము గదా, యిందుఁ దిక్కనప్రజ్ఞావిశేషమేమి యున్నది ? అని నిరసించి మాటాడు మహానుభావులుగూడ లేకపోలేదు. తగినయుపపత్తులతో వారందఱకు సమాధాన మిచ్చుటకిది సమయము గాదు. ఆంధ్రీకరణమేయయ్యు భారత ముత్తమోత్తమ మైనస్వతంత్రకావ్య మని యొక్కమాట చెప్పి ప్రస్తుతవిషయమును బరామృశింతము. నాటకమునకుఁ బ్రత్యేకతను గల్పించులక్షణములలో ముఖ్యాతిముఖ్యమైనది పాత్రచిత్రణము. పాత్రనిర్మాణమనునది శ్రవ్యదృశ్యకావ్యములు రెండింటికిని సామాన్యవిషయమే. కాని దృశ్యకావ్యమున నవి సజీవముగ మనకు సాక్షాత్కరించును. సామాన్యముగ నవి శ్రవ్యకావ్యమున నట్లు సాక్షాత్కరింపవు. కావున దృశ్యశ్రవ్యకావ్యములకుఁ గలభేదము పాత్రనిర్మాణవిషయమునఁ గాక, సజీవపాత్రసాక్షాత్కరణమునందుఁ గలదు. దృశ్యకావ్యములలో నవి ప్రత్యక్షగోచరము లైనచో, శ్రవ్యకావ్యములలో నవి మనోనేత్రగోచరములు గావలయును. శ్రవ్యకావ్యమును నాటకీయముగా రచించు కవి ముఖ్యముగా గమనింపవలసిన దిదియే. భారతకథాపురుషులఁ బ్రథమముగా సృజించినఖ్యాతి వ్యాసభట్టారకునిదే. కాని యాపా

త్రిలను 'ఆంధ్రావళి మోదముం బొరయునట్లుగఁ' దీర్చిదిద్దినఖ్యాతి కవిబ్రహ్మది. ఇది యొక్క-పాత్రల విషయముననే గాదు; సర్వవిష యములందును నిది సమన్వయించును. శ్రవ్యకావ్యమును నాట కీయముగ రచించుకవి గడచినకాలమును, గతించినవ్యక్తులను, వారివారి వేషభాషలను, ననుభూతి విశేషములను—నేఁడు మన కన్నులకుఁ గట్టినట్లు చేయుటకుఁ బ్రయత్నించును. ఆప్రయత్నములోఁ గొందఱు కృతకృత్యు లగుదురు; కొందఱు విఫలమనోరథు లగుదురు. కన్నులకుఁ గట్టినట్లు పాత్రలఁ జిత్రింపవలెనన్నఁ గవి యేమి చేయ వలెను ? కవిబ్రహ్మతిక్కన దాని నెట్లు, ఎంతవఱకు సాధించె నను ప్రశ్నలకు మన మిచట సమాధాన మీయవలసియున్నది. సజీవపా త్రసాక్షాత్కరణము విషయమునఁ గవి సాధింపవలసినలక్ష్యము తద్వి శిష్టగుణగణవ్యక్తీకరణము. ఆవైశిష్ట్య మనేకవిషయములలో నుండ వచ్చును. పలుకుఁబడిలోఁగాని, ముఖభంగిమలోఁగాని, హస్తచలన ములోఁగాని, నేత్రస్పందనములోఁగాని, మఱెద్దానియందైనఁగాని యీ వైశిష్ట్యము గోచరింపవచ్చును. ప్రత్యేకముగ వానిని వ్యక్తీకరించు టలోఁ గవి యప్రమత్తుఁడై యుండవలెను. సామాన్యమైన ప్రకృతి విశేషముల నెంతగా వర్ణించినను మనకుఁ బాత్రలు ప్రత్యక్షములు గావు. మానవప్రకృతిని బట్టియిచ్చు నీవర్ణనా సామర్థ్యమునకుఁ గవి బ్రహ్మదే యగ్రతాంబూలము. మహాభారతమువంటి మహేతిహాస ములోఁ గవిబ్రహ్మ చూపినచమత్కృతివిశేషములు వేలకొలఁదిగ నున్నవి. వానినన్నిటిని నీస్వల్పప్రసంగములో నుదాహరింప వలను గాదు. కావున మచ్చున కొకటిరెం డుదాహరింతును.

మనుష్యప్రకృతికి దర్పణమువంటిది హాసము. దీనిని వ్యక్తీకరిం చుటలోఁ దిక్కన చూపినచమత్కృతి విశేషము లనేకములు గలవు. సంస్కృతమునందుఁ గూడ నవ్వును రెండు మూఁడురకములుగ వర్ణిక

రించి యున్నారు. చిఱునవ్వు 'స్మితము'; అంతకంటెఁ బెద్దన 'హాసము'; భయానకమగు నవ్వు 'అట్టహాసము'. కవిబ్రహ్మ యీ నవ్వును వర్ణించుటలో మానవప్రకృతిని బుణికి పుచ్చుకొనినాఁడు. 'కలకలనవ్వు' 'వెడనవ్వు' 'నవ్వుగానినవ్వు' 'కన్నులనవ్వు' 'కటికనవ్వు' 'పిన్ననవ్వు' 'కిసుక్కుఁబూనినయలఁతినగవు'—ఇట్లు మానవప్రకృతికి సహజమైన నవ్వులోనివైవిధ్యమును దేఁటతెలుఁగుమాటలలోఁ దెలుఁగు వారిహృదయములందు నాటుకొనునట్లు కవిబ్రహ్మ వ్యక్తము చేసి నాఁడు. వీని కుదాహరణము లెన్నియైన నీయవచ్చును. మచ్చున కొండురెం డుదాహరణములు.

'వెఱ పెట్టెదిదయో యెన్నఁడు
నెఱుఁగని నీయట్టివాని కెవ్వరొకో యీ
పిఱికితన మింత యలవడఁ
గఱపినవా రనుచు శౌరి కలకల నవ్వెన్.'

ఇందుఁ గలకలనవ్వులోఁ బ్రేమతోడియుపహాసము గోచరించును. ఇట్లే గీతోపదేశమునకుఁ బూర్వము నరునివిషాదమును జూచి నారాయణుఁడు కలకల నవ్వెనని తిక్కన చెప్పెను. ఇందును నరుని యెడ నారాయణునకుఁ గలవాత్సల్యమే గాక కరుణాపూర్వకమైన హేళనయు గోచరించును. పాండవులరాయబారిగ ధృతరాష్ట్రుని కొలువుకూటమున శ్రీకృష్ణుఁడు కొంతవఱ కుపన్యసించినాఁడు. కాని యాయనసంధివాక్యములు దుర్యోధనునకు రుచింపలేదు. 'వాఁడిసూది మొన యించుకమోపినయంతమాత్రయుఁన్' భూమి పాండవుల కీనని దుర్యోధనుఁడు నిష్కర్షగాఁ జెప్పినాఁడు. 'భీష్మద్రోణు లీదిక్కునున్నా' అని శ్రీకృష్ణుని హెచ్చరించినాఁడు. అప్పుడు దుర్యోధనుని దుర్నీతిని, నహంకారమును జూడఁగా శ్రీకృష్ణునకుఁ గ్రోధము గల్గినది. ఆతని మూర్ఖతయెడ నీసడింపు జనించినది. ఆతనిప్రగల్భములకు హేళన

జనించినది. కాని యీభావములలోఁ దరతమభేదము గలదు. వాని యం దగ్రగణ్యముగ భాసించినది క్రోధమే. ఈ భావసమ్మేళనమును వర్ణించుచుఁ గవిబ్రహ్మ శ్రీకృష్ణునిరూపమును మన కీ క్రిందివిధముగా సాక్షాత్కరింపఁ జేసినాఁడు.

'అనిన విని కిన్కఁబూనిన యలఁతినగవు
చెలువు మొగమున కొకక్రొత్తపోలు పొనర్పఁ
బుండరీకాక్షుఁ డగుటెల్లఁ బోయి యప్పు
డరుణకమలాక్షుఁ డగుచు మురాంతకుండు'.

ఇట్టిదే మఱియొక్కఘట్టము. కౌరవసేనలో నభిమన్యుఁడు విజృంభించుచున్నాఁడు. ఆతనివిశృంఖలవిహారమున కడ్డులేకున్న నట్టివాని నెదుర్కొనుటకు మాఱుగ ద్రోణుఁ డాతనిబలపరాక్రమములను బ్రశంసించుటకుఁ బ్రారంభించినాఁడు. అదిగూడ దుర్యోధనుఁడు వినునట్లు అప్పుడు దుర్యోధనునిలోఁ జెలరేగుభావపరంపర లనేకములై యుండును. అభిమన్యునివిశృంఖలవిహారమునకుఁ గ్రోధము; ఆబాలవీరునిపరాక్రమము నాపఁజాలనితనయశక్తికి భీతి; తనకుఁ బెద్దయండగా నుండు ననుకొన్నద్రోణుఁడే తనసైన్యమును జీల్చి చెండాడునట్టియభిమన్యు నభినదించుటకుఁ గినుక, జుగుప్స, నిరాశ;—ఇన్నిభావము లొక్కమాఱుగ దుర్యోధనునిహృదయములోఁ జెలరేగెను. ఈ భావపరంపరను మఱొకసామాన్యకవియే యైనచోఁ బది పదునేనుపద్యములలో నైనను వర్ణించెడివాఁడు. కాని కవిబ్రహ్మ యొక్కపద్యపాదములో నామూర్తిని మన కెట్లు సాక్షాత్కరింపఁ జేసినాఁడో చూడుఁడు.

'...వెలుకఁ బాఱి యతిదీన మగు నాన
నమున నవ్వుగాని నవ్వు నెఱియ
సొమ్మదత్తి కర్ణశల్యాదులగు యోధ
జనులతోడ నిట్టు లనియె విభుఁడు.'

ఇక్కడ కర్ణశల్యాదులను యోధజను లనుటలోఁగూడ నొక విధమైన హేళన గోచరించును. అప్పటికే యభిమన్యునిధాటికి కోర్వలేక వెనుకంజవేసిన యోధవరులు వారు. ఇట్టి యుదాహరణము లెన్నైన నీయ వచ్చును. కాని ప్రస్తుతమున కివి చాలును.

నాటకీయతకు మఱియొక ముఖ్యలక్షణము సద్యఃస్ఫురణను గలిగించుశక్తిమంతము లగుపదములను వాడుట. ఈలక్షణమునకు లక్ష్యములగు గ్రంథము లాంధ్రవాఙ్మయమునఁ గొలఁదిగ మాత్రమే గలవు. అం దగ్రగణ్యము తిక్కనభారతము. స్థాలీపులాక న్యాయముగా రెండుమూఁ డుదాహరణములు. యుద్ధరంగమున ధర్మజుఁడు కర్ణునకుఁ బట్టుబడినాఁడు. ఆసమయమందే భీమదుర్యోధనులు యుద్ధము సేయుచున్నారు. నమ్మినబంటు గావునఁ బ్రభుసంరక్షణార్థము కర్ణుఁడు ధర్మజుని వీడి భీమదుర్యోధనులకడ కేగును. ధర్మజుని వదలిపెట్టుటలోఁ గుంతి కిచ్చినవరముగూడఁ గొంతకారణమే. ఈ విషయ మంతయు సంజయుఁడు ధృతరాష్ట్రునితోఁ జెప్పఁగనె ధృతరాష్ట్రునకుఁ జాల నిర్వేదము గలిగినది. చేతి కందినఫలము జారిపోయినదే యనియు, నిట్టి సదవకాశము మరల లభించునా యనియు కర్ణుఁ డెంత తెలివి తక్కువపని చేసినాఁ డనియు నాయనమనస్సు చాల ఖేదపడినది. అంతట

అనిలజునకుఁ జాలఁడె నా
తనయుఁడు మోసంబుగాక ధర్మజుఁ డట్లు
బ్బినఁ బోనిచ్చుట రాధా
తనయునకుం బుద్ధి యగునె తప్పెం దప్పెన్.

అని యాయంధుఁడు సంజయునితో మొఱపెట్టికొనెను. 'తప్పెందప్పెన్' అనునాచివరిమాటలో నాముసలిరాజుహృదయావేదన మంతయు

మనకు సమగ్రముగా సాక్షాత్కరింపఁ జేసినాఁడు కవిబ్రహ్మ. ఇట్టివే మఱికొన్ని యుదాహరణములు.

'నిండె సమయాబ్దములు నిం
కొం డన లే దిపుడ చని సుయోధనుతో భీ
ష్ముండు గురుండును వినఁగా
నిండె నసుము నిండె నిండె నిక్కంబునకున్'

ఉత్తరగోగ్రహణసందర్భమున సమయాబ్దములు నిండకుండఁ గనె యర్జునుఁడు బయల్దేరినాఁడు గావున మీరు మరల నరణ్యవాస మును గావింపవలెనని దుర్యోధనుఁడు పాండవుల కంపినరాయబార మునకు సమాధానముగా ధర్మరాజుఁడు పల్కిన పలుకు లివ్వి. ఇందు నిండె ననుపదమును ముమ్మా అుచ్చరించుటలోఁ గలయౌచిత్యమును సహృ దయులే గ్రహింతురుగాక. ఇట్లే ధర్మజుపైఁ గత్తిదూయుచున్న యర్జు నుని వారించుచు శ్రీకృష్ణుఁడు 'పోపో మ్మొక్కడివాఁడ'వని యదల్చును. 'హుమ్మని నోరికండ నాచికొనిన మోగ్రుబెబ్బులివి శేషము దోఁపఁ గఁ బార్థుపట్టి' సమరాంగణమున విజృంభించును. 'ఎన్నఁడో చచ్చిన యట్లు రథంబుమీఁద' దుశ్శాసనుఁడు 'చేడ్పడి'యుండును. 'కర్ణ! మముఁ జేకొనవె' యని సేనలు కర్ణు సభ్యర్థింపఁగా 'ఓడ కోడకుఁ డని పలుకుచు' కర్ణుఁ డమరేంద్రసుతునితోఁ దలపడును. 'తిండిపోత! నీకు భండనం బేటికి' అని కర్ణుఁడు భీముని హేళన చేయును.

నాటకీయతకు మఱొకముఖ్యలక్షణము సంభాషణానైపుణ్యము. దీనినే ప్రధానలక్షణముగాఁ జెప్పువారును గలరు. వారితో మనకు వివాదము లేదు. ముఖ్యముగా గమనింపవలసిన విషయ మింకొకటి గలదు. కావ్యమునఁ గన్పట్టుప్రతి సంభాషణమును నాటకీయతకు గీటురాయి కాఁజాలదు. అటువంటి సంభాషణలు ప్రతిపురాణమునం దును, ప్రతిప్రబంధమునందును గాననగును. అంతమాత్రమున నవి

నాటకీయతను సంపాదింపలేవు. వాక్చమత్కృతి నాటకీయతకు నికషోపలమువంటిది. మాట వినినంతనే యది మనహృదయమున హత్తుకొనవలెను. ఆమాటలు స్ఫురణకు వచ్చినపుడెల్ల తద్వ్యక్తి మనకు దృగ్గోచరము కావలెను. ఇట్టిసంభాషణములు కవిబ్రహ్మభారతమునందే తఱచుగాఁ గన్పట్టును. ఇతరకవుల కృతులలోఁగూడ నవి యచ్చటచ్చటఁ దారసిల్లవచ్చును. కాని యవి బహువిరళములై మనహృదయముల నంతగా నాకర్షింపఁ జాలవు. కవిబ్రహ్మభారతమున నిట్టివి యించుమించుగా సర్వత్ర గోచరించును. వీని కుదాహరణములుగ సంజయురాయబారము, శ్రీకృష్ణురాయబారము, యుద్ధపంచకమునందలి వివిధసంభాషణలు మొదలగునవి యెన్నియైన గ్రహింపవచ్చు. విరాటోద్యోగపర్వములలో నివి బహుధా ప్రయుక్తములై యున్నవి. మచ్చునకుఁ గొన్ని. ఉత్తరకుమారప్రజ్ఞ లందఱకును దెలిసినవే.

'పసుల దయ్య మెఱుఁగు పడఁతులసంతోష
మేల నాకు ననికిఁ జాల నేను'

అని రథమునుండి క్రింది కుఱికి పరుగులు వెట్టిన వీరాధివీరుఁ డుత్తరకుమారుఁడు. జమ్మి నెక్కి యందు మహోరగములట్లు గన్పట్టు పాండవాయుధములఁ గాంచి యీతఁడు భయభ్రాంతుఁ డగును. అపు గడ్డునకు నిట్లు పందతనమును వ్యక్తీకరించు నుత్తరుఁడు ధైర్యస్థైర్యములతో దన్ననునిమేషము ననునయించుచు యుద్ధమునకుఁ బురికొల్పుచున్న సవ్యసాచిని 'సారథీ' యని సంబోధించుట సహృదయుల కచ్చెరువు గొల్పకమానదు. ఆపిలుపులో బేలతనము గలదు; రాచఱికపుటహంభావము గలదు; పెద్దపిన్నలతారతమ్యము నెఱుంగిలేని వివేచనాశూన్యత గలదు. ఇన్నిభావముల నొక్కమాటలో నిమిడ్చినకవిబ్రహ్మకవితాశిల్పమున కంజలింపని వారుండరనియే నానమ్మకము. ఇందు మనకు నుత్తరుని యెడఁ గరుణతోడి వినోదము గలుగును. ప్రాయోప

విష్టుఁడై యున్న భూరిశ్రవుని సాత్యకి యన్యాయముగా సంహరించును. ఒకనాఁటియుద్ధమున సాత్యకికి సోమదత్తుం డెదురైై భూరిశ్రవ స్సంహారవిషయమున నాతని నధిక్షేపించును. అప్పుడు సాత్యకి 'భూరిశ్రవుండు సచ్చుట యొప్ప దేని నిన్నొప్పెడునట్ల సంపెద' అని సమాధాన మిచ్చును.

'అతఁడు గాండివమున నడ్డసాడులు వైవఁ
డురుల నంపవాన గురియుఁ గాని'

అని యుత్తరగోగ్రహణసందర్భమున నశ్వత్థామ కర్ణు నధిక్షేపించును. కర్ణబాణప్రహారజర్జరితాంగుఁ డగు యుధిష్ఠిరుఁడు

'విను కర్ణునకే నోడితి, నన నేటికి నీవు నోడి తనిలజమాద్రి
తనయులు మున్నె యోడిరి।మనతోఁగూడంగఁగంసమర్దనుఁడోడెన్.

అని యర్జునునితో నిష్ఠురవాక్యము లాడెను 'మనతోఁగూడంగఁ గంసమర్దనుఁ డోడెన్' అనునది తెలుఁగులో నొక లోకోక్తిగాఁ బరిణమించిన దనఁగా నాంధ్రులహృదయముల నంతనిశితముగా నానుడికారపుసొం పాకర్షించిన దన్నమాట. సంజయురాయబారసందర్భమున సంజయునికుశలప్రశ్నకు నుత్తరువుగా ధర్మజుఁడు

'ఆరాజు మాదెసంగల
కారుణ్యము కతమునను సుఖంబున నిట్లున్నారము'

అని పల్కును, ధర్మజుని 'ముళ్లమాటల' యందలిగడుసు పోఁకడలను గ్రహించిన సంజయుఁడు దుర్యోధనాదుల యోగక్షేమములనుగూర్చి చెప్పుచు

'వా, రందఱకు క్షేమం బిట
ముందఱ లేకున్న నేఁడు మొదలుగఁ గల్గున్'

అని ధర్మజునకుఁ దిరిగి చమత్కారజనకముగా సమాధానమిచ్చును. 'మునుమమ్ముఁ బొగడి పదఁపడి।ననివారల గెలువ నరిదియని పొత్తుగఁ జెప్పిన మాటకు నే నోడఁబడ।విను సంజయ పక్షపాత వృత్తి విడువుమీ.'

అని చిట్టచివఱకు సంజయుని ధర్మజుఁడు మందలించును. 'మీ, ముక్కున నూర్పు గల్గ నొకమూర్ఖునిచేఁ బడితిఁ సభాస్థలిఁ' 'ఈ, యేవురుఁ జూడఁగా సభకు నీడ్చెఁ గులాంగన నిట్లొనర్తురే' అని ద్రౌపది భీమునితోడను శ్రీకృష్ణునితోడను జెప్పికొని విలపించును. సారథిద్వితీయుఁడై యుత్తరుఁ డొక్కఁడే కురుసేన నోర్చి మగిడివచ్చు చుండె ననుమాట వినినంతనే విరటుఁడు

'ఏ మేమీ యని గోప

స్తోమముఁ బలుమాఱు నడుగుచున్ మెయివదలన్.

మంత్రులవదనములను సగర్వముగాఁ జూచును. ఇట్టి యుదాహరణ ముల నెన్నియేని యీావచ్చును. ప్రస్తుత మింకొకయంశమునుగూర్చి యోచింతము,

ప్రప్రథమమునఁ జెప్పఁబడినవిషయములను గొన్నింటి నిప్పుడు విచారింపవలసియున్నది. నాటక మొకసమాహారకళ యని ముందే చెప్పఁబడి యున్నది. ఆసమాహారత్వమువలన నెయ్యది సాధింపఁ బడుచున్నదో యద్దానిని శ్రీవ్యాకావ్యకర్త సాధింపయత్నింపవలెను. తత్సంపాదనార్థ మాతఁడు చేయుప్రయత్నము లన్నియు నాటకీయ తకు నిదర్శనములె. నాటకమున నొకప్రత్యేకతను సంపాదించు కళ లలోఁ జిత్రలేఖన మొకటి. దీనిసాహాయ్యము రంగప్రసాధన భూమి కాధారణములందుఁ గన్పట్టును. ఇద్దానిని శ్రీవ్యాకావ్యకర్త వర్ణనల మూలమున సాధింప యత్నించును. కాని వర్ణన లన్నియు నాటకీయ తను సాధింప లేవు. ఆ యా రూపములందున్నవిశిష్టతను వర్ణనలు వ్యక్తము చేయవలెను. ఆవిశిష్టత వ్యక్తీకరింపఁ బడినంతనే యారూ పము తజ్జాతినుండి పృథక్కరింపఁబడి, మన మనోనేత్రములయెదుట స్వస్వరూపముతో సాక్షాత్కరింపఁబడును. సామాన్యలక్షణముల నెం తగాఁ జెప్పినను నవి వస్తుప్రత్యక్షీకరణసమర్థములు గావు. సాధారణ

ముగాఁ గవులందఱును వర్ణనాప్రియులే. కాని యీవర్ణనలు విశిష్టల క్షణలక్షితములు గావు. వృక్షవిశేషముల నన్నిటిని బేర్కొని నంతమాత్రమున మహారణ్యము గోచరము గాదు. గజవాజిభటా ళితో గజవాజిభటాళి పెనంగె నన్నమాత్రమున రణరంగము దృగ్గో చరము గాదు. కావుననే వర్ణనలు విశిష్టలక్షణ లక్షితములై యుం డవలె నని సిద్ధాంతము. ఈ సిద్ధాంతమును సర్వథా పాటించినఖ్యాతి కవిబ్రహ్మదే. భారతమునందలి యుద్ధపంచకమును జదివి యానందిం పని వారుండరు. ఇందుల కొకయుదాహరణము. 'చేయి దునిసినదక్కి టిచేతం గైదువుగొని కవియువారును, గాలు దునిసిన నెదిరిమీఁదికి లంఘించువారును, దలదునిసినం దారు మును గన్నిడినవారిం బొడిచి పడువారును, దెగిపడియు నవుడు గఱచుటయును, బొమముడివడుట యును, సడలనితలల నొప్పువారును. ఈవర్ణనయందలి ప్రత్యేకతను భావుకులు గ్రహించియే యుందురు. యుద్ధరంగమున హఠాత్తుగాఁ దల తెగిపడినవారికి వెన్వెంటనే చైతన్యము పోదు. కావున నే కవిబ్రహ్మ "తలదునిసినఁ దారు మును గన్నిడినవారిం బొడిచిపడువారును దెగి పడియు నొడుగఱచుటయును, బొమముడివడుటయును సడలనితలల నొప్పువారును' అని వర్ణించి హఠాన్నికృత్తశిరస్కు లగునా యోధు లరూపము నందలి ప్రత్యేకతను వివరించినాఁడు. వర్ణనలవిషయమున గమనార్హమగునంశ మింకొకటి కలదు. సాధారణముగాఁ గవు లద్దా నిని విస్మరింతురు. వర్ణనలు కథాగతితోఁ గలిసి యుండవలెను. అంతే గాని 'తీర్థమునకుఁ దీర్థము, ప్రసాదమునకుఁ బ్రసాదము' అనునట్లుండ రాదు. నాటకమునఁ బ్రసాధితమగురంగస్థలము వేఱుగను పాత్రలు వేఱుగను జూపఁబడిన నెట్లుండును. కావుననే రంగప్రసాధనతుల్యము లగు వర్ణనలు కథాగతితోఁ గలిసియుండవలె నను నియమము సర్వథా సమంజసమై యున్నది. ఇట్టివర్ణనలకు గూడఁ గవిబ్రహ్మయే మార్గ

దర్శకుఁడు. ఉదా

ద్రుపదనందన పరిభవదుఃఖమునకు
నుల్లమున దురపిల్లుచు నున్నసరసి
వేఁడినిట్టూర్పులోయన వెడలెఁ గ్రొత్త
తావి మూఁతులు విచ్చునెత్తమ్మివిరుల.

కీచకుఁడు ద్రౌపదిని బరిభవించినతరువాతిప్రభాతకాలవర్ణనమిది.

జలరుహాంబులు పాండవసైనికులమొ
గంబులట్టుల విన్ననై కాంతి దఱిగె
వారిమనముల భీత్యంధకార మడరు
కరణిఁ జీఁకటి యెడనెడఁ గవియుఁదెంచె.

భీష్మవిజృంభణసందర్భమునఁ బాండవసైనికవర్ణన మిది. వర్ణనలయెడ గమనింపవలసిన యింకొకవిషయ మాయా పాత్రలచేష్టలను వ్యక్తీకరించుట. సర్వసామాన్యముగా నీవిషయమునఁగూడఁ గవులు జాగరూకులై యుండరు. సూక్ష్మాతిసూక్ష్మములగుచేష్టలొక్కొక్కప్పుడు మహత్తరార్థములను వ్యక్తీకరించును. కావుననే కవిబ్రహ్మ యట్టివానియెడఁగూడ నప్రమత్తుఁడయియే యుండును. ఇందుల కొక్కయుదాహరణము. రాయబారసందర్భమున శ్రీకృష్ణుని దుర్యోధనుఁడు తమయింట విందుగుడువ నాహ్వానించును. శ్రీకృష్ణుఁ డద్దాని కంగీకరింపఁడు మఱియు దుర్యోధనుని కేలు వట్టుకొని తనయనిష్టతకుఁ గల కారణమును నుద్ఘాటించి చెప్పును. ఈ స్వల్పవిషయము నందుఁగూడఁ దిక్కన తత్పాత్రలచేష్టాదికమును వర్ణించుటలో నప్రమత్తుఁడయియే యుండెను. 'మందరధరుండు మందస్మితంబుతో నందఱం గనుంగొని ధార్తరాష్ట్రునికరంబు గజంబు పల్లవం బల్లన తెమల్చు లీలం గేల నమర్చి' ఇందు మహోదాత్తమగు శ్రీకృష్ణునిరూపముకడ దుర్యోధనుని తేలికదనము మనకు గోచరించును. మఱియు నాటకీయతను

సాధింపఁ దలంచినకవి సూటిగ గజిబిజి లేకుండ నుపమాద్యలంకార ములను వాడవలయును. వినినంతనే భావుకులకు వస్తుస్వరూపమును సాక్షాత్కరింపఁ జేయఁగలయలంకారములే నాటకీయతకు దోహదము చేయఁగలవు. ఆంధ్రవాఙ్మయమున నిట్టియలంకృతివిశేషములకుఁ దిక్కనను జెప్పి మఱియొకనిని చేర్కొనవలె. భీష్ముఁడు ద్రుపదసైన్య ముపై విజృంభించును. అయ్యవసరమున

'ఎండినయడవిం దఱికొని

మండెడుకార్చిచ్చుమాడ్కి మారిమసఁగినట్లు'

భీష్ముఁ డుండెనని కవిబ్రహ్మచిత్రణము. 'గొఱియలపిండునకుఁ గవియు కోల్పులికిఁ యి' భీష్ముఁడు విరాటసైన్యముపై విజృంభించెనఁట.

'బలు డేగలకైవడి బెబ్బులులపగిది మత్తకరులపోలిక దర్పో

జ్జ్వలసింహంబులచాడ్పునఁ నలవుఁ బలము మెఱయ'

కర్ణభీములు పెనఁగిరఁట. ఇట్టియుదాహరణములను వందలకొలఁదిగ నీయవచ్చును. వర్ణనలు నాటకీయతకు భంజకములు గావు. అను ముఖ్యవిషయమే ముఖ్యముగా మన మిక్కడ గమనింపవలసినది. నిపుణముగాఁ జేసినసముచితవర్ణనలు నాటకీయతను బెంపొందించును. ఈనాఁటివిమర్శకు లనేకు లీవిషయమును విస్మరించుచున్నారు.

ఇఁక సంగీతము. ఇది ఛందఃపరిగ్రహణమునందే గలదు. కేవల వచనముగాఁ జెప్పినఁ గవిత్వమునకుఁ బరిపూర్ణత యుండదను సిద్ధాం తము సర్వథా సత్యము. కాని యిట ముఖ్యముగా మనము గమనిం పవలసినవిషయ మింకొకటి గలదు. సముచితముగాఁ బ్రయుక్తమైన ప్పుడే సంగీతము నాటకమున మనోజ్ఞముగ నుండును. అటుగాక యదియే ప్రాధాన్యమును వహించినయెడల నాటకము తనస్వభావ మును గోల్పోయి సంగీతపుఁగచ్చేరి యగును. ఇది కవిత్వముపట్లఁగూడ నన్వయించును. ఇటఁ బ్రధానకళ కవిత్వము. ఇతరకళలు తదుజ్జ్వలతా

సంపాదకములే యయ్యు గౌణములే. కావునఁ బ్రధానమగుకళనే కప్పి పుచ్చున ట్లితరకళ లుండరాదు. కేవలశబ్దమాధుర్యమునకై ప్రాకు లాడుకవి యీముఖ్యవిషయమును విస్మరించుచున్నాఁడు. కావున ముఖ్యముగా గమనింపవలసినవిషయమిది. కవిత్వము భావప్రధాన మైనది. గీతిమాధుర్యము దానికిఁ జేఁదోడు వాఁదోడుగా నుండవ చ్చును. కవిబ్రహ్మ భారతమున నేతత్కళారహస్యము సమగ్రముగాఁ బోషింపఁబడినది. సముచితపదసంయోజనయం దాయన కాయనయే సాటి. దీనినే శ్రీనాథకవిసార్వభౌముఁడు 'రసాభ్యుచితబంధము' అని పేర్కొనినాఁడు. రసోచితమైన పదబంధము పదవిషయముననే గాక భావవిషయమునఁగూడ మాధుర్యమును బ్రసాదించును. దీని కొక్క యుదాహరణము. ఉత్తరగోగ్రహణసందర్భమునఁ దలఁచినంతనే యర్జునునితలపై దేవత లిచ్చిన కిరీటము కాంతి పుంజముల వెలిగ్ర క్కుచు నిల్చును. ఇది తుటిలో జరిగిన కార్యము. ఈ భావవ్యక్తీక రణమునకు శార్దూలమత్తేభాదివృత్తములు పనికిరావు. సీస మసలే పనికి రాదు. అది కార్యకరణమున దీర్ఘకాలవ్యవధానమును గోరును. గీతము చిన్నదే గాని యందుఁ బదగతి మందముగ నడచును. లయ సంపాదిపదసంధానసముచితము కంద మొక్కటే-యిటస్వీకార్యము. కావుననే తిక్కన యిటఁ గందమునే స్వీకరించి లయబద్ధముగ రచించినాఁడు.

పెట్టక గట్టక మౌళిం।బుట్టినకిరియ దీధితులు నభోభాగంబుఁ
ముట్టి వెలుంగగనిందు।నిపట్టికిరీటంబు వొలిచెఁ బ్రస్ఫురితంబై.

ఇట్లే సీసపద్యములందలి ప్రతిపాదసమతాపాదనముగూడ శబ్దమాధు ర్యమునకు దోహదము చేయును. అట్లే సీసమును దెగఁజెప్పవలె నను (End-Stopped lines) లాక్షణికనియమము లేకపోయినను నద్దాని నట్లు చెప్పుటయే, యనఁగాఁ దెగఁజెప్పుటయే సముచితము. అనఁగా

నొకపాదమున నొకేభావము నిమిడ్చి, పాదాంతమగుసరికి భావము కూడ సంపూర్ణ మగునట్లు రచింపవలెననుట సీసములవిషయమున నీ నియమము, ముఖ్యముగా వర్ణనావసరమునఁ, బాటింపవలయును. కథాకథనమునెడ దీని నంతగాఁ బాటింప నవసరము లేదు. తగ్గుమొగ్గులు లేని తూఁగును (Balanced rhythm), ప్రతిపాదసమతాపాదనమును గలసీసములను బ్రాచుర్యమునకుఁ దెచ్చినవారిలోఁ బ్రథముఁడు తిక్కన. శ్రీనాథాదు లిద్దానినే సర్వాంగసుందరముగాఁ దీర్చిదిద్దిరి. ఇందుల కొకయుదాహరణము.

"వామాక్షి రుచిరలావణ్యంబు భావించు
దన్వంగిరూపు చిత్తమున నిలుపుఁ
గంబుకంధర చెన్ను కైవడిఁ దలపోయు
నంగనసౌకుమార్యము దలంచు
భామినిసహజవిభ్రమ మెదఁ గీలించుఁ
బడఁతిచెయ్వులు మదిఁ బట్టుకొలుపు
మానినిగరువంపుమాటపొం దూహించు
దళితాబ్జముఖితిన్నఁదనము మెచ్చు
"తనయొప్పెదురఁ గన్నఁ దగిలి యెవ్వరికైన
నులఁగి క్రమ్మరఁ జూడవలయువాఁడు
తనవర్తనము విన్న మునిజనంబులకైన
నలవరించుకొనంగ వలయువాఁడు
తనబంటుతన మాజిఁ గనినమార్తురకైన
బలుమాఱు నగ్గింపవలయువాఁడు
తనవితరణకేళి వినినఁ గల్పకతరు
వులకైన దలయూఁప వలయువాఁడు"

ఛందఃపరిగ్రహణమునందుఁ దిక్కనచూపిన మెలఁకువ లనేకము గలవు. వానిని సమగ్రముగ వ్యక్తీకరించుట కిది యదనుగాదు. ప్రస్తుతమున కీయుదాహరణములు చాలును.

నాటక మనఁగాఁ జేష్టానుకృతి యన్నమాట. ఈ చేష్టానుకృతిని శ్రవ్యకావ్యకర్త లనేకవిధములుగా సాధింతురు. ప్రత్యక్షముగా నొకపాత్రస్వభావము వర్ణించుట యొకమార్గము. కాని యందుఁ జమత్కృతి లేదు. నాటకీయత నది యసలే సంపాదింపలేదు. కవిబ్రహ్మ యీచేష్టానుకృతి నెట్లు సాధించెనో వివరించుటకిట నొక్కయుదాహరణ చాలును. కీచకుఁడు ద్రౌపదిని వెన్నంటి తఱుముచుండెను. ఇట మూలమున 'అనుజగామ' అనియొక్కమాటమాత్రమే గలదు కాని యీమాటవలన మనకుఁ దెలిసినది చాలతక్కువ. కీచకునిలోని యౌద్ధత్యము, శౌర్యకౌటిల్యములు మనకు దృగ్గోచరములు కావలెను అట్లే ద్రౌపదియందలి సౌకుమార్యము, దివ్యత్వము, ఆతురత, భయము మనకుఁ బ్రత్యక్షము గావలెను. అట్లు వివరించినప్పుడే యాఘట్టము మనకు నాటకమునందువోలె సాక్షాత్కరించును. కవిబ్రహ్మ దీని నెట్లు సాధించెనో యీక్రిందిపద్యమువలన సహృదయు లెఱుంగఁ గలరు.

"సమదవారణము జంగమలత వెనుకొని సరభసంబునఁ బట్టఁజనువిధమున క్రూరదానవుఁడు భూచారినిర్జరకాంత బొదువురయమ్మునఁ బోవుభంగి ఘోరగృధ్రము సుకుమారనాగాంగనఁ బటుగతినొడియంగఁ బాఱుకరణి బబలబిడాలంబు బాలశారికమీఁద నడరినత్వరముగ నఱుగుమాడ్కి"

ఈవిషయమును గూర్చి యెంతైన వ్రాయవచ్చును. నేఁడు నాటకీయత యనుమాట ననేకులు సరిగా నర్థము చేసికొనుట లేదు. నాటకమును జూచుటవలన నేయేయనుభూతివిశేషము లెంతసుకరముగఁ బ్రేక్షకలోకమునకుఁ గలుగునో యాయాయనుభూతివిశేషము లంత సుకరముగ శ్రవ్యకావ్య పఠనమువలన భావుకులకుఁ గలుగవలయును. ఇది నాటకీయతకు సరియగునిర్వాచనము. దీనిని సంపాదించుటకొఱకు శ్రవ్యకావ్యకర్త లవలంబించు మార్గములు శతధా, సహస్రధా భిన్నములై యున్నవి. ఆయామార్గము లన్నియుఁ గవిబ్రహ్మకు క్షుణ్ణములు. నాటకీయత యనుదానిని సర్వదా యాదరించి సమగ్రముగ సాధించిన మహాకవి కవిబ్రహ్మ.

# శివరాత్రిమాహాత్మ్యము–కావ్యత్వము

చిలుకూరి పాపయ్యశాస్త్రి.

(గతసంచిక తరువాయి)

ఇట్టిఘట్టములందు సంయమము గలిగియుండుట కవికి మిక్కిలి కష్టము. ఆమె యనిన మాటలివి.

"ఎన్నియో వికల్పములు గలుగుచున్నవి. అపాయము లెదురుగ నటించుచున్నవి. విఘ్నము లెన్నియో పొడలుచున్నవి. శంక లంకురితము లగుచున్నవి. వికృతు లావిష్కృతము లగుచున్నవి. రట్టు సాగుచున్నది. వీని కన్నిటికి నోర్చి నేను నీ కోర్కె తీర్చెదను. నన్ను నీకిచ్చుట తగదా! కాని యీ శరీర మెప్పటికి నిత్తునో? లేక యిప్పటికిఁ జాలునో? నిక్క మెఱుఁగఁ జెప్పుము."

ఈప్రశ్నమునందే యామెకుఁ గలధీరోదాత్తత పరిస్ఫుటమైనది.

శ్రీనాథుఁడు స్త్రీలౌల్యము గలవాఁడని, యాతనిశీలము తీర్చిదిద్దుటకు "అనుచు విప్రుండు తమకించి యంటుకొనియె" నిత్యాది పద్యమును తార్కాణముగా ప్రభాకరశాస్త్రిగారు శృంగార శ్రీనాథమునను క్రీడాభిరామపీఠికయందును చేర్కొనియున్నారు. కాని యీ ప్రకరణమున శ్రీనాథుఁడు సుకుమారుని చండాలాంగనాసంగముచేఁ బతితునిగాఁ జేయుటకై యాతనియందుద్రేకమును, చండాలాంగనయందు ధీరోదాత్తతను, జిత్రించుటకుఁ బ్రసక్తుఁడై నట్టులు స్పష్టముగ గోచరించును. మాలెత తనయంటరానితనమునకు సంకోచించుచుండ, విప్రుండు తమకించి యంటుకొనుటయే పైపద్యమునందలి విషయము గాని యిచట నశ్లీలార్థమును స్ఫురింపఁజేయుటకుఁ గాదని, తరువాతి యీ విషయము తార్కాణించుచునేయున్నది.

మాలెత చేసినప్రశ్నమున కీక్రిందిపద్యము వివరణము.

గీ. మొదలఁ గత్తిపడి కూడి పిదపఁ బాయు
నొక్కకమలాననకు డక్కి యుండఁజాలఁ
డడవిఁ బెక్కుపుష్పంబులయందు వ్రాలు
చంచరీకంబు మగవాఁడు సరియ సువ్వె!

దీనికి సుకుమారుఁ డిట్లు బదులుపలికినాఁడు.

క. మగవారల నిందింపకు
తగవును బంతంబు నిజము ధర్మము కృపయున్
మగవారికిఁ గా కెందును
మగువలకుం గలదె చంద్రమండలవదనా !

ఇట్లాయిరువురు నొకరి కొకరు నీడఁబోవనియుక్తులతో మగ యాడువారల మేలుకీడులను వ్యక్తీకరించిన వెనుక, చండాలకన్యక, "మగవారల మంచితనము నాడువారల మంచితనము సరియ; మనకు మనయాడికలు తప్పకునికి చాలు"నని యిట్లు ప్రతిజ్ఞచేసినది.

ఉ. నాకు మనంబునిండ నొకనమ్మిక సేయుము విప్రవర్య ! నేఁ
గైకొనువాఁడ నిన్ననుము; కాదన కెక్కడికైన వచ్చెద
న్నీ కొక టయ్యెనేని యవనీసురమన్మథ ! నిర్విశంకత
న్నాకముఁ జూఱవెట్టెద ధనంజయ తీవ్రశిఖాముఖంబునన్.

ఈచండాలకన్యను శ్రీనాథుఁడు త్తమపాత్రఁగా సృష్టింపఁదలఁచి యామెచే నొకసతీమణి సేయుప్రతిజ్ఞను జేయించినాఁడు. "నాకుమనస్తుష్టిగ నమ్మకము గలుగునట్టులు నిన్ను నేఁ గైకొనెద ననుము; కాదనకుండ నీవెంట నెక్కడికైనను వచ్చెదను. భూసురమన్మథ ! నన్నుఁ గైకొనినవెనుక నీ కేదేని యపాయము తటస్థించిన, నిస్సంకోచముగ నీవెంట నగ్నిలో దుమికి సతీమణినై స్వర్గము చూఱగొందును." చండాలకన్యచే ని ట్లనిపించుటలో నామెశీల మత్యుదాత్తమై యెసఁలారినది. శ్రీనాథునిదృష్టిలో సహగమనముసేయుట యుత్తమసతీమణి లక్షణము. పతివెంట నగ్నిలో దుమికినసాధ్వికిఁ గలయుత్తమత్వము కాశీఖండమున శ్రీనాథుఁ డెంతయు నగ్గించినాఁడు.

గీ. ఎన్నికకు రోమకూపంబు లెన్నిగలవు
దివ్యవర్షంబు లన్ని మోదించు సాధ్వి
నాకభువనంబునం దాత్మనాథుఁ గూడి
తెఱ పాకింతయు లేక చిచ్చుతికనేని.— కా శి. 2-91.

అట్టిలక్షణము నీచండాలకన్యకుఁ గూర్చిపెట్టుటలో నీమెశీల మత్యు దాత్తమైనది. మాలెతె అంత్యజాతిసంజాత యయ్యు నుత్తమనాయి కగా నిటఁ జిత్రితమైనది ఈఘట్టమున సుకుమారునిచే సమ్మతింపఁ జేసినతీరు కడుసుకుమారము.

సీ. కలహంసనంపదఁ గలకలశ్రీంకార
        కలకలంబైన యీ కొలను సాక్షి
ప్రచ్ఛాయ శీతలోపరిభాగమైన యీ
        శశికాంతమణిశిలాస్థలము సాక్షి
ప్రసవసౌరభవటద్భంభరంబైన యీ
        వలని లతామండపంబు సాక్షి
తరులతాగుల్మ సంతతపిధానాతప
        వ్యాపారమైన యీ వనము సాక్షి
మకరకేతను పాదపద్మములు సాక్షి
రతిమహాదేవి జఘనభారంబు సాక్షి
సత్య మెన్నఁడు నిన్నుఁ బాయ సమ్మతించి
కాఁగిలింపఁగ నీఁగదే కమలవదన !

సుకుమారుఁడు తా నామె నెన్నఁడును బాయనని తెలిపి సమ్మతింపఁజేయుటకై, యాసరోవరసన్నిహితమైన రమణీయవస్తుజాత మునే సాక్షులుగాఁ జేసినట్లు చిత్రించిన యీపద్యము నిరుపమానము. సరోవరసంపదయై వెలయు జలపక్షివిరావము, లతామండపనటద్భం భరముల మధురగానము, నిచట జతగూర్చి సరోవరమును లతామం డపమును సాక్షులుగా నొనర్చుటలోని యౌచిత్య మనిర్వచనీయము. శశికాంతమణిశిలాస్థలమును వనస్థలిని సాక్షులుగాఁ జేయుటలో శీతల రమణీయపరికరము గూర్చినాఁడు. మన్మథునిపాదపద్మములను రతిదేవి జఘనభారమును ప్రకరణోచితముగ సాక్షులనుజేయుటలో శ్రీనాథుని భావనానైపుణి యబ్బురపాటును గలిగించునది. ఈపద్యము చెవిని బడినంతనే మాధుర్యానుభూతిచే స్పందింపని సహృదయహృదయ

ఘుండఁబోవ దని నానిశ్చయము. ఈపద్యక్రమమునఁ జిత్రించిన ప్రకృతిరామణీయక మూహాతీతము. శృంగారరసభావసముద్భూతికై కూర్చి పెట్టిన యీకూర్పులో పాఠకహృదయమున పవిత్రభావ సంచారము గావించెడి లలితమధురపదసంయోజనము గావించిన శ్రీనాథుని ప్రతిభ యద్వితీయమై యెసలారినది. శ్రీనాథునికవితాపాటవము నెఱిఁగించుట కీపద్య మొక్కటియే చాలును. సుకుమారుఁ డట్లు నమ్మిక గలుగునట్లు పలుకఁగాఁ జండాలి కరారవిందంబులు జోడించి సవినయముగ సగౌరవముగ సానురాగముగఁ 'దనజన్మసఫలమైన' దని తెలిపియుఁ బంచమునియింటఁ గలుగుబీభత్సు నెఱిఁగి నన్ను నీ కెట్లీయఁగ దగినదను? అధికతరమన్మథాయత్తునకు నీ కీయకుండ నెట్లుండఁ గలిగెద ? నని పలికినది. తనప్రాణరక్షకై సుకుమారుఁ డెట్టియకార్యమునైనఁ జేయుదునని తెలిపి 'ప్రాణంబు రక్షింపు మిదె నా సేవాంజలి'యనినాఁడు. అప్పటి కావెలివాడచేడియ యంగీకారముచూపి,

శా. వాలాయంబుగ నర్థరామదుఁడు ద వ్వాంఛిన స్కంధమా
సాలంకారమనోజ్ఞమైన ముఖ మెుయ్య న్వాంచి చండాలి యా
లీలాభావ మెఱింగి యేఁగి నతవల్లీకుంజమధ్యంబునన్
గేలీతల్పము దీర్చెఁ బో మృదులకంకేలీ ప్రసూనంబులన్.

అనంతరంబవ్వసుధానిలింపుఁ డపహసితసురసిద్ధగంధర్వ విద్యాధరలీలావతీవిలాసవతి యగునవ్వెలివాడచేడియం గూడి సురత సౌఖ్యం బనుభవించె;నింతలోఁ బ్రొద్దుగ్రుంకెను.

ఈవిధముగరసభావసంవిధానము గావించి శ్రీనాథుఁ డీప్రబంధమున సంభోగశృంగారమును చండాలీ సుకుమారాశ్రయముగ నిర్వహించియున్నాఁడు. చండాలీపాత్ర నెంతయు సహజముగఁ దీర్చిదిద్దినాఁడు. ఈప్రకరణమున నశ్లీలము జుగుప్సావహము నైన భావమే పాటియు సహృదయులకు స్ఫురింపనేరదనియే నాయూహ. రసనిర్వ

హాణవిషయమున సంయమ మెంత పాటింపవలయునో యది యం తయు నిచటఁ బాటింపఁబడినది. శ్రీనాథుఁడు నిజమునకు స్త్రీలోలుఁ డే యైనచో, చండాలితో సుకుమారుని బూసెజ్జకుఁ జేర్చినపు డెం తటి బీభత్సముగ వర్ణింపవలసియుండెనో? తరువాతప్రబంధకవు లెవ్వరైన నిట్టిఘట్టములందు శ్రీనాథునివలె మానము దాల్చియూర కుండిరా? అట్టిచేత శ్రీనాథునకు వలనుపడునది గాదు. రసోచితసం యతభావానుప్రవేశమే యాతఁడు చేయఁగలిగినది. ఈసన్నివేశమున శృంగారము హెచ్చుగనుండె ననినారు విమర్శకులు. ఆమాట యెంతగఁ బాటింపవలయునో సహృదయు లెఱుంగుదురు గాక.

చంద్రోదయ మైనప్పుడు చండాలకులవరారోహ వాహకుం డెక్కి విడిచిన వారువంపుఁగొదమయుం లోలె సంభోగంబునం దృప్తి చని తనివోవక సుకుమారుఁ గౌఁగిటం జేర్చి యిట్లనెను. "అదె వేఁట పల్లె. యావల మాలవాడ. దాని సమీపమున సెలయేఱు. దాని కావల భద్రకాళియాలయము. నీ వమ్మహాస్థానంబున వసియింపుము. ఏను నీకు నాయావేళలఁ బరిచర్య సేయుచు వంచన బయల్పడకుండ మెలఁగెదను." చండాలకులవరారోహ యాతని వంచన బయలు పడకుండ మెలఁగెద నని చేసిన ప్రతిజ్ఞప్రకారమే మెలఁగుటకు మొదలిడెను. సుకుమారుఁడు కపటబ్రాహ్మణవృత్తితో దేహయాత్ర గడుపుచు నామెతోఁ గవఁగూడుచుండెను.

గీ. మాధుకరభిక్షలను స్వయంపాకములను
సత్రభోజనములఁ బితృశ్రాద్ధములను
విందులను దేహయాత్ర గావించు నతఁడు
వేదశాస్త్ర పురాణ ప్రవీణుఁ డగుట.

ఈవల నాతఁడు వేదశాస్త్రపురాణనిపుణుఁ డగుటచే కపట బ్రాహ్మణవృత్తి చెల్లిపోవునట్లు దేహయాత్ర గడుపఁదొడగెను. చండాలికూడ నాతనితో రహస్యముగనే గవగూడుచుండె నఁట.

సీ. నీరాటనెపముగా నిర్ఝరంబుల కేఁగి
సవిధనీవారకుంజముల నొందు
భూధరంబుల కిప్పపువ్వు దేనని పోయి
కందరామధ్యభాగముల నొందు
శిఖరీంద్రవరకన్య సేవింప నని పోయి
వత్త్రమూలముల నెన్నడుము నొంగుఁ
గలమసస్యక్షేత్రములకుఁ గూళ్లొగి మోసి
శణవాటికాప్రదేశముల నొందు

నెట్లు కనుఁబ్రామి వచ్చునో యింటివారి
నెట్లు చీకటి నొంటిపై నింటి కరుగు
నతివ పగలైన మాపైన నతనితోడ
నిచ్చ లొకసారి సాగించు నిధువనంబు.

ఇచట చండాలి గావించిన చౌర్యసురతప్రసక్తిని వాచ్యము చేసి వివరించుట దోష మనియు, అట్టిస్వభావ మాతనికి లేకున్న నీవృత్తాంతము నింతగఁ బ్రపంచింపఁగలుగునా? యని శాస్త్రిగారి యాక్షేపము. ఇచ్చటి యీవర్ణన మైనను సహజముగను సభ్యముగను గొనసాగినదే గాని, వేఱొకతీరున సాగనేలేదు. ఇట్టిచౌర్యసురతప్రసక్తి లేకున్న వంచన బయల్పడిపోవునుగదా!

ఇంతకు నీప్రబంధమున నష్టాదశవర్ణనలు సమన్వితము చేసెదనని ప్రతిజ్ఞ కావించియే యున్నాఁడు. సురతవర్ణనముకూడ నష్టాదశవర్ణనములలో నొక్కటి. దాని కీతావునందే వర్ణించునవకాశము గలదు. సుకుమారుఁడు కపటబ్రాహ్మణవృత్తితో నుండి చండాలితోఁ జౌర్యరతములఁ బ్రసక్తుఁడైననాఁడుగాని యాతనికిఁ బతితత్వము పరాకాష్ఠ నందఁజాలదు. ఇట్టిరహస్యవర్తన మేర్పడినపుడుగాని, సమీపవర్తులైన విప్రు లాతని వెలివెట్టుట, తత్సంపర్కదోషనిరాసకై యుత్తప్తకృచ్ఛ్రచాంద్రాయణాదివ్రతము లాచరించుటయుఁ

బొసఁగ నేరదు. సుకుమారుఁ డావెలివాడచేడియతో నచటఁ గాపురిం చుటయుఁ గుదరదు.

శ్రీనాథుని శృంగారిఁగా నిరూపింపఁదలఁచిననాఁడు చండాలీబ్రాహ్మణబ్రువసంభోగసంభార మశ్లీలముగాఁ దోఁచినది. ఇట్టి యశ్లీల భావము రామకృష్ణుఁడు పాండురంగమాహాత్మ్యమున పతితుఁడైన నిగమశర్మను ప్లవకన్యతోఁ గూర్చిననాఁడు చూపట్టలేదు. శ్రీనాథుని యెడ సద్భావము సడలినపుడు పై పద్యమున 'నిధువనము' గూర్చుట దోసమై తోఁచినది. శృంగారభావనిబంధనము విషయముననే విమర్శకులు దృష్టిని సారించినారు గాని, తదితరవిషయములపై దృష్టిని సారింపనేలేదు. ఈకావ్యమునం దాతఁడు భక్తిభావసమున్మీలనము నెట్లు గావించినాఁడో దానిపొంతకుఁ బోయినవారే లేరు. శివరాత్రి మాహాత్మ్యప్రతిపాదనమున కుపష్టంభకముగ హేమంతశిశిరర్తువుల విభవము నెంతమనోహరముగఁ జిత్రించినాఁడో దానిఁ గనుఁగొనువారైన లేరు. ఏభావమును జిత్రింపఁదలఁచినను ఔచిత్యమునకు భంగమే పాటియు లేకుండినవిధమున నిందు రచన సాగినది. మధురోదాత్త భావములు విరివిగ జతఁగూడిన దీశివరాత్రిమాహాత్మ్యమునందే యనుట తథ్యము. ముందుగ నిందలిభక్తిభావసమున్మీలనమునుగూర్చి కొంత వివరించెదను

## భక్తిభావావిష్కృతి.

స్ఫురించినపుడు శివుని స్తుతించు

ఘట్టము.

గీ. పశువులము మేము హర! పశుపతివి నీవు
పశువులకు నెక్కుడిది బుద్ధి ఫాలనయన
రాజశేఖర! నేర్పునేరములు చూడ
కరసి రక్షింపు మమ్ము నత్యంతకరుణ.

ఈప్రార్థనము శ్రీనాథుని శివభక్తిభావము నావిష్కరించుచున్నది. శివుఁడు హర్యక్షులను గరుణించినరీతి.

మ. అవధానంబున నాకు సంశ్రయము సేయ న్సర్వదా మీకు న
ధ్యవసాయం బొడఁగూడె నేని వినుఁడా! యంభోజదృగ్భారతీ
ధవులారా! విని యాచరింపుఁడు మదిం దాత్పర్య మొప్పంగ శ్రీ
శివరాత్రివ్రత మస్మదీయ మది దాక్షిణ్యంబునం జెప్పితిన్.

ఈశివరాత్రివ్రతవిధానము శివునినోట నిచట వివరించుట, తుదిని శివగంగాతీరమున శివరాత్రినాఁడు విప్రులచే నావ్రతము నాచరింపఁజేయుటలో, శ్రీనాథున కాశివరాత్రివ్రతముపట్ల నెంతటి భక్తిభావము గలదో విదితమగుచున్నది. వింధ్యారణ్యమున నర్మదానదీతీరభూమిని వటవృక్షముక్రింద నుండెడి యోంకారశంకరు నెట్లు చిత్రించినాఁడో కనుఁడు.

సీ. మకుట దేవకిరీట మణిమయూఖచ్ఛటా
పటల కిమ్మీరాంఘ్రి పంకజుండు
వికటపాటలజటా మకుటకోటిఘటిత
కోమల తారకా కాముకుండు
గంధదంతావళి క్రవ్యాదరాట్కృత్తి
కంథాధురంధర కంధరుండు
కుంభినీధరసుతా కుచకుంభమృగమద
స్థాసకస్థగిత వక్షస్స్థలుండు
శంభుఁ డోంకారనాథుండు శాశ్వతుండు-
పాయకయ యుండు నవ్వీటిపరిసరమున
నర్మదాసింధుతీర కాంతారభూమి
మఱ్ఱి యనుపేరి కల్పద్రుమంబు మొదల శివరా. 2.6.

పరమేశ్వరదివ్యవిలాసము నీపద్యమునం దత్యుదాత్తముగాఁ జిత్రించిపెట్టియున్నాఁడు. ఈప్రబంధమునం దేవిషయ ముపక్రాంతమైనను నది యత్యుత్తమగతిలో నడచినది. సంతానప్రాప్తి దవ్వాయి

నపుడు యజ్ఞదత్తునిభార్య సుశీల యోంకారశంకరుని సేవించినక్రమము కనుఁగొందము.

ఉ. ఆచపలాయతాక్షి కనకాంబురుహంబులఁ బూజసేయు విం
ధ్యాచలకందరానిలయు నద్రిసుతాప్రియనాథు నర్మదా
వీచిపరంపరాసలిలవిప్రుడు దాశ్రయశీతలగంధవా
హాచమనప్రవృద్ధభుజగాధిపకంకణు నోంకృతీశ్వరున్.

వణిక్పథపురసమీపమున శేషప్రతిష్ఠితుఁడైన నాగేశ్వర లింగమూర్తి చిత్రిణాసు.

గీ. అందు శేషప్రతిష్ఠితుం డమృతదివ్య
లింగమంగళమూర్తి ఖట్వాంగపాణి
యర్ధశశిమౌళి నాగేశ్వరాహ్వయుండు
ప్రతివసించు ననేకకల్పములనుండి.

సుశీలచే నోంకారశంకరు నర్చింపఁజేసినక్రమములో స్త్రీలుసైత మానాఁడు బరమేశ్వరునెడ నెట్టిభక్తిభావము గలిగియుండెడివారో వ్యక్తమగుచున్నది.

సీ. అభిషేక మొనరించు నళినీలకుంతల
శంభు సోమోద్భవాసలిలధార
నెలఁత యభ్యర్చించు నీలోత్పలంబులఁ
దరుణనిర్మల సుధాధామమౌళి
గరళకూటగ్రాస కల్మాషకంధరు
మేన గంధ మలందు మీననేత్ర
యర్పించు దివ్యోపహారంబు లెలనాఁగ
కుటిలకుండలిరాజకుండలునకు
నతివ దిరుగఁ బ్రదక్షిణం బభవుగుడికిఁ
గుచభరంబున నరగాను గూనుగిలఁగ
గవలిమట్టెలమ్రోఁతతో రాయిడింపఁ
జరణ నూపుర ఝుళంఝుళరవంబు

మాలెత సుకుమారు నుత్తమవిప్రునిగాఁ దనకుఁ బ్రాజ్యునిగా

భావించియున్నది గావున నాతఁడు వసించుటకుఁ దననెలవునకు సమీ-
పమునం దున్న భద్రకాళియాలయము ననువైన వసతిగాఁ దెలుపుచు,

ప్రతిభ సతతంబు గొలుతు రాభద్రకాళి
జగతి నేఁబదియాఱు దేశములవారు
దశదినంబులు సింహకేతనము నిలిపి
హూణభూమికి దైవ మీయుత్పలాక్షి

శ్రీనాథునినాఁడు పరమేశ్వరునందే గాక పరమేశ్వరియం-
దును దేశీయుల కెట్టిభక్తిభావ ముండెడిదో, దీనినిబట్టి తెలియవచ్చు-
నది. ఏయదనునందైన స్వసామయికాచారమును దెలుపుట మఱువని
శ్రీనాథుఁడు, చండాలాంగనాసంగతిచేఁ బతితుఁడైన సుకుమారునిచే
దూరమునుండియే యాభద్రకాళికి మ్రొక్కింపఁజేసినాఁడు. కొంతకాల-
మైనతరువాత సుకుమాగుఁడు చండాలితోఁ గూడి యచ్చోటు వాసి-
పోవలసివచ్చినపు డాతనిచే నాభద్రకాళికి జాతగ చేయించినాఁడు.
పతితునిచేఁ జేయించిన యీపూజయందుసైతము నిష్ఠ గాన్పింపఁ
జేసినాఁడు.

జాతర చేసె బ్రాహ్మణుఁడు చండికిఁ గమ్మని పిండివంటతో
నేతులతోడ మద్దికడ నిర్మలినాన్నముతో రసావళీ
చూతఫలాళితోడ వరసూపముతోఁ జిఱువాలతోడుతన్
నీతులతోడ నప్పు డక నిష్ఠతరంబగు నిష్ఠ పెంపునన్.

పెఱచోటులందు శ్రీనాథుఁ డితరదేవతల కుపహారము లెట్లు సమర్పిం-
పఁ జేసినాఁడో, పతితుఁడైన సుకుమారునిచే నీభద్రకాళికిఁ గూడ
నట్టులే సమర్పింపఁ జేసినాఁడు.

నాగేశ్వరాలయమున సుకుమారునకుఁ గాన్పింపఁ జేసిన జ్యోతి-
ర్లింగమయమూర్తిదర్శనము పూజాపుష్పాలంకారసంస్మరణము శ్రో-
తకు సైతము సకలకలుషహరమైన తీరునఁ గొనసాగినది. పరికింపుఁ
డాయీశ్వరార్చనకళాశీలుని భక్తిభావ నమున్మిషిత రచనాపాటవము-

"సుకుమారుఁడు మదిరామదావిష్టుఁడై యెయ్యానొయ్యన నేతెంచి, గర్భగోళంబునకుఁ జక్కం గట్టెదుర నిలిచి, రక్తకమలదళచ్ఛాయంబు లగుకన్నులు దెఱచి, యవలోకయుంబోలె నిర్మలస్ఫటికమండలాధ్యాసీనుండును, నమృతమయజ్యోతిర్లింగమూర్తియు ముక్తాఫలధవళకాంతియుఁ, ద్రిభువనవందిత చరణుండును, జరాచరగురుండును నగు నాగేశ్వరుని దర్శించి, యమ్మహాదేవు మాళికపాలమాలికామండనఖండేందుశకలంబులకు, గగనగంగాప్రవాహ డిండీరఖండంబులకు, నుష్ణీషఫణిఫణాశకలంబులకుఁ జెలికారంబు సేయుంజాలి, పాంచజన్యసహోదరంబు లన, దుగ్ధాంబురాశిహృదయంబు లనఁ జంద్రికావరణంబు లన, నంగజాట్టహాసంబు ఛేదంబు లన మెండుకొనియున్న పుండరీకంబుల పూజ కనుంగొని"

సకలపాపనిర్మోచనము నందె నఁట. ఈవచనరచనాక్రమమున శ్రీనాథునకుఁ బరమేశ్వరునందుఁ గలభక్తిభావ మత్యుత్కటమై ప్రతిఫలించుచున్నది. పరమేశ్వర మూర్తిపూజాదర్శనముల యెడ నాతనిహృదయ మెట్లుపులకించునో యనువిషయము నీవచనము తెల్లము సేయుచున్నది. ఈకావ్యమునందే దీని కీడయినపద్ధతినే మహాదేవనిశాంతమారుతమునుగూడ వీవఁజేసినాఁడు. శ్రీనాథుఁడు నిశ్చయముగ శృంగారియే యైనచో నాతనినోట యిట్టిహార్దికభక్తిభావమును దులకింపఁజేసెడి పలుకులు వెడలనేర వనియే నానిశ్చయము.

## సామయికాచారములు—నీతులు

ఈప్రబంధము పెక్కువిషయలందు మనుచరిత్రమునకు మార్గదర్శకము; పెక్కువిషయములలో నాప్రబంధమునకు మించిన కవితాప్రాభవము గలదియు నై యున్నది. ఈశానసంహితయందలి కథావస్తువు నామమాత్రమునకు మూలము. స్వతంత్రమైన భావనామయ సృష్టి దీనిలో మనుచరిత్రమునందువలెనే చాల హెచ్చు. వరూథినీపాత్రచిత్రణముకంటెఁ జండాలీపాత్రచిత్రణము కడుంగడు సంయతమై మిక్కిలి మనోజ్ఞమై నడచినది. శృంగారరసనిర్వహణముకూడ నుత్తమస్థాయి నందినది. శ్రీనాథుని స్వతంత్ర మైనయూహలెన్నియో

యిందుఁ బొందుపఱుపఁబడినవి. స్త్రీసామయికాచారముల నెన్నింటినో యిందు జతఁగూర్చి పెట్టినాఁడు. క్రమముగఁ గొన్నిటిని నిరూపించెదను. ఆనాఁడు సంతానలాభము దూరమైనప్పుడు వనితలు వ్రతనియమా దులు పాటించి, దేవతానుగ్రహమున సంతానముఁ బడయుచుండెడివా రనువిషయము సుశీల పుత్రసంతానప్రాప్తికై యొనరించిన క్రియాకలాపము విదితముచేయుచున్నది.

సీ. భక్తితో మాతృకాభవనంబులకు నేఁగుఁ
గావించు నతిథిసత్కారములను
వాయసంబులకు నిర్వర్తించు దధిబలిఁ
గొలుచు జ్యేష్ఠాదేవి నలఘుమహిమఁ
జదివించుకొనుఁ బుణ్యసంహితాఖ్యాతంబు
మూలి కామాణిక్యములు ధరించుఁ
దన్వంగి గంధాక్షతలు చిరంటుల కిడు
విప్రపత్నికల గారవించుఁ దలుచుఁ
గుమ్మరావంబు కడవలు కొల్లలిడుచు
బాలురకుఁ దియ్యపండులు పంచియిచ్చుఁ
జెలులు దానును వ్రతములు సలుపుచుండుఁ
దామరసనేత్ర పుత్రసంతానకాంక్ష.

ఇవ్విధంబునఁ బుణ్యోపవాసవ్రతదానధర్మదేవతారాధనంబులఁ బ్రతిబంధదోషంబులు వాసి సుశీల గర్భవతి యయ్యెను. పూర్వజన్మకృతకర్మదోషమున సంతానప్రాప్తికి నిరోధ మేదేనిఁ గల్గిన, దానిని పుణ్యకర్మాచరణముచేతను, వ్రతములు నెఱపుటచేతను, దానధర్మములు దేవతారాధనము కావించుటచేతను బాపుకొని సంతానముఁ బడయఁగలుగు నాచార మానాఁడుకలదని మనకుఁ దెలియవచ్చుచున్నది. పత్ని అంతర్వత్ని యైనపుడు పురుషసంతానముఁ బడయుటకు, ఆసంతానమున కభ్యుదయము గలుగుటకు పుంసవన సీమం

తాదిసంస్కారములు నెఱపుట యూనాఁటిపరిపాటి. సుశీల విప్రవనిత మంత్రిభార్యయునగుటచే సీమంతోన్నయనవ్రతము మహావిభవముతోఁ గావింపఁబడినట్లు చిత్రించినాఁడు.

సీ. కమ్మగొజ్జఁగనీటఁ గలయంపి చల్లిరి
మేగి మెత్తిరి క్రొత్తమృగమదమున
రంగవల్లులు కప్పురప్రముగ్గు వెట్టిరి
గీలించి రోగి మాల్యతోరణములు
తరుణరంభాతరుస్తంభంబు లెత్తిరి
గట్టి రెల్లెడఁ బట్టుకలవడములు
కమలచంపకమాలికలను నిర్మించిరి
స్తంభించి రుత్తమ దర్పణములు
నాలిఖించిరి గేహకుడ్యములయందు
సర్వతోభద్రమకరికా స్వస్తికములు
పరిజనంబులు రాజాజ్ఞ పట్టణమున
యజ్ఞదత్తుని ప్రథమకల్యాణవేళ.

ఈతీరయిన పట్టణాలంకారము కొండవీటనో రాజమహేంద్రవరముననో మంత్రిభార్య ప్రథమగర్భవతియైనపుడు నెఱపిన దిటఁ జిత్రితమైయుండును. ఈకల్యాణోత్సవములందు నాట్యములు సేయుట పాటలు పాడుట, అందు వేశ్యలు పాల్గొనుటయు నానాఁడు గలదనుట నీపద్యము తెలుపుచున్నది.

గీ. కౌద్య– నృత్యంబు లాడిరి వీథులందుఁ
బాడి రెత్తిలి పికకుహూపంచమమునఁ
బంజళింబున ధవళప్రబంధగీతి
కసుమయువ్వలి కర్ణాటకమలముఖులు

తూర్పుకనుమల కావలనుండెడి కర్ణాటవేశ్య లాయుత్సవము నందుఁ బాల్గొని నృత్యములాడుట కోకిలస్వరముతో ఎత్తిలి పాడుట ధవళములు ప్రబంధగీతి పాడుట నెఱపి రనినాఁడు. కసుమయవ్వలి

కర్ణాటకమలముఖు లనఁగా నేఁటి కర్నూలుమండలమునకుఁ జెందిన వేశ్యలు కావచ్చునేమో ? సీమంతము స్మార్తకర్మము గావున దత్సముచితమైన మంగళోపకరణములుగూడ సముచితముగఁ గూర్పఁబడినవి.

సీ. పూజకుండలు నిల్పె పువ్వుఁబోఁడి యొకర్తు
 శుభవితర్దిక చతుష్కోణములను
జాజాలపాళెల సర్వౌషధులు నించి
 ప్రోక్షించె నొక్క పద్మాక్షి జలము
కాంత యొక్కతె సన్నెకలుఁ బొత్తరంబును
 దోరించె వటశాఖతోడఁగూడఁ
బీఠికంబులు పెట్టె బింబోష్ఠి యొక్కతె
 మడుఁగుఁబుట్టము గప్పె నడుగుమునుఁగ
రమణి యొక్కతె వింజామరంబు దాల్చెఁ
దరుణి యొక్కతె తాలవృంతంబు పూనె
లలన యొక్కతె పసిఁడిసంబెల వహించె
నాలవట్టంబు ధరియించె యోరు

ఆయుత్సవము నెఱపు మంగళవేదిక నాలుగుమూలలందు నొకతె పూజకుండలు పెట్టినది. వేఱొకతె నవధాన్యము నుంచు పాళికలందు సర్వౌషధులు నింపి నీరు చల్లినది. ఇంకొకతె సన్నికల్లు పొత్తరము మఱ్ఱికొమ్మతో దోరించినది. మఱియొక్కతె పీటలు వేసి అంచులు దిగజారునట్లు తెల్లనివస్త్రము గప్పినది, ఒకతె వింజామరము ... విసరినది. ఒకలే బంగారు తాంబూలపుఁ పెట్టెఁ బట్టెను. ఒకయతివ ఆలవట్టము చేతఁ బట్టెను. వైదికాచారములతోపాటు రాజోపచారములు నడచినవి. సుశీల గర్భవతియైనపుడు పుట్టినింటివారు తగవులిచ్చుటలో తెలుఁగు పరిపాటలానాఁటివి గొన్ని రూపితములైనవి.

గీ॥ తగవులిచ్చిరి పుట్టింటి తల్లిప్రజలు
వీళ్లొసంగిరి చుట్టాలు వేనవేలు
కట్నమిచ్చె నృపాలుండు కన్నె దనియఁ
బరమహీపాలు రిచ్చిరి పావడములు

సుశీల సుకుమారుని గనినపుడు సూతికాగృహమునఁ బాటింపఁ జేసినవిధానములు కాదంబర్యనుసరణమునఁ దెలుఁగుపరిపాటిలోఁ నడచినవి.

సీ. తలయంపి ధవళనిద్రాకుంభ మిడువారు
రక్షాభసితరేఖ వ్రాయువారు
గౌరసర్షపరాజి కలయఁ జల్లెడివారు
బలివిధానంబులఁ బరగువారు
లవణంబు నింబపల్లవము ద్రిప్పెడువారుఁ
బ్రేముమంచంబుతోఁ బెనచువారు
గవలధూపంబు సంఘటియించువారును
మంచిముట్టెడఁద యోజించువారుఁ
గదిసి దీవించువారును గండతైల
మందుకొనువారుఁ గాయంబు లందువారుఁ
బాడువారును బరిహాసమాడువారు
నైరి శుద్ధాంతసతు లరిష్టాలయమున

సీ. కర్పూరసమ్మిశ్రిత గంధసారంబున
జలుచెఁ జప్పట భిత్తిఁ జామ యొకతె
వెల్లకిలఁ బెట్టె నుత్పలగంధి యొకర్తు
గప్ప గర్భగృహోపకంఠభూమి
జ్యేష్ఠాధిదేవత సేవించె నొకయింతి
పసుపుఁబుట్టము గట్టి భిత్తిగరిమఁ
బటముపై లిఖియించెఁ బాటలాధర యొర్తు
క్రొత్తలత్తుక శశాంకుని ఖరాంశు
జరఠమేషంబు కంఠదేశమునఁ జుట్టెఁ
బుష్పదుందుభముల నొకర్తు పువ్వుఁబోఁడి
యంబుజానన యొకతె నెయ్యభిఘరించె
భుజగనిర్మోక మొకతె నిప్పులఁ గమర్చె

ఈపద్యములు రెండిటను గూర్చిపెట్టిన సూతికాగృహనిర్వర్తిత విధానములు చాలవఱకుఁ గాదంబరిలోఁ గూర్చిపెట్టినవియే. వీనిలో శ్రీనాథునినాఁటి తెలుఁగునాఁటను బాటింపఁబడెడి పరిపాటులుగూడఁ గొన్నిగలవు. ఉప్పు వేపచిగుళ్ళతోఁ గూర్చి దిగతుడుపు వెట్టుట, మంచిము ట్టైదలో యోజించుట, కాయము లందిచ్చుట, మున్నగునవి కొన్ని తెలుఁగునాఁటివి.

ఆనాఁటి విలాసవంతులైన యువకులు గావించెడి వినోద చేష్టితముల నిట్లు పేర్కొనినాఁడు.

సీ. ఒకకాంతపొద్దు కందుకక్రేళి యొనరింపుఁ
గంకణంబుల ఝుణత్కార మెసఁగ
నొకకాంతపొద్దు వల్లకి నఖాగ్రంబుల
బహురాగముల నేర్పుఁ బ్రస్తరించు
నొకకాంతపొద్దు భాండకజనంబు లొనర్చు
పరిహాసగోష్ఠికిఁ బల్లవించు
నొకకాంతపొద్దు లోకకథా ప్రహేళికా
బిందుమత్యాదులఁ బిచ్చలించు
గొంతపొద్దు వినోదించుఁ గొఱఁతలయువ
తోడిపేడుకకాండ్రతో మేడమీఁద
విమల చంద్రోదయారంభ వేలయందుఁ
బిల్లదీవాటులను మల్లుపెనఁగుటను

దుర్వ్యసనములకుఁ బాల్పడిన యువకులైనవారికి నాఁడును నేఁడును వినోదోపాయము లిట్టివియే. చండాలి తన్నుఁ జేపట్టినపుడు సుకుమారునకు వినోదోపాయములుగాఁ దెల్పినవిషయములు కూడఁ బైవిషయమునే సమర్థించును. "సర్వకళావిశారదుండవైన నీకుం బ్రాకార గోపుర ద్వార వేదికా ప్రఘాణ కుట్టిమ హట్ట సౌధవీథీ విటంకంబులం గావ్యగోష్ఠి పరిహాసకథా బిందుమతీ భిత్తికా ప్రహేళికాభావన సుభాషిత శ్రవణంబు, వారవిలాసినీదర్శనంబు, వైతాళికస్తుతిపాఠకంబు, దురో

దరక్రీడ, చిత్రకర్మంబు, వీణాస్ఫాలనంబు, మొదలయిన వినోదంబులఁ బ్రొద్దుఁబుచ్చం గలిగెడి,

సీ. కాశిలోఁ జక్రపుష్కరిణి దుష్కరశుష్క
        గహనావళీదావదహనజిహ్వఁ
గుక్కుటేశ్వరవరకుండి పీఠపురి శం
        కాతమస్కాండచండాంశుదీప్తి
దక్షవాటంబు సప్తర్షి గోదావరి
        కలిదోషపాషాణకులిశధార
గౌతమీతటిని మార్కండేయపురిమ్రోల
        దురితాహిసంఘాతగరుడమూర్తి

నిన్నిటను దీర్థమాడంగ నేఁగుదెంతు
రఖిలమానవులఁ బ్రభాతసంధ్యాగమముల
గ్రహగణేశుండు కోదండరాశిఁ బాసి
మకరమున కేఁగుదేరంగ మాఘవేళ. శివరా. 4-28.

సూర్యుఁడు మకరరాశిలోఁ బ్రవేశించి మాఘమాస మేతెంచి నపుడు పుణ్యతీర్థములందు మును లందఱు సాయంప్రాతస్సంధ్యాసమయములందు స్నానముసేయ వత్తురని తెలిపియున్నాఁడు. ఒక్క కాశిలోని చక్రపుష్కరిణి వీడినచో మిగిలినతీర్థములు మూఁడును పీఠికాపురము దాక్షారామము రాజమహేంద్రవరమును భీమమండలికిఁ జెందినవియే. దీనినిబట్టి యానాఁడు భీమమండలిలోని పుణ్యతీర్థములకు పెక్కురు పుణ్యార్థులు స్నానార్థమై యేతెంచుచుండెడివారని తెలియుచున్నది. మఱియు నీక్రిందివచన మీవిషయమును బలపఱుచుచున్నది.

"కాశి శ్రీశైల కుంభఘోణ శోణార్క కాంచీ కాంచనసభా కాళహస్తికురుక్షేత్రాది పుణ్యస్థానంబులం గూప వాపీ తటాక కుండికా ప్రస్రవణ స్రోతస్వినులం బ్రత్యూషకాలంబులం బరమర్షి సార్థంబు తీర్థంబాడె"

ఈకావ్యము శివరాత్రిమాహాత్మ్యప్రతిపాదనమునకై యుపక్రాంతమైనది కావున, ఆనాఁడు విప్రులు పాటించెడి నియమముల నిట్లు వాక్రొనియున్నాఁడు.

సీ. శివగంగఁ బుణ్యాభిషేకంబు దీర్చిరి
దలి నొనర్చిరి మూఁడుతర్పణములు
ధరియించి రంబునిర్ధౌతవస్త్రంబులు
నాచరించిరి బ్రహ్మయజ్ఞతంత్ర
మర్ఘ్యాంజలిక్షేపణానంతరమ్మునం
దొనరించి రంశుమంతున కుపాస్తి
గృహదేవతార్చనక్రియ లాచరించిరి
యభ్యాగతులకు నర్హణలు నడిపి
రతనిసుత లెల్ల నాగేశ్వరాలయమున
కేఁగుదెంచిరి ప్రణమిల్లి రీశ్వరునకు
... ... ... ... ... నాల్గుజాలు పూజ
లాదిసంకల్ప మొనరించి రభవుమ్రోల.

— శివరా 4-34

ముందుగ పుణ్యతీర్థమునందు స్నానముసేయుట, స్నానాంగదేవర్షి పితృతర్పణములు నెఱపుట, తడిబట్టలు దాల్చుట, బ్రహ్మయజ్ఞము నాచరించుట, సంధ్యావందనానంతరమున సూర్యోపాస్తి నెఱపుట, గృహమందలి దేవతల నర్చించుట, అభ్యాగతులను బూజించుట, యను నిత్యకృత్యములు నెఱవేర్చుకొనిన పిమ్మట, శివరాత్రివ్రతపూజావిధాననిర్వర్తనమున కాలయమునకు వచ్చుట యనునవి, ఆనాఁడు నీనాఁడుగూడ వైదిక కర్మాచరణనిష్ఠులయిన బ్రాహ్మణగృహస్థులకుఁ గర్తవ్య మనువిషయము దీనియం దాసూత్రితమైనది.

ఆనాఁడు శివరాత్రివ్రతపరాయణులు నిర్వర్తించెడి పరిపాటుల నిట్లు తెలిపియున్నాఁడు.

గీ. దరంబున సమ్మార్జనానులేప
ధూపపటువాసనలు తైలదీపములును
సంఘటించిరి వివిధసంస్కారవిధుల
బ్రాహ్మణులు నర్హులైనట్టి పౌరజనులు

ఈనాఁడుకూడ శివరాత్రినాఁ డీశ్వరాలయమునందుఁ బుణ్యార్థులైన జనులు సమ్మార్జనానులేపములు, ధూపము వేయుట, తైల

దీపములు వెట్టుట నెఱపుచునేయుందురు. భక్తిశ్రద్ధలు క్రమముగఁ దరుగుచున్న యీరోజులలోఁగూడ నీశ్వరాలయములం దీసంస్కారవిధులు గానవచ్చుచునేయున్నవి.

"ఆశివరాత్రి పుణ్యకాలంబునఁ బురాణంబులు వినిపించువారు, నితిహాసంబులు చదువువారును, దురోదరంబుల వినోదించువారును, నష్టావధానంబులఁ గ్రీడించువారును, బంచాక్షరీపంచబ్రహ్మాది మంత్రంబులు జపించువారును, నీలకంఠస్తోత్రంబులు పఠించువారును బ్రాణాయామంబు లనుసంధించువారును బ్రత్యాహారంబులు నడుపువారును, బ్రదక్షిణంబులు సేయువారును, భస్మోద్ధూళనంబు లొనర్చువారును వీణ లాస్ఫాలించువారును, గావ్యగోష్ఠి నెఱపువారును, బరిహాసం బాచరించువారును, బిందుమతి యభ్యసించువారును, బ్రహేళికలు భావించువారును, నాడువారును బాడువారును, మేష కుక్కుట కరేటు లావుక కపింజలయుద్ధంబులు వీక్షించువారును, గుబ్జ వామన కిరాత బర్బర జరఠ మూక జనవికారంబు లవలోకించువారునై జాగరంబులు సలుపుచుండిరి"

ఈపరిపాటులు నేఁటికిని శివరాత్రినాఁటిరాత్రి జాగరముచేసి పుణ్యమార్జింపఁదలచినవారు పాటించుచునే యుందురు. ఏసాధనము నన్నైన శివరాత్రినాఁటిజాగరము మహాపుణ్యప్రదమని భారతీయుల హృదయములలో దృఢముగ నాఁటుకొనియున్న భావము. ఈనాఁ డట్టిసద్భావము కొంతకుఁ గొంత సడలినను, పైనిఁ దెలిపిన వివిధపద్ధతులలోఁదమతమ చిత్తసంస్కారమునుబట్టి జాగరము సేయుట కొన్ని దివ్యశైవక్షేత్రములందుఁ జూపట్టుచున్నది. పట్టిసక్షేత్రమునం దీనాఁడు కూడ వీరభద్రేశ్వరునిమ్రోల వేదపాఠముతో రాత్రియంతయు జాగరముసేయు పుణ్యమూర్తులు నిలిచియే యున్నారు. చిరకాలము నుండి యాంధ్రదేశమునందుఁ బాటింపఁబడుచున్న పరిపాటులెన్నియో యీతీరుగ నీప్రబంధమునం దాసూత్రితములైనవి.

పారదార్య మనువ్యసనము బహుళానర్థములకు నిదానమగు నను విషయ మీప్రబంధమున మిక్కిలి సహజముగ వివరింపఁబడినది.

ఆవ్యసనమునకుఁ బాల్పడినవారి కేర్పడువికారములు, వారివర్తనములు వారుసేయుపనులను సమర్థించుకొనువిధము . దేశకాలానుగుణముగ నుదాత్తసరణిని జిత్రింపఁబడినది. సుకుమారుఁ డుద్ధతుఁడై వీటిలోని యందగత్తెలను వెదకి సంకేతములకుఁ దార్చి రతికేళి సలుపుచుఁ దన్నిట్లుసమర్థించుకొనినాఁడు.

గీ. పద్మనాభుండు మదన గోపాలమూర్తి
ఘోషమున నెట్లు వలపించె గొల్ల సతుల
నెట్టుకొని యట్ల వింధ్యాంద్రిపట్టణమునఁ
బరపురంధ్రుల వలపించు బ్రాహ్మణుఁడు

శ్రీకృష్ణుఁడు యోగయోగేశ్వరుఁడుగావున ఘోషమునందలి గొల్లసతుల నందఱను వలపింపఁగలిగి, అస్ఖలితబ్రహ్మచర్యముతో రాసక్రీడాదికము నెఱపఁగలిగినాఁడు. వలపించుటయందే శ్రీకృష్ణునిసామ్యముగాక తదితరవిషయమున సైతముగావలయు నను నూహ యెవ్వరికిని బొడమదు. ఆతనివలె విషభక్షణమునకు దావాగ్నిపానమునకుఁ బూనుకొనువా రెవరు? సుకుమారుఁడు తనదుష్కృత్యము నిట్లు సమర్థించుకొనినాఁడు.

సీ. యమునానదీ సైకతమున జాలరికన్య
చనుదోయి నంటఁడే శక్తిసుతుఁడు
నందవ్రజంబులో నలిననాభుం డెట్లు
విహరించెఁ బదియాఱువేల సతుల
దేవదారువనంబులో విరూపాక్షుండు
ముని భామినుల నెట్లు మోసగించెఁ
గొక్కొరో కోయని కోడియై యెలిఁగించి
యమరనాయకుఁ డెట్లహల్యఁ గలిసె
మొలకచన్నుల పాయంపు ముద్దుఁగూఁతుఁ
బట్టుకొనె నెట్లు పైకొని పద్మభవుఁడు
చంద్రుఁ డెట్లు పొందె నాచార్యులేమ
ననుచు విప్రుండు రమియించు నన్యసతుల.

శ్రీనాథుని తరువాతి ప్రబంధరచయిత లెవ్వరేని ప్రేయసీ ప్రియ సమాగమము ననుసంధానింపవలసినచోట నెట్టులో యొకరీతి నీ భావములు కూర్చిపెట్టుట యొకపరిపాటి కావచ్చినది. పారదార్య ప్రవృత్తిని సమర్థించుట కీయుదాహరణము లెంతయు మనోహరముగా నుండుటచే కవులకు శ్రోతలకుఁ గూడ నిది యుపాదేయమే.

పారదార్య ప్రవృత్తులైనవారు ఇహపరలోక సౌఖ్యసంధాయకములైన స్వకులాచారములకు దూరులై స్వేచ్ఛాచారు లగుదురను విషయ మీ క్రిందిపద్యమున మధురోదాత్తముగఁ జిత్రింపఁబడినది.

సీ. సంధ్యాభివందన శ్రద్ధ యుద్వాసించె
గాయత్రి దప్పులఁ గట్టి పెట్టె
నగ్నిహోత్రము మీఁది యాస నుత్పాటించె
నఘమర్షణ స్నాన మరసి మానె
నిహపరసామగ్రి నీయఁజాలెడు నట్టి
విధి దేవతార్చన వీటఁ బుచ్చె
వేదపాఠము మానె వివిధ సత్కర్మాది
సత్కలాపంబులు జాఱ విడిచెఁ
దనకు మర్గిన వారసుందరవనితల
నిరతసల్లాప సంభోగ నిపుణతాసు
ఖానురాగ నిమగ్నత యనెడి కర్మ
తత్పరుండయ్యె సుకుమారధరణిసురుఁడు.

సుకుమారుఁడు స్వకులాచారముల నుజ్జగించెనని తెలుపుక్రమమున నానాఁటి సన్మార్గవర్తులైనవిప్రులు, సంధ్యావందనము సేయుట, గాయత్రీమంత్రము జపించుట, నిత్యాగ్నిహోత్రము సేయుట, అఘమర్షణస్నానమాచరించుట, నియమపూర్వకముగ దేవతార్చనము సేయుట, వేదాధ్యయనము సేయుట, వేదవిహిత కర్మానుష్ఠానము నెఱపుట యనువీనిని సక్రమముగఁ బాటించెడివా రని తెలియవచ్చుచున్నది. దుర్వ్యసనపరు లిట్టికులాచారముల నుజ్జగించెడివారనియు విదితమగుచున్నది.

## నీత్యుపదేశము

ఉత్తమకావ్యమునకుఁ బ్రధానలక్ష్యము కాంతాసమ్మితముగ నీతి నుపదేశించుట. అట్టి నీత్యుపదేశ మీప్రబంధమునం దమోఘముగ సాగినది. దానికి కాదంబరియందలి శుకనాసోపదేశము మూలప్రాయముగ నుండినను, తదనుసంధానముమాత్రము తెలుఁగు పలుకుబడిలోఁ గడుమధురముగ సాగినది.

గీ. అదిగర్భేశ్వరత్వంబు యౌవనంబుఁ
జక్కఁదనమును నతిసాహసంబుఁ జనవు
నొక్కొకఁ డొక్కఁడు చాలు దోషోత్కరమున
కన్నియును గూడియున్నవి యతనియందు.

ఆగర్భశ్రీమంతుఁడగుట, క్రొత్తగా యౌవన మావిర్భవించుట, అందగాఁడగుట, సాహసము గలిగియుండుట, చన వేర్పడియుండుట యనువీనిలో నేయొక్కటియుండినను నది యనేకదోషములు పుట్టుటకుఁ దావలమగును. అన్నియుఁగూడి యున్నవానికిఁ గలిగెడి దోషముల కవధి యేముండు నని భావము. ఐశ్వర్యమదమత్తులగుట సర్వానర్థములకు, వివిధ వికారములు పొడముటకు మూలమను విషయము నిట్లు చిత్రించినాఁడు.

గీ. త మ్మమర్త్యానుష క్తాలోచితంబులైన
కీర్తనంబుల మైపులకించు కొంద్రు
తా మమర్త్యులుగా మదిఁ దలఁతు రహహ
విత్తమదమత్తులైనట్టి వెఱ్ఱిజనులు.

ఐశ్వర్యమదమత్తులైన వెఱ్ఱిజనులు, తమనుండి ధనమును బడయఁ గోరువారు, ఆయాదేశకాలములకు సరిపడని పొగడ్తలచేఁ బొగడునపు డొడలు పులకరింపఁజేసికొందురు. పొగడెడివారు స్వర్గాదిలోకములందుండెడి యింద్రాది దేవతలతోఁ బోల్చి నుతించునపుడు, తాము మర్త్యులై జన్మించినను, అమర్త్యులము (దేవతలము)అనుకొందురు.మర

ణాధర్మముగల మనుజులు మరణములేని దేవతల మనుకొనుటకంటె వేఱొకవెఱ్ఱితన ముండదు. ఐశ్వర్యమదమత్తు లట్టివెఱ్ఱితనమునకుఁ బాల్పడుట సార్వకాలికమైన సత్యము. వారుతమ్మమర్త్యులుగానెట్టుతలతురో యావిషయమునే యీక్రింది సీసపద్యమునం దద్భుతముగాఁ జిత్రించిపెట్టినాఁడు.

సీ. అయ్య ! నీవు చతుర్భుజావతారుఁడ వన్న
దమభుజాదండ పార్శ్వములఁ జూతు
రయ్య ! నీవు త్రిలోచనావతారుఁడ వన్న
ఫాలమంటుదురు దోఃపల్లవముల
నయ్య ! నీవు గజాననావతారుఁడ వన్నఁ
గుంభపీఠము అంటికోనఁ దలంతు
రయ్య ! నీవు చరాచరావతారుఁడ వన్న
నందంబు చూడంగ నభిలషింతు
రవసరం బిచ్చుట యనుగ్రహంబు గాఁగ
మోముఁజూపుట యుపకారముగను బలుకు
మాత్రమే యప్పు డధికతరార్థముగఁద
లంతు రైశ్వర్య మదబలవంతు లుబ్బి.

అర్థార్థులైశ్వర్యమదబలవంతుల నుబ్బింపఁజేయుటకై స్తోత్రము సేయ మొదలిడి, అయ్యా! నీవుచతుర్భుజావతారుఁడవు (నాలుగుభుజములుగల శ్రీమహావిష్ణువవు) అనినంతనే మఱిరెండుభుజములు మొలచిన వేమోయని తమభుజముల పార్శ్వములను జూచెదరు. అయ్యా! నీవు త్రిలోచనావతారుఁడవు (మూఁడుకన్నులుగల ఈశ్వరుఁడవు) అనినచో మూఁడవకన్ను మొలచెనేమోయని చేతితో ఫాలము దడవికొందురు. అయ్యా! నీవు గజాననావతారుఁడవు (గజముఖుఁడవు) అనినంతనే, అందముఁజూడఁ గోరుదురు. దర్శనమున కవకాశమిచ్చుట యనుగ్రహముగను, ముఖముజూపుట యుపకారముగను, పలుకుటమాత్రమే యధికమైన పురుషార్థముగను భావింతురు. ఐశ్వర్యవంతుల కిట్టియుబ్బుట పొగరుఁబోతుతనము నాఁటికి నేటికిఁ గూడఁ గానవచ్చునదియే.

సుకుమారునకుఁ దండ్రి యుపదేశించిన నీతియు హృద్యోదాత్తమైనదియే. "గురూపదేశం బఖిలమల ప్రక్షాళన క్షమంబైన తీర్థస్నానంబు, జరామరణ వైకల్యంబులేని వార్ధకంబు, మేదోభారంబులేని గౌరవంబు, సువర్ణరచనలేని కర్ణాభరణం, బుద్వేగంబులేని ప్రజాగరంబు ఇదియభవ్యులకు సలిలంబునుంబోలె శ్రవణస్థితంబై యుపద్రవంబు నాపాదించు. నీ విటువట్టి నెట్టుకొని పెద్దలమాట వినుము వింటేని ధూర్తులు నిన్నుఁ బరిశంసింపలేరు. కుటిలులు ని న్నటమటింపలేరు. వంచకులు నిన్ను వంచింపలేరు. పల్లవులు నిన్నువలపింపలేరు. మదంబు నిన్నుఁ గదల్పలేదు. విషయంబు నిన్నాశ్లేషింపలేదు. విను; మనూచానాచారంబును, నాముష్యాయణంబును, నామధితామ్నాయంబును, నధీతాశేషశాస్త్రంబును, నలింగవృత్తియు, ననపకీర్ణంబును, ననభ్యుదితంబును, ననభిస్తుతంబును నైన యార్యవంశంబునం బ్రభవించిన వాఁడవు. మూఢుండవై యనుష్ఠానబంధంబులగు విషయోపభోగంబులయందును సుఖబుద్ధి యారోపించెదవు. నీయట్టి దుర్బుద్ధిశీలురుగదా నిస్త్రింశంబుఁ జూచి కువలయమాల యనియు, కృష్ణసర్పంబు వీక్షించి కాలాగురు ధూమరేఖయనియును, నంగారంబు దర్శించి బంగారంబనియు భ్రాంతిఁబొందుదురు. మన వంశంబునకు నీ వొక్కరుండవ సంతానబీజంబ; వింతయు నెఱింగి బుద్ధిమంతుఁడవై మమ్ము నుద్ధరింపవలదా ?" యని యజ్ఞదత్తుఁడు సుకుమారున కుపదేశించినాఁడు.

ఈయుపదేశక్రమ మతి సుకుమారముగఁ గొనసాగినది. దీనిలో నెన్నియో యుదాత్తభావములు భావనలు గూడ జతఁగూడినవి. ఈ ప్రబంధమునం దేవిషయ మెత్తుకొనిన నది యెంతయు మహితముగనే కొనసాగినది. (సశేషము

# గ్రంథస్వీకారము—సమీక్ష

బండారు తమ్మయ్య

1. శ్రీ బుద్ధచరిత్ర వచనము:—కర్త శ్రీ నిమ్మరాజు వేంకటేశ్వరులుగారు; ప్రకాశకులు, జీవరక్షణ ప్రచారక గ్రంథమాల అనంతవరము, నరసారావుపేట తాలూకా, గుంటూరుజిల్లా. క్రౌను-పుటలు 250. వెల రు 1—0—0

మానవుల మాంసభక్షణమునకయి నిర్దాక్షిణ్యముగ మూగజంతువుల విషయమున దేశమునఁ గావింపఁబడుచున్న హింసాకాండ వరికట్టు సదుద్దేశముతో రచితమయిన యుద్గ్రంథమిది. అహింసాతత్త్వ ప్రబోధముకయి యవతరించిన గౌతమబుద్ధుని చరిత్రరూపకముగ పదధ్యాయములలోఁ గూర్పఁబడినది. మూఁగజంతువుల మొఱలనాలకించి తత్సంరక్షణమునే పరమ ప్రయోజనముగా నెంచి పరమేశ్వరుఁడే భరతదేశమున గౌతమబుద్ధరూపమున నవతరించెనని ప్రతిపాదింపఁబడినది. కరుణరసమును ద్రవింపఁజేయుచు వివిధవిషయములిందుఁ జర్చింపఁబడినవి. మాంసభక్షణము మానవులకు దైవసంకల్పవిహితమయినది కాదనియు, ప్రకృతి విరుద్ధముగ వారు మాంసభక్షకులగుట మహాపాతకమనియుఁ జక్కఁగా నిరూపింపఁబడినది. రెండవయధ్యాయమందలి మూఁగజీవులు భగవంతుని ప్రార్థించుట, వాని తీర్మానములు 4, 5, 6 అధ్యాయములందలి పశుయజ్ఞములు చేయరాదు, హితోపదేశము మున్నగు భాగములు శ్రద్ధతో నెల్లరు ముఖ్యముగాఁ బఠింపఁదగినవిగ నున్నవి. మాజీ ప్రధానమంత్రి శ్రీ టంగుటూరి ప్రకాశము పంతులుగారు, శ్రీ ధూళిపాళ వేంకటసుబ్రహ్మణ్యము, జాస్తి వేంకటనరసయ్య మున్నగు పండితులు నొసంగిన యభిప్రాయము లిందుఁ గలవు. మాంసాహారము నిషేధించుచు బైబిలులోఁ జెప్పఁబడిన సూక్తులు, పాశ్చాత్య దేశపండితులు, భిషజ్ఞులు పలువురు బోధించిన వాక్యములు "ఆదర్శకులు" అను శీర్షికతో 7 వ యధ్యాయము

న గ్రోడీకరింపబడినవి. జీవకారుణ్యము నుద్బోధించు నీగ్రంథ మెల్లరు నాదరించి యందలి సందేశముల బాటించుట శ్రేయస్కరము. గ్రంథమందలి భాష కేవలము గ్రాంథికముగాక వ్యావహారికముగాక సుబోధకమే యయ్యు బలుతావుల సంస్కరణాపేక్షముగనున్నది. మచ్చునకు ఈక్రింది వాక్యములు చిత్తగించునది. "మీకు అకాలమృత్యువులను తెచ్చిపెట్టగల అధికారమే మీశక్తులకున్న యీపాటికి మానవుల, మూగజీవుల సృష్టి ఆగిపోయివుండెడిది. ఉపద్రవములను తెచ్చిపెట్టగల అధికారమే వీటికున్న ఎప్పుడో మీ లెఖపత్రికారము ఇచ్చునట్టి జీవబలికి ఆశించి మీరువేసేగడువు కాలమువఱకు పస్తుల తోవుంటూ మీచుట్టూతిరుగవలసిన అవసరములేదని తెలుసుకొనుడు." (పుట 117)

2. సాధన :—కర్త శ్రీ గరిమెళ్ళ వీరరాఘవులుగారు, రామారావుపేట, కాకినాడ. డెమ్మీ పుటలు 24 వెల 0—4—0 లు. శ్రీరామస్తుతిపరమయిన యీకృతి రమారమి 110 ఉత్పల, చంపక వృత్తములలో గూర్పబడినది. కవి శ్రీరామచంద్రునే యిష్టదైవముగా బరబ్రహ్మముగా విశ్వసించిన భక్తవరుడు. గ్రంథారంభమందలి "మనవి" లోని యీ క్రింది వాక్యముల వలన వీరి యీ కృతి రచనోద్దేశము వ్యక్తము కాగలదు.

"సాధారణముగా మానవునకు గష్టసమయములోగాని భక్తి జనింపదనియు నాపదలు కూడ నరునుద్ధరించుటకే భగవంతుడు నిర్ణయించినాడనియు నానమ్మిక. అట్లుదయమందిన భక్తి స్థిరపడు లోపున ననేకావస్థలబొందవలసివచ్చును. క్రిందుమీదులు నుంబడయవలయును. ఈ నాయనుభవమే యీచిన్ని పొత్తమున వివరించితిని. సగుణోపాసనయే నిరపాయమగు తరణోపాయము. అందుల కిష్టదైవము కర్ణధారి శ్రీరాముని కన్న దివ్యచారిత్రుడు లేడు; గాన

నాతఁడే నాపరమదైవము నేడు గడయు" జీవయాత్రలో ఘటిల్లిన పెక్కు కష్టములనుండి కృతికర్త శ్రీరామునందలి దృఢభక్తి మూలము ననే తరించి యీ కృతి రచనమునకుఁ గడంగినట్లున్నది. బహురూపములఁ గవి తనరామభక్తి నిందుఁ బ్రదర్శించినారు. వ్యంగ్యములు,నిందాస్తుతులు పలుతావులఁ బ్రయుక్తములయినవి. భావవ్యక్తీకరణమునకై యెడనెడఁ గొన్ని పద్యములు చతుష్పాద మాత్ర నిబద్ధములు గాక యెక్కుడు పాదములతోఁ గూర్పఁబడినవి.

మచ్చునకు రెండు పద్యములు

ఉ. కర్మము కర్మ మంచిలను గష్టము లొందఁగఁ బ్రోవకుంటివే
కర్మము గుడ్వ మంచచటు గానకపోదురె బంధు జాలముల్
కర్మమె నిన్ను నన్ను సరిగా జతగూర్చిన దోయి రామ! నా
కర్మము దోసిపుచ్చినను గాచుట కేరును లేరొరుల్ ప్రభూ (పుట6)

ఉ. జీవులు నిశ్వసించునది చెల్లెగఁ బీల్చుచుఁ బ్రాణవాయువున్
జీవుల కిచ్చు; జంతువుల చెత్తలఁ గీటకముల్ హరించు; నె
త్తావులు జిమ్మి శుభ్రతను తానయి చేయును గంధవాహుఁ డో
భూవిభో; యచ్చటచ్చటనె పొందుగ శౌచము కూర్చి పెట్టినా
వేవిధి నీకు నింత శ్రమ యెచ్చటఁగల్గక యుండునట్లుగాన్ (పుట11

౭. శృంగారతిలకము :- కాళిదాసకృతి కాంధ్రానువాదము కర్త; కవిరాజ, సాహిత్య విశారద, ఉప్పాడ రాజారావుగారు, ఎం.ఏ ఆంధ్రోపధ్యాయులు. ప్రభుత్వ కళాశాల, కాకినాడ.

శృంగార తిలకమనునది స్త్రీ వర్ణనాత్మకమగు కొన్ని చాటు శ్లోకముల గ్రథనమే కాని నిర్దిష్టమయిన యితివృత్తము గల గ్రంథము కాదు. ఇందలి సంఖ్య 22 శ్లోకములు మాత్రమే. ఇది కాళిదాసీయ మనెడి యాభాణకమే గాని యందుకుఁ దగిన యాధారమేదియులేదు- ప్రాచ్య పాశ్చాత్య విమర్శకలోకము కాళిదాసీయములుగా గ్రహిం

చిన కృతులు, కావ్యత్రయము,నాటకత్రయము,శ్రుతబోధ చ్ఛందము ఋతు సంహారము మొత్తమెనిమిదింటిలో నిది చేరలేదు. తెలుఁగులో నచ్చటచ్చటి స్త్రీ వర్ణనాత్మక శృంగారపద్యముల నేర్చి కూర్చి శ్రీనాథుని వీథినాటకమను పేరితోఁ గొంత కాలము క్రిందట గ్రథితమయిన చాటు కృతి వంటిదే యీసంస్కృతశ్లోక కృతి కూడనని మా యభిప్రాయము. గతాను గతికముగ నిది కాళిదాసీయమే యని పండిత వర్గమున వెలసిన విశ్వాసము కలిమినాధునిక కవులు పలువురు దీని నింతకు మున్నె యాంధ్రీకరించి యున్నారు. ప్రస్తుతాంధ్రీ కర్త శ్రీ రాజారావుగారు సరసకవితా ధురంధరులు. సహజ ప్రతిభావంతులు. వీరి కవిత సమకాలిక పండిత కవి సంస్తవములకుఁ దావలమయినది. ఈకృతికిఁ బూర్వానువాద కర్తలలో నొకరగు కవి మూర్ధన్య శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు "కవితాపరిచితి" అను పేరితోఁ బ్రశంసాత్మకముగ రచించిన యవతారికయే యిందుకు దృష్టాంతము.

మచ్చునకుఁ గ్రింది శ్లోకముల యనువాదములఁ జిత్తగించునది.

"ఇయమ్ వ్యాధాయతేబాలా భ్రూరస్యాః కార్ముకాయతే।
కటాక్షాశ్చ శరాయన్తే మనోమే హారిణాయతే"

గీ॥ బాల!వ్యాధుండవీవు; భ్రూవల్లి ధనువు, వాలుఁజూపులు శరములై
వఱలుచుండ నామనోహారిణంబు విన్నాణముగను. గాటముగ
నేయఁదొడఁగెదా రాట మొదవ (ప 14)

"అపూర్వోదృశ్యతేవహ్నిః కామిన్యాః స్తనమండలే,
దూరతోదహతే గాత్రమ్ హృదిలగ్నస్తు శీతలమ్"

గీ॥ కామినీ స్తనమండలాక్రాంతవహ్ని, కాననగును నపూర్వమై
గాత్రదహన, దక్షమగు దూరమందున్న; వక్షమందుఁ, బొదువఁ
జందన శీతల స్ఫూర్తిఁ గాంచు॥ (ప. 19)

स्युक्तं भवति । अभावस्यानित्यतारूपत्वात् । तथा चानित्यता निर्वाणमिति, सा चानित्यता अयत्नसिद्धैवेति निर्वाणमप्ययत्नसिद्धं स्यात् । किंचाभावस्य भावसापेक्षत्वाद्यत्र भावो नास्ति तत्राऽभावोपि न सिद्ध्यतीति भावः ॥७॥

किंच—

यद्यभावश्च निर्वाणमनुपादाय तत्कथम् ।
निर्वाणं नह्यभावोस्ति योऽनुपादाय विद्यते ॥८॥

अभावो नामानित्यता, स च भावमुपादाय प्रज्ञप्यते । नहि भावमनुपादाय अभावो नाम कश्चिदस्ति । यद्यभावरूपं निर्वाणं तर्हि भावसापेक्षं स्यात्। तच्च नेष्टम् । निर्वाणस्यान्यनिरपेक्षत्वादिति भावः ॥८॥

ननु निर्वाणं यदा भावरूपमभावरूपं वा न भवति, किंतर्हि निर्वाणमिति चेदुच्यते—

यश्चाजवंजवीभाव उपादाय प्रतीत्य वा ।
सोऽप्रतीत्याऽनुपादाय निर्वाणमुपदिश्यते ॥९॥

योऽयमजवंजवीभावः जन्ममरणप्रवाहः स कदाचिद्धेतुप्रत्ययसामग्रीमुपादाय प्रज्ञप्यते । कदाचिच्च प्रदीपप्रभावत्प्रतीत्य प्रज्ञप्यते । सोयमजवंजवीभावः यदा अनुपादाय अप्रतीत्य वा सामग्रीं न प्रवर्तते तन्निर्वाणमित्युच्यते । जन्ममरणपरम्पराया अप्रवृत्तिर्निर्वाणमिति भावः । सेयमप्रवृत्तिर्न भावो नाप्यभावः । तस्माद्भावाभावविलक्षणमेव निर्वाणमिति ॥९॥

किंच—

प्रहाणं चाब्रवीच्छास्ता भवस्य विभवस्य च ।
तस्मान्न भावो नाभावो निर्वाणमिति युज्यते ॥१०॥

भगवान्बुद्धः भवस्य विभवस्य च प्रहाणमेवोपदिदेश ह । यदि निर्वाणं भावरूपमभावरूपं वा स्यत्तदा तस्यापि प्रहाणं प्राप्नोति । तस्माद्भाव इति वा अभाव इति वा निर्वाणं न शक्यते वक्तुमिति भावः ॥१०॥

ननु क्लेशकर्मणोस्तत्राभावात्स्वयं च भावरूपत्वेन भावाभावोभयरूपं निर्वाणमास्त्वित्याशङ्क्याह—

भवेदभावो भावश्च निर्वाणमुभयं यदि ।
भवेदभावो भावश्च मोक्षस्तच्च न युज्यते ॥११॥

यदि भावाभावोभयरूपं निर्वाणं स्यात्तदा निर्वाणरूपो मोक्षोपि भावाभावोभयरूपस्स्यात् । तथा च मोक्षे संस्कारास्तद्विरामश्च स्यात् । तच्चायुक्तमिति भावः ॥११॥

किंच—

भवेदभावो भावश्च निर्वाणमुभयं यदि ।
नानुपादाय निर्वाणमुपादायोभयं हि तत् ॥१२॥

यदि निर्वाणं भावाभावोभयरूपं स्यात्तदा हेतुप्रत्ययसामग्रीमुपादायैवतद्भवेन्नानुपादाय । यतस्तदुभयं हेतुप्रत्ययसामग्रीमुपादायैव सिद्ध्यति किंच भावमपेक्ष्यभावः सिद्ध्यति । एवमभावप्रतिद्वन्दी भावः । एवं तावत् परस्परसापेक्षौ । तदेतदसङ्गतमिति भावः ॥१२॥

किंच—

भवेदभावो भावश्च निर्वाणमुभयं कथम् ।
असंस्कृतं च निर्वाणं भावाभावौ हि संस्कृतौ ॥१३॥

भावो हि हेतुप्रत्ययसामग्रीसम्भूतत्वात्संस्कृतः । अभावो हि प्रतीत्यसमुत्पन्नत्वात्संस्कृत एव । निर्वाणं त्वसंस्कृतम् । तस्मात्कथं निर्वाणं भावाभावरूपं भवेदिति भावः ॥१३॥

किंच—

भवेदभावो भावश्च निर्वाणमुभयं कथम् ।
तयोरेकत्र नास्तित्वमालोकतमसोर्यथा ॥१४॥

आलोकान्धकारयोरिव परस्परविरुद्धयोरेकत्रावस्थनासम्भवात्कथं निर्वाणं भावाभावोभयात्मकं भवितुमर्हतीति भावः ॥१४॥

एवं तावन्निर्वाणस्य भावाभावोभयरूपत्वं न सम्भवतीत्युक्त्वा अधुना तदुभयविलक्षणत्वमपि न सम्भवतीत्याह—

नैवाभावो नैव भावो निर्वाणमिति योजना ।
अभावे चैव भावे च सा सिद्धे सति सिद्ध्यति । ॥१५॥

यदि भावो वा अभावो वा कश्चित्स्यात्तदा तत्प्रतिषेधेन भावाभावविलक्षणं निर्वाणमित्येषा कल्पना फलेत । तावेवासिद्धौ । तस्मादेषापि कल्पना निरवकाशेति भावः ॥१५॥

नैवाभावो नैव भावो निर्वाणं यदि विद्यते ।
नैवाभावो नैव भाव इति केनैतदिज्यते ॥१६॥

यदि भावाभावविलक्षणं निर्वाणं विद्यते तर्हि तन्निर्वाणमेतादृशमिति केनेज्यते ज्ञायते प्रकाश्यते वा । नहि निर्वाणदशायामेवंविधः कश्चिदात्मा विद्यते। एवं सति निर्वाणेप्यात्मनस्सद्भावप्रसङ्गः । ननु संसारावस्थित एव कश्चिदेवं परिच्छिनत्तीति चेन्न, स किं विज्ञानेन परिच्छिनत्ति? उत ज्ञानेन? न तावद्विज्ञानेन— निमित्तालम्बनं हि विज्ञानम् । न तदानीं किंचिन्निमित्तमस्ति । तस्मान्न विज्ञानेन परिच्छिद्यते । नापि ज्ञानेन— ज्ञानस्य शून्यतालम्बनस्य अविद्यमानस्वरूपस्यैतादृशनिर्वाणाऽप्रकाशकत्वादित्यलम् ॥१६॥

यदा च निर्वाणे एताः चतस्रः कल्पना न सम्भवन्ति, एवं निर्वाणाधिगन्तरि तथागतेपि न सम्भवन्तीति प्रतिपादयन्नाह—

परं निरोधाद्भगवान्भवतीत्येव नोह्यते ।
न भवत्युभयं चेति नोभयं चेति नोह्यते ॥१७॥

निरोधात्परं भगवान्भवतीति वा, न भवतीति वा, उभयमिति वा, नोभयमिति वा नोह्यते । न ज्ञातुं शक्यत इत्यर्थः । यथा च नोह्यते तथा तथागतपरीक्षायामेवोक्तमिति भावः ॥१७॥

किंच—

अतिष्ठमानो भगवान्भवतीत्येव नोह्यते ।
न भवत्युभयं चेति नोभयं चेति नोह्यते ॥१८॥

अतिष्ठमानो हि भगवान् । अतो भवतीति वा, न भवतीति वा, उभयमिति वा, नोभयमिति वा न वाच्य इत्यर्थः । इदमपि तत्रैवोक्तम् ॥१८॥

अत एव—

संसारस्य न निर्वाणात्किंचिदस्ति विशेषणम् ।
निर्वाणस्य न संसारात्किंचिदस्ति विशेषणम् ॥१९॥

यतस्तिष्ठन्नपि भगवान्नोह्यते भवतीति, परिनिर्वृतोपि भगवान्नोह्यते भवतीति अतो निर्वाणसंसारयोरस्ति न कश्चिद्विशेषः । उभयोरपि स्वभावशून्यत्वाऽविशेषादिति भावः ॥१९॥

किंच—

निर्वाणस्य च या कोटिः कोटिस्संस्करणस्य च ।
न तयोरन्तरं किंचित्सुसूक्ष्ममपि विद्यते ॥२०॥

यथा संसारस्य निःस्वभावत्वात्पूर्वापरकोटिकल्पना न सम्भवति, एवं निर्वाणस्यापि निःस्वभावत्वादेव पूर्वापरकोटिकल्पना नास्ति । अतः कोटिद्वयाभावादपि संसारनिर्वाणयोर्नास्ति विशेष इति भावः ॥२०॥

न केवलं संसारस्य निर्वाणेनाविशिष्टत्वात्पूर्वापरकोटिकल्पना न सम्भवति । किंतु अन्या अप्येताः कल्पना न सम्भवन्तीत्याह—

परं निरोधादन्ताद्याः शाश्वताद्याश्च दृष्टयः ।
निर्वाणमपरान्तं च पूर्वान्तं च समाश्रिताः ॥२१॥

निरोधात्परमन्तवान् लोकः, अनन्तवान् लोकः, उभयवान् लोकः, अनुभयवान् लोकः, शाश्वतो लोकः, अशाश्वतो लोकः, उभयवान् लोकः, अनुभयवान् लोक इत्याद्या अपि दृष्टयः कल्पनाः न सम्भवन्ति, यत एताः कल्पनाः निर्वाणं पूर्वापरकोटिद्वयं च समाश्रित्य समुत्पद्यन्ते । यदा तु संसारनिर्वाणयोर्विशेषो नास्ति, कोटिद्वयमपि नास्ति तदा निरालम्बना एताः कल्पना न भवन्तीति भावः ॥२१॥

किंच—

शून्येषु सर्वधर्मेषु किमनन्तं किमन्तवत् ।
अनन्तमन्तवत्किं वा नाऽनन्तं नान्तवच्च किम् ॥२२॥
किं तदेव किमन्यत्किं शाश्वतं किमशाश्वतम् ।
अशाश्वतं शाश्वतं च किं वा नोभयमप्यतः ॥२३॥

यदि कस्यचित्पदार्थस्य कश्चित्स्वभावो भवेत् तदा तस्यैताः कल्पना भवेयुः, यदा तु तादृशः पदार्थ एव नास्ति तदा किमालम्बना एताः कल्पना भवेयुरिति भावः ॥२३॥

ननु भगवता निर्वाणमपि प्रतिषिद्धम्, एवं सति निर्वाणाधिगमार्थं भगवता देशितस्सर्वोपि धर्मः व्यर्थस्स्यादित्याशङ्क्य यदि नाम धर्मःस्वभावतस्स्यात्, तस्य धर्मस्य श्रोतारो वा स्युः, कश्चिद्बुद्धो नाम स्वभावतो भवेत्तदेदमेवं स्यात । स्वभाव एव यदा न सम्भवति तदा कथमेतदुपपद्यत इत्याह—

सर्वोपलम्भोपशमः प्रपञ्चोपशमः शिवः ।
न क्वचित्कस्य चित्कश्चिद्धर्मो बुद्धेन देशितः ॥२४॥

इह सर्वेषामुपलम्भाना विज्ञानानां प्रपञ्चानां निमित्तानामुपशमः अप्रवृत्तिः निर्वाणमिति यदुच्यते स उपशमः प्रकृत्यैव शान्तत्वाच्छिवः । यदाचोपलम्भानां निमित्तानां चाप्रवृत्तिः तदा कोपि पदार्थः स्वभावतो नास्ति । अतो बुद्धेन न कश्चिद्धर्मः कस्यापि देशितः । तदा कुतोऽस्माकं यथोक्तदोषप्रसङ्गः ॥२४॥

इति सुबोधिनीव्याख्यासहितमाध्यमिककारिकासु
निर्वाणपरीक्षा नाम पञ्चविंशतितमं प्रकरणम् ।

सुबोधिनीव्याख्यास

# माध्यमिककारिकासु,

## द्वादशाङ्गपरीक्षानाम षड्विंशतितमं प्रकरणम् ।

ननु "यः प्रतीत्य समुत्पादः शून्यतां तां प्रचक्ष्महे" इत्यत्र "यः प्रतीत्य समुत्पादं पश्यतीदं स पश्यति" इत्यत्र च प्रतीत्य समुत्पाद उक्तः कोऽसौ प्रतीत्य समुत्पाद इति शङ्कायां तदङ्गप्रभेदविवक्षया आह—

पुनर्भवाय संस्कारानविद्यानिर्वृतिस्तथा ।
अभिसंस्कुरुते यान् तैर्गतिं गच्छति कर्मभिः ॥१॥

अविद्यया अज्ञानेन, निर्वृत आच्छादितः पुद्गलः, पुनर्भवाय कुशलाकुशलरूपतया, कायिक वाचिक मानसिकरूपतया वा त्रिधा भिन्नान् यान् संस्कारानभिसंस्कुरुते करोति, तैः कर्मभिः, संस्कारैः गतिं पुनर्भवं गच्छतीतीत्यर्थः ॥१॥

विज्ञानं सन्निविशते संस्कारप्रत्ययं गतौ ।
सन्निविष्टेऽथ विज्ञाने नाम रूपं निषिच्यते ॥२॥

ततः संस्कारपरीतस्यास्य पुद्गलस्य संस्कारहेतुकं विज्ञानम्, आत्मत्वेन अभिमतम्, देवमनुष्यादिरूपायां गतौ सन्निविशते प्रविशति । ततो विज्ञाने सन्निविष्टे सति नाम रूपं च तत्र निषिच्यते । स्थाप्यत इत्यर्थः । तत्र बिम्बप्रतिबिम्बन्यायेन, तुलादण्डनमनोन्नमनन्यायेन वा मरणान्तिकेषु स्कन्धेषु निरुद्ध्यमानेषु एतस्मिन्नेव क्षणे संस्कृताः स्कन्धा उपजायन्ते । अत्र च तुलादण्डदृष्टान्तो बालिशलोकानुरोधेनोक्तः । न तु परमार्थतः । एवं च बिम्बप्रतिबिम्बन्यायेन सिद्धः सकारणकार्योत्पत्तिः प्रतीत्यसमुत्पाद इति सिद्ध्यतीतिभावः॥

निषिक्ते नामरूपे तु षडायतनसम्भवः ।
षडायतनमागम्य संस्पर्शः सम्प्रवर्तते ॥३॥

तदेवं विज्ञानसम्मूर्छितं नाम रूपं मातुः कुक्षौ निषिच्यते । प्रादुर्भवतीत्यर्थः । एवं निषिक्ताभ्यां नामरूपाभ्यां षडायतनस्य दर्शनश्रवणघ्राणरसस्पर्शमननरूपस्य सम्भवो भवतीत्यर्थः । षडायतनमालम्ब्य संस्पर्शः समुपजायते ॥३॥

कः पुनरयं संस्पर्शः? कथं वा सम्प्रवर्तते? इत्यत्राह—

चक्षुः प्रतीत्य रूपं च समन्वाहारमेव च ।
नाम रूपं प्रतीत्यैवं विज्ञानं सम्प्रवर्तते ॥४॥

चक्षुः, रूपं, समन्वाहारं चेति त्रितयं प्रतीत्य चक्षुर्विज्ञानमुत्पद्यते । तत्र विषयो रूपमित्युच्यते । स्कन्धलक्षणं समन्वाहारं नामेत्युच्यते ॥४॥

सन्निपातस्त्रयाणां यो रूपविज्ञानचक्षुषाम् ।
स्पर्शः, तस्माद्धि स्पर्शाच्च वेदना सम्प्रवर्तते ॥५॥

तदेवमेतेषामिन्द्रियविषयविज्ञानानां त्रयाणां यः सन्निपातः, अन्योन्यो कारेण तुल्या या प्रवृत्तिः, सैव स्पर्श इत्युच्यते । तस्माच्च स्पर्शादिष्टानिष्टोदासीन विषयानुभूतिरूपा वेदना समुपजायते ॥५॥

वेदनाप्रत्यया तृष्णा वेदनार्थं हि दृश्यते ।
दृश्यमानमुपादानमुपादत्ते चतुर्विधम् ॥६॥

वेदनाप्रत्ययः यस्यास्सा वेदनाप्रत्यया, वेदनामूलिका तृष्णा उत्पद्यते सा च वेदनाविषया । कुतः? यस्मादसौ स्पृहयालुः वेदनार्थमेव तृष्णां कुर्वन्

श्यते, तदभिलाषं करोति, तस्माद्वेदनाविषया तृष्णेति भावः । यदा तावदस्य सुखवेदना समुपजायते स तदा पुनः तस्यास्सुखवेदनायास्संयोगमभिलषते। एवमभिलषमानस्स दृश्यमानं चतुर्विधमुपादानं, कर्म उपादत्ते स्वीकरोति । तृष्णाप्रेरितः कर्माणि करोतीत्यर्थः ॥६॥

**उपादाने सति भवः उपादातुः प्रवर्तते ।**
**यस्य न स्यादुपादानं मुच्यते न भवेद्भवः ॥७॥**

उपादाने सति कर्मणि स्वीकृते सति कर्तुः भवः प्रवते । यस्तु तृष्णाप्रेरितः कर्माणि करोति तस्य भवोऽवश्यं भवतीति भावः । यस्य तु कर्मोपादानं तृष्णा नास्ति स तु मुच्यते । तस्य भवो न भवति । यस्तु प्रतिसङ्ख्यानेन तृष्णां भस्मीकुर्वन्नुपादानं न गृह्णाति तस्य भवो न भवति । स तु मुच्यत इति भावः ॥७॥

ननु कोयं भवः, तत्राह—

**पञ्च स्कन्धाः स च भवः भवाज्जातिः प्रवर्तते ।**
**जरामरणदुःखादिशोकाः सपरिदेवनाः ॥८॥**
**दौर्मनस्यमुपायासो जातेरेतत्प्रवर्तते ॥९॥**

पञ्च स्कन्धा एव भवः । कायिकं, वाचिकं मानसिकं चेति त्रिविधमपि कर्म भवत्यस्मिन्निति भवः । अनागतं स्कन्धपञ्चकं भवः । तस्माद्भवाज्जातिः । अनागतस्कन्धान्तरं जातिः । सा च जातिः पूर्वस्मात् स्कन्धपञ्चकाज्जायत इत्यर्थः । ततो जातेरेतज्जरामरणादिकं प्रवर्तते । स्कन्धपरिपाको जरा। जीर्णस्कन्धभेदो मरणम् । पञ्चेन्द्रियासन्निपातो दुःखम् । हृदयसन्तापश्शोकः । वाक्प्रलापः परिदेवना । मनोऽनिष्टनिपातः दौर्मनस्यम् । दुःखबाहुल्यमुपायासः। एतत्सर्वमपि जातेरुपजायत इति भावः ॥९॥

**संसारमूलान्संस्कारानविद्वान्संस्करोत्यतः ।**
**अविद्वान्कारकस्तस्मान्न विद्वान् तत्त्वदर्शनात् ॥१०॥**

संसारस्य विज्ञानादिप्रवृत्तिलक्षणस्य मूलं प्रधानकारणं संस्काराः, तानविद्वान् संस्करोति फलाभिमुख्यान्करोति । अतोऽविद्वान्कारकः कर्ता भवति । अत इत्यस्यानुवादस्तस्मादिति । यथाऽविद्वान्संस्कारान्संस्करोति न तथा विद्वान्

संस्करोति । कुतः तत्त्वदर्शनात् । तत्त्वदर्शनेसति सर्वभावानामभावादिति भावः।

यतश्चाऽविद्यायां सत्यायामेव संस्काराः प्रवर्तन्ते , असत्यां च न प्रवर्तन्ते । अतः—

**अविद्यायां निवृत्तायां संस्काराणामसम्भवः ।**
**अविद्याया निवृत्तिस्तु ज्ञानेनैवास्य बाधनात् ॥११॥**

यतश्चाविद्यायां सत्यामेव संस्काराः प्रवर्तन्ते, अतोऽविद्यायां निवृत्तायां सत्यां संस्काराणामसम्भव एव । नन्वविद्यानिवृत्तिरेव कथं सिद्ध्यतीत्यत्राह— यथोक्तस्य प्रतीत्यसमुत्पादस्य यथावदविपरीतभावनयाऽविद्या निरुध्यते, अज्ञानस्य ज्ञाननिवर्त्यत्वनियमात् । यो हि प्रतीत्यसमुत्पादं सम्यक्पश्यति स सूक्ष्मस्यापि भावस्य न स्वभावं पश्यति । प्रतिबिम्बस्वप्नालातचक्रादिवत्सर्वेषामेव भावानां स्वभावशून्यतामेव पश्यति । य एवं सर्वभावानां शून्यतामवगच्छति स न बाह्यमाभ्यन्तरं वा किंचिद्वस्तूपलभते । एवमनुपलभमानः न क्वचिन्मुह्यति अमुह्यंश्च न किंचिदपि कर्म करोति । एवं प्रतीत्यसमुत्पादभावनया तत्त्वदर्शिनो योगिनोऽविद्या निवर्तते । प्रहीणाविद्यस्य संस्कारो निरुध्यते ॥११॥

**तस्य तस्य निरोधेन तत्तन्नाभिप्रवर्तते ।**
**दुःखस्कन्धः केवलोयमेवं सम्यङ्निरुध्यते ॥१२॥**

एवं योगी आत्मात्मीयादिदर्शनायासनिर्मुक्तः कारकवेदकविरहितं स्वभावशून्यं दुःखस्कन्धं सम्यक् निरुणद्धि । यद्यप्ययं प्रतीत्यसमुत्पादः बाह्याभ्यन्तरभेदभिन्नः नदीस्रोतोवदविच्छिन्नः प्रवर्तते । ननु मरणानन्तरं कथमविच्छेद इति चेदुच्यते । प्रतीत्यसमुत्पादाङ्गेषु पूर्वस्कन्धेषु मरणकाले निरुध्यमानेषु तदा तत्र तस्मिन्नेव क्षणे तुलोन्नमनादिवदौपपत्त्यंशिकानां स्कन्धान्तराणामुत्पादान्न प्रतीत्यसमुत्पादो विच्छिद्यते । किं तु तत्त्वज्ञानादविद्यानिवृत्त्यनन्तरमेव सर्वोच्छेद इति भावः ॥१२॥

इति सुबोधिनीव्याख्यासहित माध्यमिककारिकासु
द्वादशाङ्गपरीक्षानाम षड्विंशतितमं
प्रकरणम् ।

# ఆంధ్రసాహిత్యపరిషత్తు

అధ్యక్షులు

ఆంధ్రాస్థానకవి, కవిసార్వభౌమ, మహామహోపాధ్యాయ

శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

ప్రధాన కార్యదర్శి, కోశాధికారి

శ్రీ దంటు భాస్కరరావు.

సహాయ కార్యదర్శి

శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి.

(ఉభయభాషాప్రవీణ, ఏ)

కార్యనిర్వాహక సభ్యులు

1. శ్రీ కోకా శివనాథశాస్త్రి.
2. శ్రీ రా. సా. మాదిరెడ్డి సీతారామయ్య. బి. ఏ., బి. యల్.,
3. శ్రీ వేదుల రామచంద్రకీర్తి, ఎం. ఏ., (ఆనర్సు) బి. ఇడి.,
4. శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి (వ్యాకరణవిద్యా, భాషా, ప్రవీణ)
5. శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి (కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర)
6. శ్రీ యండమూరి వేంకటరమణ (మధురకవితావిశారద)
7. శ్రీ బండారు తమ్మయ్య (ఐతిహాసికసమ్రాట్)
8. శ్రీ జయంతి బుచ్చిరామశర్మ.
9. డాక్టరు శ్రీ ఇవటూరి జోగారావు, (యం. బి. బి. యస్.,)
10. శ్రీ చిరువోలు కోటీశ్వరరావు.

పత్రికా సంపాదకుడు :

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి

సంపాదక సహాయులు :

శ్రీ బండారు తమ్మయ్య (విమర్శకాగ్రేసర, ఐతిహాసికసమ్రాట్)

ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రచురణములు

## శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

| | | |
|---|---|---|
| 1వ సంపుటము | ... | రు 6—0—0 |
| 2వ సంపుటము | ... | 6—0—0 |
| 3వ సంపుటము | ... | 6—0—0 |
| 4వ సంపుటము | ... | 6—0—0 |
| 5వ సంపుటము | ... | 10—0—0 |
| 6వ సంపుటము | ... | 10—0—0 |
| 7వ సంపుటము | ... | [ముద్రణములో నున్నది] |

## కవిజనాశ్రయము

వేములవాడ భీమకవి విరచితము.

పెక్కుపాఠభేదములతోఁ గూడిన వెనుకటివిషయ మంతయుఁ గలిపి
తిరిగి తృతీయముద్రణపీఠికతో ముద్రితమైనది

వెల రు 1—50.

ఆంధ్రసాహిత్యపరిషత్తు,
కాకినాడ.

Published by Andhra Sahitya Parishat, Kakinada.
Edited by C. Papaiah Sastry
Printed by J. Bhaskara Rao at Republic Press Kakinada.



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక

## Journal of the Telugu Academy
## KAKINADA.



దేశభాషలందుఁ దెలుఁగు లెస్స.

సంపుటము ౪౮ | సంచిక 3

Vol 48 | Part 3

వె. రూ. ౧-౫

# ఆంధ్రసాహిత్య పరిషత్తు

స్థాపకులు

శ్రీ జయంతి రామయ్యగారు

ప్రతిష్ఠాపకులు

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

ఉద్ధారకులు

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు,
(జమీందారు, ఉయ్యూరు యెస్టేటు,)

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక

**Journal of the Telugu Academy**

**KAKINADA.**



దేశభాషలందుఁ దెలుఁగు లెస్స.


| | | |
|---|---|---|
| సంపుటము ౪౮ | సంవత్సరము చందా | సంచిక 3 |
| Vol 48 | రు 3—0—0 | Part 3 |

# శ్రీ ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక

Journal of the Telugu Academy Kakinada

సంపుటము ౪౮ శ్రావణ—భాద్రపదములు సంచిక 3

# విషయసూచిక

— 0 —

# సూర్యాష్టక వివేకము

మల్లాది సూర్యనారాయణశాస్త్రి

సూర్యుని గూర్చి లోకమునకు అనాదికాలమున తెలియఁ జేసినది ఋగ్వేదము. అందలి మండలములలోను సూర్య విషయక సూక్తములు కలవు. ఋగ్వేద మండలములు సందర్శించిన సుమారు నాలుగు వందల మంది ఋషులలోను ఇరువది మంది మహర్షులు మాత్రమే వేర్వేఱు కాలముల సూర్యమండలమును ఖగోళమును పరిశోధించినట్లు కనవచ్చును. ఆనాఁటి వారి పరిశోధన సాధనము యోగదృష్టియే యని భావింతము. అర్వాచీన జ్యోతిర్వేత్తలు చక్ర నళికా ఘటికాది యంత్రముల సాహాయ్యమున ఖగోళము పరిశోధించుచు వచ్చినట్లు తెలియవచ్చును గాని, ఆపరిశోధన విధానమునకు మార్గదర్శకమైన ప్రాచీన మంత్రద్రష్టల విధాన మెట్టిదో తెలియరాదు. దానిని బోధించెడి 'ఆగమము' కాలగర్భమున నణఁగిపోయినట్లు "సచాగమో మహతా కాలేన నష్టః" అనెడి ఆర్యభటాదుల మాటల వల్ల విదితమగుచున్నది. ఇక్కడనే మఱియొక మాట.

ప్రాచీనార్ష సంప్రదాయ సిద్ధమైన మంత్రార్థ జ్ఞానము కొంత కొంత నిరుక్తముల నాఁటికే మఱుఁగు పడినది. వెయ్యేండ్ల క్రిందటి భాష్యముల నాఁటికి మఱికొంత మఱుఁగుపడి యుండుననుటకు సంశయమేల ? అందుచే ప్రధానమైన యర్థము గోచరింపక వ్యాఖ్యాతలు కొన్ని కొన్ని చోట్ల 'యద్వా' అనుచు నర్థాంతరములు వ్రాయుచు వచ్చిరి. అయినా ముఖ్య భావము నెట్లో భాష్య కర్తలు పైకి తేకపోలేదు ప్రస్కణ్వ మహర్షి సందర్శించిన "తరణి ర్విశ్వదర్శతో

జ్యోతిష్కృదసి సూర్య!" అను ఋక్కునకు సూర్యుఁడు తిరుగు చున్నాఁడన్న యర్థము వ్రాసినను, అందలి "జ్యోతిష్కృత్" శబ్దము నకు రాత్రియందు అమ్మయములగు చంద్రాది బింబములపై సూర్య కిరణములు ప్రతిఫలించి చీఁకటి నణఁగించుచున్నవి. ఎట్లనఁగా, ద్వారమందలి దర్పణముమీఁదఁ బడిన సూర్యరశ్మి యింటిలోని చీకటి నణఁగించు నట్లే అనుచు సూర్యమండల పరిశోధన ఫలము తెలుపక పోలేదు.

తైత్తిరీయారణ్యక ప్రథమ ప్రశ్నమందలి సప్తమాను వాక మంతయు బహు సూర్య ప్రశంసాపరమే. ఆ విషయ మంతయు వివ రించుట కిందు తావు లేదు గావున నతిసంగ్రహముగా అష్ట సూర్యు లను గూర్చి యొకింత ప్రసంగితము.

"ఆరోగో భ్రాజః పటరః పతఙ్గః
స్వర్ణరో జ్యోతిషీ మాన్ విభాసః
తే అస్మై సర్వే దివ మాతప న్తి
ఊర్జం దుహానా అనపస్ఫు ర న్త ఇతి
కశ్యపోఽష్టమః, స మహామేరుం న జహాతి"

పృథివ్యన్త రిక్షద్యు లోకములకు తేజస్సును కలిగించి వివిధ ప్రాణికోటిని రక్షించు నట్లు ఆరోగుఁడు భ్రాజుఁడు మొదలగు వారు సప్త సూర్యులు దివమున నందందు వెలయుచున్నారు. కశ్యపుఁడె యెనిమిదవ సూర్యుఁడు. అతఁడు మహా మేరువు నెన్నఁడు విడువఁడు. భూమండలము నుత్తరధ్రువమే మేరువు. ఆకశ్యపసూర్యుని కృత్య మతిచిత్రము, అమేయ శక్తి సంపన్నము. ఆరోగాది సూర్యు లందం దుండి యాయాలోకములను ప్రకాశింపఁ జేయుట కతఁడే పరమ సాధనము స్వర్ణకారుఁడు కొలిమితిత్తిద్వారా అగ్నిని ప్రజ్వరిల్లఁ జేసి సువర్ణాదులను నిర్మలము గావించి వెలయించునట్లే సోమనామక

మైన పరమేశ్వర శక్తి కశ్యపునిద్వారా ఆసప్త సూర్యులను నిరంతర దివ్య తేజస్సంపన్నులను గావించుచున్నది ఆ కశ్యపుని కృత్యమును వర్ణించిన మంత్రము లివి.

"యత్తే శిల్పం కశ్యప! రోచనావత్,
ఇన్ద్రియా వత్పుష్కలం చిత్రభాను
యస్మిన్ త్సూర్యా అర్పితా స్సప్త సాకమ్
తే అస్మై సర్వే కశ్యపా జ్జ్యోతిర్ల భంతే
తాన్ త్సోమః కశ్యపా దధినిర్ధమతి
భ్రస్తా కర్మకృది వైవమ్" ఇతి

ఈ ప్రకరణములోని ఋఙ్మంత్రములఁ దెలియవచ్చు సూర్య విషయము మన కూహాతీతము. ఇది యేయుగము లోనిదోయని పించుచు నాశ్చర్యము కలిగించును. ఈ భాగము కూడా వసిష్ఠ మహర్షి మాటలవల్లనే మనకు విశదమగుచున్నది.

"త ఇద్దేవానాం సధమాన ఆసన్నృతావానః కవయః పూర్వ్యాసః. గూళ్హం జ్యోతిః పితరో అన్వవిందన్ త్సత్య మంత్రా అజనయ న్నుషాసమ్.

సత్య మంత్ర శక్తి గల పురాతన వేదకవులయిన యంగిరసులు సూర్య తేజో మహత్త్వమును పరిశీలించి దేవతలతో కలిసి యానందించు వారైరి; యని వసిష్ఠుఁడన్న మాటలను బట్టి యానాఁటికే దురూహ్యమై సూర్య తత్త్వ మాశ్చర్య కరముగా నుండెడి దనుట విదితము కదా! ఇది వేదవాక్యముల భావము.

సరే కాని, ఈ భూమండల మందలి యెల్ల ఖండములందును కొన్ని గంటల కాల మెచ్చు తక్కువగా నుదయించు చున్నట్లు కన వచ్చెడి ఆరోగ నామక సూర్యుఁ డొకఁడే సకలప్రపంచ మానవ

సాధారణముగా గోచరించు చున్నాఁడు గాని తక్కిన యేడుగురు సూర్యు లేరీ ? సత్యమే కనరాకున్నారు.

తమ తపోయోగశక్తిని ఖగోళమును పరిశోధించిన యా ప్రాక్తన మహర్షులు తమకుఁ గన వచ్చిన యనంత సూర్యులలో నెన మండుగురిని మాత్రము సవిశేషముగా గుర్తించి, వారి కారోగ భ్రాజాది నామములు పెట్టినారు ఇది యసంగతము కాదు. అర్వాచీన జ్యోతిర్వేత్తలు నక్షత్ర మండలము పరిశోధించి కాలజ్ఞానమునకై అశ్విని, భరణి యిత్యాదిగా నక్షత్రములకు పేళ్ళు పెట్ట లేదా ? గురుఁడు శుక్రుఁడు అంగారకుఁ డిత్యాదిగా గ్రహములను నిర్దేశింప లేదా ? సూర్య విషయము నిట్టిదే. నేఁడు వివిధ యంత్ర సాహాయ్యమున ఖగోళమును పరిశోధించు మేధావులకుఁ గూడ ఆసూర్యుల యునికి గోచరించినట్లు తెలియరాదు. అంత మాత్రమున వేద వాక్యములను కాదనఁ గలమా ? ఆ సూర్యుల నందఱిని జూచిన సాక్షులఁ దెలుపు వాక్యములు కూడ నందేయున్నవి. అవి యివి.

"అపశ్య మహ మేతాఁత్సప్త సూర్యానితి,
పఞ్చ కర్ణో వాత్స్యాయనః
సప్త కర్ణశ్చ ప్లాక్షిః. ఆనుశ్రవిక ఏవనౌ కశ్యప ఇతి
ఉభౌ వేదయితే నహి శేకు మివ మహామేరుం గన్తుమ్"
"అపశ్య మేత త్సూర్యమండలం పరివర్తమానమ్,
గార్గ్యః ప్రాణత్రాతః, గచ్ఛన్త మహా మేరుమ్,
ఏకఞ్చా జహతమ్ ... "

ఇత్యాదిగా జరిగిన సంభాషణ మందలి సారాంశము కనుఁగొందము. ఒక ఋషి సమ్మేళన మందలి సూర్య బహుత్వ ప్రసంగములో పంచకర్ణుఁడు సప్తకర్ణుఁడు నను ఋషులు లేచి, ఏడుగురు

సూర్యులను మేము చూచినాము. కశ్యప సూర్యుఁడున్నట్లు విన్నాము గాని, అతనిని చూడలేదన్నారు. అపుడు ప్రాణతాత్రేయుఁడు లేచి మహా మేరువు నాశ్రయించి కదలక యుండు ప సూర్యుని నేను జూచితిని మీరక్కడికి చూడవచ్చును. ఆరోగ సూర్యుఁడీ భూమి మీఁద నున్న యన్ని ప్రాణులకు సాధారణుఁడే. ఇంక భ్రాజపటర పతంగులు మువ్వురును మేరు మార్గమునకు క్రిందుగా నందందుండి తమ యధోముఖ కిరణ జాలములచే ఆయా క్రింది లోకములకు వెలుఁగు కలిగించుచున్నారు. అట్లే స్వర్ణర జ్యోతిష్మ ద్విభాసులు ముగ్గురును మేరు మార్గమునకు పై భాగమున నందందుండి యూర్ధ్వ ముఖములైన తమ రశ్మి జాలములచే, ఆయా పై లోకము లకు కాంతిని గలిగించు చున్నారు. అందుచే వారికిని వీరికిని నడుమ నున్న మేరు మార్గము చల్లగా నుండును. మీరు సుఖముగా మేరువు చెంతకు చేరి కశ్యపుని కనుఁగొనవచ్చును.

ఈ ఋషులు లోకవంచకులు గారు, వీరు కల్ల లాడరని మనము విశ్వసించినచో, ఎనమండుగురు సూర్యులున్నారని నమ్ముట కేమి ? అష్ట సూర్యులను బేర్కొన్న యీ యనువాకమే, సూర్యు లసంఖ్యముగా నున్నారని వర్ణించినది. ఇం దసంభావ్య మేమియు లేదు. ప దేళ్ళ క్రిందట నమెరికాలోని యొక ఖగోళ పరిశోధకుఁడు భూమికి డెబ్బది కోట్ల మైళ్ళ దూరమున నొక నక్షత్రము క్రొత్తగా కనవచ్చిన దని పత్రికలలో ప్రకటించియున్నాఁడు. అట్టి యెడ మహర్షులు వర్ణించిన భ్రాజాది సూర్యుల యునికిని గూర్చి మనకు సంశయ మేల ? కశ్యప సూర్యునిద్వారా ఆరోగాది సప్త సూర్యు లాయా లోకము లను బ్రకాశింపఁ జేయుచున్నారని నమ్ముటకు సందేహ మేల ?

ఈ భూగోళము నుత్తర ధ్రువమే దేవతల నివాసమగు మేరు పర్వతము హేమాద్రియని, తరువాతి జ్యోతిశ్శాస్త్రజ్ఞులు పౌరాణికులును

వర్ణించియున్నారు. ఒకనాఁడా ప్రాంతమునం దార్య జాతి వారు నివసించి యున్నట్లు వేదవాక్యములను బట్టియే లోకమాన్య తిలక పండితులు తమ వైదిక నిలయమున వ్రాసియున్నారు. దీని నంతను బట్టి చూడఁగా, పైని దెలిపిన అష్ట సూర్య మేరు మార్గ విషయము హిమ ప్రళయానంతర మార్యావర్త మందలి ఋషులు ప్రసంగించు కొని యుందురని భావింపవచ్చును. ఏమయినను, ఆనాఁడు ప్రాణ త్రాతుఁడు నడచిన మేరు మార్గ మగమ్యమో, అజ్ఞేయమో కావ చ్చును గాని, ఆ మేరువు పైని కశ్యప సూర్యుని యునికి మాత్రము మున్నాటికి సత్యమే. మఱియు ఋగ్వేదశాఖాంతరములలోని సౌర విజ్ఞాన మెఱిఁగించు నీ యనువాకము సూర్యులకు లెక్కయే లేదు; అసంఖ్యాకు లున్నారని వైశంపాయనుఁ డన్నట్లును తెలుపుచున్నది. ఆయావాక్యము లివి "సప్త దిశో నానా సూర్యాః......ఏతద్వై వావృతాఽసహస్రసూర్యతాయా ఇతి వైశంపాయనః"

అట్లయితే సూర్యు లెనమండుగు రేయని నిర్ణయ మెట్లు? అని శంక కలుగఁగా, సత్యమే సూర్యు లనంతముగా నున్నారు. కాని, పంచకర్ణ సప్తకర్ణ ప్రాణత్రాతులు చూచినా మనుటనుటను బట్టి "అష్టౌతు వ్యవసితా ఇతి, సూర్యమండలాన్యష్టౌత ఊర్ధ్వమ్" అనుచు నెనమండ్రు సూర్యు లన్న నిర్ణయము గావింపఁబడినది. వారిలో నొక యారోగ సూర్యుఁడే మనమున్న భూమికి దగ్గఱ వాఁడగుటచే నతనినే మనము చూడఁ గలుగుచున్నాము. తక్కిన వారు కనరా కున్నంత మాత్రమున వారు లే రన్న నాస్తికవాదము కూడదు. ఆ యేడుగురును పంచ కర్ణాదులకుఁ గనఁబడిన వారేకదా! వారెట్లు చూడఁ గలిగిరి? అను సందేహమునకు వారి భ్రాజాది సూర్య సందర్శన విధాన సాధనాదిక మేనాఁడో నష్టమైనదనుటయే సమాధానము. అది యట్లుండ—

పృధివ్యన్తరిక్షద్యులోకస్వర్లోకాదుల దశదిశలందలి యగ్ని వాయు సూర్య చంద్ర నక్షత్రాత్మకమైన సర్వతేజో రాశియు నాదిత్యుఁడే యని తేజస్తత్త్వము బోధించు నీక్రింది ఋక్కును బట్టి యూర్ధ్వాధోలోకములందు వారున్నారనుట మున్మాటికి నిజము.

"ఆదిత్య స్సర్వోఽగ్నిః పృధివ్యామ్
వాయు రన్తరిక్షే సూర్యో దివి
చంద్రమా దిక్షు నక్షత్రాణి స్వలోకే"

మఱియు, ఆరోగాది సప్త సూర్యులును సృష్ట్యాదిని కశ్యప సూర్యునం దంకురించిన మొలకలు అతని తేజస్సు వల్ల వృద్ధిగాంచిన వారు...ఊర్ధ్వాధో లోకముల నెల్ల నెల్ల మొడల కశ్యపుఁడు చూచుచుండు నిత్యాదిగా సూర్యతత్త్వ మెఱిఁగించు నీక్రింది ఋక్కులే పూర్వోక్త భావమునఁ బరమ ప్రమాణము "ఆయస్మిన్త్సప్త వాసవాః రోహన్తి పూర్వ్యా రుహాః"...కశ్యపః పశ్యకో భవతి... యత్సర్వం పరిపశ్యతీతి సౌక్ష్మ్యాత్" ఇత్యాది...

ఇట్లు దివ్యతేజోమూర్తియై సర్వ ప్రపంచమును పరీక్షించు కశ్యపుని మన మిపుడు చూడలేకున్నను, ఉత్తర ధ్రువమనఁబడు మేరువు చుట్టును సూర్య చంద్రాది గ్రహములు ప్రదక్షిణము చేయుచుండు ననియు, మన సంవత్సరమందున్న దేవతల కొక దినమగు ననియు తైత్తిరీయారణ్యక మనుస్మృతి సూర్య సిద్ధాంతాదులు తెలుపుచున్నవి. ధౌమ్యుఁడీ మేరువు లక్షణములు ధర్మరాజునకుఁ దెలిపినట్లు మహాభారతము వక్కాణించు చున్నది. ఆధునిక పరిశోధకులు కొందఱు విమానములపై నేఁగి యామేరు ప్రాంతము చూచి వచ్చుచున్నారు గదా! ఇంక సకల జగత్తు నందలి సూర్యుల కాధారము పరమేశ్వరుని కధికరణమైన కశ్యపుఁడే యనుటకు సందేహ మేమి?

ఉత్తర ధ్రువమందలి యెడతెగని యాఱుమాసముల పగటి నుత్తరాయణమనియు, అందలి యెడ తెగని యాఱుమాసముల రాత్రిని దక్షిణాయనమనియు సూర్య్య సిద్ధాంతాదులు చెప్పినవి. అవే మన కయనములు. మన పండ్రెండు మాసము లక్కడి వారి కొక రోజు "బభూవ రాత్రిర్దివ సశ్చ తేషాం సంవత్సరేణై వ సమానకాలః" దాన్నినే వివరించుచు, నక్కడి రాత్రిం దివములు రెండు నిక్కడ నొక సంవత్సర మగునని స్పష్టపఱచినవి.

ఇంత దనుక చేసిన ప్రసంగమును బట్టి వైదికర్షులును వారి యుపదేశము లాధారముగా శాస్త్రకర్తలును సూర్యమండల తత్త్వ మామూలాగ్రము పరిశోధించినవా రనుట విదితముగదా? ఆవేద గత సూర్యవర్ణనలకు సవిమర్శమైన వ్యాఖ్యానమన మహాభారతా రణ్య పర్వమందు సౌరతత్త్వ మభివర్ణింపఁబడినది. దాని నెల్ల నిపుడు వర్ణించి చెప్పుట యసాధ్యము. అందలివి నాలుగు మాటలు.

"సూర్యుఁడఖిల దేవతాత్మకుఁడు జగత్ప్రవృత్తి నివృత్తి హేతు వైన యతఁడే పరమాత్మ. త్రిలోకములకు హితమాచరించు నతఁ డొకఁడే జగతీతల మందలి యెల్ల జంతువుల నేత్రము. పదుమూఁడు ద్వీపములతోడి మహీతలము నెల్ల నతఁడే వెలయించు చున్నాఁడు. సహస్ర యుగ సంమితమైన బ్రహ్మదేవుని యొక పగటికిని మొదలు తుదయు నతఁడే" ఇత్యాదిగా నున్న యావర్ణన మంతయు, ఆరో గాది సప్త సూర్యులను ప్రకాశింపఁ జేయు కశ్యప సూర్యునికి సంబం ధించియున్న దనుట నిరాక్షేపము ఇంక.

"సప్తద్వీపా వసుమతీ" యను మాటను బట్టి యీ భూమండల మందుండ వలసిన యేడు ద్వీపములు పూర్తిగా కన్పడకున్నను కొను చుండ, పదుమూఁడు ద్వీపములతోడిది భూమియన్న పై మాటను బట్టి మఱి యాఱు పములుండ వలసి వచ్చును గదా! వాటిని

గుర్తించు భారము భూగోళ చరిత్ర కారులకు విడిచి తక్కిన స్తుతిని స్మరింతము.

సర్వాంతర్యామి సకల జగదాత్మకుఁడు నైన పరమాత్ముని చిచ్ఛక్తి యీ కశ్యప సూర్యుఁడు సాధనముగా జగత్కార్యము నడపు చున్న దన్న తత్త్వము నీస్తుతి యావిష్కరించిన దని తెలియుటయే మన పని. ఈ భావమునే సూర్యసిద్ధాంత మీక్రింది విధముగా సమర్థించు చున్న దని భావింతురు గాక.

"మధ్యే సమంతా దండస్య భూగోళోవ్యోమ్ని గచ్ఛతి
బిభ్రాణః పరమాం శక్తిం బ్రహ్మణో ధారణాత్మికామ్"

'భూగోళము పరమాత్ముని యాకర్షక శక్తిని పట్టుకొని యీ బ్రహ్మాండ మధ్యభాగ మందంతటను గగన తలమున తిరుగుచున్నది. సోమనామక మైన యాశక్తియే కశ్యపుని జ్యోతిస్సును సర్వకాల సర్వావస్థల యందును ప్రసరింపఁ జేయుచు నారోగాది సూర్యులను, వారి ద్వారా సకలగ్రహ నక్షత్రాదులను ప్రకాశింపఁజేయుచున్న దని యింతకు మున్నె తెలిసికొనియున్నాము. దీనిని బట్టి పరమేశ్వరుని శక్తి కధికరణము కశ్యప సూర్యమండల మనుట సువిదితము.

ఇట్లు ప్రపంచ మంతయు సూర్యునితో నున్నదని గుర్తించిన మహర్షులు సూర్యుఁ డారోగ్య దాయకుఁడని విశ్వసించి యతని నారాధింపఁ జొచ్చిరి. ప్రస్కణ్వుఁడను మహర్షి చర్మ రోగము పాలై మూఁడు ఋక్కులతో సూర్యు నారాధించుచు రోగబాధా విముక్తుఁ డయ్యెను. అదియే తృచ విధానము. ఋగ్వేద మన్ని మండలము లలో నున్న 60½ ఋక్కుల నొక్కచోఁ జేర్చి వానికి మహాసౌర మని పేరు పెట్టిరి. దానితో సూర్యు నారాధించుట రెండవ విధానము. అది సర్వరోగ శాంతికరము. తైత్తిరీయా రణ్యకములోని ప్రథమ ప్రశ్న మంతయు సూర్య మహత్త్వ స్తుతిపరమే. దానిని

పఠించుచు సూర్యనమస్కారము లొనర్చుట యరుణవిధాన మందురు. ఈమూఁడు విధానములతో సూర్య దేవు నారాధించుట దేశమునం దిప్పటికి నాచరణలో నున్నది. ఇది యత్యాంతరంగికమైన సౌర తత్త్వ వివేకము.

సూర్యుని సవితగా వర్ణించిన మొదటి ఋషి విశ్వామిత్రుఁడు. అతఁడు సందర్శించిన ఋక్కు గాయత్రీ ఛందోబద్ధ మగుటచే గాయత్రి యనఁబడుచున్నది. అందు సవిత ధ్యేయుఁడగుటచే సావిత్రి యనియు ప్రసిద్ధి కెక్కినది. ఇట్లెందఱో యెన్నో విధముల నారాధించుచు వచ్చిన విధానముల సారాంశముగా నేర్పడిన యర్వాచీనుల సూర్యధ్యాన శ్లోకములలో నొకటి—

"నమ స్సవిత్రే జగదేకచక్షుషే
జగ త్ప్రసూతి స్థితి నాశ హేతవే,
త్రయీమయాయ త్రిగుణాత్మధారిణే
విరించి నారాయణ శంక రాత్మనే"

ఇఁకనే సూర్యాష్టక విషయమును ప్రాజ్ఞులకు సంగ్రహముగాఁ దెలిపినానో, ఆసూర్యాష్టకమును ధ్యానించుచు రచియించిన సూర్యాష్టక మును వినిపించెదను.

చిత్తగింపుఁడు.

సూర్యనారాయణీయః సూర్యాష్టక స్తవః.

వసన్త తిలకా వృత్తమ్ :—

ఆలోకనం దశది శాన్తర జీవరాశే
రాలోకితార మఖిల గ్రహతారకాణామ్,
ఆరోగ్య భాగ్య సవితార ముపాసకానా
మారోగ మీశ్వర చిదంశ మహం నమామి.

మేరో రధోగత మహీతల భూత జాత
రక్షావిధాయిన మధోముఖరశ్మి జాలైః,
విభ్రాజమానమహసం నిగమస్వరూపం
భ్రాజం పరాత్పర కృపానయనం నమామి.

తస్మేరు మార్గ నిహనైక ధరాతలస్య
సందీపన ప్రవణ దీధితి దివ్య మూర్తిమ్,
అజ్ఞేయసంస్థితి మగోచర కాల కాలః
విజ్ఞాపకం పటర మూర్జదుహం నమామి. ౩

దీవ్యన్త మన్యదిశి మేరుపథా దధ స్తాద్
రోదోఽన్తరాళమభితః పతదాత్మదీప్త్యా
తత్కశ్యపప్రభుకృపోజ్జ్వల చిత్ర భానుం
దేవం పతఙ్గ మపవర్గపథం నమామి. ౪

తస్మేరు మార్గ ముపరి స్ఫుర దన్తరిక్షం
ద్యాఞ్చో ద్వహన్త మరుణోర్ధ్వము ఖాంశు జాలైః,
స్వర్ణ ప్రభాధగధగాయితదివ్య మూర్తిం
తం స్వర్ణరం భవ సరిత్తరణిం నమామి. ౫

ఊర్ధ్వం ద్యులోక మభితః పరిదృశ్య మాన
జ్యోతిర్గ ణస్య విమలద్యు తిహేతు భూతమ్,
జ్యోతిర్మయ ప్రభు కృపా పరిలబ్ధ దీప్తిం
జ్యోతిష్మ దాఖ్య మధిలోకభృతం నమామి. ౬

1. ఆరోగః-భ్రాజః-పటరః - పతఙ్గః-స్వర్ణరః - జ్యోతిషీమాన్-విభాసః కశ్యపః- ఇత్యష్టౌ సూర్యాః
2. "జ్ఞః కాలకాలః" శ్రుతిః. అధి సత్త్వ నామకః, వ్యావహారిక కాల స్యోత్పాదకః పరమాత్మ రూపః చైతన్యాత్మకః కాల ఇతి, కాలకాల శబ్దార్థః

ఆసత్యలోక ముపరిస్థిత లోకవాసి
చక్షుః ప్రియంకరవిభా పరిభాసమానమ్,
భాసా వశీకృత దిగన్తర రోదసీకం
దివ్యం విభాస మఖిలార్తి హరం నమామి.

ఈశానుశాసనవశా దఖిలాణ్డకోటి
బ్రహ్మాణ్డదీపన విధీన్ పరికల్ప్య సూర్యాన్,
ఆశ్రిత్య మేరు మభితః పరిశీల యన్తం
తం కశ్యపం పరమహాస్సదనం నమామి

ఓ మారోగ భ్రాజ పటర పతఙ్గ స్వర్ణర జ్యోతిష్మ ద్విభాస
కశ్యపేభ్యో నమః.

శ్లో॥ మల్లాది వంశ ప్రభ వేన సూర్య
నారాయణ ధ్యానపరాయణేన,
శ్రీ సూర్యనారాయణ శాస్త్రి ణేదం
సూర్యాష్టక స్తోత్ర మభాణి భక్త్యా.

సూర్యాష్టక స్తవమముం నియతః పఠే ద్యః
ప్రాత శ్శుచిః ప్రతిదినం ప్రణమన్ సవిత్రే,
సూర్యాష్ట కస్య కృపయా లభతేఽత్ర పూర్ణ
మాయు శ్శ్రియం సుఖ, మముత్ర పరాం గతిం సః॥

ఓం తత్సత్.

---

శ్రీ శివాయ గురవే నమః

# కళింగము — త్రికళింగములు

కట్టె సాంబమూర్తిశాస్త్రి

శ్రీ మద్వాల్మీకి రామాయణము నందును, భారతా దీతిహాస గ్రంథములందును, భాగవతాది పురాణము లందును, ధర్మశాస్త్ర గ్రంథము లందును గొన్ని దేశనామములకును, వ్యక్తుల నామములకు అవి కొన్ని వింతగా నుండును. అంగదేశము=రుద్ర నేత్రాగ్ని దగ్ధుఁడగు కాముఁడు అంగము విడిచిన దేశమని రామాయణము. బలియను నొక రాజు సంతానము లేక, బహు సంతాన వంతుఁడగు దీర్ఘతముఁడను ఋషిని ప్రార్థింప నాముని వివస్త్ర గానున్న బలి భార్య యొక్క ఒడలంతయు నిమిరెననియు దానివలన నామెకు పుత్త్రుఁడు కలిగెననియు, అంగస్పర్శచే జనించిన బాలుఁడు అంగుఁడని వ్యవహరింపఁబడెననియు నాతడు పాలించిన దేశమున కంగ దేశమను పేరు రూఢమైనదనియు మహాభారతము నిర్వచించినది. అప్సరసః=సముద్రము తఱచినపు డానీటిలో బుట్టిన సారము అప్సరసలు. అంధ ప్రాయము అనఁగా అడవులచే నిండినది. ఆంధ్ర మనియు ద్రావిడంబయం తీతి ద్రావిడాః అనియు నిర్వచనములు కేవల మాత్సర్య గ్రస్తులచే నిటీవల గల్పింపఁబడినది.

శ్లో॥ హిమాచలం సమారభ్య యావద్బిందు సరోవరమ్
హిందూదేశ మితిఖ్యాత మాద్యం తాక్షర యోగతః

అను నిర్వచనము కూడ ప్రామాణికము గాని దే. కళింగ పదము రామాయణమున రెండు మూఁడు తావులఁ గలదు. కాని దాని నిర్వచనప్రసక్తి తగులలేదు. కళింగరాజులగు శిశుపాల దంతవక్త్రులు శ్రీకృష్ణునిచే నిహతులైనట్లు భాగవతమునను, భారతమున కళింగరాజు రత్నాంగదుని కూఁతురు శుభాంగిని స్వయం

వరమున నితరరాజులను గెల్చి తెచ్చి కర్ణుఁడు దుర్యోధనునకు భార్యగా నిచ్చెననియుఁ గాళింగులు కౌరవ పక్షమున భారత రణమునఁ బోరాడి రనియుఁ గలదు. దీనిని బట్టియే కలిం యుద్ధం గచ్ఛంతీతి కళింగాః కళింగా ఏవ కాలింగాః స్వార్థేఽణ్. అను వ్యుత్పత్తి యిటీవలి వారిచేఁ గల్పింపఁబడినది. కాళింగులు మహా ధీరులగు యోధులనియు సాహసికులగు నావికు లనియు అతిప్రాచీన కాలము నుండియుఁ బ్రసిద్ధి గన్న వారు. అశోకుని కళింగయుద్ధమున లక్షమంది యోధులు దేశమునకై ప్రాణము లర్పించుట చరిత్ర ప్రసిద్ధము కదా? కాళిదాసుఁడును రఘువంశమున కాళింగులను బ్రశంసించియున్నాఁడు. హూను త్సాంగు, ఫాహియాన్ అను విదేశ యాత్రికులును ప్లీని మొదలగు చారిత్రికులును గళింగులను బ్రశంసించిన వారే? వీరందఱును గాళింగులు యుద్ధప్రియులగుటచేతనే వారికి కళింగ వ్యవహారము సిద్ధించిన దని తలంచువారే.

సాధారణముగా దేశమున కేపేరుండునో ఆపేరే అందలి జనులకు వారు వ్యవహరించు భాషకును గూడ నుండుట అనుభవ సిద్ధము. ఆంధ్ర దేశము, ఆంధ్రభాష ఆంధ్రులు, తెలుఁగు దేశము, తెలుఁగు జాతి, తెలుఁగు భాషయు నట్లేర్పడినవే. దేశము, జాతి, భాష అను మూఁడిటిలోనే యొకదానినామము వలననో తక్కినవాని నామము లేర్పడునట్లు పెద్దలు చెప్పుదురు. కళింగ దేశము, కలింగ, జాతికలదు కాని కళింగభాష కనంబడదే ? అతి ప్రాచీనకాలము నుండియు ప్రసిద్ధమైన కళింగజాతికి ప్రత్యేకభాష లేకుండునా? యని విమర్శింప వలసియున్నది. దానికై మొదట కళింగనామము వ్యుత్పత్తి కనుఁగొనవలసియున్నది.

"కలిం గచ్ఛంతి" యుద్ధప్రియులను వ్యుత్పత్తి జాతికిఁ గొంత ఉత్కర్షాధాయకమే యైనను వాస్తవికము మాత్రము గానేరదు.

క్షత్రియునకు యుద్ధము తెఱచియుంచఁబడిన స్వర్గద్వారము అను నమ్మకము గల ఆదినములలో నన్ని జాతులును యుద్ధ ప్రియములే అయినప్పుడు కేవల కాళింగ జాతికే ఆ వ్యవహార మంటఁ గట్టుట న్యాయము గానేరదు. కావున కళింగ వ్యవహారమునకు వేఱు కారణ ముండియుండును. కళింగమను నది ఒక్క ప్రదేశము గాదు. ఒకని యేలుబడిలో నున్నదియుఁ గాదు. అనేకభూభాగము లనేక రాజుల పాలనములో నుండెడివి. విదేశయాత్రికులు చారిత్రికులును సప్తకళింగములని కొందఱు, పంచ కళింగములని కొందఱు, త్రికళింగము లని కొందఱు పేర్కొనిరి. ఇవి యన్నియు మొత్తము పైని వంగదేశమందలి కపిశా (లా) నది నుండి గోదావరి వఱకు వ్యాపించి యున్నవని చరిత్రకారుల సాధారణ నిర్ణయముగా నున్నది. శ్రీశైలము వఱకుఁ గల దేశము గూడ త్రికళింగాంతర్గత మనుట న్యాయ్యము. పంచ సప్త కళింగముల సన్నివేశ మెట్టిదో వాని ప్రత్యేక వ్యవహార మెట్టిదో యెఱుక పడదు. బహుశః చిన్న చిన్నవిగా నున్న రాజ్యముల ననుసరించి యీ వ్యవహారము పుట్టి యుండును. త్రికళింగము మాత్రము ఉత్కలింగము (ఉత్తర కళింగము) మధ్యోకళింగము (మధ్యకళింగము) ఎలమంచికళింగము అను మూఁడు భాగములుగా నున్నది. వంగదేశమందలి కపిశానది మొదలు కొని మహేంద్రగిరి వఱకు ఉత్కలింగము. మహేంద్ర మాదిగ విశాఖపట్టణము వఱకు మధ్య కళింగము. తదుపరి గోదావరి వఱకు ఎలమంచి కళింగము. గోదావరి దక్షిణమున శ్రీశైలము వఱకు నున్నది, ప్రస్తుతము నైజాము రాజ్యమంతయు గలిసి "త్రిలింగము" అని ప్రాచీన కాలమున వ్యవహరింపబడినట్లూహించుట సమంజసము. ప్రాచీన కాలమున బౌద్ధమత వ్యాప్తికి పూర్వము శైవమత ముచ్ఛదశలో నున్నపుడే దేశములకు కళింగ వ్యవహారము సంభవించినది.

"క" కమ్ అను శబ్దములకు నీరు అని అర్థము. జలజాతమగు పద్మము నకు కజాతము, కంజాతము, కంజము, కజము అను శబ్దములు పర్యాయపదములుగా సంస్కృత భాషయందుఁ గలవు. ఇప్పటి కవు లును సర్వసాధారణముగా వీని నుపయోగించుచున్నారు. కాఁబట్టి "క" శబ్దమునకు నీరు అను అర్థము నిర్వివాదము. ఇప్పుడు కళింగము అన నీరుగా నున్న లింగము అని మనము సులభముగా గ్రహింపఁ గలము. మూఁడు కళింగములందును జల లింగములు గలవు. శివుని అష్టమూర్తులలో పంచ భూతములు చేరియున్నవి కదా? కలింగము గూడ శివుని రూపభేదమని మనకు విశదము కాఁగలదు. దక్షిణాపథ మున శివుని పంచభూతలింగములతో గొప్ప క్షేత్రము లున్నవి. కాళహస్తి వాయులింగము. కంచి పృథ్వీలింగము జంబుకేశ్వరము జలలింగము. అరుణాచలము తేజోలింగము. చిదంబరము ఆకాశ లింగమును గలవు. మన దేశమున పంచభూతలింగములు లేకున్నను జలలింగములు మాత్రము మూఁడు గలవు. అవియే త్రికళింగములు. వాని వివరణ మీ క్రిందఁ గననగును.

ఉత్కలింగము-ఉత్తర కళింగము ప్రస్తుతము ఉత్కల విశ్వ విద్యాలయమునకు స్థానమై అతి ప్రాచీన ప్రశస్తి గల భువనేశ్వరము. భువన మనగా నీరు. జీవనమ్. భువనమ్, వనమ్. అమర నిఘంటువు. ఆక్షేత్రమున ప్రత్యేకించి లింగమేదియు లేదు. రమారమి గజము మేర చుట్టు కైవారముగ నల్లగ నిగనిగ లాడుచున్న యొక బల్ల పఱపు శిల కలదు. నడుమ నుబ్బెత్తుగాను క్రమ క్రమముగా నంచు లకు పల్లముగాను నాశిల చెక్కఁబడినది. నడుమ నుబ్బెత్తు ప్రదేశ మున నొక కాఱురాయి శిథిలమయినది కలదు. ఒక ప్రక్క నంచు నకు సమీపముగా మూఁడు పగుళ్ళవంటి గీతలు కలవు. గంగా, యమునా, సరస్వతీ నదులు మూఁడు నాపగుళ్ళ నుండి పైకి ప్రవ

హించు నని అర్చకులు, స్థానికులు నందురు. భువనేశ్వర రహస్యము, ఉత్కలింగ రహస్యము నిందే యిమిడియున్నది. ఇప్పుడు కూడ భువనేశ్వరమున నీటి జలలు గలవు. వానిని ఇంగ్లీషులో మినరల్ వాటర్సు అందురు. రామాయణమున ఆకాశము నుండి తన శిరమున బడిన గంగను శివుఁడు చిరకాలము జటలలో నిర్బంధించియుంచి భగీరథుని ప్రార్థనముచే బిందు సరోవరమున విడిచినాఁడని కలదు. భువనేశ్వరమున బిందుసరోవర మను పుష్కరిణి కలదు. భువనేశ్వర గ్రామము చుట్టును నాలుగైదు మైళ్ళవఱకును ఱాతి, కంకర, నేల. ఆ నేలలోని నీరు మిగుల నారోగ్యకరమైనది. ఆ నీటి వలన ననేకాసాధ్య రోగములు శమించును. ఆనీటికిని అక్కడి చల్లని గాలికి నీపై రాష్ట్రముల వారనేకు లాప్రాంతమున బంగళాలు కట్టుకొని నివసించుచున్నారు. భువనేశ్వరము రైలు స్టేషను మొదలుగ నూరివఱకును మూఁడు మైళ్ళ రోడ్డున కిరుప్రక్కల బెంగాలీలు మొదలగువారి బంగళాలు కలవు. శ్రీ రామకృష్ణ పరమహంస కూడ నొకప్పుడక్కడ కొంతకాలము నివసించెనఁట. ఆవిషయము తెలుపు మఠమును గొప్ప ఆవరణము నక్కడ నున్నవి. కావున భువనేశ్వరము ఆరోగ్యకరమగు నీటికి తావని మనము తెలిసికొందము. భువనేశ్వరమున దేవునకు భువనేశ్వర లింగరాజ మహాదేవుఁడని సంకల్పమునందుఁ జెప్పుదురు. ఈశ్వరలింగ పదములు తొలగించిన భువనలింగమను పద మేర్పడును. అది కళింగమునకు పర్యాయము గూడ నగును. ఈ ఈశ్వరపదమును రాజపదము నెప్పటి నుండి వ్యవహారములో నున్నను భువనలింగ పదములు మాత్ర మనాదిసిద్ధములై కళింగము నుత్తర భాగమందుండుటచే నుత్కలింగ వ్యవహారమునకుఁ గారణమై యున్నవనుట సిద్ధము.

## మధ్య కళింగము

మధ్య కళింగమునకు ప్రాకృత భాషలో మధోకళింగమని తద్భవ రూపము. మధోకళింగము కాలక్రమమున మధూకలింగము మధుకేశ్వరలింగముగా పరిణమించి మధూకవృక్ష కథ కూడ కల్పింపఁబడినది. అంతియ కాకుండ లింగము మధూక దారుమయముగా నవతరించి కొన్ని శతాబ్దములు భోగరాగము లనుభవించి మూఁడు దశలకు మున్ను త్రాగుఁబోతులగు నర్చకుల వివాహమున దివ్వె కంబము దెబ్బకు గుఱియై చెక్క ముక్కలై పోగా నిప్పుడా స్థానమున దృఢమైన శిలాలింగము పాదుకొనినది. ఇదియుఁ బ్రాచీన కాలమున జలలింగమే. ఇప్పుడు ప్రసిద్ధముగా నున్న ముఖలింగమున జలలింగమున్నట్లు కానరాదు గాని దీనికి నాతిదూరమునఁ గల "బుడితి" గ్రామమున జలలింగేశ్వరాలయ మున్నట్లును ఆలింగము కారణముగా నాగ్రామమునకు అబ్లింగము అను పేరున్నట్లు నూహింఁచుట కాధారము కలదు. ఆ గ్రామమున ఇపుడు అవలింగి యను వ్యవహారమున్నను శాసనములందు "అవలింగ" గ్రామమను పేరే కలదు. మూఁడవ వజ్రహస్తదేవుఁ డీగ్రామమును జలలింగేశ్వర స్వామికిని గొందఱు విశ్వబ్రాహ్మణులకును అగ్రహారము చేసినట్లు శాసనమున్నది. ఈ అబ్లింగ (అవలింగేశ్వరు నుండియే మధ్య కళింగము నకు కళింగనామ మేర్పడినది. ముఖలింగపదము త్రికళింగ పదమునకు నాంధ్రీకరణమున మొదట మూఁడు కళింగము ముక్కలింగము అని వ్యవహరింపఁబడి అనంతరకాలమున విజ్ఞులచే ముఖలింగముగా మార్పఁబడినది. మధ్యకళింగమని యూహింపఁబడిన అవలింగ గ్రామము పరిశోధించుటకై వెళ్ళితిని. అక్కడి హైస్కూలు హెడ్ మాష్టరు శ్రీ దేవరాజు వేంకట సూర్యనారాయణమూర్తిగారు నన్ను మిక్కిలిగా నాదరించి విశేష శ్రమ మంగీకరించి పరిశ్రమించి

నాయత్నము సుకరము సఫలము నొనరించిరి. వారికి నా చిరతర కృతజ్ఞతా వందనములు. అచ్చటి స్థలజ్ఞ వృద్ధుల వలన నీ క్రింది విషయములు తెలియవచ్చినవి.

పూర్వము జలేశ్వరుఁడను శివలింగము ఆలయము నుండెడి దనియు నది యిప్పుడు ధవళేశ్వరాలయమని వ్యవహరింపబడుచున్న దనియుఁ జెప్పిరి. దగ్గర గల బఱ్ఱికొండ నుండి జలధార ప్రవహించెడి దనియు, దానికి జలేశ్వర ఘట్టమను నామముండెడిదనియు ఆధార పూర్వము వంశధార నదితో కలిసెడిదనియుఁ జెప్పిరి. దంతవరపుకోట పాలించెడి దంతవక్త్ర మహారాజునకు గురువగు ఆనంద దేవరవారు మల్లేశ్వరుని ప్రతిష్ఠించిరి. జలేశ్వరునకే అమృతేశ్వరుఁడనియు, మల్లే శ్వరుఁడనియు కాలక్రమమున వ్యవహారము కలిగెనఁట. తీర్థయాత్రా పరులై వచ్చెడి ఋషులు తొలుత నిక్కడకు వచ్చి జలేశ్వర ఘట్ట మున స్నానమాచరించి, విభూతి ఘట్టమున విభూతి దాల్చి నారద కుండము, గోకుండములలో స్నానము చేసి బొడ్డపాడులో జలేశ్వరుని (ధవళేశ్వరుని, తరువాత బగిర్ల గుడిలో విశ్వనాథుని దర్శించి తరు వాత కామినాయుడుపేటయొద్ద కామేశ్వరుని ఎండల కామేశ్వరుని) సోమేశ్వరుని భీమేశ్వరుని,మధూకేశ్వరుని దర్శించెడి వారఁట. అవలింగి మొదలు కొని ముఖలింగముతో సహా ప్రాచీన కాలమున ఏక క్షేత్రముగానే యుండెడిదఁట. అప్పటి గృహములు దేవాలయములు శిథిలమై ఆ ప్రదేశమంతయు వరిపొలములుగా నిపు డున్నది. ముఖ లింగము వఱకు నక్కడక్కడ ఒక గజము ఎత్తు మున్నాతిక గజము చుట్టుకొలత గల లింగము లనేకము లిప్పుడున్నవి. వాని ఆలయము లన్నియు శిథిలమై అంతరించినవి. బఱ్ఱికొండపై నొక పవిత్రమైన నూయి కలదు. నారద గుండము. గోగుండము ఊటగుండము

మొదలగు కుండము లిపుడు పాడుపడి మట్టికి నీటి కుండములుగా నున్నవి. తురకల ప్రభుత్వమున, నవలింగ నగరమునకు ఔరంగ నగర్ అను పేరుండెడిదట. దంతవక్త్రుని కోటయొద్ద జలుమూరు కోటవద్ద పాటి మన్ను త్రవ్వినప్పుడు బంగారపు నగలు నాణెములు దొరికెడివట. ఈ గ్రామమున నా మట్టి దిబ్బలలో సన్నికలు ముక్కలు, మందులు నూఱు ఖల్వము ముక్కలు విశేషముగా పాత కాలపు కుండ పెంకులు దొరికెడివట. ఎక్కువ దళసరి గల ఇటుక ముక్కలు దొరికెడివట. (మల్లేశ్వరాలయమున అడుగు చదరము అడుగు మందము గల ఇటుక మేము చూచినాము. మల్లేశ్వరాలయమున కొంచెము శిథిలమైన నంది విగ్రహము గలదు. అది సాధారణముగా మెడయెత్తుకొని యున్నట్లుండక మెడ ముడుచుకొని ముంగాళ్ళపై వంచిన మెడ నానుకొని నిద్రించు చున్నట్లున్నది. ఇట్లుండుట యెక్కడ నగపడదు. మల్లేశ్వరలింగము జీవల్లింగమనియు నది క్రమక్రమముగ వల మెక్కువగుచున్నదనియు పూర్వము చేయింపఁబడిన విశ్వరూపమను నాగాభరణ మిపుడు ఇఱు కిఱుకుగా నగుచున్నదని నిక్కడి వారూహించు చున్నారు. బొడ్డపాటిలో జలేశ్వరస్వామి వారి కిచ్చిన తామ్ర శాసనము లభించినదట.

ఇవి స్థానికవృద్ధులు బోర సన్యాసినాయుఁడు వయస్సు 80 బోర సిమ్మన్న వయస్సు 70 మొదలగు వారు చెప్పినది మేము చూచినదియును. పైని వ్రాసిన దాని వలన పురాతన కాలము న నీలవలింగము, ముఖలింగములు గలసి యేక క్షేత్రముగా నుండెడి దనియు, దానికి అల్లింగనగర మను పేరుండెడిదనియు నది మూఁడవ వజ్రహస్త దేవుని కాలమునకే విడి పోయినదనియు వజ్రహస్తునిచే చేర్కొనఁబడిన జలలింగేశ్వరుఁ డిపుడంతర్హితుఁ డైనాఁ డనియు నూహింప వీలగుచున్నది.

ఇది మధ్య కళింగ ప్రశంస. ఇంక ఎలమంచి కళింగ వృత్తాంతము నారయుదము.

మలిచిలి, ఎలమంచిలి అను గ్రామములు అనేకము కనబడుచున్నవి. విశాఖపట్టణ మండలములో తాలూకాకు ముఖ్య పట్టణమగు ఎలమంచిలి మనకిప్పుడు గావలసినది. ఆశబ్దమున కిప్పుడు చివర లివర్ణమున్నను ప్రాచీన శాసనములందును చారిత్రక పత్రములందును ఎలమంచి అనియే కలదు. ప్రాచీన కాలమున నీ గ్రామము నాధారము చేసికొనియే ఎలమంచి కళింగమను వ్యవహారము రూఢమయినది. దీని సమీపముననే అతి ప్రాచీనాంధ్రుల రాజధానియగు సిద్ధి యున్నది. ఎలమంచిలి తాలూకాకుఁ గొంత కాలము సిద్ధి తాలూకా యను నామమును దాని దగ్గరనే గల (సర్వసిద్ధి) రాయవరమున మునసబు కోర్టు నుండెడివి; కాని దరిమిలాను ఎలమంచిలి తాలూకాగా మార్చి దొరతనము వారి కచేరీలన్నియు నక్కడకే మార్పఁబడినవి. ఎలమంచిలిలో కొమ్మయగుండమను చెఱువు కలదు. ప్రాచీనమైన విష్ణ్వాలయ మొకటి చిన్న కొండపైని గలదు. వెలనాటిచోడుని మంత్రియు, దండనాథుఁడునగు కొమ్మనామాత్యుఁడు ఎలమంచి లాదిగా కళింగ దేశమున ముప్పది రెండు విష్ణు ప్రతిష్ఠలు గావించినట్లు మంచన కేయూరబాహు చరిత్రమున బేర్కొన్నాఁడు. కొండ మీది ఆలయమునకు వెళ్ళెడి సోపానములలో నొక శిలా శకలము పైని గొంత శాసనభాగము గలదు. ఇటీవలివా రెవరో ప్రాచీన శిథిలాలయమును పునర్నిర్మించినపు డాశాసన ఫలకమును చిదిపి పాతియుండవచ్చును. ఈ కళింగమునకు "కళింగ" వ్యవహారమేమో కలదు. ఆ వ్యవహారమెట్లు కలిగెనో చూతము. ఎలమంచిలిలో నిప్పుడు కొమ్మయగుండ మనుచెఱువును ఆ శిధిల శిలాఫలకమును దక్క నింకేమియు ప్రాచీన చిహ్నము లగపడలేదు. నలువ

దేండ్లకుముం దొక బ్రాహ్మణుఁడు నూయిత్రవ్వుచుండగా నొక శివాలయము కనఁబడఁగా నాతఁ డాలింగమును ఎక్కడనో పాఱవైచి మలచిన ఱాలతో చక్కని యిల్లు కట్టుకొన్నాఁడు. దాని వలనఁ గూడ మన కంత లాభము కలుగలేదు. కాని ఎలమంచిలి కొంచెము దూరమున "ధారపాలె" మను గ్రామమును "పంచధార" లను క్షేత్రమును గలవు పంచధారలు ఇప్పుడు కుగ్రామ మైనను చాళుక్య రాజనరేంద్రుని కేడవతరము మనుమఁడైన చాళుక్య విశ్వేశ్వర నరపాలునకు రాజధానిగా నున్నట్లు కావ్యాలంకారచూడామణిలో విన్నకోట పెద్దన కవి "పంచధారాధురీణా" మొదలగు విశేషణములతో వర్ణించియున్నాఁడు. అక్కడ నొక చిన్న కొండ నుండి నైదు ధారలు ప్రవహించెడివి. వానివలన నాక్షేత్రమునకు పంచధారలనియు దేవునకు ధారాలింగేశ్వరుఁడనియు వ్యవహారము కలిగినది. ఈ ధారాలింగమే "ఎలమంచి"క (ధారా) లింగ"మయినది. ఇప్పుడు నక్కడ ధారపాలె మనుగ్రామమును పంచధారలలో శివాలయమును గలవు. కాని దేవునకు ధర్మలింగేశ్వరుఁడని పేరుగా నున్నది. ఈ పేరుమాఱ్పిటీవలిదనియు పూర్వము ధారాలింగేశ్వరుఁడను వ్యవహారమే యుండెడిదనియుమనము సులభముగానే యూహింపఁగలము. ఈ కళింగము గోదావరి వఱకు వ్యాపించిన ట్లగపడుచున్నది. పిఠాపురము కళింగ దేశమందలి దని తెనాలి రామకృష్ణుఁడు పాండురంగ మాహాత్మ్యమునఁ బేర్కొన్నాఁడు. దాని సమీపముననే నవఖండవాడ యనునగ్రహారము రాజరాజనరేంద్రుఁడు పావులూరిమల్లనకిచ్చెనని మల్లన తగణితమునఁ జెప్పుకొన్నాఁడు. ద్రాక్షారామ భీమేశ్వరాలయమున కళింగరాజులచేఁ జేయఁబడిన దానశాసనములున్నవి. కాఁగా గోదావరి కీవల వేంగీదేశమునకుఁ బొరుగు దేశము కళింగమే యని తేలుచున్నది. ఈ మూఁడు కళింగములకు తెనుగున ముక్క

లింగమనియు సంస్కృతమున త్రికళింగమనియు వ్యవహారము. త్రిక ళింగ పదమునకు భ్రష్టరూపము త్రిలింగమనియు అదియే దేశ భాషలో తెలుఁగుగా మాఱినదనియు గొందఱు చెప్పుచున్నారు. ఒక వింత. ఈ మూఁడు స్థలములకును సమీపముననే ప్రాచీనములగు బౌద్ధ, జైన, నిర్మాణములును గలవు. భువనేశ్వరమునకు 3 మైళ్ళ దూరముననే ఖారవేలుని శిలాశాసనము గల హస్తి గుహాయు కండ గిరి (స్కంధగిరి) గుహాలును ఉదయగిరి గుహాలును సుమారు నూఱు గలవు. ఉదయగిరియం దిప్పుడును పూజా పురస్కారములతో నున్న జైన దేవాలయము గలదు. ముఖలింగమునకు 12 క్రోసుల దూర మున సుప్రసిద్ధములగు సాలె హూండము బౌద్ధ స్థూపములు గలవు. పంచధారల దగ్గరగా అనకాపల్లి శంకారము (సంఘారామములు) గలవు. బౌద్ధ జైనమతములకును శైవమతమునకును ప్రచండ విద్వే షము. ఆకాలమున నీ రెంటిలో నేదానినో యొకటి అణఁచి వేసి రెండవది విజృంభించి యుండవచ్చును. నేఁటి కాలమునఁ బక్షపాతము లేని ప్రజా నిరాదరమును రెండును సరిగానే అనుభవించు చున్నవి. మఱియు నీ మూఁడు క్షేత్రములకును సమీపమున శిథిలములయిన ప్రాచీన పట్టణములు గలవు. భువనేశ్వరము కడ శిశుపాల ఘడము, ముఖలింగ సమీపమున దంతవక్త్రుని కోట నగరి కటకము, సింగు పురమును (ఈ మూఁడును రాజధానులయినట్లు శాసనములు చెప్పు చున్నవి.) పంచధారల దగ్గర ప్రాచీనమయిన సర్వసిద్ధియును గలవు. ఈ శిథిల పట్టణములు ప్రాచీన కాలమున త్రికళింగ రాజధానులై యుండ నోపును. ప్రస్తుత మాంధ్రదేశాంతర్గతమైయున్న కళింగ ప్రాంతమున ప్రాచీన చారిత్రకాధారము లపారముగా లభించు

నాశయున్నను పరిశోధకుల దృష్టి యటు ప్రసరింపకుండుట కాల మహిమ. కళింగ చరిత్రము లేకున్న త్రిలింగ చరిత్రము మొట్టి పడియే యుండును. కాఁబట్టి పరిశోధకులు కళింగ చరిత్ర పరిశీలమునకై యించుక కాలము వినియోగించునట్లు శ్రీ పరమేశ్వరుఁ డనుగ్రహించును గాక.

శ్రీ శ్రీ శ్రీ

# శివరాత్రి మాహాత్మ్యము — కావ్యత్వము

చిలుకూరి పాపయ్యశాస్త్రి.

శ్రీనాథుని ప్రబంధములలోఁ దుదిరచనగాఁ గానవచ్చుచు మన కుపలబ్ధమైనది శివరాత్రిమాహాత్మ్యము. ఆంధ్ర సాహిత్య పరిషత్తు దీనిని బ్రకటించిన తరువాతనే శ్రీనాథుఁ డీప్రబంధమును గూడ రచించెనని తెలియవచ్చినది. పరిషత్తువారికి లభించిన యీ ప్రతి యొక్కటియే గాక, వేఱొక ప్రతి నేఁటి వఱకు లభింపక పోవుటచే, దీనికిఁ బ్రిత్యంతర ముండినట్టులే యెఱుఁగ రాకున్నది. శ్రీనాథుని యితర ప్రబంధ రచనా సామ్యము దీని యందెల్లెడ నిమిడియుండుటచే, నిది శ్రీనాథవిరచిత మగునా, కాదా, యను విచికిత్స యెవ్వరికిని బయలుదేఱలేదు. ఈ ప్రబంధ రచన కాశీఖండ రచనానంతరమే జరిగినట్టు లిందలి శైలీపరిణతియే తెల్లముసేయుచున్నది. భావనాస మున్మిషితమైన వస్తూన్మీలన క్రమము కూడ నిది పరిణత రచన యని తెలుపుచున్నది. ఈప్రబంధము శ్రీశైలవాసి శాంత భిక్షావృత్తియతీశ్వరుఁడు, తన మూలభృత్యుఁడైన ముమ్మడి శాంతయ్య కంకితము సేయు మనఁగా, శ్రీనాథుఁ డందుల కంగీకరించి, యాతనికిఁ గృతి యిచ్చినట్లు గ్రంథస్థపీఠికవలనఁ దెలియవచ్చుచున్నది. ఆశ్వాసాద్యంత పద్యములనుబట్టి కూడ నేతత్కృతిభర్త ముమ్మడి శాంతయ్యయే యైనట్లు స్పష్టమగుచున్నది.

పరిషత్తునకు లభించిన దీని తాళపత్త్రి ప్రతి యొక్కటియే యగుటచేత, తదాలంబమున నిది ముద్రితమగుటచే గ్రంథపాత బహుళ మైనది. తన్మూలముగ నిందలి కవిత యందదుకులుగాఁ గాన వచ్చుచున్నది. ఈ ప్రబంధముద్రణమునకుఁ దొలి మలి పీఠికలు రచించిన శ్రీ కట్టి సాంబమూర్తిశాస్త్రిగారీగ్రంథ ప్రాశస్త్యమును గొంతవఱకుఁ దెలియఁ జేయుచు, నిందలి కృత్యాది శ్రీనాథ విరచి

తము కాదనియు, ప్రబంధవిషయ మంతయు శ్రీనాథ విరచితమే యనియు, దీనిలోఁ గాదంబరీ రచనానుసరణము విశేషముగఁ గల దనియు సోదాహరణముగ నట వివరించియున్నారు. కాని పాఠక లోకము శ్రీనాథుని యితరప్రబంధములను జదివినట్లు లీ ప్రబంధ మును జదువుట లేదనియుఁ జెప్పవచ్చును. దానికి మూలమేమో, కొంత వివరింతును.

శ్రీనాథుని రచన లాంధ్రభాష కమూల్యాభరణము లని,ఆంధ్ర పాఠక లోకమునకు విశిష్టముగఁ దెలిపిన వారు కీ. శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. వారీ ప్రబంధముల నన్నిటిని దలస్పర్శిగఁజూచి, శ్రీనాథుని ప్రతిభా విశేషము నవగతము చేసికొని, ఆతని ప్రబంధ ముల కాలనిర్ణయాదికమును గూర్చి, గ్రంథస్థమైన చరిత్రాంశములను గూర్చి, తమ యమూల్యమైన యాశయములను శృంగార శ్రీనాథమున వెలువరించి యున్నారు. దాని కాంధ్రలోక మెల్లప్పుడు కృతజ్ఞమై యుండవలసినదియే. 'తీర్థకారస్తు విరళః ప్రవేష్టారస్తు బహావస్సన్తి' అను సూక్తిచొప్పున దుష్ప్రవేశవిషయమునకు బాట నేర్పఱుచు వారు తక్కువ. బాట యేర్పడిన తరువాత దానిఁ బట్టి పయనించు వారు హెచ్చు. అట్టులే దుష్ప్రవేశ విషయమునకు వారొక బాట నేర్పఱిచిరి. కావున వారి యపారమైన కృషి ప్రశంసనీయమే. కాని శ్రీనాథుని శృంగారినిగా నిరూపించు క్రమమున, వారెన్నిటినో ముడి వెట్టి ముద్రవైచినారు. శ్రీనాథుని శృంగారిశేఖరునిగా నిరూపించు టకు శివరాత్రిమాహాత్మ్యరచనమును గూడ నొక కారణముగా ముడివెట్టినారు. శృంగార శ్రీనాథములో శ్రీనాథుని స్త్రీలౌల్యమును విశేషముగ నిరూపింప సమకట్టి, ఆతని కృతులన్నిటిలో నుండియు నుదాహరణము లిచ్చుచు, నీ శివరాత్రి మాహాత్మ్యరచనము కూడ దానికి మూలకారణమని తెలిపియున్నారు. ఇంచు మించుగ శ్రీనా

థుని రచన లన్నిటిలో నాతని యనుభూతి విదితమగుచున్నదని వివరించి యున్నారు. శాస్త్రిగారి యీ వివరణ మెంతవఱకు సరిపడునో, మఱియొకప్పుడు నా యోపినకొలఁది తెలిపెదను.

ఇంతియగాక 'క్రీడాభిరామము' పీఠికలో శ్రీనాథుని శీలమును గూర్చి తెలుపుచు నిట్లు వ్రాసియున్నారు.

"సత్ప్రబంధములందుఁ గూడ నిట్టి రచనలను సంకోచింపక నిరంకుశముగాఁ జొప్పించుటకు శ్రీనాథుని శీలమెట్టిదై యుండునో, యించుక యోజించిన గోచరించును. శివరాత్రి మాహాత్మ్యమును జెప్పు పవిత్రగ్రంథమున సంస్కృత మూలమున లేని చండాలీబ్రాహ్మణబువ సంభోగ సంభారము నంత సంపూర్ణముగా వర్ణింపవలసిన దేనా?"

ఈ పలుకులతో నాంధ్ర పాఠకలోకమున కీ ప్రబంధము నెడ నొక వైరస్య మేర్పడినది. శ్రీనాథుని ప్రబంధములలోఁ గాని చాటువులలోఁ గాని శృంగారభావసంవలితములైన పద్యములు చదువునపుడు గాని వినునపుడు గాని హృదయ మార్ద్రమై తన్మయత నందని సహృదయచిత్తము లుండఁబోవు. అట్టి శృంగారము మాటున నాతఁడను స్యూతము సేయు భక్తిచే పారవశ్యము నందని రసికచిత్తముకూడ నుండఁబోవదు. కాని శాస్త్రిగారు వైచిన యీ ముద్రచే శివరాత్రి మాహాత్మ్య మొక యంటరాని కావ్యముగాఁ బరిణమించినది. ఈ విషయమున ప్రభాకరశాస్త్రిగారి పలుకు లెంతవఱకు సరిపడియున్నవో పరికింతము.

ఈశివరాత్రి మాహాత్మ్యమునకు మూలము స్కాందపురాణాంతర్గతమైన 'యీశాన సంహిత' యని కృత్యారంభమునం దిట్లు పేర్కొనఁబడియున్నది.

---

1. చూ, శృంగార శ్రీనాథము పుట. 299-300.

తాపససార్వభౌములు సదా శివరాత్రిమహావ్రతంబు దో
షాపహతిక్రమంబు వినఁ డాదరణంబున నేను సద్గుణ
శ్రీపదపద్మము ల్దలఁచి చెప్పెద శంకర సంహితా కథా
దీపిత భవ్య మార్గమునఁ దేటపడ న్మొదలింటినుండియున్.

శివరా. 1-49.

సూతుఁడు శౌనకాది ఋషులకు దోషాపహమైన శివరాత్రి వ్రతవిధానము నీశానసంహితోక్తమార్గమునఁ దెలియఁ జెప్పెదనని నాఁడు. ఈ రీతిగఁ దెలిపిన యీ శివరాత్రిమాహాత్మ్యమునకు మూలమయిన 'ఈశానసంహిత' యెక్కడ లభించునా, యని యన్వేషించుచుండ, ప్రభాకరశాస్త్రిగారే మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము నందున్న, కాగితపు వ్రాఁతప్రతి నుండి యెత్తి వ్రాయించి, మూఁడధ్యాయముల సంస్కృతగ్రంథమును బరిషత్తునకుఁ బంపియున్నారు. అదియే శివరాత్రిమాహాత్మ్యమునకు మూలమయిన యీశానసంహిత యనినారు. ఆనాఁడు నేను పరిషత్కార్యాలయమున వ్యవహర్త (Manager) గాఁ బనిచేయుచు వారు పంపిన భాగమును ముద్రించియుంటిని. పిమ్మట నేను మదరాసునకుఁ బోయి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములో మాకుఁ బంపిన ప్రతికి మూలమైన మాతృకను బరికింపఁగా, నీ యీశానసంహిత యనునది యింత మాత్రమే గాక మఱికొంతభాగ ముండవలయు ననిపించినది. ఆ విషయమునుగూర్చి నే నీవఱకు ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలో 'శ్రీనాథుని గూర్చిన కొన్నిప్రసంగములు' అను వ్యాసమునఁ దెలిపియుంటిని. ఈ శివరాత్రిమాహాత్మ్యమున కాయీశాన సంహింత మూల మనుట నిశ్చితము. అది స్కాందాగ్గతమై యుండుటయు నిశ్చి

తమే. ఇపుడు పరిషత్తునందు ముద్రితమైన ఈశానసంహితలో నీ శివరాత్రిమాహాత్మ్యమునకు సంబంధించిన యితివృత్తము గలదు. దానిలో సుకుమారుఁడు చండాలాంగనతోఁ గవగూడుట, తత్సుతలతోఁ గూడ రమించుట యను నీ యితి వృత్తము కూడియే యున్నది. శ్రీనాథుఁడు మూలాతిక్రమమున నీ చండాలీ బ్రాహ్మణ బ్రువసంభోగ సంభారమును వర్ణించియుండలేదు. దాని నంత విరివిగా వర్ణింపవలసిన దేనా. యనినారు ? ఎంత సంపూర్ణముగానో వారు తెలుపలేదు. శ్రీనాథుఁ డేప్రబంధమునందును స్త్రీ పురుష సంభోగశృంగారము నతి సంయతము చేయునేగాని, దానిని హద్దుమీఱి వర్ణింపనే వర్ణింపఁడు. శృంగార రసనిర్వహణమునం దాతఁడు సహజముగఁ బాటించెడి సంయమమునే పాటించియున్నాఁడు. ఆక్రమ మెట్లుసాగెనో వివరింతును. ముందుగ నిందలి కథాసంగ్రహమును దెలిపెదను.

## కథా వస్తువు

మహాప్రళయము వచ్చి,భూమియంతయు జలమగ్నముగాఁగా, శ్రీమన్నారాయణుఁడు క్రోడావతారము దాల్చి, భూమిని జలమునుండి లేవనెత్తి ఆశ్రమ దీఱుట కాతఁడు క్షీరసముద్రమున శయనించి యుండును. బ్రహ్మయుఁ బ్రళయావసానమునఁ బ్రధానసృష్టి వాంతసృష్టి గావించి, తన కేర్పడిన ప్రాభవముతో విఱ్ఱవీగుచు క్షీరసాగరశాయియైన హరిని దర్శించును. ఆతఁడు బ్రహ్మనభ్యుత్థానాదికముచే గౌరవింపఁడు. దానిపై బ్రహ్మ కోపించి పరుషముగ మాటాడును. విష్ణువు నుద్దేకించి ప్రతివచన మిచ్చును. ఇరువురు తమ తమ ప్రాభవముల నుగ్గడించుచు వాగ్వాదమునుండి శస్త్రాస్త్రపాతమునకుఁ గడఁగుదురు. తుదిని వారిరువురు నొకరిపై నొకరు పాశుపతాస్త్రములు ప్రయోగించుకొందురు. వాని యుద్ధతి నణఁగించుటకై శివుఁ డారెండస్త్రముల నడుమ మహాలింగస్వరూపుఁడై యావిర్భవించి వారిరువుర

నాలింగమునాద్యంతములఁ గనుఁగొండని నియోగించును. వారిరువురు నా లింగము తుది మొదలు గానలేక తిరిగివచ్చి పరమేశ్వరుని శరణు వేఁడుదురు. వారికి శివుఁడు శివరాత్రివ్రతము నుపదేశించును. ఇది తొలుతటి కథ.

ఆవ్రతప్రభావము నెఱిఁగించుటకై తరువాతి సుకుమార చరిత్ర ముపక్రమింపఁబడినది. వింధ్యారణ్య ప్రదేశమున, రత్నపురి రాజధానిగాఁ బాలించు హేమాంగదునకు యజ్ఞదత్తుఁ డనుమంత్రి గలఁడు. ఆతఁడు వేదాదివిద్యలం దారి తేరినవాఁడు. ఆతని ధర్మపత్ని సుశీల. వారిరువురకు, తత్పుర సమీపవాసియైన ఓంకారశంకరుని కరుణచే జన్మించిన కుమారుఁడు సుకుమారుఁడు. ఆతఁడు వేదాదివిద్యలందు ఆరి తేరినవాఁడై వివిధకళలు నేర్చి సుందరాకారుఁడై పారదార్యము సురాపానము మున్నగు దుర్వృత్తుల మెలఁగుచుండును. కొంతకాల మిటు జరుగఁగా రాజాతని దుర్వృత్త మెఱిఁగి నగరమునుండి పంపి వేయఁగా, సుకుమారుఁడు హూణమండలమునకుఁ బోవుచు, నడుమ నొక తటాకమునొద్ద నిలుచును. తత్సమీపమున వెలివాడలో నివసించు చండాలకన్య యతిలావణ్యవతి యొక తె యాతటాకమున ఋతుస్నానము చేయవచ్చి, యాతనిఁ జూచి వలచును.

సుకుమారుఁడును గపటబ్రాహ్మణవృత్తితో మెలఁగుచు నా చండాలకన్యతోఁ గూడి రమించుచు, పక్కణవాసి శబరులతోఁ గూడి వేఁటలాడుచు, మాంస మాహరించుచు, చౌర్యముచే ధన మార్జించుచు నామెతోఁ గాపురించుచుండును. క్రమముగా నాతని దుర్వృత్తి బైటఁబడుటచే నాతఁ డచట నిలువలేక యాతావు గదలిపోవును. పిమ్మట నాతని కిద్దఱు కొడుకులు నిరువురు కూఁతులు జనించిన వెనుక నా చండాలాంగన మృతినొందును. ఆతని కఱువ దేండ్ల ప్రాయము వచ్చినను, కామోద్రేకముచేఁ దనకూఁతులఁ గూడి రమించుచు

వారలకుఁగూడఁ బుత్రులఁ గనును. ఇట్లాతఁడు పతితుఁడై మెలఁగు చుండ, నొక శివరాత్రి నాఁటి రాత్రివేళ నాకూఁతులకుఁ బూవులు తెచ్చుటకై పోయి, నాగేశ్వరాలయమునెదుట నిలిచి పొద్దుపోవు నంతకు జాగరముచేసి, భక్తులు చేసిన యీశ్వర పూజాదికమును జూచి యింటికి మరలివచ్చును. అప్పటి నుండియుఁ దన దుర్వృత్తి వదలి కదలక నిలిచియుండును. కొంత కాలమున కాతఁడు మరణిం పఁగా, వానిఁ గొనిపోవుటకు శివదూతలు యమదూతలు వత్తురు. మహాపాపి గావున నరకమునకుఁ గొనిపోవలె నని యమదూతలు, అల వోకగానైన శివరాత్రినాఁడు జాగరము సేయుట శివపూజను దర్శిం చుట యనునివి కలుషహరము లని శివదూతలు తెలుపుదురు. తుది కాతఁడు శివసాన్నిధ్యమున కేఁగును. కొదువవిషయ మిందు లేదు.

## ప్రబంధనిర్మాణపద్ధతి

శ్రీనాథుఁ డీప్రబంధమును తొందఱ తొందఱగా రచించె నని నారు శాస్త్రిగారు. కాని యట్టి తొందఱపా టేపాటియు నీరచనలోఁ గానరాదు. సావధానముగఁ బ్రణాళిక నేర్పఱచుకొని, కాదంబరీ కావ్యవిషయము ననుసంధానము సేయుక్రమమును నిర్ణయించుకొని, ప్రబంధలక్షణ సమన్వయమున కనువు గూర్చుకొని, రచన సాగించి యావెనుక కృతిసమర్పణము చేసియున్నట్టు లీ ప్రబంధమునందలి రచనాక్రమమమును సావధానముగఁ బరికించిన విదితమగుచున్నది. శ్రీనాథుఁడు తాను రచింపసమకట్టిన ప్రబంధమునం దేయేవిషయ ముల నుపనిబద్ధము సేయఁదలపెట్టెనో, వానికొక సూచన నిచ్చుచునే యుండును. అందు నీ శివరాత్రిమాహాత్మ్యమునఁ దత్సూచనాక్రమము నతివిపులముగ సాగించియున్నాఁడు.

"అభ్యుదయ పరంపరాభివృద్ధియు నభిమతార్థసిద్ధియు సత్ క్రియాభి వృద్ధియు నగున ట్లష్టాదశవర్ణనా గర్భంబుగా నత్యాశ్చర్యకరంబై నా రచియింపం

బూనిన కథాసంవిధానంబు సకలదోషవినిర్ముక్తంబై సర్వవస్తు సంధానయుక్తంబై సర్వలక్షణసంపన్నంబై సర్వాగమానూన సంభావితసంస్తుత్యంబై పరమ ధర్మో త్కృష్టంబై పరమేశ్వరప్రియంబై పార్వతీమనోహరంబై శ్రీనాథసేవితంబై బ్రహ్మ రుద్ర దేవతాదిసంస్తూయమానంబై శోభిల్లు నిష్పణ్యాచారిత్రంబు దశదోష వివర్జి తంబై యుండ నానేర్చు విధంబున రచియించెద, నది యెట్టిదనినఁ — బూర్వోక్త మార్గంబునఁ బరిపూర్ణంబై యథావిధి శోభిల్లు నిష్పణ్యాచారిత్రంబుం బోలినట్టి ధర్మ క్షేత్రంబును మహాతీర్థంబును నగు గంగా కాళిందీ సంగమంబున సత్యవ్రతపరాయణు లగు శౌనకాదిమహామునులు దీర్ఘసంత్రంబునందుఁ గూడియుండఁగ ... నమ్మహా మును లిట్లనిరి.”

సత్కవి విరచితమైన కావ్యము కృతికర్తకు కృతిభర్తకు నభ్యు దయపరంపరాధాయకము కావలయు ననిన నందలి విషయము ప్రధానముగ ధర్మసముద్బోధకమై యుండవలెను. కావ్యోపనిబద్ధమైన రస మేదియయినను ప్రధానఫలము మాత్రము శాస్త్రసమ్మితమైన ధర్మ ప్రతిపాదకము కావలయు ననుట ప్రబంధమార్గాంగీకృతమైన పద్ధతి. ఇట్టి ప్రబంధనిర్మాణము అభిమతార్థ సిద్ధిదాయకము ధర్మ క్రియాభివృద్ధికరము నగుటయు సహజము. శ్రీనాథుని యీరచన యష్టాదశవర్ణనాత్మకమై యత్యాశ్చర్యకరమై యుండు ననినాఁడు. ఇది ప్రాసంగిక విషయముగాక యథార్థమే యగునట్లు లీప్రబంధ మును బట్టణవర్ణముతో నారంభించి సుకుమార శివలోక గమనాభ్యు దయాంతముగ నిర్వహించుటలో, కించి న్న్యూనముగ సకలవర్ణన ములు సమకూడునట్టులు చేసినాఁడు. పట్టణమునందలి వనితలందఱ యీలువులు పాడుచేసి, తుదికి చండాలాంగనతోడను తత్సుతలతోడను గూడి పతితుఁడైన సుకుమారుఁ డలవోకగా శివరాత్రివ్రతపూజా దర్శనమున నిర్ధూతసకలపాపుఁడై శివలోకమున కేఁగుట యొక రసబంధురప్రబంధ మగుట యాశ్చర్యము గాక యేమగును.

ఇట్టి యీ కథాసంవిధానము సకలపాపరహితమై, సర్వలక్షణ సమ్మితమై, సకలాగమ రహస్యవేది సంస్తుత్యమై ఉత్తమోత్తమ ధర్మోత్కృష్టమై పరమేశ్వర ప్రీతిపాత్రమై పార్వతీమనోహరమై, విష్ణు సంసేవితమై బ్రహ్మరుద్రాది దేవతాసంస్తూయమానమై, శోభిల్లు నని నాఁడు. చండాలీబ్రాహ్మణ బ్రువసంయోగము ప్రధానేతి వృత్తముగాఁ గల యీప్రబంధ మింత పవిత్రము సకల సంస్తుత్యము నగుట వింత గాక మఱియేమి కావలయును. ఈ కావ్యము శ్రీనాథునకుఁ గల శృంగారానుభూతిని వ్యక్తము సేయుటకే యుపక్రాంతమైనచో, దీని నింత పవిత్రమని తెలుపుట యతిసాహస మనక తప్పదు. శ్రీనాథుఁడు తన ప్రబంధములన్నిటిలో సత్యమునే తెలిపియున్నాఁడు గాని, అస త్యము నేపాటియుఁ దెలుపలేదనియే తెలియవచ్చును. కావున నీశ్వ రార్చనకళాశీలుని యీమాటలు సర్వథా సత్యములు. "ఇప్పుణ్యాచారి త్రంబును బోలినట్టి ధర్మ క్షేత్రంబును మహాతీర్థంబు నైన గంగా యమునా సంగమ" మని తెలుపుట వింతలో వింత. ఉపమానోప మేయభావము నిట్లు వ్యత్యస్తము సేయుట కెంతటి సాహసము గావలయునో? గంగాయమునా సంగమముఁ బోలెఁ బవిత్రంబైన యిపుణ్యాచారిత్రం బనిన నదియొకపాటి. అట్లనక తలక్రిందుసేయుట శ్రీనాథునిదృష్టిలో నీకథాసంవిధాన మెట్టిదో తెల్లము చేసియున్నాఁడు.

ఈ ప్రబంధ ముపనిషత్ప్రతిపాద్యుఁడైన పరమేశ్వరుని లింగ స్వరూప మాహాత్మ్యప్రతిపాదనమున కుపక్రాంతమైనది. శివరాత్రి యనఁగా, పరమేశ్వరుఁ డురులింగస్వరూపుఁడై యావిర్భవించిన రాత్రి. అట్టియురులింగ స్వరూపావిర్భాతికి, బ్రహ్మవిష్ణువుల యజ్ఞాన విలసిత వివాద పూర్వక విద్వేషములను గారణములుగఁ దెలుపుటలోఁ దన్మహిమ మూర్తిత్రయాతీత మని వ్యక్తమైనది. శివభక్తుల కీశివ లింగావిర్భావసమయము భక్తిభావసంసేవ్య మని తెలుపుటకై

ప్రథమాశ్వాసము తుదిని శివరాత్రివ్రతవిధానమును శివుని నోట వివి పించినాఁడు. చతుర్థాశ్వాసము తుదిని, ప్రబంధవర్ణనాక్రమమున హేమంత శిశిర ర్తుల ప్రసక్తిని గొనితెచ్చి నాగేశ్వరాలయమున శివ రాత్రివ్రతము జరిపించి, దాని నలవోకగాఁ గాంచిన సుకుమా రుఁడు శివసాయుజ్యముఁ బడసినట్లుగు చిత్రించి, ఆద్యంతములు రెండి టిని శివరాత్రిమహాత్త్వముతో సంబద్ధము గావించియున్నాఁడు. ఈ తీరుగఁ గూర్పఁబడిన యీకథాసంవిధానమును సకల కలుషహార మని నిరూపించుట శ్రీనాథునకుఁ గల శివభక్తి తత్పరతను, సత్యధర్మపర తను నిర్భరమైన యాత్మవిశ్వాసమును దెల్లము సేయుచున్నది.

## రసనిర్వహణము

ఇది శివరాత్రిమాహాత్మ్య ప్రతిపాదక ప్రబంధ మగుటచే దీనిలో శాంతరసము ప్రధానమై వీరశృంగారాది రసభావపరిపుష్టమై అద్భుత పర్యవసాయిగా నిర్వహింపఁబడినది. హర్యజులకుఁ బరమేశ్వరమాయా విలసనమున నజ్ఞాన ముదయించి, ప్రభుత్వాభిమానమున గర్వము రేకెత్తి, పరస్పరధిక్కారపూర్వకముగ నెఱపిన భాషణము రౌద్ర భావావిర్భాతికి నిదానమైనది. క్రమముగ నదియే బీభత్సరసభావ సంవర్ధక పాశుపతాస్త్రప్రయోగమునకు దారితీసినది. విష్ణువు శార్ఙ్గ మును బ్రహ్మ గాండివమును నెక్కువెట్టి, యొండొరులపై శరప్రయో గము సేయు నాటోపములో వీరరస మావిర్భూతమైనది. ఈవిధముగ రౌద్ర వీరములు క్రమపరిణతములై శంకరశరణాగతి రూపమైన శాంతరసము నొదవింపఁజేసినవి. తుదికి హర్యజులు శాంతమత్సరులై ముక్తకంఠమునఁ బరమేశ్వరుని స్తుతించి, తదనుగ్రహపాత్రులైరి.

ఈ తరువాతి ఘట్టములో సుశీల తనకు సంతానము లేదని పల వించుటలో కరుణరసానుగతమైన విప్రలంభశృంగారము పరిపుష్టమై నది. ఓంకారశంకర సేవచేఁ బుత్త్రప్రాప్తి కలుగు నను నిర్ణయమున

భక్తిభావానుప్రవిష్ట మగుచు ధర్మానుబద్ధమైన వీరమై శాంతముగ పర్యవసన్నమైనది. సుకుమారజనన మాదిగ సంయోగ శృంగార పరిపోషక వస్తు సమన్వితమై చండాలకన్యాసంగతిచేఁ బరాకాష్ఠ నందిన శృంగారము, అతఁడు సర్వథా పతితుఁడగుటకు నిదానమైనది. పతితత్వమునఁ బరాకాష్ఠ గాంచిన సుకుమారున కలవోకగా లభించిన శివరాత్రిజాగరము నాగేశ్వరపూజాదర్శనము నిర్వేదమునకు మూలమై శాంతరసపోషకమై యాతని కుత్తమగతి ప్రాప్తిసాధన మై యద్భుత రసావిర్భాతికి మూలమైనవి. రౌద్రరససమున్మిలితమైన వీరరసము ప్రథమచతుర్థాశ్వాసములలో విశేషముగ నిర్వహింపఁబడినది. నడుమ నొక్క తృతీయాశ్వాసములో మాత్రము కొంతవట్టు చండాలీసుకుమార సమాగమఘట్టమున శృంగారము పరిపుష్టమైనది. ఈ విధముగ నిర్వహింపఁబడిన యీరససామగ్రి యంతయు సముచిత వస్తు సమున్మీలనసమన్వితమై యౌచితీమహితముగనే కొనసాగినది.

## వస్తూన్మీలన పద్ధతి

కాశీఖండములోని గుణనిధిచరిత్రము శివరాత్రిమాహాత్మ్యము నందలి సుకుమారచరిత్రమును తీర్చి దిద్దుట కాధారభూతము. రెండిటను బెక్కువిషయములలో సామ్య మేర్పడియున్నది. అచట గుణనిధి తండ్రియు నిచట సుకుమారుని తండ్రియు యజ్ఞదత్తులే. ద్యూతమను వ్యసనమునకుఁ బాల్పడి యిల్లు విడిచిన గుణనిధి, చౌర్య ప్రవృత్తిచే మృత్యువు వాతఁబడి, శివరాత్రినాఁడు అవశముగ నైన జాగరోపవాస దీపసంధుక్షణాది పుణ్యకార్యము లాచరించుటవలన నిర్ధూత పాపుఁడై తరువాతి తరువాతి జన్మములలోఁ గుబేరుఁడైనాఁడు. గుణనిధికంటెను నాకారసౌష్ఠవమును వ్యసనబాహుళ్యమును బడసిన సుకుమారుఁడు పతితత్వమునఁ బరాకాష్ఠ నందియు, శివరాత్రినాఁడలవోకగాఁ లభించిన జాగర శివపూజాదర్శన సుకృతముచే నిర్ధూత

సకలకల్మషుఁడై శివలోకమునఁ బారిషదస్థానమును బడయఁ గలిగి నాఁడు. గుణనిధికిఁ దల్లి యొక్కతయే నీతి బోధింపఁగా సుకుమారు నకుఁ దలిదండ్రు లిరువురు నీతిని నుద్బోధింతురు. నీతి నుపదేశించుటలో కాదంబరిలోని శుకనాసోపదేశము రెండిటను సమన్వితమైనది. గుణ నిధిచరిత్రమునం దుపక్రాంతమైన కాదంబరీవిషయప్రవేశము, ఈ శివరాత్రిమాహాత్మ్యమున విశేషస్థాన మాక్రమించినది. రత్నపురీ వర్ణనము, సుశీల సౌందర్య చిత్రణము, ఆమె సంతాన ప్రాప్తికై గావిం చిన వ్రతపూజాదికము, సూతికాగృహవర్ణనము, లక్ష్మీమద నిరూ పణము, సరోవర వర్ణనము, చండాలకన్యాసౌందర్యచిత్రణము, ఇత్యాదిగాఁ బెక్కు విషయములందు కాదంబరిలోని గద్యము లిందు గద్యపద్యాత్మకములుగా రూపొందినవి,

గృహనిర్వాసితులైన గుణనిధి సుకుమారు లిరువురచే "అరు ణగభస్తి బింబ ముదయాద్రిపయిం బొడతేర గిన్నెలో" నిత్యాది పద్యముచే నేకరూపముగనే విలపింపఁజేసినాఁడు. ఇరువురకు శివరా త్రియే తారకమైనది. దీనినిబట్టి శ్రీనాథుని దృష్టిలో గుణనిధిపాత్ర చిత్రణ మెట్టిదో సుకుమారపాత్రచిత్రణము నట్టిదియే. రసపరిపోష మునకై మూలాతిక్రమమునఁ గావించిన భావపరిపుష్టిలోఁ గొంత మార్పు గలదు. గుణనిధి కలవడిన వ్యసనము ద్యూతము. సుకుమా రున కలవడినవ్యసనము పారదార్యము. అట్టి పారదార్యవ్యసనోపహ తిచేఁ గలిగిన పతిత్వమును నిరూపించినవిషయమే విమర్శకుల దృష్టికి వెగటుగఁ దోఁచిన చండాలీసమాగమశృంగారము. తన్నిర్వహణ మెట్లుసాగెనో పరికింతము.

## సుకుమారపాత్రచిత్రణము

సుశీలాయజ్ఞదత్తుల సుకృతములకు ఫలితముగా నోంకార శంకరుని కరుణచే సుకుమారుఁడు జన్మించి నాఁడు. అతఁడు వేదాది

విద్యలు సకలకళలు నేర్చినవాఁడు. యజ్ఞదత్తుఁడు హేమాంగదునకు మంత్రియైన కారణమునఁ దత్సుతుఁడైన సుకుమారుఁ డాగర్భశ్రీమంతుఁ డైనాఁడు. దానితోఁ పా టభినవయౌవనము చక్కఁదనము సాహసము చనవు దొరఁకొనినవి. ఇవన్నియు నేకైకదోషాకరములు. ఇట్టివ న్నియు నొక్కచోఁ జేరినఁ జెప్పెడి దేమున్నది. సుకుమారుని పార దార్యప్రవృత్తికి నాతని చక్కఁదనము మూలకారణమైనది. దాని నెట్లు చిత్రించెనో పరికింపుఁడు.

సీ. ఆజానుదీర్ఘబాహార్గళ స్తంభుండు
కోమలాళి వినీలకుంతలుండు
కర్ణాంత విశ్రాంత కమలాయతాక్షుండు
పరిఫుల్లచంపకప్రసవ కాంతి
బహుళాష్టమీ శశిప్రతిమ ఫాలతలుండు
కంబుసన్నిభ చారుకంధరుండు
పరిపక్వ బింబికాఫల పాటలోష్ఠుండు
గంధవారణకుంభ కఠినభుజుఁడు
సచివతనయుండు కుపిత ధూర్జటిలలాట
చక్షురనలార్చి రుద్గమ సంప్రభూత
విస్ఫులింగచ్ఛటావలీ వేష్టనమునఁ
బసిమి దప్పని వలరాజుపగిది నొప్పె.

ఆజానుబాహుఁడు ఆకర్ణాంతవిశాలనేత్రుఁ డగుట సాధార ణము. పూఁచిన సంపెఁగ పువ్వువంటి శరీరకాంతి గలుగుట, కృష్ణ పక్షాష్టమి నాఁటి చంద్రునితో సమానమైన ఫాలతలము గళము గలుగుట, దొండపండువంటి మోవి గలుగుట యనునివి విలక్షణ సౌందర్యస్ఫోరకములు. ఇట్టి సౌందర్య మాతని కేర్పడి యుండుట చేత నేహరనేత్రాగ్నిజ్వాల లలముకొనినను వన్నెతరుగని వలరాజువలె నొప్పె ననినాఁడు. ఈవిధమైన పురుషసౌందర్యావిష్కారము కూడఁ

ప్రకరణోచితముగ నతివిలక్షణముగ నిచటనే జతగూడినది. ఇట్టి యాతఁడు వైదికాచార మార్గము నుజ్జంగించి, ఆరజము (దుర్విలాసము) రాచరికము నలవఱుచుకొని వీథులఁ దిరుగాడుచుండ,

క. కుసుమాయుధనిభుఁడగు నా
రసికునిపై వ్రాలె సానురాగముతోడన్
బిసరుహానయనల చూపులు
భసలంబులు పూవుఁదోఁటపయి వ్రాలఁగతిన్.

మన్మథ సన్నిభుఁడైన యారసికుని మీఁద పద్మనయనల చూపులు మధుకరములు పూచిన పూవుఁదోఁట మీఁద వ్రాలిన విధమున ప్రీతితో వ్రాలినవి. ఇది యొక మధురమైన కల్పన. పద్మములందు నెలవుకొనియున్న తుమ్మెదలు క్రొత్తగఁ బూచిన పూఁదోఁట మీఁద సానురాగముతో వ్రాలును. పద్మనయనల చూపు లనుచంచరీకములకు కుసుమాయుధ ప్రతిముఁడైన యాతని సౌందర్యము క్రొత్తగఁ బూచిన పూవులతోఁటయైన దనుటలో, సుకుమారుని సౌందర్యము సకలపద్మనయనా దృష్టిప్రసారయోగ్యమైన దనుట వ్యక్తమైనది. సుందరీమణు లందఱచూపు లాతనిపై వ్రాలుటకు కారణము కూడ సహజముగ నిరూపితమైనది.

గీ. భావ మభిరామరూపైకపాతుకంబు
యౌవనము దోషములకెల్ల నాస్పదంబు
మన్మథుఁడు కోపి యెటు నియమంబు నిలుచు
సుదతులకు వానిఁ గడకంటఁ జూచునపుడు.

మానవస్వభావము మనోహరరూపమునందు ముఖ్యముగఁ బ్రసరించునదియై యుండును. యౌవనము సమస్తదోషములకు నెలవు. మన్మథుఁడు కోపస్వభావుఁడు. ఇట్టి పరిస్థితిలో సుందరీమణులకు సుకుమారుని క్రీగంటఁ జూచినపుడు మనోనియమ మెట్లు సమకూడును ?

సుకుమారుఁడు లోకవిలక్షణమైన సౌందర్యవంతుఁడు గావుననే వానిఁ గూర్చి తలపోఁతలేని యువిద పందెము చఱచినఁగూడ నాపట్టణమం దొక్కతెయు లేదఁట.

సీ. హృదయ మువ్విళ్లూర నేకాంతమున నుండి
వానిఁ జింతింపని వనజముఖియు
నొకమాఱతనిఁ జూచి యొండొక్కమాఱుఁ జూడ
నభిలషింపని విద్రుమాధరయును
గలలోన వానిఁ జిక్కఁగఁ గౌఁగిటను జేర్చి
ముకుళితేక్షణ గాని ముద్దియయును
నతనిరూపము కుడ్యములందు లిఖియించి
యందంబుఁ జూడని యంగనయును
జెలుల చేతను బ్రోదిరాచిలుక చేత
వానిగుణములు విని కుచద్వంద్వసీమఁ
బాదుకోఁ బులకింపని పైదలియును
బన్నిదము వేసినను లేదు పట్టణమున.

నలుని సౌందర్య మీవిధముగనే సకలసుందరీజన సంప్రార్థ్యమై నట్లులు వర్ణింపఁబడియున్నది. ఇచటి వర్ణనాక్రమ మావిధముగనే కొనసాగినది. విలక్షణమైన సౌందర్యము కామినీకామ్య మగుట సహజ విషయము. దానికిఁదోడు సుకుమారుఁడు స్వధర్మదూరుఁడై కాముక జనసంసేవ్యమైన ద్యూతక్రీడా మద్యసేవనాది వినోదోపాయముల మునిఁగి తేల మొదలుపెట్టినాఁడు. ఇట్టి దుర్వృత్తి పట్టువడుటకు ధనము కలిమి మూలమైనది. ధనమదమత్తుల దుశ్చేష్టితము, వారి కేర్పడు గర్వాంధ్యము వారి నెన్నియో పెడత్రోవలఁ బట్టించును. అట్టి యౌద్ధత్య మంతయు సుకుమారునకు విపరీతముగ జతపడినది.

సుకుమారుఁ డత్యుద్ధతుఁడై వీటిలోని యుందకత్తెలనంద ఱిని వెదకి వెదకి చెఱుచుచుండెను. కామవేదనాదగ్ధహృదయుఁ

డైన సుకుమారునకుఁ దల్లిదండ్రుల సదుపదేశ మేపాటియుఁ జెవికెక్కలేదు. ఇఁక నాతఁడు చదివిన చదువంతయుఁ దనయపమార్గ ప్రవృత్తికి సమర్థకముగా సమన్వయించుకొనఁ దొడఁగినాఁడు. వామదేవుఁడు శుకుఁడు దక్క ముక్తు లున్నారని మనము విందుమా? కావున 'చేతోజాతు నుపాశ్రయించెదఁ బరస్త్రీల న్వినోదించెదన్, మాతంగీపరమేశ్వరిం గొలిచెద న్మద్యంబు సేవించెదన్' అని నిశ్చయించుకొని, తలము దప్పఁ ద్రాగి, మధుమదాతిరేకమున ఆరణ్యకములు పఠింపఁదొడఁగినాఁడు. ఈ తీరుగ సుకుమారుఁడు సురాపాయియై పరస్త్రీలోలుఁడై పురమునందలి సుందరీమణులందఱ యీలువులు చెఱచు చుండుట దుర్భరమై పురజను లందఱుఁ గూడి రాజునకు మొఱవెట్టుకొనునట్లు గావించినాఁడు. దానితో రా జాతని దేశము నుండి వెడలనడచెను. ఇట్టి సుకుమారుని విలక్షణ సౌందర్యమునకు ఫలము అవినీతి వర్తనము, తన్మూలకముగ దేశనిర్వాసనముగా నేర్పడినది.

## చండాలాంగన

సుకుమారుఁడు నగరనిర్వాసితుఁడై కాంతారమార్గముఁ బట్టి పోవుచు, నడుమ నొక కొలని దరికిఁజేరి, యచట క్షుత్పిపాసలు దీర్చుకొని, మార్గాయాసశ్రమచేఁ గొంత తడవు నిద్రించి మేల్కొని చూచుసరికి నాతని యెదుట నొక చండాలాంగన ప్రత్యక్షమైనది. సుకుమారుని యాకారమునకు సరిపడిన సౌందర్య మాచండాలాంగనలోఁ జూపట్టినది. ఆమె సౌందర్య చిత్రణ మీతీరుగ సాగినది.

సీ॥ ఆదికాలమున మాయావిలాసినియైన
మురదైత్యదమనుని మూర్తివోలె
ధరణీతలంబునఁ జరియింప నేర్చిన
పురుహూతమణి శిలాపుత్రివోలెఁ

గామినీ రూపంబు గైకొన్న శంబరా
  రాతి కాలాయసాస్త్రంబు వోలె
వేడ్కకై మానుషీవిగ్రహంబు ధరించి
  విహరించు తొలుకారు మెఱపువోలె
నంధతామిస్రమును నవిద్యయును బోలె
భువనమోహన రూపవైభవము లొలయ
లీల నేతెంచె నొక్క చండాలకన్య
కొలనఁ జిఱుబంతి పసుపాడఁ జెలియుఁ దాను

సుకుమారుని సౌందర్య మేతీరునఁ జిత్రింపఁబడెనో, చండా లాంగనా సౌందర్యము కూడ దాని కీడఁబోవని రచనలోఁ గొన సాగినది. నల్లనియాకృతిలో సైతము భువనమోహన రూపవైభవ మొలికించుటకు కాదంబరీ రచన మాతనికి సహకరించినది. తద్దర్శనము యాజ్ఞదత్తి కబ్బురపాటు నొదవించి పరిపరివిధముల భావింపఁ జేసి నది. ఆమె శరీర మార్దవము నెట్లు చిత్రించెనో పరికింపుఁడు.

గీ, దీనిఁ గల్పించె నజుఁ డభిధ్యానమునను
  నాతి మును ముట్టరాకుండ నంత్యజాతి
  ముట్టుటయు గల్గెనేని యమ్మ్రదితమేను
  గందకుండునె? పుష్పంబు కంటె మృదువు.

కాదంబరీకావ్యమున బాణభట్టు చిలుకను గొని వచ్చిన చండాలాంగనను జిత్రించుటలో సేకరించిన సామగ్రి గొని, యచటి వాక్యములనే తన భావనాబలమునఁ గొంత ముందునకుఁ గొనిపోయి, యీ మాలెతను విలక్షణసౌందర్యవతినిగాఁ జిత్రించినాఁడు. చండాల కన్యాసౌందర్యము నింతగా వర్ణించుట దోష మని భావించువా రుం డినచో నది శ్రీనాథుని దోషముగాక భట్టబాణునిదే యగును.

ఆసుందరిని గనుఁగొనినంతనే యామె సౌందర్యమున కబ్బుర పడి సుకుమారుఁడు నిర్నిమేషుఁడై తన్నుఁ దా నెఱుఁగక నివ్వెఱపడి

చూచుచుండెనఁట. అంతటి దామె సౌందర్యము. మాలెత యెంతటి సౌందర్యవతియో, యంతటి వివేకవతి. ఆమెయు నాతని నలవోకగాఁ జూచి, విప్రవేషము దాల్చిన విష్ణుఁడా? బ్రాహ్మణుఁడై జన్మించిన మన్మథుఁడా? లేక చంద్రుఁడా? యనుకొనినది. ఆమె యంతంతఁ జేరవచ్చి 'యశేషజనపూజనీయులు బ్రాహ్మణు' లని తమకులము పెద్దలవలన వినియుండుటచేఁ గేలుదోయి సేవాంజలి పుటంబు లలాటంబునఁ గీలించి 'అయ్యగారికి నమస్కారం' బని, అధరకిసలయంబునకు దశనరత్నాంకురజ్యోత్స్నా కుసుమస్తబకంబుగా, సహకార పల్లవాస్వాద కషాయకంఠ కలకంఠకామినీ కోమల కుహూకార కోలాహల కరంబిత పంచమరాగ ప్రపంచంబునకు మించుఁ జూపు కంఠస్వరంబునఁ బలికెనఁట. ఈఘట్టమున సుకుమార చండాలాంగనల సౌందర్యవినయముల రెండిటి నతిమనోహరముగ నిరూపించి యున్నాఁడు.

శ్రీనాథుని యీ తుదిరచనలో నెన్నియో యుత్తమజాతికిఁ జెందిన కవితావిశేషములు పొంగులు వారినవి. ప్రబంధనాయికలం దెవ్వతెకు నేకవియుఁ గూర్పని సౌందర్య వినయవివేకసంయమములను చండాలాంగనకుఁ గూర్చిపెట్టినాఁడు. ఈ రచనలో సామయికాచారములు కుప్పలు తిప్పలుగాఁ గూర్పఁబడినవి. కులము పెద్దలవలనఁ దాను వినియున్న సంప్రదాయము ననుసరించి చండాలి నమస్కరించినది; సుకుమారుఁడు విప్రుఁడు గావున నామెను దీవించుటకు వలను పడక, కరతిర్యగాందోళనమున దాని నమస్కారము గైకొనినాఁడు. ఈ రెండు విషయములు గూడ శ్రీనాథసామయికాచారములు. మన్మథ సమానుఁడైన సుకుమారుని జూచినంతనే యామెకుఁ బ్రేమ ముదయించినది. దానితో నామె బ్రాహ్మణుఁడుగాన లజ్జింప నక్కఱ లేదని, బాల ప్రౌఢవోలెఁ జూచి, "చాటువడి యుండుమయ్య! యీ

సరసిలోన నుదకమాడెదఁ గాక పిన్నదియు నేను" అనినది. ఇది సమయోచితప్రసంగము పిమ్మటఁ జెలియుఁ దాను జలకేళి సలిపి బయటకు వచ్చిరి. అప్పటి యాచండాలాంగనాసౌందర్యము ని ట్లుత్ప్రేక్షించి యున్నాఁడు.

చ- పడఁతి పసిండిడాలుగనుపట్టు హరిద్రమఁ దీరపంకముం
దొడసి, సరోవరాంబువులఁ దోఁగి, పయోనిధితీరభూమికిన్
వెడలి, ధరాసుపర్వునకు నేత్రమహోత్సవమయ్యె నప్పుడ
ప్పుడ కలశాబ్ధిమధ్యమునఁ బుట్టిన యాదిమలక్ష్మియో యనన్.

శివరా 3:43.

ఆపడఁతి పసిఁడిరంగు పట్టునట్టులు పసుపు, తీరపంకము నొడలికిఁ బూసికొని, ఆసరోవరమున జలకమాడి గట్టెక్కినది. ఈ స్నానము రజస్వలాప్రయుక్తము. రజోదోషనివృత్త్యర్థమై పసుపు మట్టి నుపయోగించుట యనునది కూడ సామయికాచారమే. దానిని చాటింపఁజేయుచు నప్పటి యామెసౌందర్యము నద్భుతముగఁ జిత్రించిపెట్టినాఁడు. సరోవరమున నీటఁదోఁగి గట్టునకుఁ జేరినంతనే యామాలెత, అప్పుడప్పుడే క్షీరాబ్ధి మధ్యమునుండి యుద్భవించిన యాదిలక్ష్మియో యనునట్లు భూదేవుని నేత్రములకు మహోత్సవమాపన్నమైనదఁట. పసిండిడాలు గనుపట్టఁగ పుసుపు పూసికొనుట లక్ష్మీసముద్భావనకు సాధనమై యెంతయు నౌచితిని వహించినదైనది. శ్రీనాథుని కవితాశిల్పమునందలి భావనావైచిత్రి యన నిట్టిది. తడి యార్చునప్పటి యామె శిరోజములనైతఁ మెంతయుఁ జిత్రముగఁ జిత్రించినాఁడు.

అకలకంఠి యొయ్యఁ దడియార్పఁ వెడన్ జఘనాంతికంబులై
కేకికలాపలీల నణఁకించి, మధువ్రతమాలికాకృతిం
గైకొని, యింద్రనీలమణిఖండవిలాసములిమ్ముచంబులై
చీకటిగొల్పె బ్రాహ్మణునిచిత్తముఁ బెన్నెఱిసోగవెంట్రుకల్.

శ్రీనాథుఁడే వస్తువునందైన సౌందర్యము నావిష్కరింపఁ దల పెట్టినచోఁ దత్తన్మూర్తి సాక్షాత్కారము లేకుండఁ జేయఁడు. ఇచట మాలెత శిరోజములను సుకుమారుని చిత్తమునకుఁ జీకటి గొలుపు నట్లు చేయుటకై వానికి విదిర్చినప్పుడు జఘనపర్యంత వ్యాప్తిని, నెమిలిపింఛమును మీఱిన విస్తృతిని, తుమ్మెదచాలు పోలికను, ఇంద్రనీల మాణిక్యవిలాసాపహారమును గూర్చి, మిక్కిలి నైల్య మును జతగూర్చి పెట్టినాఁడు. ఈపద్యమునందు శిరోజముల పొడవు దట్టన నలుపు తెలిపి, విలాసిహృదయాకర్షకశక్తిని వానికి సమ కూర్చి నాఁడు. శ్రీనాథుని సౌందర్యావిష్కారపద్ధతి కిది యొక నిదర్శనము.

పిమ్మట నామె యాసరోవరతీరమున లభించు పల్లవాది విభూష లమరించుకొని, గురివెందపూసలపే రొకటి దాల్చియుండెను. ఆయంగన సౌందర్యమును గాంచిన సుకుమారుఁడు తనలో నిట్లు తల పోసెను. "బ్రహ్మ నాకు మిగిలిన జ్ఞానేంద్రియములు నాలుగింటిని గన్ను లుగా నేల చేయఁడు ? ధాత కీనిర్మాణపాటవ మెట్లు కలిగెను ? ఈమెను సృజించిన వెనుక మనసున నుప్పొంగారక యెట్లుండినాఁడు ? శృంగారసృష్టిలో దీనిని సృజించినాఁడు కాఁబోలు ?" ఇత్యాదిగాఁ జింతించి యామెతో సంభాషింప నిలిచినాఁడు. ఈ ప్రకరణమునం దంతటను బతితుఁడు కావలసిన సుకుమారునియందుఁ దత్తరపాటును, చండాలాంగనయం దుత్తమనాయిక యగుటకుఁ దగిన సంయమమును గవి కూర్చిపెట్టినాఁడు. ఆమె చేయు సంభాషణమునం దెల్లెడలను, నుత్తమ ప్రకృతి కాంతల కుండు వినయవివేకాది సద్భావములను సమ కూర్చి, యామె జాతిచే నంతిమయైనను శీలముచే నగ్రిమనుగాఁ జిత్రించి నాఁడు.

ఆమె యాతని నిట్లు ప్రస్తుతించినది— "ఎందుండి వచ్చితిరి ? ఎందరిగెదరు ? ఇచట నేకతంబున నుంటిరి ? నిన్నుఁ జూచిన సుఖా

మృతంబున మునింగినచందంబున నా హృదయంబు నిర్వృతింబొంది యున్నది. నీవు రూపసంపదను మన్మథ నలకూబర నల జయంత చంద్రులం బోలినవాఁడవు. నిన్ను సామాన్య విప్రునిగా భావింపవచ్చునా? నామాట కల్ల గాదు. మాయన్నలయాన. చూడు; కుచంబులపైఁ బులకాంకురంబులు మొలచినవి. భూసురోత్తమా! చింతకాయల కాజ్జగాని గ్రుక్కిళ్ల కాజ్జయున్నదా? అంటరాకుండిన నేమి? దూరమున నుండి తనివిదీఱ నిన్నుఁ జూచుటకు వలనుపడదా? ఈ భాషణమునం దెంతటి లాలిత్యము మాధుర్యము సముచితత్వ మిట్టిపడినదియో! అట్టి యెడ నా చండాలాంగన సుకుమారుని సేవకై మనసుపడిన విధ మతిమనోహరముగఁ జిత్రింపఁబడినది.

సీ. కమలినీ పత్త్రపుటములఁ గాసారోద
కము దెచ్చి పాదపద్మములు గడుగఁ
జిలుక మెట్టని ఫలంబులు గోసికొని వచ్చి
పరికించి యారగింపంగఁ బెట్టఁ
గాంతార కర్పూర కదళి కాదళ మూల
పరసరీతులను వీజన మొనర్ప
నధ్వఖేదము వోవ హస్తద్వయంబున
నూరుకాండము లొత్తి యుపచరింప
తే. డక్కయయ్యెడఁ వినయంబు విస్తరిల్ల
భక్తిగొనఁగఁ బ్రమోదంబు పారమేద
నీకు విప్రోత్తమునకు నీ సెలవునందుఁ
జెడ్డ దుర్జాతి యది నన్నుఁ జెఱచెఁ గాని.

ఎంతటి సుకుమారమైన సేవయో! సరోవరపరిసరములం దుపలభ్యమయ్యెడి వస్తువులతో భక్తివినయములు రెండును జతఁగూడునట్లు సేవచేయింపఁ దలపెట్టుట యెంతటి మధురభావనయో! ఈ పలుకులలో మాలెతకుఁ గల వినయము ప్రణయము కూడఁ దొణికిసలాడినవి. మాలెత శీల మీపద్యమునం దత్యుదాత్తముగాఁ జిత్రింపఁ

బడినది. కవి కిట్టి యూహ పొదలుటయే వింత. శృంగారరసనిర్వహణ మున శ్రీనాథుఁడు పాటించెడి సంయమ మంతయు నీ యొక్క పద్యము నందే ప్రతిఫలించినది.

పిమ్మట నామె తన యావాసాదికమును గూర్చి యెఱిఁగించి యాతనికిఁ దనయుపచారముచే నెట్టయిన సంతసము గలిగింపఁ దల పెట్టి యిట్లర్థించినది.

క. వాణసివారము కమ్మని
ప్రాణము నెఱజాణ దేవరా! వినవలదా?
వీణావాద్యముఁ బాటయు
వేణుస్వానంబు వేనవే ల్ఛందములన్.

తాను దుర్జాతియయిన యంటరానికులమునఁ బుట్టినదానికే వగచుచుఁ, దన కలవడియున్న వీణావాద్యము పాట వేణునాదము పలురీతుల వినిపించెదను వినవలదా? యని యర్థించినది. ఈ యర్థన మున నామె హృదయమున సుకుమారుని యెడఁ గల సద్భావము వ్యక్తమైనది.

ఈ విధముగ నాచండాలాంగన పల్కిన, విప్రుఁడు తన భవిత వ్యతాబలమున నామెఁ గవయఁ గోరుట యేపాటియు నధర్మమని యెంచ లేదు సరిగదా! అయ్యవనీ సురాధముఁడు కలికి చండాలకన్యపైఁ గన్నువైచి, తనకృత్యము నిట్లు సమర్థించుకొనెను.

సీ. మాంసంబు భక్షింప మనసు పెట్టినవాఁడ
దాక్షిణ్యగుణము విధ్వంసమయ్యె
గంజాయి దినఁగ నుత్కంఠఁ జేసినవాఁడ
లజ్జాభిమానంబు లుజ్జగిల్లె
హాలారసముఁ గ్రోల నభిలషించినవాఁడ
నూన్యశ్రోత్రుల సుద్ది చూఱవోయెఁ
బరకళత్రముల బొంబడఁ దలంచినవాఁడ
ప్రజ్ఞావిలాసంబు పదటఁ గలిసె

నింక నేఁటికి వంచింప నిలుపు నాకు
బరువె యీపాపములలోవఁ బాప మొకటి
వరుస వేయింటిమీఁద జవ్వాదిగొమ్మ
తివుటఁ జండాలకన్యకఁ గవయువాఁడ.

పారదార్యమునకుఁ బాల్పడువారికి మాంసభక్షణము సేయుట గంజాయి పీల్చుట మద్యము త్రావుట యను నీ వ్యసనములు వెంట నంటివచ్చు ననియు, వారికిఁ బాపముల బరువు గణనకు రాదనియు ప్రజ్ఞాలోపమున నెట్టి చేయఁగూడని పనియైనఁ జేయుదు రనియు నీ పద్యమున వ్యక్తమగుచున్నది.

ఇట్లు తలపోసి యాతఁ డామెను వంచించుటకై చేరవచ్చి "సర సిజలోచన! నీవు దేవజాతికన్యవై యుండి, యొక మహాముని శాప వశమునఁ జండాలకన్యవై జనించితివి. కావున భూదేవుని నన్ను వరిం పుము. పదునాల్గుకోట్ల నాకసతులలో నీ వొకతెవై యుండి, యే పాపముననో హీనజాతిని బుట్టియుంట నిజము. నీదృగ్విలాసము నా యింద్రియముల నెత్తుకొని పోవుచున్నది. మన్మథుఁడు నన్ను వేధించు చున్నాఁడు. ఏమిచేయుదు"నని.

గీ. వనిత నీ చిత్తమున కేను వత్తునేని
కామతంత్రంబునకు సంచకరము గాఁగఁ
జుంబనము సేయుని మోష్ఠ బింబ మిపుడు
గండుఁగోయిల చిగురాకు గమిచినట్లు.

అని తనవలపుకోరికను దెలిపినాఁడు. ఇది పరమసుకుమారమైన ప్రయోగము. వనితా! నేను నీ మనసునకు నచ్చినచో, మన్మథ వ్యాపారమునకు గట్టితనమునకై ముందిచ్చెడి ధనముగ (సంచకరము= Deposit ) నీ యోష్ఠబింబమును గండుకోయిల చిగురుటాకును గఱచి నట్టులు చుంబనము సేయనిమ్ము. ప్రణయప్రార్థన యెంత సుకుమారమో యిచటి పదజాలముకూడ నంతసుకుమారముగ జతగూడినది. శ్రీనా థుని రచనలో సంస్కృతపదజాలము కూర్పులో నాదసౌష్ఠవ ముండిన

విషయ మందఱకు విదితము. అట్టి నాద సౌష్ఠవము తెలుఁగు నుడికారపు నడకలో నాతఁడు సంతరింపఁ గలఁడనుట కీపద్యము తార్కాణము.

గీ. అనుచు విప్రుండు తమకించి యంటుకొనియె
సమ్మతించియ యుండె నా చంద్రవదన
శూకలాశ్వంబు నసరేపఁ జొచ్చినప్పు
డనుమతింపదె యత్తడియైన బడబ.

పై పద్యమునఁ దెలిపిన రీతిని వచించి, బ్రాహ్మణుఁ డుద్రేకించి మాలెతను ముట్టుకొనెను. ఆచంద్రవదనయు విప్రుఁడు తన్నుఁ దాఁకుట కంగీకరించియే యుండెను. పొగరెక్కిన మగగుఱ్ఱము కామోద్రేకము గలిగించినపుడు పుష్పితయైన యాఁడుగుఱ్ఱము తన్నంటుట కంగీకరింపదా? యని యీ పద్యమున కర్థము. చండాలకన్య సుకుమారుని జూచినప్పటినుండియుఁ దా నంటరానికులమునఁ బుట్టితినను సంకోచముతో విప్రు నంటుటకు జంకుచువచ్చినది. కాని యాతఁ డుద్రేకించి తన్నంటినపు డందుల కంగీకరించినది. శూకలాశ్వము పుష్పితయైన బడబను సమీపించుట కంగీకారము చూపినట్టు లని యిచటి యుపమానము. బడబ కంగీకారము లేకున్న నది యెంతటి శూకలాశ్వమునైనను దన్ని వేయును. బడబ పుష్పితయైనపుడే శూకలాశ్వము దానికి నసరేపుట, యది దానిఁ దాకుట కంగీకరించుటయుఁ బొసఁగును. పుష్పిణియైన చండాలకన్యను బడబతోడను, ఉద్రిక్తుఁడైన సుకుమారుని శూకలాశ్వముతోడను బోల్చుట కిచట నను వేర్పడినది. ప్రధానముగ నిచట సుకుమారు నుద్రిక్తునిగాఁ దెలుపుట కొఱకే యీ యుపమానము పాత్తమయినది. చండాలాంగనయందు వికారము లేకత్తె నని తెల్పుటకుఁ గాదని దీని తరువాతి వచనముచే విదితమగుచున్నది. ఆవచనమిది. "ధీరోదాత్తయగుట నమ్మత్తకాశిని చిత్తజాయత్తయయ్యుఁ దత్తరపాటు లేక యతనితో నిట్లనియె."

(సశేషము.

# వైదికుల సంజ్ఞలు — పరిభాషలు

పరాశరం గోపాలకృష్ణమూర్తి

'దేవీం వాచ మజనయన్త దేవా స్తాం విశ్వరూపాః పశవో వదన్తి''

మాటలు చిత్రముగా నర్థవిపరిణామమును బొందుచుండును. ఒకొకప్పు డవి మొదటి యర్థపుఁ గనుచూపుమేర దాఁటి కూడఁ బోవును. జిజ్ఞాసువులైనవారు మాత్రమే ప్రత్యేకించి శ్రద్ధఁబూని వాని పుట్టు పూర్వోత్తరముల గ్రహింపవలసియుండును. యజమానుఁడన నేఁడు గృహము యొక్క లేదా యొక సంస్థయొక్క స్వామియను నర్థమున నందఱికిని బరిచితము. కాని దాని గాథ ద్రవ్వినఁ, యజ్ఞముఁ జేయువాఁడు, యజ్ఞము యొక్క ఫలస్వామి యని తెలియును. పెద్దన గారు కూడ 'యజమానుఁ డంకస్థితార్థపేటి' యని గృహస్థుఁడను నర్థమునఁ బ్రయోగించియున్నాఁడు. ఈ పదమును బట్టి వైదిక సంస్కృతి విదితమగుచున్నది. యజ్ఞముల ప్రాచుర్యము, గృహస్థుఁడయిన ప్రతియొక్కఁడు యజ్ఞములఁ జేయు నలవాటునాఁ డెంతగాఁ గలదో యిది తెలుపును. నాఁడు ప్రతిగృహస్థుఁడును యజమానుఁడయ్యెడువాఁడు. కావున యజమానుఁడను పదము క్రమముగా గృహస్థుని, గృహస్వామిని దెలుపునదిగా మాఱి చివరకు మిల్లుయజమాని, పొలముయజమాని యనువఱకు దిగజారినది.

ఇట్టివే కుశలుఁడు, ఆధ్వర్యవము మొదలగునవి. దర్భలను గోయుటకు నైపుణ్యమవసరమైయున్నందున దర్భలను గోయువాఁడను నర్థముకల కుశలుఁడనుపదము నిపుణుఁడనుటకు వాచకమయినది. అట్లే నైపుణ్యమనుటకుఁ గౌశలమనునది రూఢికెక్కినది. అధ్వర్యుని కృత్యమాధ్వర్యవము. ఏజన్నమైనను నొకరి యాధ్వర్యవమున జరుగుచుండి కాలక్రమమున నాయర్థము భ్రష్టమయి 'పెత్తనము'గా వ్యవహరింపఁబడుచున్నది. వసిష్ఠుఁడన నేఁడు పురోహితుఁడని రూఢి. 'మా

వసిష్ఠుఁడెవర'ని యడుగుదురు. ఇందుఁడు, వసిష్ఠున కతనివంశమునఁ బ్రాజ్ఞులు పుట్టుదురనియుఁ బ్రసిద్ధి వహింతురనియు వరమిచ్చినట్లు గోపథబ్రాహ్మణమున నొక కథగలదు. వసిష్ఠుని వంశమునఁ బరాశరుఁడు, వ్యాసుఁడు మున్నగు పెక్కురు వేదవేదాంగ నిపుణులగు వారు జన్మించుటయు, నతఁడు సప్తర్షులలో నొకఁడయి కులపతియయి మంత్రద్రష్టయు నయియుండుటవలన వసిష్ఠున కనితరసాధారణమగు నాగౌరవ మేర్పడి పురోహితుఁడయిన ప్రతివాఁడు నతనిపేరఁ బిలువఁబడియుండును. లేక 'అగ్నిర్బ్రాహ్మణవకః' అన్నట్లు లాక్షణికముగాఁ దత్సదృశుఁడను నర్థమునఁ దొలుత వాడఁబడి పిమ్మట నభేదాధ్యవసాయము నందియుండును.

తద్దినము, కర్మ మొదలగుపదములు తమతొలుతటి యర్థమును గోలుపోయి వ్యవహారమున వేఱొకవిషయము స్ఫురింపఁజేయుట యెల్లరకుఁ దెలిసినవిషయమే. ఇట్లుగావచ్చిన పదములే కాక కేవలము వేదకర్మతులయి వేదాధ్యాయున ప్రచారముల నొనర్చునట్టి వారిచే నాయా విషయములఁ దెలుపుటకై గాని స్ఫురింపఁజేయుటకయిగాని వాడఁబడునవి పెక్కుసంజ్ఞలు పరిభాషలును గలవు. అట్టి వానినిగూర్చి దిఙ్మాత్రముగా నిందుఁ జర్చింపఁబడును.

సంభావనలప్పుడు దొరకిన దక్షిణల నాణెములను వానిపేళ్లతోఁగాక వేఱుసంజ్ఞలచేఁ దెలుపుకొందురు. ఆభరణము (బేడ) నక్షత్రము (పావులా). తదర్థం (అర్ధరూపాయి) శుభ్రం. (రూపాయి) శివనేత్రాలు (మూఁడురూపాయలు) ప్రత్యామ్నాయ గోదానం (6రూపాయలు) దశావతారాలు (10 రూపాయలు) అనువిధముగా నాయా నాణెములఁ దెలుపుకొందురు. 'సత్యంత్వర్తేన' యెక్కడనఁగా భోజన మెక్కడని భావము. ఒకానొక మంత్రములోని భాగము నుచ్చరించుటవలన నొకానొక విషయము స్ఫురించునట్లు చేయుదురు. సామా

న్యముగా వాడుచ్చరించిన దానితరువాతనున్న పదము నర్థమును దానికి సంక్రమింపఁజేయుట జరుగుచుండును.

1. 'ఏతత్సామగాయన్' అయినదన లేదని తాత్పర్యము. 'ఏతత్సామగాయన్నాస్తే' యను దానిలోని 'నాస్తే' యను విసికిడి పూర్వభాగమున కాయర్థమును సంక్రమింపఁజేసినది.

2. యద్దేవా—హేళనము. "యద్దేవా దేవహేళనం ... " అను మంత్రమువలన దానికా వాడుక చేయఁబడినది.

3. యంబ్రహ్మ — పిసినారివాఁడు. 'యం బ్రహ్మ బ్రహ్మ గుప్తయే ... 'యను దానిని బట్టి ధనమును గుప్తముగా నుంచు వాఁడు, ఏఁడుముళ్లు వేసి దాఁచువాఁడను నర్థ మారోపింపఁబడినది.

4. ద్రాపి — గ్రుడ్డివాఁడు, (తిండిపోతు) పనికిరానివాఁడు. 'నమస్తే ద్రాపే అన్ధస స్పతే... ' అను దానిని బట్టి దీని కిది వచ్చి యుండును. "పశ్యన్తో అన్ధం దురితా దరక్షన్" అను దానిని గూడ గ్రుడ్డివానిని జూచినప్పుడు చదువుదురు. వాఁడు గ్రుడ్డివాఁడనక యే పై మంత్రమును జదువుట వలన గోప్యముగా వ్యవహరించుకొందురు.

5. తేభ్యం—వాఁడుకట్టె తేభ్యము (దేభ్యం) అందురు. చేత గానివాఁడు. తిండితినుట యే గాని చురుకుఁదనము లేనివాఁడని యర్థము "తేభ్యశ్చాయం పిండః" అని తద్దిన మంత్రప్రకరణములో వచ్చును.

6. అయమోదనం (గాఁడు.)—ఇదియు దేభ్యమువంటిదే. "అయమోదన మిత్యేకైక పిండ మాదాయ అయమోదనం కామ దుహోస్వనం ధోక్షేయ—" అని మంత్రము.

7. త్వాష్ట్రము — త్వాష్ట్రుఁడు = పశువు; పశుతుల్యుఁడు. "త్వాష్ట్రాః పశవః అను మంత్రము వలన నీ వ్యవహారము వచ్చినది.

8. త్రిపాత్ — త్రిపాది, త్రిపాదిలాగ దిరుగుచున్నాఁడని యందురు. గాలికిఁ దిరుగుట, స్వేచ్ఛగా నుండుటను నిది సూచించును.

"త్రిపా దూర్ధ్వ ముదైత్ పురుషః ... " అను దానివలన నీయర్థము వచ్చినది. త్రిపాది నక్షత్రమువలె తిరుగుచున్నాఁడను వాడుకయుఁగలదు.

ఒక్కొకప్పుడు వీని వలన నశ్లీలార్థ గోపనమును జరుగుచుండును.

1. పద్భ్యాముదరేణ — అనునది 'శిశ్నాఖ్య' యను దానిని సూచించును.

2. పశవస్సు— ఇదియునట్టిదే "పశవ స్సుజంభం ... " అని అన్నసూక్తములో వచ్చును.

3. అశ్మాచమే — మృత్తిక (మట్టి తప్ప నితరము లభింప లేదనుటకు) 'అశ్మాచమే మృత్తికాచమే' అని చమకములో వచ్చును.

4. ఇంద్రాణీ — వితంతువు. "ఇంద్రాణీ వావిధవా" అని తైత్తిరీయ బ్రాహ్మణము. అవిధవ విధవగా నసుచిత విభాగము నందినది.

ఆయామంత్రములు చదువునపుడు చేయుపనులను గూడఁ దన్మంత్రములవలనఁ దెలుపుదురు.

1. ఆరోహారోరు — కౌఁగిలించుకొనుట. "ఆరోహారోరు ముప బర్హస్వ బాహుం ... " అను మంత్రమునఁ జేయుపని కౌగిలించు కొనుట యని భావము.

2. శన్నోదేవీ — పాలు.

3. వసోర్ధారాం—నేయి. స్నపనము మొదలగునవి చేయునపు డామంత్రములతో నా వస్తువులను గ్రహింతురు. కావున వాని నా వస్తువులను దెలుపుటకు వాడుకొందురు.

4. హరిః ఓం — ప్రారంభము. వేదకర్మలను బ్రారంభించు నపుడుగాని, మంత్రములను జదువఁబోవునపుడు గాని యారంభమునఁ హరిః ఓం అనుట సంప్రదాయము. కావున నేపనికైనఁ బ్రారంభము

జరిగినపుడు 'హరిః ఓం' అయినది, హరిః ఓం అని తగాదా మొదలెట్టాఁడని యందురు.

5. స్వస్తి—సుదీర్ఘమగు సంభాషణ. బ్రహ్మఘోష, మహా సంకల్పము, దిక్పాలక గద్యలు మొదలగునవి. 'స్వస్తి'తో నారంభమయి దీర్ఘకాలము పఠింపఁబడును. అందుచే దాని కట్టి యర్థము సంక్రమించినది. ఏదో స్వస్తి చెప్పుచున్నాఁడు. ఏమిటి నీస్వస్తి; ఇత్యాదిగా వ్యవహారము.

6. భవతి భిక్షాం దేహి — బిచ్చమెత్తుకొనుట. భిక్షాచరణమా మంత్రముచే జరుగవలసియున్నది. కాన దానికా వాడుకవచ్చినది.

7. భుజః కరిష్యమాణః— బుజమున వేసికొని మోయుట.

8. ఓంభూః— (అంటూ కూర్చొనుట) యన ముక్కుమూసికొని కూర్చుండుట. ప్రాణాయామ మంత్రమగుట వలన దీని కీ యర్థము ప్రాప్తించినది.

9. తస్కరాణాంపతయేనమః — దొంగను, దొంగతనము జరుగుటను దెలుపును. ఇది నమకమంత్రములలో వచ్చును. 'వాఁడు తిరుమంగయాళ్వారు' అనుటయు నట్టిదే. తిరుమంగయాళ్వారు చోరుఁడగు నొక విష్ణుభక్తుఁడు. పన్నిద్దఱాళ్వారులలో నొకఁడు.

10. క్షేత్రాణాం పతయేనమః—ఒక స్థలమున ననుకొనకుండ నుండిపోవలసివచ్చినపుడు ప్రయాణ మబద్ధము—ప్రసాదము నిబద్ధమనునట్లుగా వాడుదురు. ఇది క్షేత్రపతికి నమస్కారము చేయు మంత్రము.

11. ప్రాచీనావీతి — అపసవ్యము పై 'ఖండ' చెప్పినపుడు జందెము నపసవ్యము చేసికొందురు. కావున నపసవ్యముగా నేపని నయినఁ జేసినపుడు 'ప్రాచీనావీతి' పనులు, ప్రాచీనావీతి గాఁడందురు.

12. తృప్తాస్థ — మనస్సునకుఁ దృప్తియగుట. "తృప్తాస్థ

తృప్తాస్థ ..." అని శ్రాద్ధ ప్రకరణములో వచ్చును. "తృప్తాస్థగా జుత్తి త్రేన్పులే"దని కవిప్రయోగము.

13. స్వాహా (అయినది.) — తినివేయఁబడినది. "అగ్నయే స్వాహా ఇన్ద్రాయస్వాహా..." అని హోమము చేయుదురు. 'స్వాహా' అను పల్లవముచేత హవిస్సును వినియోగము చేయుదురు కావున 'స్వాహా' యయినదన నా వస్తువు వినియోగ మయినదని తాత్పర్యము.

14. వషట్కారములు—తిట్లు. వషట్కారమును షట్ప్రయోగ విధానములో మంత్రశాస్త్రమున విద్వేషణాదుల పట్టున నుపయోగింతురు. కావున దీనికీ యర్థము సంక్రాంతమైయుండును. 'వషట్' పదమునందలి కటుధ్వనియు దీనికి సహకరించి యుండును.

15. అసావాదిత్యో బ్రహ్మ—ఢొంకతిరుగుడు పని. సూటిగాఁ బనిచేయక, నీవుక్కడనినఁ దలచుట్టు చేతిని ద్రిప్పి ముక్కును జూపుటవలెఁ జేసిన పనిని సూచించును. పై వాక్యము నుచ్చరించు నపుడు సంధ్యావందనములో నా పనినే చేయుదురు గదా!

16. యత్తే అగ్నే (చెప్పుట.) — ఉద్యాసన చెప్పుట — వెడలఁగొట్టుట. ఇది అగ్న్యుపస్థాన మంత్రభాగము. "యత్తే అగ్నే తేజస్తే నాహం తేజస్వీ భూయాసం..." అని మంత్రము. ఈ మంత్రముతో అగ్ని కభ్యనుజ్ఞ నిత్తురు గాన వెడలనడుచుట నిది సూచించుచుండ వచ్చును.

17. ఏషాగాథలు— ఇచ్చకపు మాటలు "ఏషాగాథా ..." అని పూర్వగాథలను దెలుపు ప్రస్తావములు బ్రాహ్మణములందు వచ్చుచుండును. కావున 'ఏషాగాథ'లన నిచ్చకపు మాటలు, ముచ్చటలని వ్యవహారము కలిగినది.

"ఏషాగాథలు పల్కు మంత్రములు దానెచ్చోటికిం బోవురా పూషాదిత్య దురాత్మయంచుఁ బెలుచన్ ..."

వీరభద్ర విజయము; 4 వ ఆశ్వా. 123 పద్యము.

"ఓయి చాలించరోయి మీా జగడాలు. నగరివారు ముహూర్తం నిర్ణయించమంటే యేపాగాథలాడుచున్నారు" మన్నారు దాసవిలాసము

ఇట్టి ప్రయోగములు, వాడుకలు యక్షగానములందుఁ జాల కలవు.

18. 'వరణ' పుచ్చుకు కూర్చుండుట—ఏపనికయిన సిద్ధముగా నుండుట;

అస్మదర్థం భవన్తః కుర్వన్తు "బ్రహ్మాణం త్వాం వృణీమహే" ఇత్యాదులచే నొకపని కొకరిని వరింతురు. అట్లు వరింపఁబడినందుకు గుర్తుగా నక్షతలతోపాటు దర్భపుల్ల నిత్తురు. దానినే 'వరణ' యిచ్చుట యందురు. 'వరణ' (వరుణ) పుచ్చుకొన్న వానివలె సిద్ధముగా నున్న వానిని గూర్చి పై దాసిని వాడుదురు.

ఇటువంటివే కాక కొంత దూరాన్వయము కలిగినవియు, మొదట యోగ్యమగు వానిని దెలుపునవైనను నిప్పుడయోగ్యము లను స్ఫురింపఁజేయు విధముగా నున్నవియుఁ గొన్ని కలవు.

1. పూర్వాషాఢలు — విరేచనములు. పూర్వాషాఢలు పట్టుకొనిన వన నీళ్ళవిరేచనములని గ్రాహ్యము. పూర్వాషాఢా నక్షత్రమునకు (వరుణుఁడు) జల మధిదేవతయగుటయు, పూర్వాషాఢా నక్షత్ర మంత్రము "యాదివ్యా ఆపః పయసా సంబభూవుః యా అంతరిక్ష 'ఉతపార్థి వీర్యా...'అని జలవర్ణనము చేయునదియై యుండుటయు పై వాడుక కుపష్టంభకమైయుండును.

2. అవాఢ్వ్యుఁడు, అవాఢ్యుఁడు. } అయోగ్యుఁడు, అసమర్థుఁడు.

ఈ పదమును గూర్చి 'ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక రజతో

త్సవ సంపుటములో వ్రాత్యశబ్ద విచారమను శీర్షిక క్రింద శ్రీ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు కొంత వివరించియున్నారు. ఇది తైత్తిరీయ సంహితలోను, దద్బ్రాహ్మణమునను గల, రెండు పదముల కూడిక.

1. "అవాడ్ఢవ్యాని సురభీణి కృత్వా" తై॥ సం॥ ౨. ౬.
(అవాట్, హవ్యాని, సురభీణి, కృత్వా.)

2. "అవాడ్ఢవ్యా పితృభ్య ఆ." తై॥ బ్రా॥ ౨. 3.
(అవాట్, హవ్యా, పితృభ్యః, ఆ.)

పై రెండు స్థలములలోను, 'అవాట్' అనునది వహించుచున్నాఁడను నర్థముగల క్రియ. హవ్యాని, హవ్యా అనునది ఆజ్యాది హవిస్సుల నను ద్వితీయావిభక్తి. హవిస్సులను వహించు నగ్నిదేవుఁడని తాత్పర్యము. దీనిని వైదికపండితులెట్లో యయోగ్యుఁడను నర్థమున వాడుచున్నారు. 'బహుశః' హవిస్సులను జేరవేసినట్లు మాటలను జేరవేయువాఁడని భావమైయుండును. యజ్ఞాదికర్మలందు మంత్రపాటవ మంతగాలేని బ్రాహ్మణబ్రువుని,సంభారములందిచ్చు వానిగాఁ బరిచారకునిగా నియోగింతురు. అందులకుఁదప్ప నితరమున కక్కఱకు రానివాఁడని యర్థము. ఆవిధముగా మాత్రమే యుపయోగింపఁదగు నయోగ్యులను (వేదపండితుల దృష్ట్యా) గూర్చి యిది వ్యవహరింపఁబడి చివరకు అయోగ్యుఁడు, అసమర్థుఁడు నను నర్థమున మిగిలిపోయి యుండునని నాయూహ.

3. పౌండరీకుఁడు — బహిరంగముగా వ్యభిచరించువాఁడు; 'పచ్చిశృంగారి' అని తాత్పర్యము. పౌండరీక మనుక్రతువునందు హోమకుండోపరిభాగమున నమర్పఁబడిన వేదిక కంటె దీనిపై బ్రహ్మచారి కులటాసంవాదము జరుగుటయు దదితరమగు కర్మకాండయుఁ గొంతకలదు. దానినిబట్టి యిది వచ్చినది.

4. శ్రాద్ధయోగ్యము—అసంతృప్తికరము, బాగుగాలేనిది, అయోగ్యము; "శ్రాద్ధయోగ్యా భవన్తు" అని తద్దినప్రకరణములోని వాక్యము అచ్చటి సంభారములన్నియు నట్లుగానుండవలెనని భావన. యోగ్యములగు వానికే యిది వ్యవహరింపవలసియున్నను నయోగ్యముగా నున్నవానినే 'శ్రాద్ధయోగ్యము'గా నున్నవందురు.

కొన్నికొన్ని వైదికుల పరిభాషలు కథలనుగూడ సంతరించుకొనియుండును "దేవాదేవేషు" అట్టిది. తన్నులాటయయినది, దెబ్బలుతగిలినవి యనుటకు "దేవాదేవేషు"అయిన దందురు. పూర్వమొక గృహస్థునకు వేదజడుఁడగు పెద్దయల్లుఁడు సంస్కృతము చదువుకొన్న నాగరకుఁడగు చిన్నయల్లుఁడు నుండిరఁట. పెద్దయల్లునకుఁ బంచలోఁ జాపపై;చిన్నయల్లునకు గదిలో మంచముపైఁ బడకల నమర్చిరి.చిన్నయల్లున కతి మూత్రమో యేమో తడవకు వెలుపలికి రావలసివచ్చెనఁట. వచ్చినపుడల్ల షడ్డకునిద్రొక్కి (నేఁటివారు Excuse me అనునట్లు) "క్షమధ్వం" అనుచుండెనఁట. ఇట్లు మూఁడు నాలుగు తడవలు జరుగుటతో విసివి కోపముతోనున్న పెద్దయల్లుఁడు మరలనాపని జరిగినవెంటనే చిన్నయాతనిజుట్టు దొరకఁబుచ్చుకొని 'క్షమధ్వం' అనుదాని యుచ్చారణకు సరిపోవునట్లు, "దేవాదేవేషు శ్రియధ్వం, ప్రథమా ద్వితీయేషు శ్రియధ్వం, ద్వితీయా తృతీయేషు శ్రియధ్వం..." అని యూపిరితిరుగకుండఁ జపేటాఘాతములఁ దగిలించెనఁట.

'కైసా జాతే' అనిన "ఉత్తమే శిఖరే జాతే" యనియు,'కోన్ హై' యనిన నాపేరు కోనయ్యగాదు కోటయ్యశాస్త్రిలనియు నొక మహమ్మదీయున కొక ఛాందసుఁడు సమాధాన మిచ్చెనఁట. "సర్వప్రజాం మేగోపాయ..." అని నీరాజనమంత్రము. ఆమంత్రముతో నీరాజన మిచ్చుచుండ నేయూరిలోనో గోపయనామధేయుఁడు గ్రామాధికారియుండుట తటస్థించి యతఁ డామంత్రమును విని కన్నెఱ్ఱ చూచు

టతోడనే యది గ్రహించిన యర్చకుఁడు విధిలేక "సర్వప్రజాంమే గో పయ గారండీ" యనువిధముగా నామంత్రములో 'గోపాయ' వచ్చిన తావునెల్ల మార్చి చదివెనఁట.

ఒకపనిని జేసినపిమ్మటఁ జేయవలసినవిధి నాపనిని దెలుపుటకు వాడుటయుఁ గొన్నియెడల జరుగును. అల్పాచమన మనుట యటు వంటిది. మూత్రోత్సర్జనమయిన తరువాత నాచమనము విధాయక మైయున్నది. కావున నాపని 'అల్పాచమనము' (అల్పాచమానము) అనియే ప్రసిద్ధము.

ఇవన్నియుఁగాక వేదపండితులు, వారిసంసర్గమందున్నవారు వాడు కొన్ని జాతీయములవంటి వాడుకలు, సామెతలు నున్నవి. అవి కూడఁ గొన్నియుదాహరింపఁ బడుచున్నవి.

1 అంకురార్పణ / అంకురారోపణ } = మొదలు, ప్రారంభము. ప్రతిశుభ కార్యమునకు ముందు నంకురార్పణను (నవధాన్యములు చల్లి మొక్కలు మొలిపించుటను) జేయుదురు. కావున 'అంకురార్పణ'యనుట ప్రారంభమున కుపలక్షకమయినది.

2. నాంది—నాందియయినదనుటయుఁ బైదానివంటిదే. నాందీ ముఖశ్రాద్ధమని వివాహోపనయనాదులకుఁ బూర్వము జరుగును. దానిసంగ్రహ స్వరూపము 'నాంది'. దీనివలనఁ బితృదేవతలు తృప్తి జెందుదురు. ఇదికాక నాట్యశాస్త్రప్రకారము వేఱొక 'నాంది'కలదు. ఈ రెండువిధములయిన నాందులును 'నాంది' యయినదను వాడుక ప్రచురమగుటకుఁ దోడ్పడియుండును.

3. తిలోదకములిచ్చుట—ఆశవదలుకొనుట, వదలివేయుట.

4. తద్దినము పెట్టువానితమ్ముఁడు—నామమాత్రుఁడు, అజాగళస్తనసదృశుఁడు.

5. అస్త్రాయఫట్—వితంతువు (బోడిది) పట్టినలుపుట.

6. సమిధలు వేయుట—జోడించుట, చాడీలుచెప్పుట

7. అక్షింతలువేయుట—తిట్టుట, నిందించుట

8. దర్భపోటు (తగిలినది)—తద్దినభోజనము

9. తొమ్మిదో అష్టము పారాయణచేయుట— (అష్టకశబ్ద భవము-అట్టము) నిందించుట, బూతులుతిట్టుట తొమ్మిదవ యట్ట మునఁ దద్దినమంత్రము లుండును.

10. బృహస్పతి } బృహత్తు } =అండవృద్ధి

ఇంతేగాక నాగవల్లినిష్ఠురము, నాపసాని, వల్లెవేయుట, సంత చెప్పుట, పీత్యానుష్ఠానము, భట్టీయంవేయుట, శతమానమగుట, తథాస్తు "శాంతి శ్శాంతిః" వంటివి వారి సంభాషణలో లెక్కలేనన్ని దొరలుచుండును.

వేదపండితులకు సంబంధించినవి, వారికెక్కువ పరిచితములు యినవియు నగు సామెతలును గొన్నికలవు. అవి చాల చమత్కార ముగా నుండును.

1. ఆత్మస్తుతి, పరనింద, ధనకాంక్ష లేక యెనుబది రెండు పన్నములు చదువుకొన్నానాకు, ఓంభూలురాని ఆవెధవకు ఇద్దరకూ రూపాయేనా సంభావన అన్నాడఁట యొకప్రబుద్ధుఁడు. లేనిదేమియు లేదని విజ్ఞులు గ్రహింపకపోరు,

2. అవకతవక పెండ్లికొడుకు అక్షింతలు నోట్లో వేసికొనెనఁట.

3. కృష్ణస్నానమునకు కొండుభట్లు ఆజ్ఞా ?

4. వ్రతానాం ముత్తమమ్ వ్రతమ్ =దేనిప్రసక్తి వచ్చినపుడ దియే ప్రశస్తమనుట.

5. పెండ్లంటే తద్దినమనుట—ఎతియన్న ప్రతియన్నట్లు విరుద్ధభాషణము లాడుట.

6. మంత్రాలురాని బ్రాహ్మణుఁడు మంగలివాళ్లను చావగొట్టినా డన్నట్లు. ఏదో నోటికివచ్చిన కొద్దిమంత్రముల మొదళ్ల నుదాహరించుచు మంగలివారి నెప్పటికి వాద్యములు ప్రయోగించునట్లు చేయుట. తాను జదువుతప్పులు, నవకతవకలు పై వారికిఁ దెలియకుండవలెనని యాతని యారాటమైయుండును.

7. "కట్టాయస్వాహా, కంపాయస్వాహా, చెఱిసగాయస్వాహా" మంత్రములు రానివా రిర్వురు చేరి యమాయికుల కన్నుగప్పి పంచుకొనుటను దెలుపుచున్నది.

8. 'పరాయివాఁడు వచ్చాడు మొదలెట్టరా పారమాత్మికము' వైఖానసకల్ప సూత్రమున నితరత్రలేని 'పారమాత్మికమంత్రము' లని కొన్ని యనువాకములుకలవు. ఎంత వేదపండితునకయినను తదితరున కవి తెలియునవకాశములేనందున పరాయివాఁడు వచ్చినపుడు వారు హెచ్చరికగాఁ దమకుమాత్రమేవచ్చు నామంత్రములను జదువుదురు. ఎదుటివాని కందుబాటులో లేనివిషయము నెత్తినపుడీ సామెత వాడుదురు.

9. అరుంధతిలేదు, గిరుంధతిలేదు నాఁరంధంతా పెండ్లి కూఁతురు అప్పమీఁదే ఉన్నదన్నాడఁట వెనుకటికొక పెండ్లికొడుకు.

అరుంధతీదర్శనమును నూత్నదంపతులచే వివాహములోఁ జేయింతురు అరుంధతీదర్శనము రాత్రిపూటే దుశ్శకము. అట్టి తఱి పట్టపగలు దానిని జూపుటకుఁ బురోహితుఁడు చేయు వ్యర్థప్రయత్నములు, ఈడేఱిన పెండ్లికూఁతురి యప్పగారిని దదేకదృష్టితోఁ జూచుచున్న యారసికుఁడగు వరునకు విసుగు గల్గించి యుండును.

10. పిడుగుకు బియ్యమునకొకటే మంత్రమా ?

ఇటువంటి సామెతలను వారెక్కువగా నుపయోగింతురు.

వైదిక సంస్కృతిసంప్రదాయములవలన భాషలో జీర్ణములయి యర్థవిపరిణామమును బొంది సర్వజనామోదమును బొందినవి: యజమానుఁడు, కుశలుఁడు, కుశలము (క్షేమమను నర్థమున), కౌశలము, ఆధ్వర్యవము మొదలయినవి. తద్దినము, కర్మ మున్నగునవి 'ద్వంద్వార్థము' గానున్నవి. అట్లుకాక వైదికులగువారిచే మాత్రమే యా యా యర్థములందు సంజ్ఞలుగా, పరిభాషలుగా వాడుకొనఁబడు వానినొక విధముగా నొకవర్గమునకుఁ జెందిన మాండలికములని యనవచ్చును. పైనుదాహృతములగు వానినిబట్టి తత్తన్మంత్రముయొక్కగాని, వాక్యముయొక్కగాని పూర్వభాగమునకుఁ దరువాతి పదముయొక్క యర్థమును సంక్రమింపఁజేయుటగాని, లేక తరువాతిపదము నిది జ్ఞాపకము చేయుటగాని పెక్కుపరిభాషలలో జరిగినది. సామాన్యవిషయమునకు గంభీరార్థము నిచ్చుకోరికయు, నశ్లీలార్థగోపనకాంక్షయు, నెల్లరకుఁ దెలియకుండఁదమలోఁదాము మాటలాడుకొను నిచ్ఛయు నందులకుఁ గారణములు. కొన్నిసందర్భములలో మంత్రముచేఁ జేయనగుదానిని మంత్రముచే సూచించుటయు వివరింపఁబడినది. అర్థవ్యాకోచము, అర్థసంకోచము, అర్థాంతర సంక్రమణము మొదలగునవి వైదికుల జాతీయములలోఁ గానవచ్చును.

అటువంటి పరిభాషలను-సంజ్ఞలను నర్థముఁజేసికొనఁగలుగుట, యట్టివానిని వాడుచుఁ బ్రసంగించుటయు వేదపండితుల సమాజములో గౌరవమును జేకూర్చును. అట్టిగోష్ఠులలో వారి కందుబాటులో నుండు తత్సజాతీయములగు జాతీయములు, సామెతలు దొరలుట సహజమేకదా! కావున వానినిగూర్చికూడఁ బ్రసక్తానుప్రసక్తముగాఁ గొంత వివరింపఁబడినది. వైదిక పరిభాషలయొక్కయు నాసమాజములో వాడఁబడు జాతీయములు, సామెతలు, సంజ్ఞలు మొదలగు

వానియొక్కయు వైచిత్రిని విశిష్టతను విజ్ఞులదృష్టికిఁ గొలదిగానైనఁ దీసికొనిరాఁగలిగినచో నీవ్యాసము చరితార్థమగును.

"...యోఽర్థజ్ఞ ఇత్సకలం భద్ర మశ్నుతే
నాక మేతి జ్ఞానవిధూతపాప్మా"

---

# గ్రంథస్వీకారము—సమీక్ష

బండారు తమ్మయ్య.

1. సింహబలి:—పద్యకృతి; కర్త :—శ్రీ మోటూరి వేంకటరావుగారు B. A. విజయనగరము, ప్రకాశకులు M.S.R. Murthy & Company విశాఖపట్టణము. డెమ్మీ ౘ పుటలు 102 వెల రు 2-0-0

మొగలు పాదుషా ఔరంగజేబుచే నాక్రమింపఁబడి స్వాధీనము చేసికొనఁబడిన మహారాష్ట్రదేశమందలి సింహగడదుర్గమును తల్లి జిజియాకోరికను నెఱవేర్చుటకుఁగాను ఛత్రపతి శివాజీ తనసేనానియగు తానాజిని నియోగించి మరల స్వాధీనముగావించుకొనుటయిందలి యితివృత్తము. కృతికర్తచే నిది హైందవ ప్రాజ్యతేజమున కంకిత మొనర్పఁబడినది. తానాజీ ప్రభుభక్తి, పరాక్రమ నైపుణ్యములు నిందుఁ జక్కగా వర్ణితమయి ప్రదర్శింపఁబడినవి. ఈకథనే గైకొని మున్ను శ్రీ సురభి నరసింహముగారు సింహగడమనుపేరితో మనోహర దృశ్యరూపకముగ రచించి యున్నారు. విజయమును సాధించినను కార్యరంగమున తానాజీ ప్రాణములఁ బాయుట దుఃఖజనకమయి కరుణరసపోషణమునకు సహాయకమగుచున్నది. కృతికర్త శ్రీ వేంకటరావుగారు ప్రతిభావంతులు. సరస కవితానిపుణులు. అందు కాదర్శకముగానే వీరి యీకృతి రచనము వెలయుచున్నది. శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి "శిల్పాలోకము", మధునాపంతుల సత్యనారా

యణశాస్త్రిగారి మున్నుడి, ఆస్థానకవి, కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి ప్రభృతుల విద్వదభిప్రాయములు కృతికి ముఖాలంకరణములుగఁ జేర్పఁబడినవి తిక్కన నిర్వచనోత్తరరామాయణావతారికలో "పలుకులపొందులేక, రసభంగము చేయుచుఁ, బ్రాఁతవడ్డ మాటలఁదమనేర్పుచూపి,యొకటక్ హృదయంబలరింపలేక..."యని వ్రాసిన పద్యములోఁ బ్రాఁతగిలినమాటలను గృతిరచనమునఁ గూర్చుట యొక యవగుణముగా సూచించినాఁడు. కాని మన వేంకటరావుగారీకృతియందట్టి ప్రాఁతమాటలనే యెక్కువగాఁ గూర్చుట యొక విశేషము. అట్టివి పాఠకలోకమునకు సుబోధకములు కావని తలంచియే కాఁబోలు, తద్వివరణాదికములకయి 13 పేజీల టిప్పణమును గ్రంథాంతమునందుఁ జేర్చియున్నారు. కథాకాలమునాఁటి తత్తత్సన్నివేశములను, అప్పటిజనుల వేషవ్యవహారములను పర్వతప్రాంతములను పాఠకుల కన్నులకుఁగట్టునట్లు లెస్సగాఁ జిత్రించుటకిట్టి పదప్రయోగము లవసరోచితములని సంభావించి, విశ్వనాథవారు తమశిల్పావలోకములో నీకృతిని "వస్తూచితశిల్పచాతుర్యముగల కావ్యము"అని ప్రశంసించియున్నారు ప్రాఁతమాటలు పెక్కులున్నను. "పలుకుల పొందు లేమి, రసభంగముచేయుట, పాఠకహృదయముల నొక్కట నలరింపఁ జాలమి" అని తిక్కన పేర్కొనిన దోషములకు గుఱిగాక శ్రీ వేంకటరావుగారి యీకృతి రసోల్బణకారకమగు శిల్పనైపుణితో రచింపఁ బడినదఁయే మాయభిప్రాయముగూడ. పాఠకలోక మిందుకు స్వాగతమొసంగుఁగాక. మచ్చునకొండు రెండు పద్యములు:—

సలిపి, దురమ్ములన్ గెలుపు సల్పినశాతకరాళ ఖడ్గమున్
బలిపెపు డాలుఁబూని యనవద్యపరాక్రమశాలులై తనుం
గొలిచెడు మావళీలు పొదిగొన్న దళమ్ము గవేపు రంతలో
బలికొనసుక్కనిక్కు పడవాలయితానజిఱుమ్మ మొల్కుచున్ (2-12)

అడితపుంబోటుమాటున నిరర్గళశోణిత మోడిగిల్లుచున్
బుడమిపయిఁ బయస్వినులపాల్పు వెలార్పఁగ దేహమంతయుఁ
దడఁబడ, దెబ్బతిన్న హరినైజ విజృంభణమట్లు వైరిపైఁ
బడితునుమాడితచ్ఛిరము, వ్రాలెను తానజికూడ క్షోణిపై (7-46)

2. ఆంధ్రసేవాకథలు:—వచనము కర్త ఉభయభాషాప్రవీణ, జాస్తి వేంకట నరసయ్యగారు, చిలకలూరుపేట, ఉన్నత పాఠశాలాంధ్రోపధ్యాయులు క్రౌను, పుటలు 58, వెల రు 0—10—0 లు

విశ్వదాత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులు, మాతృదేశభక్తి సంపన్న మాగంటి అన్నపూర్ణాదేవి, కలియుగభీమ కోడి రామమూర్తినాయఁడు, ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారల జీవితచరిత్ర చిత్రణ విచక్షణ పూర్వకమయినది యీ లఘుకృతి-విద్యార్థిలోకమునకు దేశభక్తి పూర్వకములగు నుత్తమ గుణముల నుద్బోధించు సదుద్దేశముతో వారి పఠనమున కుచితమగు సులభశైలిలోఁ గూర్పఁబడినది. అందుచేఁ బాఠశాలావిద్యార్థులకుఁ బాఠ్యముగా నుండుట కిది యెంతయుఁ దగియున్నది.

3. శ్రీవిలాసము—మూఁడాశ్వాసముల పద్యకావ్యము. కృతికర్త.విద్వత్కవి శ్రీ ఆకుండి వేంకటశాస్త్రిగారు విజయనగర సంస్కృత కళాశాలా నివృత్తాధ్యాపకులు,కృతిభర్త:-శ్రీ ఆచార్య మామిడిపూడి వేంకటరంగయ్యపంతులుగారు,ఎం.ఏ:-క్రౌను పుటలు 128 వెల 2-8-0

కృతికర్తయుఁ భర్తయుఁ జిరకాలము విజయనగర సంస్థానపుఁ గొలువులో గీర్వాణ భాషాపండితులుగా, చరిత్రోపన్యాసకులుగా మంత్రిసత్తములుగాజీవితముల నెఱపిన పండిత వతంసులు. వారి చిరపరిచయ, స్నేహవాత్సల్యములఁ బురస్కరించికొని వానిని సంస్మరణీయములుగ నొనర్చుటకయి కృతికర్త యీకృతిని శ్రీ వేంకటరంగయ్యగారికి వారి డెబ్బదియవ జన్మదినోత్సవ సందర్భమున నం

కిత మొనర్చుట ముదావహము. సన్నిహిత సంబంధ బాంధవములుగల గోదావరీమండల ద్రావిడకుటుంబములు రెండింటిలో ఘటిల్లిన వైవాహిక బంధము కల్పితేతి వృత్తముగాఁగాని రచింపఁబడినది. అమలాపురమందలి ఓరుగంటి వంశ్యులు, నారసింహ వేంకమాంబాదంపతుల పుత్త్రుడు శ్రీనివాస నామాంకితుఁడు వరుఁడు. పోలవర ప్రాంతమందలి దేవపురాగ్రహార వాస్తవ్యులు, శేషావధాని నాగమాంబలకు లక్ష్మీనాథ ప్రసాదమున జనించిన లక్ష్మీదేవి వధువు ఆదిమ వ్యాహారమను పేరితో కవిమూర్ధన్య శ్రీ కాకరపర్తి కృష్ణమూర్తిగారు రచించిన మున్నుడి ముఖాలంకృతిగఁ గూర్పఁ బడియున్నది. అందు కృతికర్త ప్రతిభావ్యుత్పత్తులు చక్కఁగా వివరింపఁబడినవి. (శ్రీ వేంకటశాస్త్రి) గారు చిరకాలము గీర్వాణభాషాధ్యాపకులుగా నుండిన వారయ్యు నాంధ్రమునఁగూడఁ జక్కని యభిజ్ఞత, కవితాపటిమ మెఱయింపఁ గల్గిన విద్వన్మణులు. వారికవితా పాండిత్యముల వేఱుగాఁ బ్రశంసించుట యనవసరము.

మచ్చునకుఁ గొన్ని పద్యములు.

పకపకనగవులు తొలఁగఁగ జకచకగతులడఁగనడుమునన్నందనమున్
చికపికలై చెడఁబచ్చని మొకమునఁదెలికాంతులందముగ నగపడి
యెన్ (ఆ ౧.పుట. 38)

"నాఁడుసిరివేల్పుఁగొలువని నాతియెచట కర్ణగోచరగాదు
దీర్ఘంబుమీఁది సాధ్యపూర్ణమువలెఁ గొత్తసరణి నత్త
గలిసెఁగోడలు రేఫసాంకర్యమట్లు (ఆ. 3 పుట. 108)

అట్టి వసంతవేళ జగమంతయుఁ గెల్వఁగఁ బుష్పబాణముల్
పట్టి జయమ్ముఁగాంచు తనపట్టిని జూడఁజరించివచ్చెనో
యట్టులుగాక లక్ష్మితనుఁ బ్రార్థనసేయఁగ దానిఫుట్టినిల్
పట్టఁగవచ్చెనో యనఁగ లక్ష్మియుఁజేరెఁదదగ్రహారమున్.
(ఆ. 3 పుట 112)

**4.** శ్రీ నిరతాన్నదాత్రి డొక్కా సీతమ్మగారి జీవితచరిత్ర :- వచనము గ్రంథకర్త : మిత్తిపాటి సీతారామచయనులుగారు ప్రాథమిక పాఠశాలా ప్రధానోపధ్యాయులు, లంకల గన్నవరము. క్రౌను పుటలు 88 వెల రు 1—4—0

గోదావరీ మండలమందలి లంకలగన్నవరము వాస్తవ్యులు కీర్తిశేషులు శ్రీ డొక్కా జోగన్నగారు వారి సాధ్వీమణి సీతమ్మగారు పూర్వపుఁ గఱవుదినములలో నిరతాన్న ప్రదానమున విశ్వవిశ్రుతి గన్న పుణ్యదంపతులు. ఎట్టిపట్టుల నెంతమాత్రము వెనుదీయక యీ దంపతులు నిజధర్మవ్రతాచరణమును నిర్వహించిన ఘట్టములెన్నియో యాప్రాంతముల వాడుక కథలుగా వెలసినవి. అతిథులయెడ, అన్నాతురులయెడ శ్రీ సీతమ్మగారు ప్రకటించెడి యౌదార్యము, ఆదరణము వర్ణనాతీతములు. ఈమె జీవిత కథాఘట్టములఁ బెక్కింటిని సేకరించి గ్రంథరూపమున వెలయించి గ్రంథకర్తగారా సాధ్వీమణిని జిరస్మరణీయగఁ జిత్రించి ధన్యులయినారు. ఆబాలగోపాలము సుబోధకమగు చక్కని సులభగ్రాంథిక శైలిలో నిది రచింపఁబడినది. విద్యాధికారు లీ గ్రంథమును బాఠశాలలోఁ బఠనీయముగా నిర్ణయించినచో వారి జీవితములందుత్తమ భావములను రేకెత్తించుట కిది యుపకరింపఁ గలదు ఆంధ్రప్రదేశ్ రెవిన్యూమంత్రి శ్రీ కళా వేంకటరావుగారు సంగ్రహముగఁ గూర్చిన శ్రీ సీతమ్మగారి జీవితచరిత్రము, విద్వచ్ఛిరోమణులు శ్రీ పుల్య ఉమామహేశ్వరశాస్త్రి, నెంపరాల సూర్యనారాయణశాస్త్రి మున్నగువారొసంగిన యభిప్రాయములు గ్రంథారంభమున ముద్రితములయి యీకృతి కనూనశోభను వెలార్చుచున్నవి. ఆంధ్రప్రదేశ విద్యాధికారులు పాఠశాలలందు, ప్రజాపఠనాలయములందు గ్రంథభాండారములలోఁ దీనిని జేర్చుటకామోదము నొసంగియున్నారు.

भवेत्स चेदानीं स्कन्धानुपादद्यात् । उपादाय च स्कन्धान्पश्चात् स्कन्धवानपि भवेत् । तादृशस्तु तथागतो नास्ति । निर्हेतुकत्वप्रसङ्गादिति भावः ॥५॥

एवं च—

**स्कन्धांश्चाप्यनुपादाय नास्ति कश्चित्तथागतः ।**
**यश्च नास्त्यनुपादाय स उपादास्यते कथम् ॥६॥**

निर्हेतुकत्वप्रसङ्गात् स्कन्धाननुपादाय पूर्वं तथागतोऽस्ति । यश्च तादृशो नास्ति सोऽविद्यमानत्वात्कथं स्कन्धानुपादातुं प्रभवतीति वक्तव्यम् । न कथंचित्प्रभवतीति भावः ॥६॥

यदैव तथागतः उपादानात्पूर्वमविद्यमानत्वान्न किंचिदप्युपादत्ते तदा—

**न भवत्यनुपादानमुपादानं च किंचन ।**
**न चास्ति निरुपादानः कथंचन तथागतः ॥७॥**

उपादात्रधीना हि उपादानानुपादानव्यवस्था, न तमन्तरेणोपपद्यते । पूर्वसिद्धस्योपादातुरभावादुपादानं नास्ति । तदभावे निरुपादानस्तथागतोपि कथं चनापि न भविष्यतीति भावः ॥७॥

एवं च—

**तत्त्वान्यत्वेन यो नास्ति मृग्यमाणोपि पञ्चधा ।**
**उपादानेन स कथं प्रज्ञप्येत तथागतः ॥८॥**

प्रागुक्तपञ्चप्रकारैः मृग्यमाणो विचार्यमाणोपि यः स्कन्धरूपतया तदन्यत्वेन वा नास्ति स तथागतः अत्यन्तमविद्यमानः कथमुपदानेन प्रज्ञपयितुं शक्यः । तस्मान्नास्ति स्वभावतस्तथागत इति भावः ॥८॥

प्रकारान्तरेणापि तथागतो नास्तीति प्रतिपादयन्नाह—

**यदपीदमुपादानं तत्स्वभावान्न विद्यते ।**
**स्वभावतश्च यन्नास्ति कुतस्तत्परभावतः ॥९॥**

यदिदमुपादानं रूपवेदनाविज्ञानसंज्ञासंस्काराख्यपञ्चस्कन्धरूपं तदपि स्वभावेन नास्ति । प्रतीत्यसमुत्पादात् । स्कन्धपरीक्षायां विस्तरेण प्रतिषिद्धत्वाच्च । यच्च स्वभावेन नास्ति तत्परभावेनापि न सम्भवत्येव । न हि वन्ध्यापुत्रः स्वभा-

वेनाविद्यमानः परभावेनास्तीति शक्यते वक्तुम्। तस्मान्नास्ति स्वभावपरभावाभ्यामुपादानम्। अथवा उपादातृसापेक्षत्वादुपादानं स्वभावेन नास्ति। तस्मादुपादाता तथागतोपि स्वभावपरभावाभ्यां नास्तीति सिद्धमिति भावः ॥९॥

इदानीं यथाप्रदर्शितमेवार्थमुपपादयन्नाह—

**एवं शून्यमुपादानमुपादाता च सर्वशः।**
**प्रज्ञप्यते च शून्येन कथं शून्यस्तथागतः ॥१०॥**

एवमुक्तेन प्रकारेणोपादानं स्कन्धपञ्चकं शून्यं, निस्स्वभावम्। उपादातापि शून्यो निस्स्वभावः। तथा च निस्स्वभावेन स्कन्धपञ्चकेन कथं निस्स्वभावः तथागतः प्रज्ञप्यते? नह्यविद्यमानेनाविद्यमानस्य प्रज्ञप्तिरस्तीति भावः ॥

ननु वयं स्वविकल्पविकल्पितानि कणभक्षाक्षपादाद्युपज्ञानिदर्शनान्तराणि परित्यज्य, निरवशेषान्यतीर्थीय मतान्धकारविघटकं, स्वर्गापवर्गानुगाम्यविपरीतमार्गसंप्रकाशकं, सद्धर्मदेशनाकिरणव्याप्त्यशेषविविधविनेयमतिकमलमुकुलविबोधनतत्परं, यथावदवस्थितसकलपदार्थतत्त्वावभासनक्षमसकललोकचक्षुर्भूतं, सकलजगच्छरण्यं, दशबलवैशारद्यावेदितातिभास्वरबुद्धधर्मामलमण्डलं, महायानमहानयसारथिवरं, बोधोत्तुङ्गतुरङ्गमं, सकलत्रिभुवनजनजातिजरामरणसंसारकान्तारसरिदुच्छोषणतत्परं, चतुराराातिमारसमरशरसम्पातविजयिनं, तथागतसवितारं, अज्ञानमहान्धकारनिराकरणाय शरणं प्रपन्नाः, तस्य चासत्त्वं ब्रुवता भवता तथागतमहादित्यप्रच्छादकेन, आकालिकघनघनावलीप्रसरणजगदन्धकारोपमेन, नास्माकं सम्बन्ध इति चेदुच्यते— अत एव हेतोरस्माकं प्रत्याशा भवद्विधेषु बुद्धजनेषु यदि भवन्तो मोक्षकामतयाऽन्यतीर्थिकमतानि परित्यज्य भगवन्तं तथागतमेव परमशास्तारं, प्रतिपद्यापि परमगभीरमनुत्तरं, सर्वतीर्थासाधारणं, नैरात्म्यसिंहनादमसहमानास्तुरङ्गमा इव विविधकुदृष्टिव्यालमालाकुलं, विपर्यस्तजनानुगतं, तमेव महाघोरसंसाराटवीसञ्चारानुगुणं मार्गं गाहन्ते, नहि तथागताः कदाचिदप्यात्मनः स्कन्धानां चास्तित्वं प्रज्ञपयन्ति। नहि वयमपि स्कन्धानां तथागतस्य च सर्वथैव नास्तित्वं ब्रूमः। अपि तु निस्स्वभावं तथागतं व्याचक्षाणेन, अविपरीतार्थमधिजिगमिषुणा योगिना ॥

न वक्तव्यं शून्यमित्यशून्यमिति वा भवेत् ।
उभयं नोभयं चेति प्रज्ञप्त्यर्थं तु कथ्यते ॥११॥

शून्यमेतत्तथागततत्त्वमिति वा, अशून्यमिति वा, शून्याऽशून्योभयात्मकमिति वा, अनुभयात्मकमिति वा न वक्तव्यम्। सर्वथाप्यनुपपत्तेः । भगवता बुद्धेन तु विनेयजनानुरोधेन संवृतिसत्त्वमङ्गीकृत्य यथावसरं क्वचिच्छून्यमिति, क्वचिदशून्यमिति, क्वचिदुभयं, क्वचिन्नोभयमिति विनेयानां प्रज्ञप्त्यर्थमेव कथ्यते। परमार्थतस्त्वस्मदुक्तैव सरणिरनुसर्तव्येति भावः । तस्मात्तथागते एताः कल्पना न सम्भवन्तीति ॥ ११॥

न केवलं शून्यत्वादिकमेव तथागते न सम्भवति । अपितु—

शाश्वताशाश्वताद्यत्र कुतः शान्ते चतुष्टयम् ।
अनन्ताद्यपि चाप्यत्र कुतः शान्ते चतुष्टयम् ॥१२॥

इह भगवता चतुर्दशाव्याकृतानि वस्तूनि निर्दिष्टानि । यथा शाश्वतो लोकः, अशाश्वतो लोकः, शाश्वतोऽशाश्वतश्च लोकः, नैव शाश्वतो नैवाशाश्वतश्च लोक इति चतुष्टयमेकम् । अन्तवान् लोकः, अनन्तवान् लोकः, अन्तवाननन्तवांश्च लोकः, नैवान्तवान्न चैवान्तवांश्च लोक इति द्वितीयं चतुष्टयं। भवति तथागतः, मरणात्परं न भवति तथागतः, मरणात्परं भवति च न भवति च तथागतः, मरणात्परं न भवति न न भवति च तथागत इति तृतीयम् । जीवोन्यः, शरीरमन्यदिति द्वयम् । एतानि चतुर्दशवस्तूनि अव्याकृतत्वादव्याकृतवस्तूनि । तत्र शान्ते निस्स्वभावे तथागते पूर्वोक्तेन न्यायेन यथा शून्यादिचतुष्टयं न सम्भवति तथा शान्तत्वादीन्यव्याकृतचतुर्दशवस्तून्यपि न सम्भवन्तीति भावः ॥१२॥

एवं स्थिते—

येन ग्राहो गृहीतस्तु येनास्तीति तथागतः ।
नास्तीति कल्पयन् सः निर्वृतस्यापि कल्पयेत् ॥१३॥

येन पुंसा, येन महताभिनिवेशेन तथागत अस्तीति ग्राहः पक्षः गृहीतः,

यदि वा तथागतो नास्तीति वा मरणात्परमिति पक्षो वा गृहीतः। एवं विकल्पयन् सः निर्वृतस्यापि मोक्षस्यापि पूर्वोक्तं विकल्पं कल्पयेदेवेति भावः ॥१३॥

अतः—

स्वभावतश्च शून्येऽस्मिन् चिन्ता नैवोपपद्यते।
परं निरोधाद्भवति बुद्धो न भवतीति वा ॥१४॥

स्वभावतः शून्येऽस्मिन् तथागते निरोधात्परं बुद्धः भवति वा न वेत्यादि चिन्ता नोपपद्यते ॥१४॥

वस्तुनिबन्धनो हि प्रपञ्चः। अवस्तुकश्च तथागतः। अतः प्रपञ्चातीतस्तथागतः। तमित्थंभूतं तथागतं स्वोत्प्रेक्षितमिथ्याविकल्पमलीमसमानसतया—

प्रपञ्चयन्ति ये बुद्धं प्रपञ्चातीतमव्ययम्।
ते प्रपञ्चहतास्सर्वे न पश्यन्ति तथागतम् ॥१५॥

विविधैः परिकल्पनाविशेषैः प्रपञ्चातीतमनुत्पादेनावस्थान्तरगमनाभावादव्ययं बुद्धं ये प्रपञ्चयन्ति ये ते सर्वेऽपि स्वकल्पनाप्रपञ्चैरेव हतास्सन्तः तथागतं तत्त्वतो न पश्यन्तीत्यर्थः ॥१५॥

अनया तथागतपरीक्षया सर्वो लोकः परीक्षितो वेदितव्य इति प्रतिपादयन्नाह—

तथागतो यत्स्वभावः तत्स्वभावमिदं जगत्।
तथागतो निस्स्वभावो निस्स्वभावमिदं जगत् ॥१६॥

यादृशस्वभावस्तथागतस्तादृशस्वभावमेवेदं जगत्, पूर्वोक्तरीत्या निस्स्वभावस्तथागत इति सिद्धम्। यथा च जगन्निस्स्वभावं तथा प्रत्ययपरीक्षादावुपदर्शितमेवेति भावः ॥१६॥

इति सुबोधिनीव्याख्यासहितमाध्यमिककारिकासु
तथागतपरीक्षा नाम द्वाविंशतितमं प्रकरणम्।

सुबोधिनीव्याख्यासहित-

# माध्यमिककारिकासु,

## विपर्ययपरीक्षानाम त्रयोविंशतितमं प्रकरणम् ।

ननु कारणस्य क्लेशादेस्सद्भावाद्विद्यत एव भवसन्ततिः । इह हि रागादिरूपक्लेशेभ्यः कर्मोपजायते । ततश्च जन्ममरणपरम्परा, सैव भवसन्ततिरित्युच्यते । तस्याश्च प्रधानं कारणं क्लेशाः, प्रहीनक्लेशस्य भवसन्तत्यभावात् । तस्मात्कारणसद्भावादस्ति भवसन्ततिरिति चेदत्राह—

**सङ्कल्पप्रभवो रागः द्वेषो मोहश्च कथ्यते ।**
**शुभाशुभविपर्यासान् सम्भवन्ति प्रतीत्य हि ॥१॥**

सङ्कल्पः चित्तवृत्तिविशेषः । स रागद्वेषमोहानां साधारणं कारणम् । अन्येषामपि क्लेशानां सत्त्वेपि मुख्यत्वात्त्रयाणामेवेहोपादानं कृतम् । एते च क्लेशाः शुभाशुभविपर्यासान् प्रतीत्य सम्भवन्ति । अतश्शुभाशुभविपर्यासा एषामसाधारणानि निमित्तानि । तत्र शुभाकारं प्रतीत्य राग उत्पद्यते । अशुभाकारं प्रतीत्य द्वेषः । विपर्यासं प्रतीत्य मोहः ॥१॥

एवं च—

**शुभाशुभविपर्यासान् सम्भवन्ति प्रतीत्य ये ।**
**ते स्वभावान्न विद्यन्ते तस्मात्क्लेशा न तत्त्वतः ॥२॥**

यदि रागादयः स्वभावसिद्धाः स्युः तदा नैवैते शुभाशुभविपर्यासान् प्रतीत्य भवेयुः । स्वभावस्याकृत्रिमत्वादन्यनिरपेक्षत्वाच्च । यतो रागादयो क्लेशाः शुभाशुभविपर्यासान्प्रतीत्य सम्भवन्त्यतो निस्स्वभावा एवैते न तत्त्वतः सन्तीति भावः ॥२॥

अपि च—

**आत्मनोऽस्तित्वनास्तित्वे न कथञ्चिच्च सिद्ध्यतः ।**
**तं विनाऽस्तित्वनास्तित्वे क्लेशानां सिद्ध्यतः कथम् ॥३॥**

आत्मनो यथाऽस्तित्वनास्तित्वे न स्तः तथोक्तं विस्तरेण प्राक् । ततश्च तदाश्रितानां क्लेशानामस्तित्वनास्तित्वे न सम्भवत इति भावः ॥३॥

किंच—

**कस्यचिद्धि भवन्तीमे क्लेशाः स च न सिद्ध्यति ।**
**कश्चिदाहो विना कश्चित्सन्ति क्लेशा न कस्य चित् ॥४॥**

एते रागादयः स्वोत्पत्तौ कंचिदाश्रयमपेक्षन्ते । तमाश्रयमपेक्ष्य कस्यचिद्भवति समाश्रयः । आत्मा वा चित्तं वा स्यात् । स च प्रागेव प्रतिषिद्धः । तस्मात्कंचिदाश्रयं विना कस्यापि क्वचिदपि क्लेशा न सन्तीति भावः ॥४॥

ननु क्लेशानां पूर्वसिद्ध आश्रयोः मास्तु, क्लिष्टं चित्तं प्रतीत्य क्लेशा उपजायन्ते । तच्च चित्तमपि सहैव क्लेशैरुपजायत इति चेत्तत्राह—

**स्वकायदृष्टिवत्क्लेशाः क्लिष्टे सन्ति न पञ्चधा ।**
**स्वकायदृष्टिवत्क्लिष्टं क्लेशेष्वपि न पञ्चधा ॥५॥**

स्वकायो नाम रूपादिसंघातः । तस्मिन्नात्मात्मीयदृष्टिस्स्वकायदृष्टिः । यथेयं पञ्चधा विचार्यमाणा न सम्भवति एवं पञ्चधा विचार्यमाणाः क्लेशा रागादयः क्लिष्टे चित्ते न सन्ति । यदेव क्लिष्टं स एव क्लेश इति न सम्भवति । कर्तृकर्मणोरेकत्वप्रसङ्गात् । नाप्यन्यो क्लेशः, अन्यत्क्लिष्टमिति सम्भवति । परत्र निरपेक्षत्वादक्लिष्टहेतुकक्लेशप्रसङ्गात् । एवमाधाराधेयतद्वत्तापक्षाणामप्यभावात् क्लेशेषु क्लिष्टमिति पक्षो न सम्भवति । एवमेव एकत्वान्यत्वाधाराधेयतद्वत्ता-पक्षाणामसम्भवात् क्लिष्टे क्लेशा इत्यपि न सम्भवतीति भावः ॥५॥

किं चान्यत्—

**स्वभावतो न विद्यन्ते शुभाशुभविपर्ययाः ।**
**प्रतीत्य कतमान् क्लेशाः शुभाशुभविपर्ययान् ॥६॥**

शुभाशुभविपर्ययान्प्रतीत्य क्लेशा भवन्तीति न सम्भवति । शुभाशुभ विपर्ययानामेव स्वभावतोऽविद्यमानत्वात् । एवं हेत्वभावादपि क्लेशादयो न सम्भवन्तीति भावः ॥६॥

आलम्बनाभावाच्च क्लेशादयो न सन्तीत्याह—

**रूपशब्दरसस्पर्शाः गन्धो धर्मश्च षड्विधम् ।**
**वस्तुरागस्य द्वेषस्य मोहस्य च विकल्प्यते ॥७॥**

धर्मो नाम स्वलक्षणः। रूपरसगन्धस्पर्शशब्दधर्माः रागादीनां क्लेशानामालम्बनमिति कल्प्यते भवता। रूपादिषु शुभाकाराध्यारोपेण रागो जायते, अशुभाकाराध्यारोपेण द्वेषः, विपरीतदर्शनेन मोह इति भावः ॥७॥

रूपशब्दरसस्पर्शा गन्धो धर्मश्च केवलम्।
गन्धर्वनगराकारा मरीचिस्वप्नसन्निभाः ॥८॥
अशुभं वा शुभं वापि कुतस्तेषु भविष्यति।
मायापुरुषकल्पेषु प्रतिबिम्बसमेषु च ॥९॥

क्लेशानामालम्बनतया कल्पिता रूपादयो निस्स्वभावाः, गन्धर्वनगराकाराः, मरीचिस्वप्नसन्निभाश्च प्रतीयन्ते। अतः प्रतिबिम्बोपमेषु तेषु कथं रागाद्यालम्बनत्वं सिध्यति? तस्मादालम्बनाभावान्न सन्ति क्लेशा इति भावः ॥

न केवलमालम्बनमिथ्यात्वेनैव शुभाशुभयोः क्लेशनिमित्तयोर्मिथ्यात्वं प्रकारान्तरेणापीत्याह—

अनपेक्ष्य शुभं नास्त्यशुभं प्रज्ञपयेमहि।
यत्प्रतीत्य शुभं तस्माच्छुभं नैवोपपद्यते ॥१०॥
अनपेक्ष्याशुभं नास्ति शुभं प्रज्ञपयेमहि।
यत्प्रतीत्याशुभं तस्मादशुभं नैव विद्यते ॥११॥

इह शुभाशुभे ह्रस्वदीर्घत्वे इव परस्परसापेक्षे। अतोऽशुभमनपेक्ष्य शुभं नास्ति। यदशुभं प्रतीत्य शुभं प्रज्ञपयेमहि तदशुभं नास्ति। शुभसापेक्षत्वात्। अशुभाच्छुभमपि नोपपद्यते। एवं शुभमनपेक्ष्याशुभमपि नास्ति। यच्छुभं प्रतीत्याशुभं प्रज्ञपयेमहि तच्छुभं नास्ति। तस्मादशुभमपि नास्तीति भावः॥११॥

एवं —

अविद्यमाने च शुभे कुतो रागो भविष्यति।
अशुभेऽविद्यमाने च कुतो द्वेषो भविष्यति ॥१२॥

शुभाशुभनिमित्तकयो रागद्वेषयोः शुभाशुभरूपनिमित्ताभावे सति नास्ति सम्भव इति भावः ॥१२॥

तदेवं शुभाशुभनिमित्ताभावेन रागद्वेषयोरभावमुपपाद्य विपर्यासाभावप्रतिपादनेन मोहस्याप्यभावं प्रतिपादयितुमाह—

**अनित्ये नित्यमित्येवं यदि ग्राहो विपर्ययः ।**
**नाऽनित्यं विद्यते शून्ये कुतो ग्राहो विपर्ययः ॥१३॥**

इह चत्वारो विपर्यया उच्यन्ते । यथा अनित्ये प्रतिक्षणनाशिनि स्कन्धपञ्चके नित्यमित्यभिनिवेश एको विपर्यासः । 'यदनित्यं तद्दुःख' मिति न्यायेन अनित्ये स्कन्धपञ्चके यत्सुखं तदपि दुःखमेवेति ग्राहः स द्वितीयो विपर्यासः । एवमिदं शरीरं सर्वात्मना सततमशुचिस्वभावं, तत्र शुचित्वाभिनिवेशो तृतीयो विपर्यासः । एवं पञ्चस्कन्धात्मकमिदं अस्तित्वादुदयव्ययधर्मित्वाच्च निरात्मकं, आत्मस्वभावशून्यं तस्मिन्नात्मग्राह आत्मत्वाभिनिवेशः चतुर्थो विपर्यासः । एवमेते चत्वारो विपर्यासा मोहस्य हेतवः । अत्र विचार्यते । यद्यनित्ये नित्यमिति ग्राहः अभिनिवेशो विपर्यासस्तदा शून्ये निस्स्वभावके जगति अनित्यमेव नास्ति । यदा चैवं तदा नित्यत्वाभिनिवेशरूपो विपर्यासः कुतो भविष्यति । नास्त्येव नित्यमिति विपर्यास इति भावः । यथा चानित्यत्वं शून्ये न सम्भवति, एवं सुखत्वाशुचित्वानात्मत्वान्यपि न सम्भवन्ति । यदा च स्वभावशून्येऽनित्यत्वादिकं न सम्भवति तदा कुतस्तद्विपक्षभूतस्य नित्यदुःखशुच्यात्मत्वादेर्विपर्यासः सम्भवति । तस्मान्नास्ति विपर्यास इति भावः ॥१३॥

ननु अनित्ये नित्यमित्यभिनिवेशो यदि विपर्ययः स्यात्तर्हि अनित्यमित्यभिनिवेशः किमविपर्यासो भवेदित्याशङ्क्य सोपि विपर्यास एवेति प्रतिपादयन्नाह—

**अनित्ये नित्यमित्येवं यदि ग्राहो विपर्ययः ।**
**अनित्यमित्यपि ग्राहो शून्ये किं न विपर्ययः ॥१४॥**

स्वभावशून्ये नित्यमिति वा, अनित्यमिति वा ग्रहो न सम्भवति । यथा वन्ध्यापुत्रे । तस्मात्तत्रानित्यमित्यपि ग्रहो यदि स्यात्सोपि विपर्यास एव भवितुमर्हति । सोपि ग्राहः पूर्वोक्तनीत्या नास्त्येवेति भावः । यथाचाऽनित्ये नित्यमित्ययं ग्राहो विपर्ययो न सम्भवति । एवमन्येपि विपर्यया न सम्भवन्तीति योज्यम् ॥१४॥

भावानामहेतुकत्वाभ्युपगमाद् घटादीनां स्वभावत एव विद्यमानत्वात्कर्तृ-करणक्रियाणामुत्पादनिरोधयोश्चाभावः प्रसज्यते । स्वाभाविकस्य भावस्य कार्यत्व-कारणत्वयोरप्यपेक्षा नास्ति । तस्मात्सर्वमेतद्भवत्पक्षे नोपपद्यत इति भावः॥१७॥

अस्माकं तु भावस्वभावशून्यतावादिनां सर्वमेतदुपपद्यत इत्याह—

यः प्रतीत्यसमुत्पादः शून्यतां तां प्रचक्ष्महे ।
सा प्रज्ञप्तिरुपादाय प्रतिपत्सैव मध्यमा ॥१८॥

यः प्रतीत्यसमुत्पादः हेतुप्रत्ययसापेक्षकार्योत्पादः, तामेव वयं शून्यतां ब्रूमः, नत्वभावम् । शून्यतनामभावानां स्वभावेनाऽनवस्थानात् । सकारणभावोत्पत्तिरित्यर्थः । सैव शून्यता उपादाय प्रज्ञप्तिरिति, मध्यमा प्रतिपदिति चोच्यते। कारणमुपाय कार्यं प्रज्ञप्यते,अत्र उपादायप्रज्ञप्तिरित्युच्यते । भावाभावान्तद्वयरहितत्वान्मध्यमा प्रतिपदित्युच्यते । तदेवं प्रतीत्यसमुत्पादस्यैवैता विशेषसंज्ञाः—शून्यता, उपादायप्रज्ञप्तिः, मध्यमा प्रतिपदिति च ॥१८॥

एवम्—

अप्रतीत्यसमुत्पन्नो धर्मः कश्चिन्न विद्यते ।
यस्मात्तस्मादशून्योऽभिधर्मः कश्चिन्न विद्यते ॥१९॥

यस्मादप्रतीत्य समुत्पन्नः कश्चिदपि भावो नोपपद्यते तस्मादशून्यः शून्यतारहितः स्वाभाविकः कोप्यभिधर्मः नास्तीति भावः ॥१९॥

भवतस्तु स्वभाववादिनः—

यद्यशून्यमिदं सर्वमुदयो नास्ति न व्ययः ।
चतुर्णामार्यसत्यानामभावस्तु प्रसज्यते ॥२०॥

यदा चेदं सर्वमशून्यं, सत्स्वभावं तदा उदयो नास्ति । व्ययोपि नास्ति । तयोरभावे आर्यसत्यानामप्यभावः प्राप्नोतीति भावः ॥२०॥

तथा हि—

अप्रतीत्य समुत्पन्नं कुतो दुःखं भविष्यति ।
अनित्यमुक्तं दुःखं हि तत्स्वाभाव्येन युज्यते ॥२१॥

यद्धि सत्स्वभावं तन्न प्रतीत्यसमुत्पद्यते, यदप्रतीत्यसमुत्पन्नं न तदनि-

र्यं भवति। भगवता च दुःखमनित्यमित्युक्तम्। तथा च भावानां स्वाभाव्ये सत्स्वभावाङ्गीकारे तन्न युज्यते ॥२१॥

एवं दुःखस्यानुपपत्तिमुक्त्वा समुत्पादस्याप्यसम्भवमाह—

स्वभावतो विद्यमानं किं पुनस्समुदेष्यते।
तस्मात्समुदयो नास्ति शून्यं तां प्रतिबाधतः ॥२२॥

समुदयत्यस्माद्दुःखमिति समुदयो दुःखस्य हेतुः। शून्यतां प्रतिबाध्य सत्स्वभावं दुःखमभ्युपगच्छतस्तव समुदयोपि न सिद्ध्यति। सत्स्वभावस्य दुःखस्य उत्पादाऽसम्भवात्। तस्मात्समुदयोपि तव न सिद्ध्यतीति भावः ॥२२॥

स्वाभाविकं दुःखमभ्युपगच्छतस्तव निरोधोऽपि दुर्घट इति प्रतिपादयन्नाह—

न निरोधस्स्वभावेन सतो दुःखस्य विद्यते।
स्वभावपर्यवस्थानान्निरोधं प्रतिबाधसे ॥२३॥

स्वभावेन विद्यमानस्य दुःखस्य निरोधो न सम्भवति। तस्मादेवं स्वभावं गृहीत्वा प्रत्यवतिष्ठमानस्त्वं निरोधमपि बाधसे ॥२३॥

आर्यमार्गोपि स्वभाववादिनां यथा नोपपद्यते तथा प्रतिपादयन्नाह—

स्वाभाव्ये सति मार्गस्य भावना नोपपद्यते।
अथासौ भाव्यते मार्गः स्वाभाव्यं ते न विद्यते ॥२४॥

यदि मार्गः स्वाभाव्येनैव भवेत्तदाऽसौ भावनामन्तरेणैव व्यवस्थित इति किं तस्य भावनया? अव्यवस्थितस्य भावना, न व्यवस्थितस्य। असौ मार्गो भाव्यते त्वया। ततश्च सत्स्वभावता भवदभिमता भावानां नास्तीति भावः ॥२४॥

किं च—

यदा दुःखं समुदयो निरोधश्च न युज्यते।
मार्गो दुःखनिरोधत्वात्कतमं प्रापयिष्यति ॥२५॥

दुःखस्य भवन्मते स्वाभाविकत्वान्नास्ति दुःखनिरोधः। यं मार्गो सम्भावितः प्रापयिष्यति। एवं भावानां सत्स्वभाववादिनस्ते आर्यसत्यानां चतु-

र्णामभावः प्राप्नोति । किंच मार्गस्य दुःखनिरोधोपायत्वात्तदभावे कं प्रापयिष्यति? न कमपि प्रापयिष्यतीति व्यर्थोऽयं मार्गोपदेश इति भावः ॥२५॥

इदानीं दुःखादिपरिज्ञानमपि यथा न सम्भवति तथा प्रतिपादयन्नाह—

स्वभावेनाऽपरिज्ञातं यदि तस्य पुनः कथम् ।
परिज्ञानं ननु किल स्वभावस्समवस्थितः ॥२६॥

यदि दुःखं स्वभावेनापरिज्ञातं, अपरिज्ञातस्वभावं यदीत्यर्थः । तस्य तादृशस्य दुःखस्य कथं पुनः परिज्ञानं सम्भवति । यतः स्वभावो व्यवस्थितः किल । अपरिज्ञातस्वभावस्य परिज्ञाने स्वभावभङ्गप्रसङ्गादिति भावः ॥२६॥

यदा दुःखपरिज्ञानं नास्ति तदा—

प्रहाणसाक्षात्करणे भावना चैवमेव ते ।
परिज्ञावन्न युज्यन्ते चत्वर्यपि फलानि च ॥२७॥

समुदयस्य प्रहाणम्, निरोधस्य साक्षात्करणम्, मार्गस्य भावना चेति त्रयं परिज्ञावदेव न युज्यते । अतश्च चत्वार्यार्यफलान्यपि न सम्भवन्तीतिभावः॥२७॥

न केवलं फलानामेव परिज्ञावदसम्भवः, किंत्वधिगमोऽप्येषां न सम्भवतीति प्रतिपादयन्नाह—

स्वभावेनाऽनधिगतं यत्फलं तत्पुनः कथम् ।
शक्यं समधिगन्तुं स्यात्स्वभावं परिगृह्णतः ॥२८॥

भावस्वभाववादिनस्स्वभावस्यान्यथयितुमशक्यत्वात्पूर्वमनधिगतं फलं पश्चात्कथमधिगन्तुं शक्यं स्यात् । पश्चादप्यनधिगतमेवेति भावः ॥२८॥

फलस्यानधिगमे दोषमाह—

फलाभावे फलस्थानां न सन्ति प्रतिपन्नकाः ॥
सङ्घो नास्ति न चेत्सन्ति तेऽष्टौ पुरुषपुद्गलाः ॥२९॥
अभावाच्चार्यसत्यानां सद्धर्मोऽपि न विद्यते ।
धर्मे वाऽसति सङ्घे च कथं बुद्धो भविष्यति ॥३०॥

कारिकाद्वयस्यास्य पूर्ववदेवाऽर्थो वेदितव्यः ॥३०॥

न्तकर्मापि न स्यात् । पूर्वमविद्यमानस्वभावस्य दुःखनिरोधस्याधुना विद्यमानत्वे पूर्ववत्स्वभावविपर्ययापातात् । पूर्वं विद्यमानस्वभावानां सर्वक्लेशानां प्रहाणमपि न स्यादिति भावः ॥३९॥

अतः—

य: प्रतीत्यसमुत्पादं पश्यतीदं स पश्यति ॥
दुःखं समुदयं चैव निरोधं मार्गमेव च ॥४०॥

यः प्रतीत्यसमुत्पादलक्षणां सर्वशून्यतां पश्यति सर्वमिदमनुपपन्नं पश्यति दुःखसमुदयनिरोधमार्गादिकं यद्यद्भावस्वभाववादे अनुपपन्नं तत्सर्वमप्युपपन्नं पश्यतीति भावः ॥४०॥

इति सुबोधिनीव्याख्यासहितमाध्यमिककारिकासु
आर्यसत्यपरीक्षा नाम चतुर्विंशतितमं प्रकरणम् ।

---

सुबोधिनीव्याख्यासहित-

# माध्यमिककारिकासु,

## निर्वाणपरीक्षानाम पञ्चविंशतितमं प्रकरणम् ।

ननु भगवता बुद्धेन निर्वाणद्वयमुपदिष्टम्— सोपधिशेषं, निरुपधिशेषं चेति । तत्र निरवशेषस्याऽविद्यारागादिक्लेशगणस्य प्रहाणात्सोपधिशेषं निर्वाणं सिद्धयति । उपधीयतेऽस्मिन्नात्मस्नेह इत्युपधिः । आत्मप्रज्ञप्तिनिमित्ताः पञ्च उपादानस्कन्धाः उपधिरित्युच्यन्ते । शिष्यत इति शेषः । उपधिरेव शेष उपधिशेषः । तेन सह वर्तत इति सोपधिशेषं निर्वाणम् । तत्र च सत्कायदृष्ट्यादिक्लेशतस्कररहितं स्कन्धमात्रमेव केवलमवशिष्यते । निहताशेषचोरगणग्रामवत् । यत्र तु निर्वाणे निहताशेषचौरगणग्रामस्याभाववत्स्कन्धमात्रमपि नास्ति, तन्निरुपधिशेषं निर्वाणम् । एतद्द्विविधमपि निर्वाणं क्लेशानां स्कन्धानां च निरोधाद्भवति । एवं च—

**यदि शून्यमिदं सर्वमुदयो नास्ति न व्ययः ।**
**प्रहाणाद्वा निरोधाद्वा कस्य निर्वाणमिष्यते ॥१॥**

क्लेशानां प्रहाणात्सोपधिशेषनिर्वाणम् । स्कन्धानामपि निरोधान्निरुपधि-षनिर्वाणं च भवति । यदीदं सर्वं शून्यं स्यात्तदा उदयो नास्ति । व्ययोपि ास्ति । एवं च क्लेशानां स्कन्धनां चाभावात्प्रहाणनिरोधयोरभावः प्राप्नोति । था च निर्वाणमेव न स्यात् । तस्मादस्ति भावानां स्वभाव इति भावः ॥१॥

अत्रोच्यते— भावानां स्वभावाङ्गीकार एवाऽयं दोषः प्राप्नोति, न ्यताङ्गीकार इति प्रतिपादयन्नाह—

**यद्यशून्यमिदं सर्वमुदयो नास्ति न व्ययः ।**
**प्रहाणाद्वा निरोधाद्वा कस्य निर्वाणमिष्यते ॥२॥**

इदं सर्वं यद्यशून्यं प्रतीत्यसमुत्पादरहितम्, स्वाभाविकमेव यदि तदा लेशानां स्कन्धानां च स्वभावेन विद्यमानत्वात् स्वभावस्याऽथयितुमशक्यत्वा-दयो वा व्ययो वा नास्ति । अतश्च प्रहाणाद्वा निरोधाद्वा कस्य निर्वाणमिष्य- । स्वभाववादिनः कथमपि निर्वाणं न सम्भवतीति स्वभाववादिन एवायं ोषः, न शून्यतावादिन इति भावः ॥२॥

ननु शून्यतावादिनो निवृत्तिलक्षणं यदि नेच्छन्ति तर्हि किं लक्षणं त-दिच्छन्तीत्यत्राह—

**अप्रहीणमस... ... ... ... ।**
**अनिरुद्धमनुत्पन्नमेतन्निर्वाणमुच्यते ॥३॥**

यद्धि नैव प्रहीयते रागादिवत्, नैव प्राप्यते श्रामण्यफलादिवत्, नैवो-च्छिद्यते क्लेशादिवत्, नैव शाश्वतं स्वभाववत्, नैव निरुद्ध्यते दुःखादिवत्, वोत्पद्यते घटादिवत्, शिवं सर्वप्रपञ्चोपरमलक्षणं निर्वाणमुच्यते । तत्र च ेकल्पानां नास्त्यवकाशः । सर्वप्रपञ्चोपरमलक्षणत्वात्तस्य । ननु निर्वाणे नसन्ति लेशाः, नापि स्कन्धाः, तथापि निर्वाणात्प्राक्सन्ति ते । अतस्तेषां प्रहाणमेव िर्वाणमिति चेदत्रोच्यते— यदि निर्वाणात्प्राक्स्वभावतस्सन्ति क्लेशाः तर्हि षां प्रहाणं न सम्भवति । विद्यमानस्वभावस्य प्रहाणायोगात् । तस्मान्निर्वाणाभि-ाषिणा त्याज्यैवैषा कल्पनेति भावः ॥३॥

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

అధ్యక్షులు

ఆంధ్రాస్థానకవి, కవిసార్వభౌమ, మహామహోపాధ్యాయ

శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

ప్రధాన కార్యదర్శి, కోశాధికారి

శ్రీ దంటు భాస్కరరావు.

సహాయ కార్యదర్శి

శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి.

(ఉభయభాషాప్రవీణ, ఏ)

కార్యనిర్వాహక సభ్యులు

1. శ్రీ కోకా శివనాథశాస్త్రి.
2. శ్రీ రా. సా. మాదిరెడ్డి సీతారామయ్య. బి. ఏ., బి. యల్.,
3. శ్రీ వేదుల రామచంద్రకీర్తి, ఎం. ఏ., (ఆనర్సు) బి. ఇడి.,
4. శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి (వ్యాకరణవిద్యా, భాషా, ప్రవీణ)
5. శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి (కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర)
6. శ్రీ యండమూరి వేంకటరమణ (మధురకవితావిశారద)
7. శ్రీ బండారు తమ్మయ్య (ఐతిహాసికసమ్రాట్)
8. శ్రీ జయంతి బుచ్చిరామశర్మ.
9. డాక్టరు శ్రీ ఇవటూరి జోగారావు, (యం. బి. బి. యస్.,)
10. శ్రీ చిరుహోలు కోటీశ్వరరావు.

పత్రికా సంపాదకుడు :

చిలుకూరి పాపయ్యశా.

సంపాదక సహాయులు :

శ్రీ బండారు తమ్మయ్య (విమర్శకాగ్రేసర, ఐతిహాసికసమ్రాట్)